# కేదారం

( ఉర్దూ కథలు )

రచయిత

జీలానీబానూ

అనువాదం

దాశరథి రంగాచార్య




ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్, సైఫాబాద్, హైదరాబాదు - 500 004

# విజ్ఞప్తి

భారతదేశమున అనేక భాషలున్నవి. అన్ని భాషలకును సాహిత్యము ఉన్నది. ఆయా సాహిత్యములు విలక్షణమైన చరిత్ర కలిగి ఉన్నవి. విశిష్టమైన సంప్రదాయములు కలిగిఉన్నవి. మనదేశ సమైక్య పరిరక్షణకుగాను ఒక భాషా సాహిత్యమును ఇతరభాషలవారు తెలుసుకొనవలసి ఉన్నది. అట్లు తెలుసు కొనుటకు తోడ్పడునది అనువాదసాహిత్యము.

ఒకనాడు తెలుగుదేశమున అనువాద సాహిత్యము కొల్లలుగా వెలువడినది వంగసాహిత్యము ఎక్కువగా తెలుగులోనికి వచ్చినది. కొంతవరకు ఉర్దూ హిందీ సాహిత్యములు కూడా తెలుగులోనికి వచ్చినవి. ఈ మధ్యకాలమున అనువాదములు అంతగా కనిపించుటలేదు.

అనువాదప్రక్రియ భారత సమైక్యతకు జీవమువంటిది. సాహితీ, సంస్కృతుల సమ్మేళనము అత్యంత ఆవసరమై ఉన్నది.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి తెలుగు, హిందీ, ఉర్దూ సాహిత్య ములతో సంబంధమున్నది. ఆయా భాషలనుండి అనువాదములను సాహిత్య మును గురించిన గ్రంథములను ప్రచురించుటకు పూనుకొన్నాము. కొన్నిగ్రంథ ములను ప్రచురించినాము.

ఇంతకుముందు తెలుగు కథలను కొన్నింటిని ఉర్దూలోనికి అనువదింప చేసి "తెలుగు అఫ్సానే" అను గ్రంథముతోపాటు ఉర్దూ కథలను తెలుగులో పరివర్తించి ఉర్దూకథానికలు అను సంపుటము అకాదమి పక్షాన యింతకుముందు ప్రకటించనైనది.

శ్రీమతి జీలానీబానూకు కథారచయిత్రిగా ఉర్దూ సాహిత్యమున విశిష్ట స్థానమున్నది. ఆమె తండ్రి ఉర్దూ సాహిత్యమున చక్కని వైదుష్యముగలకవి. జీలానీబానూకు భాషమీద చక్కని అధికారమున్నది. ఆమె కథలలో చాలా

చోట్ల కవితా ధోరణి కాన్పించును. ఆమెకు తనదైన ప్రత్యేకమైన శైలి ఉన్నది. అంతేకాక ఆమెలో వస్తువైవిధ్యము కూడ ఉన్నది. ఆమె కథలు చదువువారికి ఈ విషయములు తెలియును. జీలానీబానూకు జీవితమును పరిశీలించుటకు తగిన ప్రజ్ఞాపాటవములు గలవు.

జీలానిబానూ కథలలోని విశిష్టతను, విలక్షణతను దృష్టిలో ఉంచుకొని వాటిని తెలుగులోనికి అనువదింపజేసి ప్రచురించుటకు నిర్ణయించనైనది. అనువాద కార్యమును నిర్వహించవలసిందిగా శ్రీ దాశరధి రంగాచార్యులగారిని కోరినాము. వారు చక్కని అనువాదకులు. ఇదివరకు ఉర్దూ, హిందీ, ఇంగ్లీషు నుంచి అనువాదములు చేసినారు. వారు మాకు సకాలమునకు చక్కని అనువాదము అందించినారు.

ఇతర సాహిత్యములనుంచి ఇచ్చి పుచ్చుకొనుట అవసరమను దృష్టితో ఉర్దూ కథల తెలుగు అనువాదమును గ్రంథముగా ప్రచురించుచున్నాము. ఇందుకు తెలుగువారి ప్రోత్సాహము మాకు లభించునని ఆశించుచున్నాము.

హైదరాబాదు
15-10-77

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి

# ఛాయ

అనువాదం అసలు రచనకంటే కష్టం. ఈ విషయం రెండు ప్రక్రియల్లో రచనలు చేసేవారందరికి తెలుసు. స్వీయరచనలో స్వేచ్ఛ ఉంటుంది. భావాలు తనవి. భాషతనది. అది తానుకన్న ముద్దుబిడ్డ. అది ఎలాఉన్న బాధ్యత తనదే.

అనువాదం అలాకాదు. భావాలు మరొకరివి. భాష అనువాదకుడు కూర్చాలి. పరిధి సంకుచితం అయిపోయింది. అనువాదకునికి స్వేచ్ఛలేదు అసలు రచయిత గిసింది "లక్ష్మణరేఖ" ఆ పరిధి దాటలేడు. ఇది మరొకరు కన్నబిడ్డ. ముద్దూ ముచ్చటా అనువాదకుడు తీర్చాలి. ఈ బాధ్యతలో తనభాగం ఎంతో తెలియదు.

అనువాదం అంటే భాషను మార్చడం మాత్రమేకాదు. ఇది రచయిత భావాలను అనువదించడం. ఒక్కొక్కసారి భావోల్బణంతో భాషజలపాతంలా వస్తుంది రచయితకు. రచయితకు అలాంటి భావోల్బణం కలగడానికి కారణాలూ - పరిస్థితులు - ప్రభావాలూ ఏవో ఉంటాయి. అనువాదకుడు అదే పరిస్థితుల్లో ప్రభావాల్లో ఉండడు. అయినా భావోల్బణానికి తనభాషను సమకూర్చాలి. అది ఆ భావోల్బణాన్ని వ్యక్తపరచాలి. అది ఎంత కష్టమో ఆలోచించండి, మరొకణ్ణి కొడ్తే - తాను ఏడవాలి!

భాషలన్నీ పరిమితాలే. ఏ భాషకూ భావాలకు సరిపోయేన్ని పదాల్లేవు అయితే ఒక్కొక్కభాష ఒక్కొక్క పరిధిని ఏర్పరుచుకుంది. ఒక్కొక్క భాషకు కొన్ని ఆచార వ్యవహారాలుంటాయి. రెండు భాషలకు సమానమైన పదాలుండడం కష్టం. ఈ పదాలను ఏరి, వెతికి పెట్టడం వల్ల అతుకులబొంత అవుతోంది తప్ప అనువాదంకాదు. ఉదాహరణకు ఉర్దూలో ఉన్న మజ్బూర్, ఆవారా, ఫుజూల్, సన్నాటా, కర్వట్ బదల్నా, ఫిజా, నఖ్రే అన్నపదాలకు

తెలుగుపదాలు దొరకవు. అనువాదకునికీ ఉర్దూపదం తెలుసు. దాని అర్థంతెలుసు, దాని సొగసుతెలుసు, కాని తెలుగులో చెప్పలేడు. అతనిబాధను అర్థంచేసుకొండి.

రచయిత ఒకమూడ్‌లో రచనచేస్తాడు. ఆ మూడ్‌నుబట్టి అతనిశైలి మారుతుంటుంది. ఒకసారి హాస్యంగా, ఒకసారి అపహాస్యంగా, ఒకసారి గంభీరంగా ఒకసారి వర్ణనాత్మకంగా సాగిపోతాడు రచయిత. అనువాదకుడు ఆ రచయిత మూడ్‌ను పట్టుకొని సాగాలి. ఈ మూడ్ తనదికాదు. మరొకరిది. అతని చొక్కాలో నేను అందంగా కనిపించాలి!

అనువాదం కష్టం. అందుకే చాలమంది అందుకు పూనుకోవడంలేదు. సాహిత్య సంస్థలుతప్ప అనువాదాలు ప్రచురించడం అరుదు. అయినా అనువాదం అవసరం. మనదేశంలో విభిన్న భాషలున్నాయి. విభిన్నభాషల్లో అనంతం అయిన సాహిత్యం ఉంది. ఒకరి సాహిత్యాన్ని ఒకరు అర్థం చేసుకున్నప్పుడే సమన్వయం సాధ్యం అవుతుంది. అందుకే సాహిత్య అకాడమీ వంటి సంస్థలు అనువాదాలు చేయించి ప్రచురిస్తున్నాయి.

ఇదివరకునేను "ఉమ్రావ్‌జాన్ ఆదా" అనేఉర్దూ నవలను అనువదించాను. దాన్ని కేంద్ర సాహిత్య అకాడమీ వారు ప్రచురించారు.

ఇప్పుడు జీలానీబానూ ఉర్దూ కథలను అనువదించే పనిని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు నాకు అప్పగించారు. అందుకు అకాడమీ కార్యదర్శి పూజ్యులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి నామీద ఉండే అభిమానం కారణం. వారికి నేను కృతజ్ఞుణ్ణి.

జీలానీబానూ కథల్ని గురించి నేనేం చెప్పదలచలేదు. కాని సాధ్యమయినంత చక్కని అనువాదం చేయడానికి ప్రయత్నించాను. నా కృషి ఎంత వరకు ఫలించిందీ చెప్పాల్సింది మీరు.

సికింద్రాబాదు
11 జూలై 1977
సోమవారం.

భవదీయుడు.
దాశరథి రంగాచార్య.

# విషయసూచిక


1. తీరని దాహం 1
2. పాదాలు 27
3. ఆదరణ 43
4. అద్దం 51
5. మోక్షం 62
6. మనసౌశచోట 78
7. దొంగసొమ్ము 90
8. సతీసావిత్రి 98
9. శ్యామల 112
10. శాలువ 128
11. సరస్వతి 134
12. వీక్షణ 152
13. పరుల ఇల్లు 154
14. చప్పటి కథ 175
15. ఎంకమ్మ 192
16. స్కూటర్‌వాలా 206
17. గొడ్రాలు 217
18. బంగారు లేడి 227
19. కిషన్! ఓ కిషన్! 235
20. అపరిచితులు 242
21. వినోదం 252
22. మనస్కారం 258
23. సూనా 265
24. కేదారం 275

# తీరని దాహం

"దాహంకూడా రోగమే? డాక్టర్లకేం అలాగే అంటారు. వైద్యులకు విద్యలేదు. ధైర్యంగా ఉండు స్పష్టంగా కనిపిస్తుంది. ఏదో గాలి తాకిడిలా ఉంది. మంత్రగానికి చూపించడం మంచిది."

"దాహం అంటే మామూలుదాహం అనుకున్నారా? రోజంతా బిందెల కొద్దీ నీళ్లుతాగుతుంది. అయినా దప్పి అరందే ఆదేంధాహమోమరి?"

"ఇప్పుడిహ రూపమే గుర్తించకుండా అయిపోయింది. అయినా ఊరుకుంటుందా? ఊపిరి ఆడ్డమే కష్టం. అయినా వాగుడు మానదు."

"రాత్రి అయిందంటే కొండలు విరుచుకుపడ్డట్టే- ఆ దేవుడే రక్షించాలి"

అవును. నాకు రాత్రులు కొండల్లాగే అనిపిస్తాయి. కొండలు ఎక్కుతూ ఎక్కుతూ జీవితాన్నే కోల్పోయాను. నా చంద్రుణ్ణి పోగొట్టుకున్నాను. కటిక చీకటిలో కొట్టుకుంటున్నాను. నేను గురిచూచుకునే గోడను. గురిచూచి తమ ప్రతిభను గుర్తించుకోవడానికి నన్ను లక్ష్యం చేసుకున్నారు. నా మనస్సు అనేక చోట్ల బీటలు వారింది. నా అపజయాల సైన్యం అందు ప్రవేశించింది. నా గుండె ఖజానా అందుకుని నలువైపులా పురుకుతున్నాను. ఖజానా ఏమిటి? ఏమిటి పిచ్చి? ఇంకేం మిగిలింది నాలో? నాలో ఇంకేమైనా మిగిలిందా? ఛా, నాకు మతిలేదు. నేను గుండెకు అదుముకొని తిరుగుతున్న మూటలో నా మనస్సుకు సంబంధించిన ముత్యం ఒక్కటీ లేదు. కొంటె పిల్లలు దానిలో చిత్తుకాగితాలు కట్టారు. నా మనోమందిరాన్ని ఎందరెందరు దోచుకున్నారు. నేను నడచిన బాటలనిండా ముత్యాలు రాలేయి. వాటిని ఏహ్యంగా చూచి లేచాను. నేల రాలిన దాన్ని అందుకుంటారా? ఛీ నిజమే ఏమిటీ మాటలు ఒట్టు ఎందుకిలా వాగుతున్నాను?

## 2

ఏమిటేమిటి ఇవ్వాళ? ఎండేనా? ఎందుకీదాహం? గొంతు ఆరిపోతూంది. భగవాన్ గ్లాసెడు నీళ్ల ఇచ్చేవాడులేడు. అప్పుడు నేను తప్పు చేశాను. నిజం కాని మావాళ్లు నాకు భయంకరం అయిన శిక్ష విధించారు. అపఖ్యాతిఅనే ఎడారి లో దాహంతో మాడగొడ్తున్నారు. నేను తృప్తిగా కనీసం నీళ్ల తాగలేకపోయాను జనం మేమేమో తాగుతున్నారు. వీళ్లు మావాళ్లుకారు. కసాయివాళ్లు సలీమ్ మప్పు లేదకు. వీళ్ల నీళ్లివ్వరు. కానీ ఇలాగే చస్తాను దాహంతో.

నేటిరేయి ఇంత నీరసంగా ఎందుకుంది? చంద్రుని కళ్లు ఎందుకిలా మూతలు పడుతున్నాయి. వెన్నెల బిందువులుగా రాలుతున్నట్లుంది. వెన్నెల కన్నీరై రాలుస్తోంది. కన్నీటి చుక్కల్నే తాగుదాం.

అయ్యో-పరీక్షలు వచ్చేశాయా నెత్తిమీదికి. వరండాలో అమ్మా, షమ్మా పళ్లుపియుచుకొని నోట్సురాస్తున్నారు. నాకూ గుర్తుండదు ఈ భూమి-చంద్రుడు వాటి సిద్ధాంతం. పరీక్షలు వచ్చాయంటే గంటలతరబడి బట్టీపెట్టేదాన్ని. భూమి బొంగరంలా తిరుగుతుంది. దాని వెలుగుభాగం చంద్రునిముందుకు వస్తే వెన్నెల రాత్రులు అవుతాయి. భూమికీ చంద్రునికీ దూరం కలకాలంగా ఉంది. ఉంటుంది. కొత్త సైంటిస్టులు అది నమ్మరట. నమ్మకపోదురుగాక నాకేటి భయము. నాపరకునాకు భూమి చంద్రునిలోంచి విడిపోయిన భాగం మాత్రమే ననిపిస్తుంది. అందుకే విడిపోయిన తనదేహంలోని భాగాన్ని కలుసుకోవడానికి భూమివెంట పరిగెత్తుతూంది. చంద్రునికి నోరుంటే ఎంత బావుండును. అతడు చెప్పగలిగేవాడు తన ఇష్టపూర్తిగా భూమిచుట్టూ తిరుగుతున్నానని.

హా హ్హా హ్హా ఎంత వింత-అక్కడ ఆకాశంలో కూడా స్వార్థం పురి విప్పుకొని ఆడుతూంది. అక్కడ కూడా అదృష్టం బలపత్తరం అయిందే. అందుకే పాపం భూమి - చంద్రుడూ కలుసుకోలేక పోతున్నాయి. తాకలేక పోతున్నాయి, ఇహ ఇంతేనా? చంద్రుని కన్నీరు వెన్నెల జలపాతాలు కావలసిందేనా? కలయిక లేని ఈ కల్లోలాన్ని లోకం భరించలేదని కాబోలు నేటి రాత్రి నిశ్శబ్దంగా ఉంది. వాయువు స్తంభించింది. అమ్మ అజ్ఞాతంగా కూర్చొని

జపంలో లీనం అయిపోయింది. రేయి ఈ విషాదదృశ్యంమీద, కంబళి కప్పా లనుకుంటూంది. కాని వసంతంలో శృంఖలాలు వెదుక్కునే వెర్రిగుండెల వాళ్ళను ఆపగలవాడేడీ? చంద్రుడు తేపతేప మబ్బుల ముసుగులను చీల్చుకుని వేగంగా ఉరుకుతున్నాడు. కాదు చంద్రుడు నిలిచే ఉన్నాడు. మబ్బులు మబ్బులతో పాటు నా మంచం, నా ఇల్లు, నా మనసు అన్నీ చంద్రునివెంట ఉరుకులు పెడ్తున్నాయి. సలీం! చంద్రుడు వెర్రివాడిలా ఉన్నాడు. కాకుంటే ఎందుకలా భూమివెంటపడి ఉరుకుతాడు. ఏమిటి భూమికి చంద్రునికీ బంధం? వాళ్ల కలుస్తారా? కలుస్తారు పో-ప్రళయంరాదూ? అవును ఈ పరీక్షలూ ప్రళయం లాంటివే! భగవాన్ ఎలాంటి పరీక్షలో పెట్టావయ్యా ఎన్ని కల్లోలాలు రేపావయ్యా!

అజీమ్ అక్క గాలిబ్‌కవిత చదివించేది. గాలిబ్ కవిత చెప్పేప్పుడు ఆమె తన్మయురాలయిపోయేది. సురయా చూపులు, ఆమె చామన చాయ వదనంనుంచి చిన్నచిన్న కళ్ళనుంచి కదలే పెదవులనుండీ కదిలేవికావు. ఆ కదిలే పెదవులు ఏంపలుకుతున్నాయో! నిశ్శబ్దంలో కాగితంమీద వేల నాజూకు వేళ్ల కదలాడు తున్నట్లుండేది. సురయా శరీరంమీది ప్రతిరోమమూ కన్నుగా పరివర్తనం చెందింది.

''నిన్నబోలు దాని నేనేడ తెత్తును?

అజీమ్ అక్క స్నిగ్ధదృక్కులు క్లాసునిండా పరచుకున్నాయి.

''గాలిబ్ కవి ఎవరిని ఉద్దేశించి ఈచరణం ఆలాపించాడో చెప్పగలరా!''

అజీమ్ అక్క వ్యక్తిత్వంలో ఆకర్షణ ఉంది. కాలేజిలోని ప్రతిరెండో అమ్మాయి ఆమె కురుల్లో ఇరుక్కుంది. పురుషులు ఆమెను చూస్తే చూపు మరల్చక పోయేవారు. కాన దగ్గరికి వస్తే గౌరవంగా సంబోధించేవారు. అణకువగా ప్రవర్తించేవారు. అజీమ్‌అక్కకు తన బలహీనతలు తెలుసు. నా రూపాన్ని చూచి చిలిపి భావాలు కలిగేవారు నా బుద్ధితో పోటీపడగలరా? నిన్నటికిన్నిన్న ఒక కవి నన్ను ఉదేశించి కవితచెప్పారు.

# 4

క్లాసులోని అమ్మాయిలంతా కాపీలు మూసి ఆ రోమాంచకమైన వలపును తమ గుండెలమీద రాసుకోవాలని ప్రయత్నించేవారు. అది కాల్పనిక రొమాన్స్. ఆ విషయం అందరికీ తెలుసు. అయినా దానిని కాల్పనికం అనే ధైర్యం ఏ ఒక్క అమ్మాయికీ ఉండేది కాదు. అజీమ్ అక్కలాంటి నిర్భయంగల ఆడది మరొకటి ఏది? ఏడేడు పరదాల్లో దాగటానికి అలవాటు పడిన పల్లెలనుంచి వచ్చిన అమ్మాయిలకు సంజ్ఞలు, సంకేతాలూ అర్థంకాకుంటే ఫలానా అబ్బాయి నువ్వంటే పడి చస్తాడు ఏదో ఒకటిచెప్పు అని ఆజ్ఞాపించేది. అనేకసార్లు స్టాఫ్‌రూమ్‌లో ఆమెకు వ్యతిరేకంగా కల్లోలంరేగింది. కాని ఆమెకు యూరోపులోని అన్ని దేశాలకు చెందిన డిగ్రీలున్నాయి. వాటిని మోయాలంటె ఇద్దరు కూలీలు కావలసి వచ్చేవారు. అలాంటప్పుడు ఆమెను కదలించడం ఎవరికీ తరమయ్యేదికాదు. ఆమె కేవిగా అనేది చాటుగా మొరిగేవాళ్లు ముందుకురావాలని.

సరే ఇదంతా ఆమెను గురించిన భోగట్టా, అసలు కథకువస్తే ఆమె ప్రశ్న అడిగిందికదా! అలవాటు చొప్పున సురయ లేచినుంచుంది. అజీమ్ అక్క అలవాటేమంటే తానంటె పడిచచ్చే అమ్మాయినే ప్రశ్నించేది. కాని ఆరోజు విచిత్రంగా సురయాను ఆపాదమస్తకం అవలోకించి తల ఆడించి "కాదు .... నువ్వు కాదు. ఈ కవితలో ........" ఆమె కనుచూపు అక్కడున్న రూపాలన్నింటినీ వెదికాయి.

"ఈ కవితలో గాలిబ్ కవి జమాల్‌ను ఉద్దేశించారు. ఏమంటావ్ జమాల్?"

క్లాసుసాంతం ఆ కొత్తఅమ్మాయివైపు తిరిగింది. ఆమె ఫస్టియర్‌పిల్ల - వెర్రిది. వలపు జ్వాలలంటే ఎరుగనిది. తన అందాన్నిసైతం గుర్తించనిది. ముడుచుకొని కూర్చుంది. గొంతు ఆరుకు పోతూంది. భయంతో చేతిలోని పెన్ను గజగజలాడుతుంది. అమ్మాయిలంతా గొల్లుమని నవ్వారు అది ఆమెకు వినిపించలేదు. పెనుగాలికి పతాకంలా రెపరెపలాడింది. అజీమ్ అక్క పీరియడ్ అయిపోయింది. ఆమె పర్సు, పుస్తకాలు జాగ్రత్తగా లెక్చరర్స్‌రూమ్‌కు చేర్చాల్సింది. చేర్చకుండానే ఆమె క్లాసునుండి అమ్ములాసాగింది. గేటువైపుసాగింది.

అంగణంలో తల్లి కనిపించింది. ఆమెది నలుపురంగు, నల్లచీర కట్టుకుంది. మసి అంటిన చేతులు కడుక్కుంటూంది. ఏమిటదంతా, అమ్మను ఉద్దేశించి కవి కవిత చెప్పాడా? లేదే, ఒక నిట్టూర్పు విడిచింది. గదిలోకి వచ్చింది ఎక్కడా అద్దం కనిపించలేదు. అయినా గోడల్లో తన ప్రతిబింబాలు కనిపిస్తున్నాయి - పదులు - వందలు. అనేక కోణాల్లో తన ప్రతిమలు తనకే కనిపిస్తున్నాయి. చామనచాయ, చట్టిముక్కు. వెడల్పయిన వదనంలో చిన్నచిన్నకనులు చెంపలమీది మొటిమల పంట-కనులు చిటికిపోతే ఎంతబావుండేది! ముఖం తిప్పుకొని వెళ్లిపోయేవారు కనిపించేవారుకారు. ప్లాస్టిక్ సర్జరీ బొంబాయిలోకూడా చేస్తున్నారట చేస్తుండవచ్చు, కాని సైంటిస్టులు ఇంతవరకు రంగుమార్చేమందు కనిపెట్టందే! వెధవలు చంద్రుని మీదికి ఉరుకుతున్నారు. మసిషిరంగు మార్చలేనివారు చంద్రుని మీదికి మిడకడం ఎందుకో? ఆదేవుడు ఇలాంటి అందవికారుల కుటుంబంలో ఎందుకు పడేశాడో? ఇహ ఇంటివాళ్లను ఆ అల్లాయే కాపాడాలి నాన్నకు అబ్బో ఎంతోగర్వం ఎండిన నారింజలాంటి నల్లని అమ్మముఖంమీద పడిచస్తాడు. ఒకళ్ళిద్దరుకారు ఏడుగురు నల్లని పిల్లల్ను కన్నారు. అమ్మ బొగ్గు నమిలిందేమో పిల్లలంతా అమవాస్యరాత్రులయినారు అనేది బామ్మ కూతురుకు పద్నాలుగేళ్ళు వస్తేచాలు నాన్న మర్వాడీ దగ్గరికి ఉరికేవాడు అప్పు అడగ డానికి. కొన్నినెలలు గడుస్తాయి కొత్త అల్లుడు ఇంటికి వస్తాడు. ఇహ అతని ముందు తమ కష్టాల్ని గురించి ఏడుపు చర్చలను గురించినరొద ఆ అల్లుళ్లు ఎలాంటి వారయా అంటే ఒంటెల్లాంటివారు. మామిడి పరుగుల్లాంటి క్లార్కులు, వాళ్లు - తమను తాము నలకూబరులనుకొని సురయాను "నీలమణి" "నల్లరాతిబొమ్మ" అనేవాళ్లు. సురయా ఏడ్చేది, తన నొసటా అలాంటివాడే రాసి ఉన్నాడనుకునేది. కుమిలిపోయేది. అయితే అలాకాలేదు. మర్వాడీలు ముఖం ముడిచారు. పెళ్లి ముహూర్తం చాలాసార్లు మారింది. ఈలోగా ఆమె తొమ్మిదో క్లాసులో ఫస్టున పాసయింది. ఇంతలో ఆక్లార్కుకు జనాభా తగ్గుతుందని భయం అయింది. వేరేదాన్ని కట్టుకున్నాడు. తొమ్మిదోక్లాసు పాసైందని తల్లి అంటే మెట్రిక్ కానిమ్మన్నాడు తండ్రి. మగపిల్లలు లేకుంటేఏం ఆడపిల్లనే చదివింతామనుకున్నాడు. అయితే మిగతా కూతుళ్లకు రూపంతోపాటు తెలివీ లేకుండాపోయింది. మూడేళ్లు కాందే రెండోక్లాసు దాటలేదు. పెళ్ళయేవరకు,

ఆరోక్లాసుకు వస్తే గగనంగాఉండేది. అలాంటప్పుడు సురయా మెట్రిక్ పాసయింది. ఆ సంతోషంలో ఎత్తిపోయిన సంబంధపు దుఃఖం మరచాడు. సురయా దస్తూరి అందమైనది. తండ్రి ఆమె దస్తూరితో తనదాన్ని పోల్చుకొని సిగ్గుపడేవాడు. లెక్కల్లో నలభై, యాభై, మార్కులు తెచ్చుకునేది. ఉర్దూలో అనేక కవితలు అప్పజెప్పగలిగేది. పగలంత వలపు పత్రికలు చదివేది. కూతురు ఆసక్తికి తండ్రి మురిసిపోయేవాడు. ఆమె కోరింది హాజరుపరచేవాడు. ఆరోజుల్లోనే కొన్ని పత్రికలు ముందరేసుకుని స్త్రీ విద్యనుగురించి ఒకవ్యాసం రాసింది సురయా అది చూచాడు. తండ్రి మురిసిపోయాడు. కనిపించిన వాడికల్లా చదివి వినిపించాడు. దాన్ని హెడ్ మిస్ట్రెస్ దాకా చేర్చాడు. ఆమె నిండు క్లాసులో ఆ వ్యాసం చదివి వినిపించింది. సురయా వీపు తట్టింది - శ్లాఘించింది. దాంతో సురయా ఉక్కిరి బిక్కిరయింది. ఆమెకోదారి కనిపించింది. ఆకర్షించ దానికి ఇదొక మార్గం అనుకుంది. తన వ్యాసాలు చూచినవారు కనీసం తనను చూచి ముఖం తిప్పుకోరు అనుకుంది. తొలిసారి పొగడ్త రుచిచూచింది. ఇహ ఆమె శరీరం సాంతం తాపంతో పరితపించింది. అప్పుడామె రచయిత్రికావాలని నిశ్చయించుకుంది. తాను ఘాటయిన కథలు రాస్తుంది. జనం తనను చూడ్డానికి ఆరాట పడిపోతారు. తాను మసిబొగ్గు అనేమాట మరచిపోతారు. ముఖాన పెరిగిన మొటిమల పంటను పరికించరు. ఆ రాత్రి ఆమె రంగురంగుల కలలు కన్నది. తనఖ్యాతి సుదూరప్రాంతాలకు వ్యాపించింది. మహామహా రచయితలు తనవాకిట తలలువంచి నుంచున్నారు. అప్పుడు తాను తనకు నచ్చిన రచయితను పెండ్లాడింది. రాత్రిసాంతం తనపేరో తరవాత తనఅభిమాన రచయితల పేర్లో రాస్తూ ఉండిపోయింది.

ఆరోజుల్లోనే సురయా మేనత్త ఒక సంబంధం తెచ్చింది. వాడు పోకిరి మజీద్. వాణ్ణి బాగుచేసే ఉపాయం ఆడగటానికి ఆమె తరచు తమ్ముని దగ్గరికి వస్తూండేది. మజీద్ మహాశయుడు చాలకాలంగా మెట్రిక్ పరీక్ష ఇస్తున్నాడు. తప్పడానికి కారణం తన మాస్టర్ల దుర్మార్గం అని ఆరోపిస్తుంటాడు. ఆమాట విని సురయా వాణ్ణి వెక్కిరిస్తుండేది. పగలబడి నవ్వుతుండేది, అయినా

పెళ్ళయితే ముకుతాడు పడిన ఎద్దులా సురయా లొంగి పోతుందని మజీద్‌గారి తల్లిగారి దృఢవిశ్వాసం.

ఛీ మజీద్ పేరువిని సురయా ఏవగించుకుంది. ఆ వెధవకు కవిత్వం ఏచెట్టు పేరోకూడా తెలియదు. ఒకసారి తాను సలీమ్ వెంట కవి సమ్మేళనానికి వెళ్లింది. అక్కడ ఎంతంత రసికులయిన కవులను చూచింది. తన కాలేజివాడే ఒక యువకవి 'షాహిద్ రొమాని' మీదినుంచి దృష్టిమరల్చుకోలేక పోయింది. బక్క పల్చనివాడు–పొడవు వెంట్రుకలవాడు–బలహీన హస్తమున కంపించు సిగిరెట్టు కలవాడు. అతని ముఖం నలుపు–పండ్లుపొకరవి. అయినా ఎంత ఆకర్షణఉంది అతనిలో! కాలేజీ అమ్మాయిలంతా అతని పేరువింటే వెర్రివాళ్ళయి పోయేవారు! షాహిద్ కవితలోని ప్రతిపాదం సురయా గుండెలో హత్తుకుంటూంది.

ఒకనాడు షాహిద్ వికార రూపం చూచి జనం మూతిముడిచి ఉంటారు, ఇవ్వాళో ఎంతటి హీరోలనయినా అతను కాలదన్నగలడు! మరునాడు సురయా ఆటోగ్రాఫి పుస్తకం కొన్నది. సలీమ్‌కు ఇచ్చింది. షాహిద్ సంతకం తెచ్చి పెట్టమన్నది. సంతకం చూచింది. ఆమె గుండె దడదడ లాడింది. ఆ రోజు చాటుగా పలుమార్లు తనపేరు పక్కన షాహిద్ రొమానీ పేరు రాసింది, సురయా షాహీద్‌రొమాని మళ్లీ చెరి పెప్పుడు చాలదుఃఖం కలిగింది. గుండె కుర్రింగింద. సలీమ్ ఆమెను హేళన చేసింది. షాహిద్ ఘామూలు కవి అన్నదీ బచ్చాగాడు అన్నది కావాలంటే వెంటనే పరిచయం చేస్తానన్నది. అయినా ఆ బచ్చాకవికి పెద్దగా లిఫ్ట్ ఇవ్వద్దన్నది.

సాయంత్రం సలీమ్ వెంటవెళ్ళడానికి తయారవుతూంది, ఇంతలో అమ్మా, అక్కా గుసగుసలు వినిపించాయి. మజీదును మించిన సంబంధం సురయాకు దొరకదంటుంది అక్క. అక్కకు అయిదో పిల్లాడు కోతిపిల్లలా కొమ్మనంటు కొని కీ, కీ అంటుంటాడు. బలవంతంగా విడిపిస్తే ఏడుపు లంకించు కుంటాడు. ఇంటి చికాకులకు విసిగి పెళ్ళాం మొగుడు పోట్లాడు

కోని రోజంటూలేదు. అయినా చెల్లెళ్ల పెళ్లిళ్లు చూడాలని మహా సంబర పడుతుంది.

సలీమ్ బాగా పురి ఎక్కిస్తే బయల్దేరి ఇంటివాళ్ళందరిముందు తాను బి.ఏ. పాసయే వరకు పెళ్లి చేసుకోనని ప్రకటించింది. ఆమాట విని తల్లి మూర్ఛ పోయింది. అక్కనోట మాట రాలేదు. తండ్రి చాలాసేపటికి తేరుకున్నాడు. సురయాకు బి.ఎ. అయిందాకా పెళ్లి చేయనన్ని ప్రకటించాడు తాను వకాల్తీ చేసి ఇల్లు కట్టడమే కాక కూతురును బి.ఏ కూడా చదివించాడనే విషయం తిమ్మాపురం ప్రజలకు ఎరుకపరచాలనుకున్నాడు

అంతే అనుకున్నంతే అయింది కొత్త సంవత్సరం వచ్చింది. కొత్త అమ్మాయిలు వచ్చారు. అజీమ్ అక్క ఎప్పటిలాగే సురయాను మరచింది. జమాల్‌ను ఎన్నుకుంది. సురయా అజీమ్ అక్కకు ఫెర్‌కాపీలు రాసిపెట్టడం నుంచి ప్రైవేటు ఉత్తరాలు అందించడం ప్రత్యర్థికూటాల్లో గూఢచారవృత్తి అవలంబించడం వరకు అన్నివిధులూ నిర్వర్తించింది. సురయా మండిపడింది. నానా మాటలన్నది. ప్రొఫెసర్లముండు. రచయితలముందూ జమాల్‌ను ఆడి పోసింది.

'జమాల్ వట్టి మొద్దుముండ పిచ్చిది. మీ అదృష్టం బావుండి షాహిద్ లాంటి తెలివైనవారికి చదువుచెప్తున్నారు. నిజం. అజీమ్ అక్కను చూడండి పాపం' అని చట్టిముక్క ఉలికించింది.

'జమాల్ ఎవరు? షాహిద్ ఉలికి పడి అడిగాడు షాహీద్ కాలేజీలో జరిగే కవిసమ్మేళనాల్లో విజయం సాధించిన్నాటినుంచి అమ్మాయిల్లో అతి విఖ్యాతుడయినాడు. అందమైన ప్రతి అమ్మాయిమీదా తనకే తొలిహక్కను కునేవాడు.

'కాలేజీకి వచ్చిందిలే ఒక జాగీర్దారు కూతురు.'

సురయా షాహిద్‌ను శ్రుతిపెట్టిన వీణలాచూచింది, తీగ తెగనుందో? పాడనుందో? షాహిద్‌ను చూచుకొని కొన్ని రోజులుగా కలలు కనడం సహితం మానేసింది. ఏదో విధంగా కాలేజీలో ఈ స్కాండల్ వ్యాపించాలని తహతహలాడుతోంది.

ఏం చెప్పమంటావు, షాహిద్ పాడు ముఖమూ అటీ మామూలు కవితకు కూడా అర్థం చెప్పలేదు. ఒకసారి ఏమైందనుకున్నావు- అజీమ్‌అక్క గాలిబ్ కవితకు అర్థం అడిగింది. ఒట్టు-తెలుస్తేనా?

"అది సరే ఇంతకూ ఎవరి కూతురు?" షాహిద్ ముఖంలో కలుగు తున్న మార్పులను బట్టి సురయా గ్రహించిది - ఆతని సర్వేంద్రియాలు జమాల్‌ను అన్వేషిస్తున్నాయని.

"అయ్యో! నాకేం తెలుసు ఆ చచ్చినోడెవడో?"

"అవును. అవునవును - నేనూచూచాను" షాహిద్ ధ్వనిలో పరాకు పసికట్టింది సురయా - మాట మార్చింది.

"నిన్నటి నుంచీ గాభరాగాఉంది నిజం భయం, ఒట్టు-రాత్రింతా నిద్దర లేదంటే నమ్మ"

"ఏమి? ఏమైంది?" షాహిద్ బెదిరినట్లయి చేతితో జుట్టు సవరించు కున్నాడు.

"ఏంచెప్పమంటావ్-వద్దంటుంటే అమ్మాయిలంతానన్ను యూనియన్‌కు ప్రెసిడెంటును చేశారు. ఇప్పుడేమో ఎవరో మంత్రిగారు వస్తారట ప్రారందోత్స వానికి, వారికేమో ఎడ్రస్ రాసి సమర్పించాలి. నిజం నాకు చాలాభయంగా ఉంది. ఎలారాస్తారో ఎడ్రస్ మంత్రులకు!"

"సరే ఎడ్రస్ రాసిస్తాను కాని ఒక్క షరతు" షాహిద్ చిరునవ్వులో కొంటెదనం కనిపించింది.

'నిజం! అని గంతేసింది. సురయాషాహిద్ బుజానికి తాకింది. (సలీమ్ ఏమంటుందంటే రాత్రింబవళ్లు కూర్చొని వెధవవ్యాసాలు రాయడం ప్రయోజనం కాదు. నీకోసం మరొకరు కవితరాయడంలో స్వారస్యంఉందని)

"ఇప్పుడిహ షరతులు గిరతులు పెట్టకు. ఎల్లుండి నాకు ఎడ్రస్ కావాలి."

"ముందు మీ ఫంక్షన్‌కు ఆహ్వానంపంపండి. తరవాత జమాల్‌తో పరిచయం చేయిస్తానని వాగ్దానం చేయండి."

అయితే ఈ వెధవకూడా 'మీరు' అనడం మానడంలేదు. దౌర్భాగ్యుడు.

మరునటిరోజు కాలేజీకి వెళ్లింది. జమాల్ సుందర సుకుమారహస్తం తన గుండెలమీద పెట్టుకుంది. తన దగ్గరి మిత్రుల్ని తోటలోకి లాక్కెళ్ళింది. అక్కడ సిగ్గుతో వంకరతిరిగిపోయి షాహిద్ కొంటెదనాన్ని గురించి, నిన్నటి అసభ్యప్రవర్తనను గురించి వివరించింది. అజీమ్ అక్క ఆహ్వానంమీద రేపటి సభకు వస్తున్నాడు—ఎందుకు అచ్చంగా తనను చూట్టానికి.

వెళ్ళేప్పుడు అతి ప్రేమగా జమాల్ చేయి పట్టుకుంది. జమాల్! నిజం నువ్వే అతిధులను ఆహ్వానించాలి. ఒట్టు నేను స్టేజు మీదికి రాలేను. ఏమో నబ్బా నాకు భయంగాఉంది. సిగ్గేస్తుంది ఈ వార్త కాలేజీలో వ్యాపిస్తుందేమోనని.

షాహిద్ సభకు వచ్చాడు. అతిధులమధ్య సోఫాలో కూర్చున్నాడు, వెనక సీట్లలో కూర్చొన్న అమ్మాయిల్లో గుసగుసలు బయల్దేరాయి సురయా అంటే షాహిద్ పడిచస్తాడని.

సురయా స్టేజిమీద ఉదయించి బహూపసందయిన ఎడ్రస్ చదివింది. అందరూ నిర్విరపోయారు. మాటకు తప్పుతీసే ఖమర్‌హుసేన్ సహితం మెచ్చుకున్నాడంటె అమ్మాయిలసంగతి అడుగనేల? సురయా తన సాయం అర్థించక ఏరచయిత ప్రాపకం సంపాదించి ఉంటుందని అజీమ్ అక్క

ఆలోచనలో పడిపోయింది. అంతకుముందు అజీమ్ అక్క వకే అడ్రస్ అందరిచేత చదివించేది. అది ఎక్కడిదంటే ఆమె ప్రెసిడెంటు అయిన పుడు ఖమర్‌హుసేన్ రాసిచ్చింది - పేర్లుమాత్రం మారేవి అంతే.

షాహిద్ సురయాగుండెలో గూడు కట్టుకున్నాడని అమ్మాయిలంతా ఏకగ్రీవాభిప్రాయాలకి వచ్చారు. అందుకే స్టేజిమీద ఉన్న సురయాను నిక్కి నిక్కి చూస్తున్నాడని అనుకున్నారు.

సురయా మైక్‌ముందునుంచి జరగ్గానే షాహిద్ పక్కనున్న అజీమ్ అక్కతో దీన్నంటారు మంత్రముగ్ధరచన అని అన్నాడు.

'ఎంతైనా నా శిష్యురాలు' అజీమ్ అక్కధ్వనితో అట్టడుగున దాగిన కావేషం కనిపించింది. ఆ మాటకు అజీమ్‌తోపాటు షాహిద్ కూడా పెద్దగా నవ్వాడు. వారి నవ్వువిని అంతా వారివైపు చూశారు. తరవాత డ్రామాలవంతు వచ్చింది. తీర్చిదిద్దిన కొండపల్లి బొమ్మలా జమాల్ స్టేజుమీద అవతరించింది షాయిద్ ఆమెను చూచాడు. తన్నుతాను మరచాడు. వరాకులో అతని సిగ రెట్టు అజీమ్ చంపకు తగిలింది. ఆమె చుర్రున లేచింది 'ఇందుకే మిమ్మల్ని అమ్మాయిల కాలేజికి పిలవంది. హద్దూ పద్దూ ఎరగరు'

'క్షమించండి. నిజంగానే మాకు హద్దులేదు.' అని చేతులు నలుపు కున్నాడు. తరవాత ఆమె మీదికి వంగి 'మీరు సంధాన విద్యావేత్తలని విన్నాను గుసగుసలాడారు.

హుష్..ఊరుకో అజీమ్ డ్రామాలో మునిగిఉంది.

వీల్లేదు. జమాల్‌తో కలుపుతానని వాగ్దానం చేయండి. కాకుంటే ఇక్కడే అందరిముందు అల్లరిచేస్తా' పిల్లల్లా మంకు పట్టాడు.

''నాకేమీ తెలిదు బాబూ సురయావల్ల పట్టుకో'' అని చేయి వదిలించు కుంది. సంధాన విద్యలో సురయా ఆమెకు నిజమైన శిష్యురాలిగా నిరూపితం అవుతూంది.

డ్రామా ఏంబాపుండలేదు. జమాల్ హీరోయిన్ పాత్ర నిర్వహించ లేక పోయింది. రొమాంటిక్ సీన్ వస్తే సంభాషణలు మరచి వడకిపోయింది కాటుక మీసాలు పెట్టుకున్న సురయాచూచి, వాస్తవంగా వరుడు వచ్చి చేతికి ఉంగరం పెడ్తున్నట్లు కుంచించుకు పోయింది.

సారాబాయి వగైరాలు గ్రీన్‌రూమ్‌లో జమాల్ నటనను గురించి విసుక్కుంటున్నప్పుడు మైక్ ద్వారా వొక ప్రకటన వెలువడింది. నవాబ్ రహమతలీగారి కూతురు జమాల్ అత్యద్భుత నటనకు గాను షాహిద్ రోమానీ బహుమానం ప్రకటించారు. హాలు మరొకసారి కరతాళ ధ్వనులతో ప్రతిధ్వనించింది. ఇద్దరే ఇద్దరూ మిన్నకున్నారు. గోడవైపు ముఖంపెట్టి నవ్వుతున్న జమాల్ ఒకర్తె. చేతిలోవున్న ఎడ్రెస్ కాపీ అంచులు చించిపారేస్తూన్న సురయా రెండోది.

తర్వాత చర్చల పోటీ అజీమ్ అక్క జడ్జీగా స్టేజి ఎక్కింది.

"చాల కష్టపడ్డాను. సురయా ఉపన్యాసం కాస్త శ్రద్ధగా విను". వికార్ షాహిద్ చెవిలో చెపితె ఉలిక్కిపడాడు. నమ్మలేనట్లు చూశాడు. సురయా స్టేజి మీద టిక్కు టిక్కుమని కులుకుతూ కదులుతూంది.

వికార్ డ్రామాల్లో విలన్ వేషంవేసేవాడు. క్రికెట్ ఆడుతాడు. దారే వెళ్ళే అమ్మాయీలను చూచి ఈలవేస్తాడు. అమ్మాయిలకు అతడంటే అదురు. అందుకే షాహిద్‌వంటి బుద్ధిమంతుల్లోకి అతని రాకలేదు. సురయా వికార్ పద్ధతిలో స్టేజమీద పొగలు జిమ్మే ఉపన్యాసం ఇచ్చినపుడు పాపం ఈ అమ్మాయికి కీర్తికండూతి మెండయింది అనుకున్నాడు షాహిద్.

కాలేజి సాంతం చూస్తుండగా సురయా ట్రాఫీ గెలుచుకుంది. షాహిద్ చాలా ఉత్సాహంగా ఆమెతో కరచాలనం చేశాడు. చిన్నపిల్లల్లా సురయా కొంగు పట్టుకొని మిఠాయి ఇప్పించాలని మంకు పట్టాడు. సురయా ఒప్పుకోక తప్పలేదు.

## 13

అతిథులను సాగనంపడానికి జమాల్‌గేట్ దాకా వెళ్ళింది. ఆమె ముఖపు మేకప్ ఇంకా పూర్తిగా వదల్లేదు. గోరింటాకుతో చేతులు ఎర్రగా ఉన్నాయి. చమ్కీఉన్న ఓణీ కండవాలా బుజాలమీద కప్పుకుంది. ప్రతి అతిథివెంటా కారుదాకావెళ్ళి సవినయంగా "చాలాచాలా కృతజతలు, చాలా శ్రమ కల్గించాం'' అంటూంది.

యూనివర్సిటీ పిల్లలంతా "చాలా చాలా కృతజ్ఞతలు'' అని గట్టిగా అరచి జమాల్‌ను అనుసరించుతూ సాగిపోతున్నారు. అదే సమయంలో షాహిద్ వొక నల్లషేర్వాని మిత్రునితో అటుగావెళ్తున్నాడు.

''జమాల్‌గారు! మిఠాయి తినడానికి మీ ఇంటికి ఎప్పుడు రమ్మంటారు?

''మాఇంటికా''? జమాల్ కొండమీంచి దొర్లిపడిపోతున్నట్లనిపించింది. ఆమె కళ్ళల్లో మంటలు ఉమిసేతండ్రి కనిపించాడు, జమాల్ స్టేజి ఏక్కిందని వారికీ తెలుస్తే వెంటనే తుప్పుపట్టిన తుపాకీ మరమ్మత్తుప్రారంభిస్తారు.

''సురయా అక్కను అడగండి'' ఆమె ముడుచుకు పోయింది,

''వీల్లేదు. మేం మిమ్మల్నే అడుగుతాం. మీరు గొప్పగా నటించారు. ఆ సమయంలో గాలిబ్ మహాకవి ఉంటే తన కవితకు వ్యాఖ్యచూసి పొంగి పోయెవాడు.

''చాలా చాలా కృతజ్ఞతలు, చాలా శ్రమకల్గించాం''. అని తప్పుకుంది.

''ఏవరాపిల్ల వెర్రిదానిలా ఉంది''. అని అతని మిత్రుడు లాక్కో పోయాడు

''సురయా అన్నీ నేర్పుతుంది,,. అన్నాడు షాహీద్.

పార్టీ సురయా ఇచ్చింది. కాని తన ఇల్లు ఇరుకని సలీం ఇంటికి పిలిచింది. అంతమంది మగపిల్లల్ని ఇంటికెవరు రానిస్తారు? విన్న మాటల్ని బట్టే 'చలాకీ పిల్ల ', అనే బిరుదం ఇచ్చేశారు. తండ్రి తిట్లుదాటి దెబ్బలదాకా

వచ్చారు. తల్లి, అక్కల ముందు అవమానించింది. అంతేకాదు ఎవడో ఒక కసాయిని పిలిపించి 'నికా' చదివిస్తానని బెదిరించింది. చదువుకున్న పిల్లను నికా కట్టుకునే కసాయి ఉండడని గ్రహించి ధైర్యం తెచ్చుకుంది. ఏర్పాట్లలో మునిగిపోయింది.

ఈ విందు ఆమె సలీమ్ ఇంట్లో ఏర్పాటుచేసింది. సలీమ్ నాయబ్ జంగ్ గారి ఒాకే ఒాక ముద్దుల కూతురు. ఆమెకు క్షయ. పదేళ్ళనుంచీ కాలేజీకి వాస్తోందంటే — చదవడానికి కాదు విహారానికి. యూనీవర్సిటీలో కాస్త పేరున్న విద్యార్థినల్లా విందులనీ, వినోదాలనీ సతాయించేది. సలీం అనుగ్రహం ఉంటే ఫస్ట్‌డివిజన్ ఏమిటి తాసిల్దారీ కూడ చేతికి అందుతుందని కాలేజీలో చెప్పుకునే వారు. ఆమెకు మామలు, బాబాయీలు, అన్నలు అంతటా ఉండేవారు. ఫీసు మాఫీతో చదివే పిల్లలు ఆమె దయాధర్మాలకై పడిగాపులు కాసేవారు. ఎలుక ముఖమూ. లొడితెడు మనిషి అయినా సౌందర్య రాశిగా చిత్రించే కవిరాజులకు కరువులేదు. అందువల్ల ఆమె కీర్తిచంద్రికలు యూనివర్సిటీని దాటి నగరంలోకి వ్యాపించాయి. నగరంలోని సాహిత్య రంగం ఆమెకు చేరువ అయింది. ఊరినుంచి వచ్చిన తల్లిచాటు పిల్లలు కూడా ఆమె శిక్షణతో నగరంలో పేరున్న రచయితలుగా ప్రఖ్యాతి గాంచారు. వీరంతా సృష్టిలో మహాకవులు అనిపించుకున్న నలీమ్‌ను చూస్తే ఊరిలోని తల్లులను గుర్తుకు తెచ్చుకుంటారు.

అందుకే సురయా సలీమ్ ఇంట్లో పార్టీ ఏర్పాటుచేసింది. అక్కడికి మరి కొందరు స్నేహితురాళ్ళను పిలిచింది. వారిలో మసూద్ ఒాకతి. ఆమె సురయాకు ప్రాణస్నేహితురాలు మసూద్‌కు తనపేరు పుం వాచకంగా ఉండడం ఇష్టం ఉండేదికాదు. అందువల్లనే ఆమె తన ముఖంలోను. శరీరంలోను ఆడ దనం అగుపించకుండా జాగ్రత్త పడుతుంది. ఆరోజుల్లో కాలేజీలోని ఆడ పిల్లలు తమ పేర్లలోని స్త్రీవాచకం తుంచి పారేయడం ఫేషన్‌గా భావించేవారు.

మసూద్ స్థితి సురయాలాంటిదే. ఒాక ప్రొఫెసరువారు తన విరహమున దివికేతెంచనున్నారని ప్రకటించింది. ఆ ప్రొఫెసరు భార్య, పాపం

కొద్దినెలల క్రితమే చనిపోయింది. వారు క్లాసులోకి వచ్చి తల్లిపోయిన పిల్లల పోషణకు సంబంధించిన చిట్కాలు అడిగేవారు. మసూద్ మాటిమాటికి లేచి ఏవేవో ఉపాయాలు చెప్పేది. ప్రొఫెసర్ అక్కడక్కడా మిగిలిన నల్లవెంట్రుకలను సరిచేసుకొని, జారిపోతున్న ప్యాంటు పైకి లాక్కుంటూ కృతజ్ఞతలు అప్పగించేవారు.

'మసూద్ బీబీ చాల తెలివైంది. ఈ కళ మీరూ నేర్చుకోవాలి. ఎందు కంటారా? వీటన్నింటి ప్రతిగా మీకురానున్న వరుడు ఒకేవక ప్రతిఫలం అప్పగిస్తాడు—సంతానం.'

అదివిని సిగ్గూ కోపం కలిసిన భావంగల నవ్వులు ప్రతిధ్వనిస్తాయి. ప్రొఫెసర్‌గారు కూడా తన పాచిపండ్లు బయట పెట్టి హె హె హే అని నవ్వుతారు.

'జారీగారు నీకు ప్రతిఫలం ప్రసాదించా లనుకుంటున్నారు. సలీమ్ మసూద్‌ను ఉడికించేది.

మసూద్ ముఖం జేవురించేది, ఆమెలో సిగ్గుల నిగ్గులు కనిపించేవి.

మరొకతిరానా. ఆమెకు సురయాలాగే కీర్తిజ్వరం తగులుకుంది. ఆమె చాయ సురయాలా అమావాస్యరాత్రి కాకున్నా సంధ్యాసమయపు మసక చీకటి లాంటిది. కొత్త కొత్త మేకప్ పద్ధతులు అవలంబించి ఉడిగిన సంజలాంటి చాయకు తెచ్చుకుంది. సురయాకు, ఈమెకు ఒకతేడా ఉంది. సురయా మంది వెంట తిరిగి వ్యాసాలు రాయించుకుంటుంది. రానా చుట్టు అబ్బాయిలు ముసిరి తాము రాసిన వ్యాసాలు ఆమెపేర ప్రకటించుకో వలసిందని ప్రార్థిస్తారు. 'నేను సూర్యుణ్ణి యూనివర్సిటీలోని ప్రతి పిల్లాడూ పొద్దుతిరుగుడు పూవు' అంటుంది రానా.

తరచుగా ఆమె, సురయా యూనివర్సిటీకి వెళ్ళేవారు — ఊరికే — విహారార్థం. రానా ఏదో ఒక గేలరీదగ్గరసురయాను నిలిపేసేది.—ఎందుకో తెలుసా?

తనతోపాటు కాలంనిలచి పోయిందని చూపడానికి. అప్పుడు ఏంజరిగిందంటే క్లాసులు వదలి వస్తున్న పిల్లలు ఏదోఒక నెపంతో అక్కడే తిరుగుతుండేవారు. అలాంటి సమయంలో ఈమె ఎలాప్రవర్తిస్తుదనుకున్నారు? చుట్టూ ఎక్కడా నరవాసన లేనట్లు సురయా మెడలో చేతులేసి రేలింగ్ మీదినుంచి తొంగి చూస్తుంది-కిలకిలా నవ్వుతుంది.

మొన్ననే మూన్‌లైటు ఎంజాయ్ చేయడానికి హోష్రుబా వెళ్ళానే. వాళ్ళేడూ హమీద్ మళ్ళీకారు తెచ్చాడే! నువ్వెందుకురాలేదే! ఎంత బావుందనుకున్నావే-ఓహ్! అబ్బా నాకు భయమేస్తుందబ్బా! అన్నానే! ఇంటికి వెళ్ళిపోతానన్నానే! నాన్నకు తెలుస్తేనా చెప్పందుకుంటాడన్నానే! చూశావా మా అక్క ఇవాళ బలవంతంగా గోరింటాకు పెట్టింది నేను వద్దన్నా విన్నది కాదే-యూనివర్సిటీ పిల్లలు ముదనష్టపాళ్లు వెక్కిరిస్తారో ఏమోనబ్బా! సిగ్గు వేస్తుంది.

పీర్లుకాక జమాల్ మరోపిల్ల పులిని వేటాడాలంటె తుపాకి ఒక్కటే చాలదు. దడుచుకుని అరచే మేకపిల్లకావాలి. అదికాక యూనివర్సిటీ పిల్లలు అంతా కదిలే మరల్లాంటి వాళ్ళు. వాళ్లతో నెగ్గడం ఆజీమ్ అక్కకు మాత్రమే వచ్చు. కాని సలీమ్, సురయాలకు వాళ్ళ ఆయువుపట్లు తెలుసు.

జమాల్ ఫస్టియర్‌లో చదివేది. తోటిఅమ్మాయిలను చిన్నమ్మల్లా ఆదరించేది. అయినాసురయా మూడు నాలుగుసార్లు కలుసుకున్నతరువాత బుజం మీద చేయివేసి కాలేజీతోటలోకి తీసికెళ్ళింది. ఆమె రూపాన్ని పొగడినతీరు చూచి క్లాసు పిల్లలంతా అచ్చెరువొందారు. వాళ్ళు మెట్లెక్కుతూ దిగుతూ చూసే సురయా జమాల్ జడ అందుకొని వీపుమీద దప్పు వాయిస్తుండేది. సురయా తన టిఫిన్‌డబ్బాలో గాజర్‌హల్వా తెచ్చేది. జమాల్ భవిష్యత్తును గురించి లెక్చరర్లకుసైతం నిరాశ కలిగింది. అయినా సంస్కృతిక కార్యక్రమాలు వచ్చినపుడు ఆమెనే పిలవాల్సివచ్చేది.

అయితే ఈపిల్లలు కాక పార్టీకి యూనివర్సిటీలో పేరున్న మగపిల్లల్ని కూడా ఆహ్వానించారు. నగరంలోని నవ కవులు, రచయితలూ కూడారు. వాళ్లు సురయా నుంచి జమాల్ దాకా అందరిని స్తుతిస్తున్నారు.

బాబూ! రజా అలమ్ రాలేదా! రజాఅలమ్........ షాహిద్ ఎస్తూనే వాగుడు సాగించాడు. అతడు నేరుగా బార్ నుంచి వస్తూన్నాడని కాదు అమ్మాయీలను చూస్తే అతని గుండె గంలేస్తుంది - నోరు అదుపు తప్పుతుంది.

హాయ్యో! మరిచేపోయాను సురయా పశ్చాత్తాపం నటించింది. అది షాహీద్ జ్ఞాపకం చేస్తున్నందుకు, కాకుంటే ఆకథలు రాసేవాడి ముఖం అంటెనే ఆవిడకు గిట్టదు. రజాఆలమ్ బట్టతలా, ఎండిన ముఖంచూచి వాళ్ళంతా 'ఎండురొయ్య అనేవారు.'

"చిత్రమే మీరు రజాఆలమ్‌ను మరవడం. సరేగాని ఈ విషయం అతని ముందు ఎత్తకండి.

"అవును మరిచాను ఏం అతడేమన్నా నా ఫ్రెండా? ఆ ఎండురొయ్యను చూస్తేనే నాకు భయం."

"ఆతడు పొరపాటున మిమ్మల్ని రస్‌గుల్లా అనుకున్నాడేమో" వికార్ అంటే అందరూనవ్వవలసివచ్చింది.

"దాన్ని గురించి రజాఆలమ్ గుండెను అడగండి."

"పోనీండి ఇప్పుడెందుకది." సురయా గుండెమీదికి ఒక కొండ దొర్లి వచ్చింది - అలా వచ్చిన కొండ సముద్రపు అడుగునకు కొట్టుకు పోయింది.

ఫ్రూట్‌సాలడ్ చేస్తూచేస్తూ ఆమె చేతులు పోయాయి. అందరి మధ్యన కూర్చొని గంటగా పళ్ళుపొట్టు వలుస్తూంది. సమయం వస్తే చక్కని వంట చేయగలనని నిరూపించడానికి ఆపని. అంతకు గంట ముందే సేరు పాయసా

నికి చక్కెరెంతని సలీమను అడిగింది. అప్పుడు ఆమె జమాల్ కథ విని పించింది. అదేమంటే ఓసారి జమాల్ పులగం వండాల్సివస్తే అందులో మిరపకాయలు వేసింది!

మీకు నన్ను హేళనచేస్తున్నారు. అసలు విషయం ఏమిటి చెప్పరాదూ. షాహిద్ చప్టమున్కా ఉలికించి అడిగింది.

చెప్పేదేమిటి మీ ఆడపిల్లల జాతి చాలా కఠినమైంది. అబ్బాయిలం ఇక్కడున్నాం - మమ్మగురించి ఆలోచించండే."

"రజా ఆలమ్ మాటమాట్లాడదండి," జమాల్ ఎంతో ఆసక్తిగా షాహద్‌ను చూచింది. సురయా ఆమెకు తన చీర కట్టించింది సాధారణ మేకప్ చేసింది, ఆమె సింగారింపు చూచి తన గుండె చప్పుళ్లను జమాల్ అర్థం చేసుకుందని గ్రహించాడు.

"అదికాదు ముందు మామాట వినండి" అన్నాడు జమాల్‌ను ఉద్దేశించి.

"అసలు ఇవాళ షాహిద్‌కు మంచి ఛాన్సు దొరికింది." అని సురయా అందరినీ నవ్వించింది.

"అయినాప్పి రజాఆలమ్ - పాపం" వికార్ మళ్ళీ జ్ఞాపకం చేశాడు.

'నాముందు వాడిమాట తేవద్దు - వాడు గాడిద'

'అది వాడి కర్మ షాహిద్' అందరితో కలిసి నవ్వక సిగరెట్టు వెలిగించాడు తనకు రజాఆలం ఎందుకు జ్ఞాపకం వచ్చినట్టు? అనవసరంగా సురయాను ఎందుకు ఏడిపిస్తున్నట్టు అనే ఆలోచనలో పడిపోయాడు. మంచిదే కాని పాపం ఇంత కష్టపడ్డందుకు బహుమానం లభించాలిగా!

బట్టతల అలంకారాన్ని గురించిన జమాల్‌జోక్ బాగా పేలింది. ఎంత ప్రయత్నించినా సురయా నవ్వలేకపోయింది. అందుకు కారణాలు జమాల్ ఆమెను పేపతేప అక్కా అని పిలుస్తుంది, రెండు రజాఅలమ్ 'కితాబు,ను

గురించి మాటి మాటికి రెట్టించడం ఎందుకు? అతనిదేమన్నా నిజంగా బట్టతలా? అదృష్టవంతుల్లా ముఖం కాస్త విశాలం అంతే.

'ఒకసారి కిషన్ చందర్ సురయాను గురించి చాల మంచివాక్యం రాశాడు. చెప్పనా సురయా' సలీమ్ అడుగుతే సురయా జంకింది.

'ఇదిగో సలీమ్ చూడు – నామీద ఒట్టు చెప్పావంటె చూడు మజాబ్ అన్నమాట నేనూ చెప్పేస్తాను.

'ఏమిటామాట? ఏమిటది?, అందరిలో ఆసక్తి పొంగింది.

అసలు విషయం షాహిద్‌కు మాత్రమే తెలుసు. మాటా లేదుమట్టీ లేదు. తనకు అంత పెద్దపెద్ద వాళ్ళతో పరిచయం ఉందని చెప్పుకోవడానికే ఇదంతా.

'ఇహ కవిగోష్టి ప్రారంభింతామా....? షాహిద్ అడగ్గానే అందరూ అందుకు సంసిద్ధులయినాయి.

ఈపార్టీ పర్యవసానం ఏమైనప్పటికీ రజాఆలమ్ అదృష్టం పండింది అతని విశాల వదనంమీద విధాత పేరు ప్రఖ్యాతులే కాక ఒక చురుకైన పిల్ల సాంగత్యం కూడా రాసిపెట్టాడని సురయా అతనికి విశ్వాసం గలిగించింది. ఏ ద్వారంలోకి ప్రవేశం లభింపని దురదృష్టవంతుల్లో రజాఆలమ్ ఒకడు అతడు తన కథల్లో అభ్యుదయం, ట్రాజిడీ, సెక్స్‌చిట్కాలు అన్నీ సమపాళంలో వేసేవాడు. అయినా అతని వెంటపడం వచ్చిన సంపాదకులు ఉండక పోవడం దురదృష్టం కాదూమరి! విసిగిపోయి స్వయంగా వక పత్రిక ప్రారంభించాడు. అప్పుడు నగరంలోని చిన్నా, పెద్దా రచయితలు అతని నైపుణ్యాన్ని గురించి రాయసాగారు. ప్రతి రచయిత కర్తవ్యం ఏమిటంటే అతని పత్రిక భారత దేశంలో ఏకైక పత్రికగా కీర్తించడం – అతణ్ణివినా మరొకణ్ణి కథాకారునిగా గుర్తించక పోవడం. ఇప్పుడు రజాఆలమ్ కథలు అచ్చుకావడమేకాదు. అతని కథల్ని గురించి సురయా రాసిన ప్రశంసావ్యాసాలు కూడా అచ్చవుతున్నాయి

సురయా కాలేజీనుంచి బయటపడి స్కూలు టీచరు అయింది. రజా ఆలమ్ క్లార్కు ఉద్యోగం వదిలేశాడు. కథలు రాయడమే అతనిపని. పగలంతా సిగరెట్లు కాలుస్తూ కథలు రాస్తాడు. సాయంత్రం తాగి తూలుతూ సురయా ఇంటిముందు కూలబడి ఆమె పేరుపెట్టి పిలుస్తుంటాడు. మొదటిసారి అతను వచ్చినప్పుడు ప్రళయం వచ్చేసింది. లోన కూర్చున్న అమ్మా, అక్కా సురయా తాత్కాలికంగా చనిపోతే బావుండుననుకున్నారు. నాన్న మెడపట్టి రజాఆలమ్‌ను గెంటారు. బెత్తం అందుకొని సురయావైపు సాగాడు.

'ఆగు అడుగు ముందుకువేస్తే ఉండను. లేచిపోతా'

వేలెత్తి అన్న సురయానుచూచి తండ్రి ప్రతిమలా విశ్చేతనుడై నిలచిపోయాడు. ఆ బెదిరింపు విని తల్లి తల్లడిల్లింది. నిజంగానే లేచిపోతే అనుకుంది.

ఆమెకు పెళ్లికావల్సిన మరి ముగ్గురు కూతుళ్లు కనిపించారు. వాళ్లు ఎదుగుతున్నారు. వారిలో మొలుస్తున్న వయసు తండ్రితో మార్వాడీ దగ్గరికి వెళ్లి-అప్పులుతే అంటూంది. కాని అప్పుం అప్పులతో జీవితం లభించదే! సురయాను గురించిన గుసగుసలు, ముసి ముసి నవ్వులనుంచి హేళన నవ్వుల దాకా వచ్చేశాయి. మంచి వాళ్ళెవరూ ఈ గుమ్మంలో అడుగు వేయలేక పోతున్నారు. ఎలావేస్తారు? మెట్ల దగ్గరే రజాఅలమ్ కుక్కలా పడి ఉంటుంటే! సురయా వచ్చి అతని చేతికి మూడు, నాలుగు రూపాయాలిచ్చి పంపుతేగాని కదలడు. ఇంటివాళ్లకు ఆమెతో సంబంధం వలచబడింది. స్కూలునుంచి కాలేజీకి వెళ్తుంది. అక్కడ సంధాన కార్యక్రమంలో కొంతకాలం గడుపుతుంది. ఆతరువాత రజాఆలమ్ గదికి వెళ్తుంది. అంతకుముందు ఆగదిని నాన్ రొట్టెలవాడు అద్దెకు తీసుకొన్నాడు. అందుకే అందులో ప్రవేశిస్తే పట్టపగలు కూడా అర్ధరాత్రిలా ఉంటుంది. సురయా దానికి సున్నం వేయించింది. ఇప్పుడా నల్లని గోడలు తెల్ల ముసుగువేసుకున్న సురయాలా ఉన్నాయి. రజాఆలమ్ ఆమెను గురించి ప్రశంసా కవితలు చదివి నప్పుడు ఆ గదిలో దీపావళి రేయి

పరచుకుంటుంది. ఆమె బాల్యంలో రచయిత సాహచర్యం కోరుకుంది. అది అక్షరాలా నిజమైయింది. ఆ గది గోడల నిండా 'సురయా రజాఆలమ్, అని పెన్సిల్‌తో రాసింది

తండ్రి దగ్గరికి వెళ్ళి పెళ్లిని గురించి అడగమని సురయా రజాఆలమ్‌తో చాలసార్లు తగాదాపడ్డది. రజాఆలమ్ పద్ధతి ఆమెకేమీ నచ్చలేదు. బాజాలు లేకుండా ఊరేగింపు లేకుండా ఎక్కడో గుప్ చుప్‌న నికా కట్టుకోవడం ఆమెకు ఇష్టం లేదు. అలా జరుగుతే తాను పెండ్లికూతురు కావడం, పెండ్లివిందులు జీవితాం-తం కలగానే ఉండిపోతాయి. ఈ లోగా రజాఆలమ్ మహబూబ్‌నగర్‌లో తనకో తల్లిఉందనీ, ఆస్తి ఉందనీ ప్రకటించాడు. ఆ మాటవిని సురయా పొంగిపోయింది. అత్త, ఆడబిడ్డలతో తగాదాలు పడొచ్చుననుకుంది. ముసలి దాన్ని ఆటలాడించ వచ్చుననుకుంది. ముసలిది తనబాధలు పడలేక రజాఆలంతో మొరపెట్టుకుంది. ఆ విధంగా, ఊర్లో ఏ మూలనో పడి ఉన్న ముసలిదానికి ఆయువు ప్రసాదించుమని ప్రార్థించింది. తన జీతం సొంతం రజాఆలమ్‌కు అప్పగించింది. అక్కడిఆస్తిఅమ్మి ముసలిదాన్ని ఇక్కడికి తీసుకరమ్మంది. అవును డబ్బు! లేకుండా పెళ్లికార్యం ఎలా జరుగుతులడ!

రజాఆలమ్ వెళ్లిపోయాడు. అప్పుడు ఆమె కళ్లుతెరిచింది. లోకాన్ని చూస్తే చాలా మారిపోయింది షాహీద్ కాలేజీ ముగించుకొన్నాడు. బొంబాయిలో రోడ్లమీద తిరుగుతున్నాడు. జమాల్ విరహం భరించలేక పిచ్చివాడయినాట్ట. జమాల్ ఫిలాసఫీ ప్రొఫెసర్ భార్య అయింది. జీవితం గడుపుతూంది.

సలీమ్ టీబీ చివరిదశనుంచి జీవితపు తొలి మజిలీ చేరుకుంది. అప్పటి ఉర్దూ ప్రొఫెసర్ క్లాసులో భార్యకు సంబంధించిన కథలు వినిపిస్తున్నాడు. సలీమ్‌కు తలనొప్పి అవుతే ప్రొఫెసర్‌కు మనసులో మనసు ఉండడంలేదు. క్లాసులో 'జవుఖ్' కవితను 'గాలిబ్' కవిత అంటున్నాడు. సలీం ఇప్పుడు పరదాలో ఉంటూంది. తన పాతస్నేహితులకు గూండాలని బద్మాషులని బిరుదులు ప్రదానం చేస్తుంది.

# 22

సురయా రజాఆలం నుంచి ఉత్తరం కోసం వేచివేచి సలీమ్ ఇంటికి చేరుకుంది. తానే ఆ ఇంటికి నియంత అయినట్లు సోఫాలో పడిపోయింది. సలీము ఆమెకు విసనకర్రతో విసురుతూంది. చాయ్‌చేసి తెచ్చిఇస్తుంది. తన జీవితం వెలుగొందడానికి సంబంధించిన బ్యాటరీస్విచ్చి సురయా దగ్గరుందని ఆమెకు తెలుసు.

జమాల్‌కు తనను గురించిచాల గర్వం ఉండేది. షాహిద్‌ను తననుంచి ఎవరూ వేరుచేయలేరని విర్రవీగేది. కాని ఏదో అదృశ్యహస్తం షాహిద్‌ను బొంబాయి రోడ్లమీద విసరివేసింది, జమాల్ పెండ్లి ఫిలాసఫి ప్రొఫెసర్‌తో జరిగినపుడు సురయా స్వయంగా దోలు వాయించింది. పాటలు పాడింది. స్వహస్తాలతో జమాల్ చేతిని వరుని చేతికి అందించింది.

ఇవన్నీ సురయా స్వప్నంలో చేసినట్లుంది. ఆమె జమాల్‌ను, సలీమ్‌ను పెండ్లికూతుర్ను ఎందుకు చేసింది? తాను పెళ్ళికూతురు కావడానికి నిరీక్షించి గనుక. ఆమె జమాల్ తల్లయి జమాల్ పిల్లలను ఏల చిచ్చికొట్టింది? ఆమె దగ్గర పసి పిల్లల దుస్తులు చాలా కుట్టిఉన్నాయి. గనుక షాహిద్ కన్నీరు కారుస్తూ జమాల్‌కు ఉత్తరాలురాస్తే ఆమెకూడా వాటిని చదివి కన్నీరు రాల్చింది

ఆమె కోరిందేమిటి? తాను చేసిందేమిటి? ఏమీ అర్థం ఆయ్యేదికాదు. షాహిద్ వెర్రివాడయి బొంబాయినుంచి వచ్చేవాడు. అప్పుడు జమాల్‌ను సాగ దోల్సివచ్చేది. సాగదీయాల్సివచ్చేది ఏమిటది? వందలకొద్ది అబ్బాయిల, అమ్మాయిల జీవితాలను తీర్చిదిద్దే బాధ్యత తనకెందుకు?

రజాఆలమ్ రావాలి. తానూ పెళ్ళికూతురు కావాలి. అత్తతో పోట్లాడాలి పిల్లల్నివాదాలితాను కూడా గుండాలకుదూరంగా ఉంటుంది, పరదాలో ఉంటుంది. పాపం రజాఆలమ్ తన కథలు వినిపించి వినిపించి శ్రోతలనుక్షమాపణకోర్తాడు.

"క్షమించండి మా ఆవిడకు నిన్నటినుంచి దోకులు. నా బదులు కిషన్ చందర్ మీకు కథ వినిపిస్తాడు."

ఆమె రేలింగ్ మీదినుంచి వంగింది. కరెంటు వాళ్ళపని చూస్తూంది, కూలీలు చీమల్లా ఉన్నారు. ఇనుప స్తంభాన్ని కరచుకొని ఉన్నారు. ఎటు చూచినా చుక్కల గుర్తులు - స్విచ్చులు, ఉచ్చులు, రోడ్డుకు ఇటునుంచి అటు తాడు. మధ్యన రెపరెపలాడే ఎర్రజండా.

ఈ శ్రామికులు అనంత కళలు సృష్టించ గలరు - ప్రదర్శించగలరు. ప్రవహించే నదులను నిలుపగలరు. ఆ నదికి అగ్గిపెట్టగలరు. అందునుంచి విద్యుత్కాంతిని సృష్టించగలరు ఆ విద్యుత్తు వందలమైళ్లు పయనించి చుక్కలవల పరచగలరు. కంపన - ప్రకంపన - ఉచ్చులు ప్రమాదాన్ని హెచ్చరించు ఎర్ర జండా ఒకమీటు, దాన్ని నొక్కడం - లైటు వెలగడం-ఆ వెలుగుకు ఒకవెర్రిశలభపు ఆత్మరక్షణ, ఇంతే, ఇదే మనిషి కథ - వలపు గాథ

లోన గదిలో షాహిద్ జమాల్ మాట్లాడుకుంటున్నారు. గుసగుసలు నిట్టూర్పులు. వందలమైళ్ళదూరం అక్కడొకనది. నది ఒడ్డున బురద. బురదలో పురుగులు బిలబిలాడుతున్నాయి అక్కడే ఒక పతంగం కూర్చుంది - ఆలోచించింది - ఆ పరసలో చివరి మజిలీ చేరుకోవాలనుకుంది. ఇంతలో ఒక దివ్వెమండింది, వెలిగింది. ఇహ ఆపతంగపు ప్రదక్షిణకు అంతంఏది?

తాను ప్రమాదాన్ని సూచించు జండా అయింది. బయటి రెపరెపలాడుతూంది. తనకు ధైర్యం వుంది. సాహసం ఉంది. వాటిబలంతో తాను వంటరిగా ఇనుప స్తంభం పాతుతూంది. వదిలే తీవల స్విచ్చులను కలుపుతుంది. అది నిజమే తన శరీరంలో కూడా కరెంటు పాకుతూంది. షాక్ అనిపిస్తూంది. వంటి నిండా వేదనలతరంగాలు వెలుగుతూ ఉరుకుతున్నాయి.

ఎంత బరువైన బాధ్యత నిర్వహిస్తూంది తాను! తనకు ప్రమాదాలతో ఆటలు అలవాటే. అయినా వళ్లు వడకుతూంది. నేడు జమాల్ కప్పులేని కరెంటు తీగ. అంటుకున్నవాడు హరీ అనాల్సిందే, ఎంతధైర్యంతనది? ముగ్గురుపిల్లలు జబ్బుతో నున్న భర్తనుంచి జమాల్‌ను లాక్కొచ్చిందితాను. జమాల్ ఆరేళ్ళక్రితపు అందాలు అక్కడే వదిలేసినట్లుంది, అమె చేతులకు

భర్తతలకు రాస్తున్న నూనె దుర్వాసన చీరమీద చిన్నపిల్లవాడి మూత్రం. పెద్దపిల్లకు అల్లుతున్న సూటర్ అంటుకొని ఇక్కడిదాకా వచ్చింది. అలాంటి జమాల్ సిగ్గుతో ముడుచుకొని గదిలోకి వెళ్ళింది. అప్పుడు సురయాకు కూడా సిగ్గేసింది.

అంత అందమైన అతివ ఎంతలో భార్య అయింది! తల్లి అయింది! ఇహ జీవితాంతం వాటిల్లోనే మునిగి ఉంటుందేమో! అయినా ఆమె షాహిద్ ప్రేయసి అనే విషయం సురయా గుర్తుచేస్తుంది, జమాల్ బిడ్డకు జబ్బు చేస్తుంది. ఆమె మనసు మనసులో ఉండదు, ఇంట్లోఏవో చీకాకులు వాటితో సురయాకు మర్యాదలు చేయలేదు, అప్పుడు సురయా ఆజ్ఞాపిస్తుంది. ఏమని? షాహిద్‌కు ఉత్తరం రాయమని ఎందుకని? రాయకుంటే అతడు ఇంట్లోనే దిగుతాడని,

అయినా ఆమె ప్రేమాభిమానాలను ఎవరూ గుర్తించలేదు. రేలింగ్‌మీద వంగి వంగి కన్నీరు తుడుచుకుంది. బట్టతల రజాఅలంకూడా ఆమెను గమనించలేదు. ఇప్పుడతడు ఊరినుంచి మిత్రులకు కథలు పంపడంలేదు. ఉత్తరాలు రాస్తున్నాడు. ఆ ఉత్తరాలు తానూ చూచింది. అన్నింటిలోనూ భార్య జబ్బును గురించి, పిల్లల ముద్దులను గురించేఉంది.

ఆమెకూడా భార్యకాగలదు, ఆమె కూడా పిల్లవాడు మూత్రించిన చీర కట్టుకోగలదు అనే విషయం జనం మరిచారు. తాను సంతోషాలు పంచడంలో ఉదారంగా ప్రవర్తించింది, జనం తన విషయంలో లుబ్ధులు ఎందుకవుతున్నారు తన అనుగ్రహం ప్రవాహాన్ని అందరికీ అందించింది, అంతా దాహం తీర్చుకొన్నారు. తమ దారి చూచుకున్నారు, తననుచూచి తుర్రున ఎగిరిపోయే రంగురంగుల పిట్టల్ని పట్టుకొనడానికి ఉరికింది, పిల్లలంటే కనికరం లేని చంద్రునివెంట పరుగులు తీసింది,

అమె తన కన్నీటి వరదకు కట్టుకట్టి పైకిచూచింది గోడకు వ్రేలాడే. బల్లమీద Tolet అని రాసిఉంది, ఈ ఖాళీ ఇంటిని షాహిద్ చాల కష్టంగా

సాధించాడు. జమాల్‌ను కట్టుకోవడానికి. కాని అబల్ల తన పొసట ఉన్నట్లని పించింది సురియాకు. ఆమె కూడా ఖాళీఇల్లే. దీన్ని దయ్యాలకొంప అను కున్నారు. అంతా విడిచిపెళ్ళారు. ఇప్పుడు దాని గోడల్లో గడ్డి మొలుస్తూంది. గోడలగచ్చు అక్కడిక్కడా పెచ్చెల్లేచింది.

ఈ ముంగిలిలోకే దాగుడుమూతలాడే పిల్లలేలరారు? ఇంతవరకు ఇక్కడ దీపం ఎందుకు వెలగలేదు? ఆమె ఛీకటిలో తలకొట్టుకొని తెరుగుతూంది. కేకలువేసి పిలుస్తూంది. ఎపడూ పలకడు ఏడీ షాహిద్? ఏడీ వికార్? ఏడీరజా? ఏరీ వీరంతా!

ఆమే మొదలు నరికిన చెట్టులా మెట్లమీద పడిపోయింది.

ఎవరది? ఎవరక్కడ? ఎవరు డోలువాయించేది? నిజం. అది డోలే డోలు చప్పుడే. ఎవరో అపస్వరాలు వాయిస్తున్నారు. చ ఛ ఏమిటాపాట? సలీమ్ గుర్తుందా? నీపెళ్ళిలో ఎన్ని పాటలు పాడాను? ఎంత హడావుడి చేశాను ఇంట్లో పెళ్లిఅవుతే ఎంతసందడి-ఎంత వెలుగు! వెలుగే వెలుగు సందడేసందడి

బత్తోలుఉండే దానికి గోరింటాకు పెట్టుకోవడం గిట్టదు. కొండెంగలా నేనోమూలకు కూచోనని స్పష్టంగా చెప్పేసింది. కమ్మ్యూనిస్టునని తిరిగేది నాకైతే బాగనిపిస్తుందమ్మా! వధువులకు గోరింటాకు అలంకరించడం వాళ్ల చల్లని చేతులు తాకడం నాకు భలేసరదా. అందుకే జమాల్‌కు బాగా గోరిం టాకు పెట్టాను.

ఈ నిమ్మాషమ్మా ఖుర్రలకు ఏమైంది? భూమీ, చంద్రుడు వేరువేరుగా తిరుగుతున్నారని తెలీదా? పీరిమధ్యదూరం శాశ్వతంగా ఉండేదే-ఉంటుంది.

సలీమ్ ఎందుకింకా కూర్చున్నావు? వెళ్లు నీమొగుడు ఎడబాటు భరించ లేడు. పాపం. పద్యాల అర్థాలు మరిచిపోతాడు. నాకు తెలుసు నీవెందుకు కూర్చున్నావో? ఏదో శుభవార్త విందామని-అంతేకదూ? విను చేపుతా. అమ్మ

మళ్ళీ మజీద్ దగ్గరికి వెళ్ళింది యాచించడానికి. వాడూ నిరాకరించాడు. వాడికీ నేనక్కర్లేదు. పెళ్ళాం కావాలి. తల్లిలేని పిల్లల్ని సాకడానికి. వాడికో ప్రాణంలేని బొమ్మ కావాలి. వాడు నాకేం చేయగలడు? నేను సురయాను-సురయాను మాత్రం. నాకు నీళ్లు తాగించు. ఆ పచ్చికుండ ఎత్తి నామీద గుమ్మరించు. ఈ మాత్రం చేయలేవా? చాల్లే ఎందుకా మాటలు? అవును నాకు ఎందుకు సాయం చేస్తావులే. నేనెవరికేం చేశానని. ఒక ముసలివాణ్ణి పిసినారిని జాగీర్దారుని తెచ్చావు. అతని అమ్మముందూ అక్కముందూ కూర్చోబెట్టావు. అబ్బా! ఏమిటబ్బా ఈ పెక్కు. రోజంతా ఆలోచించినా ఏచీర కట్టుకోవాలో తెగదు ఎందుకూ అన్ని నగలు పెట్టావు. ఉక్కపోస్తుందబ్బా! సరేకాని ఇవ్వాళ నువ్వు చెప్పినట్లే వింటాను. దాచెనా కాటుకా పెట్టుకుంటాన్లే, కాకుంటే నువ్వు నన్ను పెళ్ళికూతురనవు. అవునురదా! నువ్వు నా పాపిట అలంకరిస్తున్నావు అప్పుడు నాకో మంచి ఆలోచన వచ్చింది. ఏమిటంటావా? ఒక పెండ్లి పత్రిక రజా అలీకు పంపుదాము. అప్పుడెలా ఉంటుంది. వాడికి కోపం వస్తుంది. మండి పడతాడు పెళ్ళాన్ని బాదుతాడు. వెధవ ఎందురోయ్య!

ఈ మొగాళ్లు తమ కోపాలను ఆడవాళ్లమీద తీరుస్తారు. ఈ ఆడవాళ్ళను చూస్తే భయమవుతూంది. కళ్లు మూతలు పడుతున్నాయి. సిగ్గనిపిస్తుంది. వాళ్లు వధ్యశాలలో నుంచున్న జంతువులా ఉన్నారు. ఎందుకూ నేనువాళ్ల కోసం ఏడవడం? వాళ్ళంటే అసహ్యం నాకు. నీకూ, మా అమ్మకూ భయపడి అక్కడ కూర్చున్నాను. అతడెవరు? నీకు మామా? అతడే వద్దన్నారుగా - ఇహ సరా? ఆడ పిల్లలు అలా అనగలరా? ఒకసారి మజీద్‌ను వద్దన్నాను. అంతే ఇలా అయ్యాను.

నేనిపుడు ప్రమాదం సూచించు ఎర్రజండాను. నన్ను వెదురుబొంగుకు కట్టి జనానికి చూపించు.

ఎవరది....? మెట్లమీద ఎవరి అడుగుల సవ్వడి . ? నువ్వేదో దాస్తున్నావు. నిజంగా ఎవరో వస్తున్నారు. రావచ్చు వచ్చేవాడు నాకోసం గ్లాసెడు చల్లని నీళ్లు తెస్తుండవచ్చు. రానివ్వు తేనివ్వు.

# పెదాలు

వాళ్లకు సాధ్యం అప్పుడే నన్ను ఎముకలో మూలుగులా పీల్చిపారేసేవాళ్లు

ఈ ఇంటికి వచ్చినప్పుడు అదృష్టంమీద నమ్మకం లేదు. అత్తవారింటికి వెళ్ళే కోడళ్లు తమ బలహీనతను అదృష్టంగా భావిస్తే పుక్కిటి పురాణం అనిపించేది. ఆ కోడలుపిల్లలాగే తిట్టుకుంటున్నా ఆ ఇంటికి వెళ్ళడం తప్పడం లేదు. రోజూ రెండుసార్లు ఆ ఇంటికి వెళతాను. అసలు నేను మూడుసార్లు వెళ్ళాల్సింది. మహమూద్ అలా ఏర్పాటు చేశాడు. నేను నెలకు ముప్పై రూపాయిలిచ్చేట్లు నాకు మూడు పూటలా వాళ్లు తిండి పెట్టేట్లూ ఏర్పాటు.

యూనివర్శిటీ హాస్టల్లో ఈగల పులుసూ, రాళ్ల రొట్టెలూ మాన్పించడం కొందరి కుర్రాళ్ల సాహసానికి సాధ్యం అయ్యేదికాదు. హైదరాబాదులో కొండల్ని చదును చేయడమూ సాధ్యంకాదు. మహమూద్ మాయదీపపు భూతంలాంటివాడని ప్రఖ్యాతి. అయినా అమ్మాయికి ఇవ్వవలసిన ప్రేమలేఖ లెక్చరర్‌కు చేరవేసేవాడు. అతనికి రహస్యం అవి చెప్పింది. తప్పక ప్రొఫెసర్ల దాకా పోయేది. అదంతా ఏమైనా నాకుమాత్రం నగరంలో ఒకగది ఇప్పించాడు. యూ.పి.నుంచి వచ్చిన మంచి కుటుంబంలో భోజనం ఏర్పాటు చేశాడు.

గది మద్రాసు వాళ్లు కిరాయకు ఇచ్చారు. వాళ్లు కాఫీ, ఊరగాయలు, అప్పడాలబేరం చేసేవాళ్లు. దంచవలసిన వస్తువుల వర్తకం వారిది. కాఫీగుండ వానెత్తిమీద దంచేవారు. ఊరగాయల ఘాటుకు తుమ్ములవరస. తుమ్ములతో శుభ్రం అయిన మెదడుకు రొయ్యలువేపిన వాసన అందించేవారు. శ్మశానంలో చందనం చెక్కా, నేతిలో వేసిన పీనుగల వాసనలో ఉంటూన్నట్లు అనిపిస్తుంది

సరిగ్గా సమయానికిపనులు జరగడం ఈఇంట్లోనే చూశాను. ఇంటికి పెద్ద పిల్లవాడు తలుపు తీయమని కేక పెట్టాడనుకోండి .. మీరు కళ్లుమూసుకొని ఉదయం ఏడున్నర అయిందని చెప్పచ్చు. పెద్దమనిషి బయటికి రావడానికి

తలుపు తెరిచిన చప్పుడయితే సాయంకాలం ఆరు గంటలయినట్లు అప్పుడామన పాలు పోయడానికి బయల్దేరుతాడు. తలుపు తట్టిన చప్పుడయితే రాత్రి ఎనిమిదయినట్లు. తరవాత గప్‌చుప్ ఇహ చప్పుడేగాదు. శ్మశాన ప్రశాంతత ఆవరిస్తుంది. తరవాత అడుగుల చప్పుడు గిన్నెల కదలికతప్ప ఏమీ వినిపించవు. ఒకనాడు మాత్రం నా గదిపక్కన ఒక ఆడది పడ్డట్టూ, ఆమె ఆయాస పడుతున్నట్లూ వినిపించింది. మర్నాడు యజమాని వచ్చి క్షమాపణ కోరాడు.

ఆ తరవాత భోజనం చేయాల్సిన ఇంటికి వెళ్ళాను.

అది రెండుగదుల క్వార్టర్. ముసలాళ్ళ గది ఖాళీగా ఉంది. గాలిపటాల కాగితాలు, విరిగిన కర్రలు, ఖాళీ సిగరెట్టుపెట్టెలు, ఫిల్ముల వాల్‌పోస్టర్లు గుట్టగా పడిఉన్నాయి. ఒకమూలకు చిరిగిన చాప ఉంది. దానిమీద చిరిగిన మురికి బట్టలు పడిఉన్నాయి. దానిమీద ఒక ముదుసలి ముడుచుకొని పడి ఉన్నాడు. అతనిది నిప్పుకోడిలాంటి పొడవైన మెడ. దాన్ని మోకాళ్లమధ్య ఇరికించి ముడుచుకున్నాడు. లోపలినుంచి ఒక ఆడది శ్వాససైతం ఆడనట్లున్నది. గుట్టమీద గుడ్డపేగులాంటిదివేసి పెంచుతూంది. మహమూద్ కేకవేశాడు ముసలివాడు ఉలిక్కిపడి లేచాడు. అప్పుడతనిమెడ ఆకాశంలో నక్షత్రాలమధ్య నడయాడుతున్నట్లుంది. అతడు మమ్మల్నిచూశాడు. తీక్షగాచూచి గుర్తించినట్లు చేశాడు. చాపమీద కూర్చోడానికి అనుమతించాడు.

“మురాద్‌నుంచి ఉత్తరం వచ్చిందా? మహమూద్ సంభాషణకు ఉపక్రమించాడు.

‘మూడు నాలుగు నెలల్లో రావచ్చు,’ ముసలివాడు నిట్టూర్పువిడిచాడు.

‘రాకున్నా అతని ఆశతో జీవించడం మానేశాం.

అతనికి అది నచ్చలేదు. ఆశపెట్టుకోవడం వ్యర్థప్రయాస. డెబ్బై ఏండ్ల వయసులో అదే నేర్చుకొన్నది.’ అన్నాడు.

ఆశలు వదలుకుని జీవిస్తున్న వృద్ధుణ్ణి దగ్గరిగా చూచాను. అతడు మసిషిగా ఉండిందెప్పుడో తెలీదుగాని ఇప్పుడు మాత్రం అస్తిపంజరానికి చర్మం తొడిగినట్లున్నాడు. అతని ముఖం ఆరిన దీపంలా ఉంది. కూలిన కొంపలా ముఖంలో మౌనముంది. అడ్డదిడ్డంగా పెరిగిన గడ్డం కదలాడుతూంది. రానున్న ఇక్కట్లలా జులపాలు పెరుగుతున్నాయి. జీవితాంతం ఎడారిలో పాట్లుపడి ఇప్పటికీ అగ్నిమీద అడుగులేస్తున్న జాడలు అతని వదనంలో కనిపిస్తున్నాయి.

గదిలో మాసిన గోడలమీద ఉమ్మిచారలున్నాయి. అద్దేములో పికాసో ఆర్టులాంటి అసమాన రేఖాప్రతిమలున్నాయి. ఒకకుర్రాడు సిగరెట్టు పీలుస్తున్నాడు. ఆడదాని రూపానికి చేప శరీరంఉంది. ఒకడు గాడిదమీద స్వారి చేస్తున్నాడు. దాని కింద 'బహుదూరపుబాటసారి! మమ్మువెంట తీసికెళ్లు'అని రాసింది. భూతాలు, పక్షులు, పిచ్చుకల బొమ్మలకు లెక్కలేదు. ఈచిత్రలేఖనం లోపలదాకా కొనసాగుతున్న ఛాయలు కనిపిస్తున్నాయి. లోపలనుంచి ఒకపురుషుడు అతి అపస్వరంతో పాడుతున్నాడు, "బాల్యం నుంచే రపికా గ్రేసరుణ్ణినేను" అని

ఆ పాడేవాడు రఫీని తలతన్నాననుకునేవాడిగా కనిపించాడు.

మహమూద్ నామంచి తనాన్ని గురించిన కథల్ని ముసలి వాడికి చెపుతున్నాడు. నాకేమో ఈ ఇంటిని చూస్తే బుగులుగాఉంది. రోజూ మూడుసార్లు రావడం గండం అనిపిస్తుంది.

అమాంతంగా లోపలి పాట మూతపడింది. ఒక సన్నవి మెత్తనిస్వరం వినిపించింది. 'పెద్దన్న మిత్రులు వచ్చారు. పెద్దన్న మిత్రులు వచ్చారు.' అమాంతంగా పరుగుపందెం మొదలయింది. గది గుమ్మానికి వేలాడే మురికి తెర కదలసాగింది. తలుపులు కదిలాయి. ద్వారంనుంచి ఒక సుందరి చూస్తున్నట్లనిపించింది, ఇప్పుడు అటు చూడకుండడం నా నైతికధర్మం, చూపు తాకుతుంటేఆదోలాఉంది. కాళ్లు చేతులు మంచు ముద్దలయినాయి. ఇహ అక్కడచేత్తో

శిరోజములు సవరించు కుంటున్నారు. ముక్కుస్థానం తప్పిందేమోనని చూచు కుంటున్నారు. ఫోటోదిగడానికి తయారైనట్లున్నారు.

'ముందు వీరి ఆరోగ్యంచూచి మేము ఈర్ష్య పడేవాళ్ళం. హాస్టల్ తిండి ఇలా చేసింది'. మహమూద్ చెప్పుకుపోతున్నాడు.

అప్పుడు నన్ను నేను చూచుకుంటే ఏడ్పువచ్చింది. ధైర్యం తెచ్చుకోవడానికి కాబ్రాపాంటు చూసుకోవాల్సివచ్చింది.

తలుపు కొద్దిగా తెరుచుకుంది. ఆరేడేళ్ళపిల్లవాడు లోనికి వచ్చాడు. వాడు చొక్కాసు మామిడి పండులా చీకుతున్నాడు. ఎర్రని పొడపైన వెంట్రుకలు ముఖంమీద పడుతున్నాయి. మమ్మలను తీక్షగాచూస్తూ మూలన నుంచున్నాడు. అతని ముఖంలో పిల్లల పసితనం బొత్తిగాలేదు. మాంత్రికుని గుహనుంచి బయటపడినట్లు భయం ఆవహించి ఉంది.

తెరవెనుక గాజుల చప్పుడు అవుతూనేఉంది. రఫీని తలతన్నినపాట కాడు' మన్ తడ్పత్ హరి దర్శన్‌కో ఆజ్' అందుకున్నాడు.

'సరే. ఈ డబ్బు తీసుకోండి. రేపటినుంచి ఇక్కడే భోజనం చేస్తారు'

మహమూద్ జేబులోంచి డబ్బుతీశాడు. పిల్లవాడు నిలదొక్కుకొన్నాడు. అయస్కాంతంలాంటి ఆకర్షణ కుర్రాణ్ణి వృద్ధుని దగ్గరికి లాక్కొచ్చింది.

తెరవెనుక నాకు కొద్దిదూరంలో నాజూకు పాదాలు నడయాడుతున్నాయి ఆ పాదాలు చక్కని చాయ్ ఛాయలో ఉన్నాయి. గోళ్ళకు రంగుంది. నాలోని చలనం చచ్చింది. నిశ్చలంగా కూర్చున్నాను. డబ్బులో గారడి ఉంది. అది అందమైన పడుచు పాదాలను ఇంత దగ్గరికి లాక్కొచ్చింది.

కుర్రాడు లోపలినుంచి ఈ సువార్తవినే వచ్చినట్లున్నాడు. ఎందుకంటారా పాపం హరిదర్శనానికి తపించేవాడికి ఆకాశవాణి వినిపించింది. హరిదర్శనానికి ఉరికివచ్చాడుపందొమ్మిదీ ఇరవై ఏళ్ళ పడుచువాడు గుట్టమీంచి గుండు దొర్లినట్లు ఊడిపడ్డాడు. సిగరెట్టు పట్టుకొనే భంగిమలో రెండువేళ్లెత్తి ఒకే సలామ్, మాఇద్దరికి

పంచేశాడు  నుంచున్నాడు. ముసలవాడిచేతిలో వడుకుతున్న నోట్లను చూస్తు న్నాడు. ముఖం అందమైందే. గాలి తిరుగుడుకు అవతారం మారింది. వెంట్రుకలు దిలీప్‌కుమార్‌లా పెంచాడు. ప్యాంటు చిరిగి, మురికి పట్టింది. ప్యాంటుది ఒకకాలు మోకాలుదాకా మడిచాడు.

'మీరు మురాద్‌గారి తమ్ముడిగారు షాహిజాద్ గారు'

"ఆదాబె అరజ్"

"ఆదాబె అరజ్"

అక్కడున్నవాళ్ళలో చిన్నకుర్రాడు అనవసరంగా కనిపించాడతనికి. లాగిరెండు గుద్దులు గుద్దాడు. పిల్లవాడు తల్లడిల్లాడు. ఏడవలేదు. వెంటనే కుర్రాడి కాళ్లుపట్టుకొని లోనికి విసిరేశాడు.

పాదాలు గడగడ లాడాయి. కదిలి పోయాయి.

"ఈ వెధవను చూస్తేనావళ్లు మండుతుంది". అని మావైపు చూచి చిరు నవ్వాడు. వాడునాకు కసాయిలా కనిపించాడు. నాగుండెలో మంటలు రగిలాయి.

"మీరూ మాఅన్న దోస్తులేనా?" ఒకరకం పోజుపెట్టి మాదరికిచేరి కూర్చున్నాడు. వాడి చూపులు వృద్ధుని చేతిలో పిచ్చుకలా ముడుచుకున్న నోట్ల మీద ఉన్నాయి. లోపలినుంచి కుర్రాడి ఎక్కిళ్లు వినిపిస్తున్నాయి. ఇప్పటి దాకా పాదాలు కదలాడిన చోట వెలుగులు కనిపిస్తున్నాయి.

"కాదండీ నేను మహమూద్‌గారితో యూనివర్సిటీలో చదువుతున్నాను"

"అయితే మీ ఆనందాలకు అంతేమి?" మరి కాస్త దగ్గరికి జరిగాడు,

"ఏదో కాలం గడుపుతున్నాం"

"ఢిల్లీలో మా అన్నకూడా హాయిగా........" అతని చూపులో ఈర్ష్య గోచరించింది. గోడమీద తన అన్నకు సంబంధించిన కలర్ ఫిలిం చూడ సాగాడు,

నాకూ గోడమీద రంగులు వ్యాపిస్తూ కనిపించాయి. వెలుగు చిమ్మింది. రంగుగాజుబుడ్లుఒలికాయి. రంగులు, రంగులు, అనేక రంగులు. రంగురంగుల వలయాలు రంగులు ముడుచుకున్నాయి. ఒకేరంగు ఎరుపు-అరుణిమ-అంతటా కనిపిస్తూంది. గోడ ఎరుపు. బట్టలు ఎరుపు. గోడమీది పెన్సిలు బొమ్మలు ఎరుపు. పెద్దమనిషిగడ్డం ఎరుపు. నడయాడినపాదాలు ఎరుపు. పాదాల నంటిన చీరఅంచు ఎరుపు. ఆ ఎరుపు అందమైన పాదాలను కాటువేస్తున్నట్లున్నది.

ముసుగులో దాగిన ముఖం, తెరచాటున కదలాడిన పాదాలు నా మతి పోగొడ్తున్నాయి.

"నా కొడుకు చదువుకట్టుకొని డబ్బుకూడ దెస్తున్నాడు" పెద్దమనిషి బలం పుంజుకొని అన్నాడు.

"మురాద్ బిజినెస్ చేస్తున్నాడా? ఉద్యోగమా? వేలు సంపాదిస్తుంట వచ్చు" నా మీదప్రభావం వేయడానికి కాక, పెద్దమనిషిని ఓదార్చడానికి అన్నాడు మహమూద్.

"మహమూద్ మియాఁ ఏంలేదు మురాద్‌ది మంకు, చప్పున బోలెడు సంపాదించి తెస్తానంటాడు" వేల సంపాదనకు సాక్ష్యం చూపలేక అన్నట్లు అన్నాడు.

"బావుంది. అలాఅనుకుంటే మీకు కష్టంకాదూ!" ఏదో అనాలనిఅన్నాను

"ఏమిటా వాగుడు" ముసలాయిన నన్ను కొట్టేంత పనిచేసి "మేం మంది సంపాదన మీద బతుకుతా మనుకున్నావా? నీకేం తెలుసు మేం ఎలా బతికామో! ఈ డబ్బు మాకో లెక్కా? కాల తన్నేవాళ్ళం" అని నోట్లను వేలకొట్టాడు. వెంటనే పవిత్ర గ్రంథాన్ని పడేసినట్లు అందుకున్నాడు.

తెరలో భూకంపంలాంటివి వస్తున్నాయి. గాజుల గలగలలు నిట్టూర్పులుగా మారాయి. ఆ పాదాలుకూడా అవతారం మార్చాయి. అవినల్లగా ఉన్నాయి. ముడుతలు పడ్డాయి. కాళ్లు పగలాయి. వేళ్లువంగిపోయాయి. గోళ్లకు రంగు లేదు. నల్లగా ఉన్నాయి. అవి పారాణి పులిమిన పాదాలు కావు— దెబ్బలు తిని

గాయాలయిన పాదాలు. విశాలమయిన ఎడారిలో ఎండకు నడిచి నడిచీఅలసి, సొలసిన పాదాలు !

ఆ నాటినుంచి అక్కడికే భోజనానికి వస్తున్నాను. భోజనంచేయడం నేనొక్కణ్ణేన? నావెంట పిల్లి ఖుర్షీద్, షహజాదా, ముడుచుకున్న బాబాయి; తెరలోపల జీవితంలో ఓడిపోయిన వికారపాదాలు, ఆ వేదనలో తిరుగాడే అందమైన పాదాలూ అన్నీ ఉంటాయి. అందరూ నాతోపాటు నోరు తెరుస్తారు-మూస్తారు. ఊహాభోజనం చేస్తారు ఆ కళ్ల గుంపులో కూర్చుని వంటరిగా వాళ్ల ఎముకలు కొరుకుతున్నాను. ఈ రొట్టెల్లో బాబాయి ఉన్నారు, పడిన నిట్టూర్పు, ఖుర్షీద్ షహజాదా ప్రేగుల అరుపులు కలిసియున్నాయి. ముప్పై రూపాయలిచ్చి ఈ రొట్టెలు తినే హక్కు సాధించాను. ఇప్పుడిహ ఈ ముప్పై రూపాయిల ఆశను ముక్కలుచేయడమూ అనర్థమే. వీటితోనే ఈఇంటివాళ్లలో ఇంకా ప్రాణాలున్నాయి. పోట్లాడుకునేశక్తి నిలిచి ఉంది. అందుకోసమన్నా నేను రెండుసార్లు రావాలి. నా పరిస్థితి ఉరిశిక్ష వినిపించడానికి రోజా తీసుకొని వచ్చే ఖైదీలా ఉంది.

నేను రాగానే ఇంట్లో గడబిడ మొదలవుతుంది. కోడలు సోమరితనాన్ని గురించి బాబాయితిట్లు, సాపెనలు మొదలు అవుతాయి. జవాబుగా లోన గాజుల గలగలలు వినిపిస్తాయి. పాటపాడేముందు తల ఆడించే హీరాబాయి కూని రాగాలు వినిపిస్తాయి. నా నిరీక్షణ పాటకోసం. వాస్తవంగా నాకు ఈ ఇంట్లో ఎవరిమీదా సానుభూతిలేదు. ఆ కూనిరాగం వినడానికే ముప్పైరూపాయలు ఇస్తున్నాను. లోన గిన్నెల చప్పుడుతోపాటు షాహజాదా పాటప్రారంభిస్తాడు. 'వెధవల్లారా! నాకూ మిగల్చండి.'

అంతగట్టిగా అనకు చిన్నన్నా, బయటినుంచి మిగిలివచ్చింది తినండి, ఖుర్షీద్ ధ్వని తగ్గించి మెల్లగా అంటాడు.

ఖుర్షీద్ నాకు స్నేహితుడయినాడు. ఇంటిలో అతనిది విచిత్రస్థితి. వారికి కోపంవస్తే పీణ్ణాదేవారు. వరుసగా ఉపవాసాలు, అనంతం అయిన

దరిద్రం ఏడేళ్ళపిల్లవాడికి పదిహేడేళ్ల అనుభవమూ జాగ్రత్తా కలిగించాయి. సన్నగొంతు పసితనపు నవ్వుతప్ప బాల్యపు లక్షణాలేమీ కనిపించవు. అణా కోసం పొరిగిండ్లకు సామానులు తెచ్చిపెట్టాడు. ఒక టీచర్ పాపను ఎత్తుకున్నందుకు రోజూ బేడా ఇచ్చేది. అదే ఆ ఇంటికి ఆశ. అదే రాబడి. పాపను ఎత్తుకొనీ, ఎత్తుకొనీ నడుం ఒకవైపుకు వంగిపోయింది. బరువుమోస్తే ఆయాసం వస్తుంది. నొసటి నరాలు పొంగాయి. ముక్కు కొనకు చెమట చుక్కలు నిలుస్తాయి. ఇంటిలో అందరినీ మించిన బాధ్యత అతనిదే. వస్తువులు కుదురు పెట్టడం, ఇంటిగౌరవాన్ని కాపాడ్డం అన్నీ అతడే చేసేవాడు.

అతనికి కథలు వినడం బహుఇష్టం. అరేబియన్ నైట్స్ కథలన్నీ నోటికివచ్చు. అతడు ఎవరినైనా అసహ్యించుకుంటే అల్లావుద్దీన్ అద్భుతదీపం కథలో మాంత్రికుడితో పోల్చేవాడు గోడమీద ఆ మాంత్రికుని బొమ్మవేస్తాడు. అతడు తనకు కలిసిన కొత్తవాళ్లను సాధారణంగా ఒక ప్రశ్న అడుగుతాడు.

‘అన్నా మీకో పైస దొరికిందనుకోండి ఇల్లుసాంతం నిండేంత వస్తువు కొనాలనుకొన్నారు. అదిఏది?’

‘ఏమిటి’? నాకర్థంకాక తలగోక్కున్నాను.

‘మీరు చెప్పండి’

‘కాదు మీరే’

‘సరే నేనే చెప్తాను. గాలి కొనితెస్తాను” అని పెద్దగా నవ్వాడు నవ్వీ నవ్వీ ఆతని ముఖం కందగడ్డ అయింది. నవ్వుతూనే తండ్రితో “ అప్పా! అప్పా అన్నకు తెలీదు పైసకుకొనే గొప్పవస్తువేదో’ అన్నాడు.

ఆ నవ్వువిని ఉలిక్కిపడ్డతండ్రి వాణ్ణి ఒకతన్ను తన్నాడు. ‘దీపం ఎందుకు తేలేదు?’ అని అడిగాడు.

‘అవును మరచాను’ అని తలవంచుకున్నాడు.

"మీకు ముగ్గురు రాజకుమారుల కథ తెలుసా?" అని ఆ కథ చెప్పడం ప్రారంభించారు. బాబాయి వారి నుంచి బయటపడాలంటే వారికథ చెప్పేవాడు. తిండి.... తిండి.... తిండి.... తినడానికే వారు లోకంలో అవతరించారు. తండ్రితాతల కొంప తినేశారు పొలాలు నమిలి మింగేశారు. పిన్ని నగలు పిండి కొట్టి బుక్కేశారు. వారికి ఎందలరకాల నోరూరించు రుచులు తెలుసు వందలవంటల పుస్తకాలు చిరిగి నా చాపకింద దాచి ఉంచారు. కాస్త డబ్బుచేతికివస్తే ఆ వంటలు చేయించాలని.

బాబాయి నోరుకదపక నిశ్శబ్దంగా ఉంటే నాకో ఆలోచన వచ్చేది వారేవో ఊహాలోకాల్లో విహరిస్తున్నారని. ఎండురొట్టెలకోసం వేచివేచి కవాబుల కోసం ఎవరెస్టు శిఖరం అధిరోహిస్తారు. పాలసముద్రంలో ఈదులాడుతారు. మిఠాయీల ద్వీపాలు ఎక్కుతారు. రకరకాల వంటకాల్లో కూరుకుపోతారు.

ఈ ఇంట్లో రొట్టెలు లెక్కించి ఇస్తారు. కూరలతో నాలుక చెడింది. ఇక్కడ తినడం ఇష్టంలేదు. అయినా ఆ అందమైన పాదాలు-అవి నన్ను వదలడంలేదు. ప్రతిరోజూ నారాక తెలిసి ఆపాదాలు తెరదగ్గరికి చేరుకుంటాయి. ఆ అడుగుల సవ్వడి నాకు తప్ప మరెవ్వరికీ వినరాదు. ఖుర్షీద్ మాత్రం అప్పుడప్పుడూ నన్ను చూస్తాడు. కదిలేకాళ్ళనుచూస్తాడు. పిల్లలతో ఆటలో పడిపోతాడు.

పిన్ని చర్రట్రేలో నాలుగు రొట్టెలు అసహ్యంగా కనిపించే కూరా తెస్తుంది. "బిడ్డా! రొట్టెలు ఎక్కువ తేలేదు అనుకోవద్దు. ఎంగిలిపడ్తాయని తేలేదు. అవుసరం అయితే అడుగు."

"ఎందుకు పిన్నీ! ఇవే ఎక్కువ, కాస్త తగ్గించండి" మొహమాటానికి అనేవాణ్ణి.

షాహజాద్, ఖుర్షీద్ చూపులు ఆశగా నన్నూ, నిరాశగా పిన్నినీ చూస్తుండేవి. షాహ్‌జాద్ వచ్చి నా పక్కన కూర్చుంటాడు. ఖుర్షీద్ పిల్లవాణ్ణి పట్టుకొని చాపమీద కూరబడ్తాడు. పిల్లవాడు రొట్టెల్నిచూచి ఏడుస్తాడు నేనో రొట్టెముక్క పిల్లవాడికి ఇస్తాను. నా ధాతృత్వంమీద షాహ్‌జాద్‌కు కోపం

వస్తుంది. "వెధవ పుర్రెకాపు తిండితిని బలుస్తున్నాడు మీరు వాడికి రొట్టె ఇవ్వకండి" అంటాడు. "మున్నా ఇటుతే కాకికి ఇస్తా" అని రొట్టెముక్క లాక్కొని నోట్లోవేసుకుంటాడు.

బాబాయి తల మోకాళ్లలో ఆనించి ముఖం దాచుకొంటాడు. ఇంతలో దగ్గుతెర వస్తుంది ఉక్కిరిబిక్కిరయి ఏదో చెప్పాలనుకుంటాడు, నా నోట్లో ముద్ద విషంలా అనిపిస్తుంది. ఖుర్షీద్, షాహజాద్, మురాద్‌భార్య, పిన్నిపిల్ల నరాల్లోంచి లాగిన రక్తంలో నావేళ్లు మునుగుతున్నాయి !!!

"మీరేంచేస్తుంటారు" ముంచుకొస్తున్న సిగ్గును కప్పిపుచ్చుకోవడానికి షాహిజాద్‌ను అడిగాను.

"ఏంచేయను? ఏమిచేయను. అన్నాడు నా భోజనంమీద చూపుదిగిడించి "నాల్గుసార్లు మెట్రిక్ పరీక్ష ఇచ్చాను" అన్నాడు ముద్దమింగుతున్న నన్నుచూచి.

"ఏంచేయాలనుకుంటున్నారు ?"

"నాకు ఫిలింలైనులో పోవాలని ఉంది. కొద్దిగొప్పడ్యాన్సు నేర్చుకున్నాను పాటకూడావచ్చు" అప్పలిస్తూ అన్నాడు.

"చిన్నాన్న జానీవాకర్ అవుతాడు" ఖుర్షీద్ అందించాడు.

"నోర్ముయ్‌బే" ఒక్కతన్ను తన్నాడు అఫ్లాఫ్ సాహెబ్! జానీవాకర్ అంటే నాకిష్టం. తాగుబోతు పాత్రవాడింటే బాగాచేయగలను. కాని ఫిలిం ఫీల్డులో అందమైన అమ్మాయైనా ఉండాలి, గట్టిసిఫారసైనా కావాలి."

"ఒకసారి చిన్నాన్న వదిన గొలుసుతీసుకొని..........." ఖుర్షీద్ ఏదో చెప్పబోయాడు కాని షాహిజాద్ పళ్లురాచేట్లు చెంపవాయించాడు, ఈ గొడవచూచి బాబాయి మేల్కొన్నాడు. లోకం ఎలాఉందో చూడ్డానికి మేల్కొనట్లున్నారు. లోకంలో వ్యాపించిన అంధకారం, అన్యాయం, అక్రమంచూచి తమ "ఉటోపియా" లోకి వెళ్లిపోయారు.

"మా నాన్నగారికో పిచ్చి, కొడుకులను పెంచి పెద్దవాళ్లను చేస్తే పైస పైస రాబట్టాలను కొంటారు, వారికి తిండిని గురించి తీవరం ఎక్కువ. అన్నను బి. ఏ. చదివించడానికి నాలుగువేలు పోశాడు. ఇప్పుడు చూడండి ఇక్కడ మావదిన ఆరిపోతూంది. నన్నూ అలాగే చేయాలని ఎత్తు"

మాట్లాడుతున్నా అతని దృష్టి నాతిండిమీదనే ఉంది.

"నేను ఒప్పుకోలేదు. మిలటరీలో దరఖాస్తు ఇచ్చాను-చేరాను. కాని ఏంచెప్పను - నెలరోజుల్లోనే ఎముకలు నుసి అయినాయి. గండంగడిచి బయట పడ్డాను. ఇప్పటికీ ఉద్యోగం అంటే అసహ్యం నాకు. ఇవ్వాళకూడ రుచిగా ఉన్నట్లుంది. అని గుటకలు మింగాడు-మూడో రొట్టె ముట్టుకోకుండా భోజనం ముగించాలని అతని ఉద్దేశం.

"అన్న ఇస్తే కొంతడబ్బుతీసుకొని బొంబాయి వెళ్లి ప్రయత్నిస్తాను"

"పాపం ఇంటి కర్చుకు ఇబ్బందిగా ఉన్నట్లుంది" అందమైన పాదాలను చూచి అనాలని అన్నాను.

ఖుర్షీద్ బాగా సంపాయిస్తాడు. కాని మా ఇల్లే అంత. ఎంతవచ్చినా ఇంతే. అన్నాడు కాళ్లు ఊపుతూ.

క్రమక్రమంగా ఆ ఇంటి విషయాలన్నీ నాకు తెలిసిపోయాయి. పరిచయాలూ పెరిగాయి. పిన్ని తలుపు వారకూర్చొని తన పిల్లిగొంతుతో గంటల తరబడి మాట్లాడేది, కొడుకుల లక్షణాలు. పొరుగమ్మల ముచ్చట్లు, మొగుని నవాబులాంటి కర్చూ, కోడలు లెక్కలూ ఎన్నో చెప్పేది. కోడలుమీద చాడీలు మెండు. కోడలుకు హిస్టీరియా! వంట తప్పించుకోవాలని మూడుసార్లు పొయ్యిమీద పడిపోయింది!! ఆమెకు తన అందంమీద గర్వం. భర్తంటే పడదు. పాపం వాడెంతో ప్రయత్నించాడు - అయినా ఉద్యోగం దొరకంది వాడేంచేస్తాడు చెప్పండి?" తనకు కాళ్లకలకలు. మురాద్ తిరిగివస్తే ముందు వైద్యం చేయించుకుంటుంది. షాహజాద్ వదిన నగలన్నీ స్వాహచేశాడు.

మాటలు అయిపోయాయనుకోంది - పాత ముచ్చట్లు అప్పగించేది. అప్పుడు అమెకు అయిదు గేదెలుండేవి. బాబాయి పేష్కారు నేతిలో తప్ప వంటలు చేసేదికాదు.

పిన్నితో వివరంగా మాట్లాడిన్నాడు నిద్రపట్టేదికాదు. ఆ నాజూకు పాదాలు నిప్పుకలమీద ఉరుకుతాయి. ఏకుతున్న దూదిలా నిద్రచెదిరిపోతుంది. తెల్లని పూలల్లో ధూమ్యాకాశాలు దాక్కుంటాయి. క్రమంగా పూలతెలుపుదనం పసుపుపచ్చగా మారుతుంది. తరవాత ఎరుపు అవుతుంది. అగ్గిమంటలు లేస్తాయి మంటలు - మంటలు - మంటలు.

ఉదయం లేస్తే అలిసి పోయినట్లుంటుంది-రాత్రి సాంతం రాళ్లుమోసినట్లు కనిపిస్తాను.

నెలచివరిరోజుల్లో కాళీగదిలో వంటరిగా కూర్చోవలసి వస్తుంది. లోన ఏదో ఉడుకుతుంటుంది. బయటికి ఎవరురారు. తుదకు పిన్ని తలుపు చాటుకు వచ్చి చాల అలస్యంగా వచ్చారు. బయట తినివచ్చారనుకున్నాం, సరే వండుతా లేండి. ఎంతసేపు" అంటుంది. నేను వద్దంటాను. అనవసరంగావ దినకుశ్రమ.

కొన్నాళ్లు జబ్బునెపంతో వెళ్ళలేదు. నాలుగురోజులువెను ఇంటిల్లపాటీ బిలబిలా బయటికి వచ్చారు. పాపం బాబాయికూడా ఈ పాడులోకాన్ని చూడాల్సి వచ్చింది.

"బిడ్డా! ఈ నెలలో నాలుగురోజులు నీకు బాకీపడ్డాం. ఆ నాలుగు రోజులూ వోంచేసిపో బిడ్డా!"

"అదేమిటి నాలుగురోజులేమిటి? తరవాత రావద్దంటారా ఏం ?"

అందరికీ ప్రాణాలు లేచివచ్చాయి.

అందమైన పాదాలు నన్ను పలకరించడం అదే తొలినారీ-చివరిసారికూడా.

'మీరు చాలరోజులు రాలేదు',

నేను గంతువేశాను. నా చెవులను నమ్మలేకపోయాను. ఖుర్షిద్ నన్నే చూస్తున్నాడు. పెదవిని కొరుకుతున్నాడు.

ఆనందంతో ఉక్కిరి బిక్కిరయి ఆనందోత్సవాలు జరపాలనుకున్నాను. ఖుర్షిద్‌నుచూచి అన్నీ పరచాను.

'ఆరోగ్యం బాగాలేకుండింది. మీరు బావున్నారా'?

'బావుండడం! బావుండి చేసేదేముంది'. నిరాశగా నిట్టూర్చింది.

నాకు ఏవేవో ఆలోచనలు వచ్చాయి. ఏమేమో అందామనుకున్నాను. ఆటుచూస్తే తెరకనిపించింది. పాదాలు కదిలిపోయాయి. పిన్ని తలుపుచాటు నుంచి అడుగుతూంది.

"మీకు షాహిజాద్‌గాని కనిపించాడా? నాలుగు రోజులయిందిఇంటికిరాక

'అదేమిటి ఎక్కడికి వెళ్ళినట్లు?' నేను ఆశ్చర్యం వ్యక్తపరచాను.

"దోస్తుల దగ్గరికి వెళ్ళి ఉంటాడు. ఇంటిలో ఇబ్బంది అవుతే వెళ్లిపోతాడు. ఇహ మా కోడలు చస్తానని ఉరుకుతుంది." మెల్లగా గుసగుస చెప్తున్నట్లు 'ఇంటివాడు వెధవ బావికూడా తవ్వించాడు' అన్నది.

నాకు కంపరం పుట్టింది. పారిపోవడానికి ఈ ఇంటికి చాలాదోవలున్నాయనిపించింది.

సాయంకాలం ఆపాదాలు దర్వాజా పక్కనుంచి కదులుతుంటే ఆరోగ్యాన్ని గురించి అడిగాను.

'నేను జబ్బుగాఉన్నానని ఎవరు చెప్పారు?'

నేను దిమ్మర పోయాను. 'ఏదో అలాగే అనుకున్నాను.

"అయితే అనుకోటమే మీపనా?"

ఆరోజు భోజనం బావుంది. మినప్పప్పు చేపలు వగైరా.

'ఇవ్వాళేమైన పండగా?' ఖుర్షిద్‌ను అడిగాను,

'ఏంలేదు. మీరు వదిన ఆరోగ్యాన్ని గురించి అడిగారు. ఆమె మీకోసం వంటచేసింది.' అని గబగబా బయటికి వెళ్లిపోయాడు.

ఖుర్షిద్‌తో నాస్నేహం నాను మాత్రం అయిపోయింది. అతడు అంతగా మాట్లాడేవాడుకాడు. నేసుంటే లోనికి రావడం తక్కువ.

ఇవ్వాళ బాబాయిగారూ చాపమీంచి మాయం. పిన్నికూడా గడపమీద కూర్చొని నా ముద్దలు లెక్కించడంలేదు. గాజుల గలగలలు మాత్రం వినపిస్తున్నాయి.

కొద్దిసేపట్లో ఖుర్షిద్ షాహిజాద్‌ను లోనికి లాక్కొచ్చాడు. 'చెప్పు ఎక్కడికెళ్ళావు?' అడుగుతున్నాడు.

అతడు జవాబు చెప్పలేదు. వంటకాల వాసన చూసి ముక్కుపుటాలు ఎగరేశాడు, ప్లేట్లను చూస్తూ ఉండిపోయాడు.

'మళ్ళీ దొరికాడా ఆ దొంగవెధవ?'

'ఊరుకోండి.... ఊరుకోండి' వదిన అక్కడితో ఆపించింది.

'ఇంతమంచి వంటచేసినందుకు వదినకు కృతజతలు చెప్పండి' అని పిన్నికి ప్రేవాపసు ఇచ్చేశాను ఇంతలో తెరలేచింది. పెరటిలో మెరుపు మెరిసింది, ఆమె మురికిచీర కట్టుకుంది, నవ్వులు వలకపోస్తుండగా షాహిజాద్ ఫిలిం హీరోలా వచ్చి ఆమె నడుం మీద చేయివేసి 'ఇవ్వాళ వెలిగిపోతున్నావ్.' అన్నాడు.

ఒక దివ్వె వెలుగుతున్నా బాబాయి ఇంట్లో చీకటి ఉంది, ఈ దీపాన్ని చేతపట్టుకొని వీరు దోవ ఏల వెదకరో?

భోజనం అంత చెడ్డగాఏంలేదు, మరో నాలుగు నెలలు ఉందామనుకున్నాను,

మరునటిరోజు గదిలో ఖుర్షిద్ ఒంటరిగా కనిపించాడు. ఏమీ పనిలేని ట్లున్నాడు తీరిగ్గా ఉన్నాడు. ఇల్లుసాంతం నిశ్శబ్దంగా ఉంది. నా ప్రశ్నలన్నిటికీ అతని సమాధానం ఒక్కటే

'పెద్దన్నయ్య వచ్చాడు'

'వచ్చారా? 'నా మీద ఒక హంటర్ దెబ్బ పడ్డట్లయింది.

"తరవాత —?'

"ఏమిటది?'

వాస్తవంగా ఏమిటిది? ఆలోచించాను అసలు ఏమిటి

పెద్దన్న ఏమీ లేలేదు. అన్నీ అబద్ధాలే, ఉమ్మితో గోడమీది గీతలను చెడుపుతూ నాపని సులభంచేశాడు. పెన్సిలుతో కొమ్ములున్న మాంత్రికుని బొమ్మగీస్తున్నాడు.

నేను వదినను గురించి ఆలోచిస్తున్నాను ఇప్పుడామె ఏంచేస్తుందని

'వదినకు చెప్పు....భోజనం... భోజనం....' ఎలా చెప్పాలో అర్థం కాలేదు.

'వదిన లేదు. చిన్నన్నతో రాత్రిలేచి పోయింది. పెద్దన్న పోలీసులో రిపోర్టు ఇవ్వడానికి వెళ్ళాడు'

అతడు గోడమీద కార్టూనులు వేస్తున్నాడు.

నేను నిశ్చేష్టుణ్ణయి కూలబడ్డాను. కదుల్తే ఇల్లంతా కూల్తుందన్నట్లు కూర్చున్నాను. కనురెప్పలు చీల్చుకొని చూచినా ఏమి కనిపించదు. పట్టపగలు అర్ధరాత్రి ఎలా వచ్చింది?

మా ఇద్దరి మధ్య శతాబ్దాలు గడిచాయి. ఈలోగా ఎన్నో సిగరెట్లు కాల్చి పారేశాను. ఖుర్షిద్ బాల్యంలో ఏమంటావని డెబ్బయ్యేళ్ళ ముదివగ్గయి అంటున్నాడు

'ఇహమీదట మా ఇంటికి భోజనానికి రాడు. వదిన వెళ్ళిపోయిందిగా।

పెన్సిల్ పారేసి తండ్రి దగ్గరికి వెళ్ళి కూర్చున్నాడు. మోకాళ్ళలో తల ఇరికించుకుని అతని అస్తిత్వాన్ని దాచుకో చూస్తున్నాడు.

---

# ఆదరణ

ఎంటువాడు కూడా తనను తాను కళాకారుడను కుంటాడని అలావుద్దీన్ నా దగ్గరికి వచ్చినప్పుడు నాకు తెలిసింది. అతను తన పేరు రాసి చీటీ పంపిం-చాడు. దానిమీద 'ఆర్టిస్ట్' అని వుంది.

అతను చక్కగా అలంకరించుకొని వచ్చాడు ఉతికిన తెల్లని ప్యాంటు, తెల్లని షర్టు మామూలు చెప్పులు వేసుకున్నాడు. వెంట్రుకలు అభ్యుదయ కవి వెంట్రుకల్లా కత్తిరించాడు. రూపం చూడగానే మన వర్గం వాడని తెలిసిపోయింది—అంటే అభ్యుదయ వర్గం; తనను పరిచయం చేసుకోకముందే నన్ను పొగడ్డం ప్రారంభించాడు.

'మీ కథలు చదువుతే నాలుక తుప్పు వదులుతుంది. ఏం రాస్తారో ఇత-రులు గాని చదువుతే జీర్ణకోశం చెడిపోతుంది.'

నేనేం చేయను చిరునవ్వాను.

ఇహ అతను కళను గురించిన నిర్వచనం సాగించాడు.

'కళాకారుడంటె ఏంది తనను కలలో మాంసమోలె కరిగించాలె. తన నెత్తురున్నదే—దాని ఆఖరి తొట్టుకూడా కల కోసం అర్పించాలె.

కళాకారుడు కళ అనే మూకుడులో మాడి పోవటానికి తయారుగుండాలె.'

ఒకడు తనను కళాకారుడు అనుకోవడానికి భారత రాజ్యాంగంలోని ఏ పరిచ్ఛేదమూ అడ్డురాదు. అలాంటప్పుడు నేనేం చేయగలను మౌనమే భూషణం అనుకున్నాను.

మీరేదైనా "గజల్" రాశారా 'నజమ్' రాయనున్నారా?

'నేనా' నన్ను నమిలి మింగేట్లు చూశాడు. త్వరలో కవితాకదంబం అచ్చుకానున్న కవి కావచ్చు అనుకున్నా.

'నేను బతుకులో ఒక్క కవితకూడా తయారుచేయలేదండీ నా ఆర్ట్ వేరే ఉంది.' ఉన్నత శిఖరాలను అధిరోహించినట్లు నవ్వాడు అతని ముందు నేను పీనుగలా కనిపించాను.

శానరోజులనుంచి పనిలేదండీ ఈ రోజుల్లో కళా పోషకులులేరు శాన రోజులనుంచి కళాపోషకులకోసం వెతుకుతున్నాను. అల్లూ చెప్పాడు మీరు కళాభిమానులని మీకు శానవుంది నవాబులతో సంబంధాలున్నా యన్నాడు"

'అల్లూ ఎవరు' ఆశ్చర్యంగా అడిగాను.

'ఆదేవాడే రెడ్‌హిల్స్‌లో ఇంజనీరున్నాడుగదా-అక్కడి వంటమనిషి"

అతన్ని తీక్షణంగా చూశాను-తాగి ఉన్నాడా అని, నల్లని రంగు,ఎండిన పెదవులు తాపంగల కళ్లు-రోజూ పొయ్యి మీద కాలే గిన్నెలా ఉన్నాడు.

అతడు నా జవాబుకోసం నిరీక్షించాడు-రెండు మూడు నిముషాలు.

'నేను మీ దగ్గరికెందు కొచ్చిన్నంటె-కళాకారునికే కళాకారుని విలువ తెలుస్తుందని........"

"మీరు కథ రాశారా? అది అచ్చుకావాలా?' మాటమధ్యలో అందు కున్నాను.

'లేదండీ-చెప్పుకుంటెసిగ్గు - నా రంగం వేరే- నేను మరో కళాకారున్ని' ఆ తరువాత అతడు కళాసమస్యలు నేడున్న కళానిరసనను గురించి గంభీరంగా మాట్లాడాడు.

'ఒక పెద్దకవి ఉన్నాడు. తనను 'ఆటిస్ట్' అనుకుంటాడు. కాని మరో ఆటిస్ట్‌ను గౌరవించడండీ. వంటోడు కూడ కలాకారుడైతే నా పద్యాలన్ని పొయ్యిలోవేసి తగలపెట్తానంటాడు. విన్నారా? ఈ లోకంలో మూర్ఖులే మిగిలి పోయారు.'

సకలప్రపంచంలో మిగిలిన ఒకే ఒక 'ఆటిస్ట్" కళ్లుతుడుచు కుంటు న్నాడు. కోపంతో అగ్గిబుగ్గి అయిపోతున్నాడు. కన్నీరు నాబలహీనత.

కన్నీరు కార్చేవాళ్లను ఊరడించడానికే నేను కథలు రాయడం సాగించాను. ఆయినా అతణ్ణి ఓదార్చలేకపోయాను.

ఆరోజుల్లో మా వంటవాడు మమ్మల్ని చాలా సతాయిస్తున్నాడు. అతణ్ణి వెళ్ళగొట్టటం అటుంచి కోప్పడ్డం చాతకావడంలేదు. పనివాళ్లు పదిపన్నెండేళ్లుంటే యజమానుల హక్కులన్ని హరించేస్తారు. అలావుద్దీన్ కనిపించేవరకు మా వంటవానికి బుద్ధిచెప్పాలనిపించింది. అంతేకాక అలావుద్దీన్ మూర్ఖుడేం కాదు. ఆర్టిస్టు అతనికి ఆర్టిస్టు బైజూబావర, ఆర్టిస్టు గాలిబ్, ఆర్టిస్టు సూరదాస్ కథలన్నీ తెలుసు.

అలావుద్దీన్ ఎనిమిదో క్లాసు పూర్తిగా పాసైనాడు. తొమ్మిదో క్లాసులో మాత్రం ఇంగ్లీషు, ఉర్దూ, లెక్కల్లో ఫెయిలైనాడు. ఫెయిలు కావడం తన లోపం కాదంటాడు. మాస్టర్‌గారి కోడిపెట్టకు రోగం వచ్చింది. ఆస్పత్రికి తీసికెళ్లమన్నాడు. అలావుద్దీన్ తీసికెళ్ళలేదు. అందుకోసం ఫెయిలయినట్టు. ఆ కాస్త తప్పు చేసిఉండకపోతే అతడు బడీసంతులయి పిల్లలను ముందు కైమా చేసి ఆ తర్వాత కవాబులకింద కాల్చేవాడు.

'కళాకారుడు కావటానికి నిజాయితీ ఉండాల్సిందీ నిజాయితీ గలవాడు నరకాన్నికూడ దాటొచ్చు'

నేనూ తల డించి ఆమోదం తెలపాల్సి వచ్చింది.

అలావుద్దీన్ వంటింటిలో దూరితే కోడిపందాల్లాంటిపోరు మొదలయింది మా వంటవాడు పోరులో ఓడి పక్కచుట్ట కట్టపోగాడు. అలావుద్దీన్ కొలువు కోసం రాలేదని, అతణ్ణి నేనో చోట పనికి కుదిరించేముందు కాస్త పని చూడదల్చానని నచ్చచెప్పాను. మా వంటమనిషికి. అంతలో అలావుద్దీన్‌లోని కళాకారుడు దెబ్బతిన్నాడు అలిగి మెట్లెక్కి కూర్చున్నాడు.

"పూర్వకాలపు ఆర్టిస్టులు ఒకరికోసం ఒకరు ప్రాణాలిచ్చేవారు. అందుకే కల అంత ఎదిగింది. ఇప్పుడు గుర్రాన్ని గాడిదనూ ఒకేతీరుగా చూస్తున్నారు,

“నోరుముయ్యి హేయ్ కళాకారుడా — నన్ను గుర్రం అన్నావంటే జైలుకు పట్టిస్తా” పొయ్యి ఊదుతునే కాలుదువ్వాడు వంటమనిషి.

తన వాగుడులో వినలేదు అల్లావుద్దీన్ మంచిదయింది. వింటే తనను గాడిద అన్నాడని కుస్తీకి దిగేవాడు.

తొలిరోజు అతడు చేపల హల్వాచేస్తానన్నాడు.

‘చేపలహల్వా’? నాకు చేపగొంతులో ఇరుక్కున్నట్టనిపించింది.

‘అరె తినైతే చూడండి. పెళ్ళిహల్వాలన్నీ తిని మీ నాలుక తుప్పు పట్టింది. తుప్పు వదులుతుంది.’

“సరే కానివ్వు” ఒప్పుకోక తప్పలేదు.

పొద్దటినుంచి సాయంత్రందాకా చేపల్ని కడగడంతోనే సరిపోయిందని వంటవాడు సమాచారం అందించాడు. సాయంకాలానికి చక్కగా ముస్తాబయి వచ్చాడు.

‘చేపలహల్వా ఇంకా తయారు కాలేదమ్మా’

‘సరే. రాత్రి భోజనం వరకు తయారుచేయి.’

‘ఇప్పుడు నేను అటు తిరగటానికి పోతున్న కళాకారులు సాయంకాలాల్లో పనిచేయరు. మీరు చిత్రంగ కనపడుతున్నరు, సాయంకాలంకూడ చదువుతరు.’

‘అయ్యోదేవుడా! నేను కళాకారిణినని ఎప్పుడు చెప్పాను?’ చిన్నపిల్లలా మూతిముడిచాను.

‘హి హి హి’ అని వెకిలిగా నవ్వాడు. పృథ్వీరాజ్ తనను అనుకరిస్తున్న హాస్యగాణ్ణి చూచి నవ్వినట్లుంది అతని నవ్వు.

రెండోరోజు తొమ్మిది గంటలదాకా నిద్రలేచాడుకాడు. లేచాడా — లేచి కాలాన్ని తిట్టాడు. పొరుగువాళ్ళ గడబిడను నిందించాడు. తరవాత మరోగంట

సిగిరెట్టు పీల్చాడు టిపిన్ చేసి పన్నెండు గంటలకు హొయ్యిదగ్గరికి చేరాడు. రెండోరోజు హల్వా తయారయింది.

అతని ముందు అడ్డంలేకుండా హల్వాను పొగిడాం. పికాసొ చిత్రాన్ని చూచి కళాకారుడు కీర్తించినట్లు. వాస్తవానికి హల్వా బావుంది. అద్దిస్టు అమ్మా మొగుడైనా చేపకు సంబంధించిన వాసనగాని, రుచిగాని గుర్తించలేదు.

అతి కష్టంమీద అలావుద్దీన్ను ఒకపెద్ద హోటల్లో కొలువుకు పెట్టించాను. జీతం నూటాయాభై. పని వంటవాళ్ళమీద పర్యవేక్షణ.

మరుసటిరోజు మళ్లీ అలావుద్దీన్ మా ఇంటికి వచ్చాడు. 'ఆ కొలువు విడిచి వచ్చిన్నమ్మా" ఎంత ఠీవిగా చెప్పాడంటే అతని మెళ్ళో పీరమాల వేయాలనిపించింది.

"ఏం? అం అర్థం అయింది." హోటల్ మేనేజరు ఘనగర్వంతో ఇతనిలోని కళాకారుణ్ణి అనాదరించి ఉంటాడు.

'నాకు మొదలే తెలుసమ్మా మమ్మి ఆదరించేవాండ్లు నవాబులుమాత్రమే మా విలువ మరొకరికి తెలియదు. ఆ వెధవ – మేనేజర్ – కుర్మాలో పసుపు వేయమంటాడు. తినటంకూడా ఒకఆర్ట్. ఆ హోటలుకు వచ్చే వెధవలకు పరమాన్నానికీ పచ్చిపులుసుకూ తేడా తెల్వదు.'

అతడు కోపంతో వణికిపోతున్నాడు. చలిలో నుంచున్నట్లు.

'తరవాత?'

'ఇంకేమున్నది? నిండుహోటల్ల నిలబడి "ఇక్కడ తినేవాండ్లు కత్తి లేకుండనే ఆర్ట్‌ను కూనీచేస్తున్నరు. ఇంక ఈడ ఉండలేను. పోతున్న, అని బయటపడిన'' అనిలేచి నుంచున్నాడు.

"చిన్నచిన్న విషయాలకు ఏమిటలా' ఏదో వదిలించుకోవాలని అన్నా

"ఏమంటిరి - ఇది చిన్నమాటంటారా?" ఇది చిన్న మాటా?" అగ్గి అంటుకున్నట్లు అన్నాడు. మీరు కతలు రాస్తరు. మీకు కు ఏం తెలుస్తుంది ఆటిస్టు ఆప్కు అగ్గిపెడ్తే అగ్గిల దుంకినట్లుంటది. ఆక్బర్‌బాదా ఆదరించిండు ఆటిస్టులను"

అతనికి ఆటిస్ అనే మాటనేర్పిన కవిపుంగవుని మీద నాకు కోపం వచ్చింది. అతనికి ఎనిమిదో క్లాసుదాగా చదువు ముగించిన మాస్టర్లమీద మండు కొచ్చింది. ఎనిమిదో క్లాసుతోనే మహాపండితుడైన అలావుద్దీన్ నేలమీద నిలవలేకున్నాడు.

"అక్బర్ బాదుషా చచ్చిన్నాడే కళాకారులు ప్రాణాలు విడిచారు. ఇహ అప్పట్నుంచీ పుట్టడం మానేశారు" ఓదార్చడానికి అన్నాను.

"ఆఁహఁ పుట్టడం మనచేతులున్నదా? ఆటిస్‌ను అల్లామియాఁ పంపిస్తడు హోటల్ ముండకొడుకులకు బుద్ధిచెప్పటానికి" ఆతడు అపార్థం చేసుకున్నాడు,

"ఇదీ ఎనిమిదోక్లాసు ఉర్దూ పుస్తకంలో ఉంద?"

"లేదండీ, అది నా సొంత ఆలోచన"

"బావుంది. అయితే నీవు ఆర్ట్సను గురించి రీసర్చ్ చేశావు, అలాంటప్పుడు హోటల్‌వాళ్ళలో కళాభిరుచి కలిగించడానికి అక్కడ కొలువుచేయాలి"

"ఊరుకోండి 'మేం బర్రెలముందు బాజా వాయించం" అని లేచి పోయాడు. ఊసిరావడానికి వెళ్లాడేమో అనుకున్నా, ఎంతసేపటికీ రాకుంటే నాముందు బాజా బజాయించడం వ్యర్థమని వెళ్లిపోయాడనుకున్నా.

కొన్నిరోజులుగడిచాయి. వాకిట్లో అలికిడి అవుతే అలావుద్దీన్ అను కోవడం మానేశాను. మా వంట మనిషిమాత్రం అతన్ని మరిచిపోలేదు.

"సన్నాసి కావటం ఇష్టంలేదు. వంటలో వందరుచులు చూపిస్తా.

చెప్పాయి అయిదురకాల కూర్మా వండులా. యాభైరకాల పలావు చేస్తా అనేవాడు" అని పొట్టపగల నవ్వుతాడు. మేమందరమూ వాడితోపాటు నవ్వాల్సివచ్చేది.

మళ్ళీ ఒకనాడు అలావుద్దీన్ వాకిట్లో ప్రత్యక్షం అయినాడు. చివరకు అతణ్ణి ఒక పెద్ద నవాబుకు అప్పగించాను.

ఆ నవాబు గొప్పవాడు అలాంటివారు అరుదు. అతను కూర్చునేది కల్లబొల్లి సింహాసనమే అయినా అట్టహాసానికి ఏమీ కొదువలేదు. భోజన భాజనాలు గొప్పగా ఉంటాయి. వంటవాళ్ళ విలువ తెలిసినవారు. నేను వారికి అలావుద్దీన్ను గురించి పరిచయం చేసేప్పుడు ఆతని నాజూకు స్వభావాన్ని గురించి కూడా వివరించాను.

నవాబుదగ్గర నౌకరి దొరికిందని ఎగ్గిరి గంతేశాడు. సంతోషంతో చేతులూ, కాళ్ళూ విరిచిపారేసేంత పని చేసాడు. చొక్కాకు ఉన్న ఒకే ఒక గుండీ తెంపి పారేశాడు.

"మీరు శాన గొప్పపని చేసిండ్రి - నైనైతే అనుకోలే"

"ఏమిటీ నీవు అనుకోంది"

"అదే మీరు నిజమైన ఆటిస్ అని లల్లా చెప్పినమాట అబద్ధమనుకున్న"

"బావుంది" పుక్కెడు విషం మింగి నట్లయింది.

"సూడండిప్పుడు నాకల చూపిస్త. మంది మతిచెడి చూడాలె. ఒక కలాపోసకుడు దొరికిండు. మా విలువ నవాబులకే ఎరిక. తినటంకూడ గొప్ప ఆర్ట్"

నాకు వాణ్ణిచూస్తే అసహ్యం వేస్తోంది.

మూడోరోజు అలావుద్దీన్ బదులు నవాబుగారు, విజయం చేశారు. అసాధారణంగా - రాక తెలియపరచకుండా - వెంట వంది మాగధులు లేకుండా.

"మంచి వంటవాణ్ణే పంపించారు"

వారి ముఖం చూస్తే నాకు నవ్వు వచ్చింది.

"అతడు గొప్ప వంటకారుడు నవాబుగారూ! అతణ్ణి ఆదరించడం నేర్చు కోండి".

'అది నిజమే, కాని అతడు రాత్రి బావిలోదూకి ప్రాణం తీసుకున్నాడు'.

"ఏమి???"

"ఉన్నట్లుండి ఆపద విరుచుకు పడింది ఉదయం నుండి పోలీసు స్టేషనుకు తిప్పుతున్నారు".

"ఏమిటి? ఏమైంది?" మాట కష్టంగా పెకిలింది

"కావడానికేముంది?" నవాబుగారు పైపు ముట్టించారు. 'పత్రాలు పొది గావేమో తెలియదుగాని పగలు సొంతం పలావ్ తయారు చేస్తూ కూర్చున్నాడు. పలావ్ మీద బంగారు రేకులు పరచాడు. సాయంకాలం భోజనాలకు కూర్చు న్నామా బెర్నార్డ్‌షా తమ కొత్తనాటకాన్ని ప్రదర్శిస్తున్నంత గర్వంగా నుంచు న్నాడు. "అయ్యా! ఇప్పుడు నా ఆర్ట్‌ను ఆదరించటం మీచేతులో ఉన్నది" అన్నాడు. నేను భోజనానికి కూర్చున్నాను. పలావ్‌లో కొద్దిగా 'దాల్చా' కలిపాను. అంతే అతని మీద కుందెడు నిప్పులు గుమ్మరించినట్లయింది. "పలావులకు ఇంకేది ఆదరణ! ఇగ మునిగి చావల్సిందే". అని కేకలు వేసుకుంటూ ఉరికాడు బావిలో దూకాడు.

# అద్దం

నిలువుటద్దం అమ్మేసి "పప్పూ"కు బత్తాయీలు తినిపించాలనుకుంది ఫాతిమా. కాని అద్దం అమ్మేవిషయం అత్తగారితో చెప్పలేక పోయింది. ఆమాట చెపితే అత్తగారు ముందు అరవడం ప్రారంభిస్తారు. తరవాత భోజనం మానేస్తారు. గుండెదడ పట్టుకొస్తుంది. ఏడుపు లంకించుకుంటారు. అద్దం అమ్మడానికి అప్పగిస్తే ఇంట్లోంచి పీనుగ వెళ్లినట్లు ఏడుపులు, మొత్తుకోళ్లు సాగుతాయి అది ఫాతిమాకు అనుభవమే. ఇదివరకు ఇంట్లోంచి కదిలిన ప్రతివస్తువుకూ పీనుగు కదిలినంత అట్టహాసం జరిగింది. అయినా "పప్పూ"కు బత్తాయీలు లభించనేలేదు. 'పప్పూ'కు బత్తాయీలు పెట్టాలంటే వేరే గత్యంతరం లేదు. అద్దం అమ్మాల్సిందే

పప్పూకు మందుతోపాటు బత్తాయీలుకూడా ఇవ్వాలని డాక్టర్ సంవత్సరంగా చెబుతున్నాడు. బత్తాయీలు ఇవ్వందే పప్పూ పేలకాళ్లకు బలంరాదనీ చెపుతున్నాడు. బత్తాయీలు ఇవ్వకుండానే పప్పూను పెరగెత్తిస్తా నంటూంది ఫాతిమా భర్త అస్లమ్‌తో ఏడాదిగా. ఏడాదినుంచీ అస్లమ్‌కు అదే అనుభవం. ఆఫీసునుంచి వస్తాడు. మురికితిండి ఈగలుముసిరే పప్పూను చూస్తాడు. టీపొంగ చూరిన వాసన వస్తుంది. పత్రికలో వెధవ వార్తలుంటాయి. ఫాతిమా మురికి బట్టలతో సిద్ధం. పైగాకోపంతో పిల్లలమీద ఎగురుతుంటుంది. అత్తఅవకాశం కోసం నిరీక్షిస్తుంటుంది, కోడలుమీద కొడుక్కి చాడీలు చెప్పడానికి.

ఆఫీసునుంచి వచ్చిన అస్లమ్ విసుక్కుంటుంది. ఏదో అంటాడు. జగడం మొదలు, పెళ్ళాం మొగుడి తగాదా చూడ్డానికి పొరుగింటి ఆవిడ వెంటిలేటర్ లోంచితొంగిచూస్తుంది. ఆమె వ్యవహారమూ అంతే. భర్త ఆఫీసునుంచి రాగానే తగాదాలు మొదలు. నువ్వెంత అంటే నువ్వెంత అని సాగుతుంది. అలాంటిపుడు ఫాతిమా తనకన్నీరు తుడుచుకొని పొరుగింటి పోట్లాట చూడ్డానికి వెంటిలేటర్‌లోంచి తొంగిచూస్తుంది.

ఫాతిమా తన పంతం నెగ్గించుకోవడానికే పప్పూకు బత్తాయీలు ఇవ్వడం లేదని అస్లమ్ అభిప్రాయం. కాని రెండువందల రూపాయలతో ఇల్లుగడపడం ఎంతకష్టమో ఫాతిమాకు మాత్రమే తెలుసు

తొలిరోజుల్లో ఫాతిమా అన్నీ గట్టిఏర్పాటుచేసింది ఇంటి బడ్జెట్ కూడా పకడ్బందీగా ఏర్పాటుచేసింది. అప్పుడు అత్తగారు చాలసంతోషించారు. అయినా అస్లమ్ జీతం చాలందే. ఒకనెల్లో అద్దె బకాయీపడేది. మరోనెలలో కరెంటుబిల్లు. ఇరవయ్యోతేదీ వచ్చిందంటే తల్లీ కొడుకుల గుసుగుడు మొదలు అయినా వచ్చినదానితో సరిపెట్టుకుంటున్నందుకు అస్లంకుసంతోషంగా ఉండేది. సంవత్సరం గడిచేసరికల్లా నియమాల బంధంలో ఇరుక్కొని విసిగిపోయాడు.

అత్తగారు రోజూ పులగమే తింటూంది. పాలే తాగుతూంది. రోజూ పులగం తినటం అంటే విషం తిన్నట్లుంది. ఇహ ఫాతిమా నెయ్యీ, చక్కెరా చూచి వేసేది. ఉప్పు అటుగాని ఇటుగానికానిచ్చేదికాదు. ఆదేరుచి. అదే పులగం వేలసంవత్సరాలనుంచితింటున్నట్లనిపించేది. పులగంముందుకువస్తేతన్నెయ్యాలనిపించేది. రాత్రిమిగిలిన పాచిరొట్టెలు, కుండలో మిగిలిన కూరనంజుకొని తినాలనిపించేది. కాని కోడలు చదువుకున్నది. పాచి పదార్థం తిననిస్తుందా? కోడలు భయం ఏమంటే అత్త అపథ్యం చేస్తే మందు తెప్పించాలి. మందు తెప్పిస్తే మరో ఖర్చు తగ్గించాలి. ఏ ఖర్చు తగ్గించాలో తెలీదు. అన్నీ బొటాబొటిగా ఉన్నాయి ఖర్చులనీ పోటలుపెట్టి నిలబెట్టిన యింటిలా ఉంది. ఏది లాగినా ఇల్లంతా. కూలేట్లుంది అందువల్ల కుటుంబంసాంతం కొయ్యబొమ్మల్లా ఫాతిమా సంజ్ఞల ప్రకారం ఆడవాల్సి వచ్చేది.

కొడుకును కోడలు కొంగున కట్టుకుంది అంటుందిఅత్తగారు. అస్లమ్ పరమ సోమరి. అయినా సిగరెట్టు బూడిద నేలమీద పడనీయడు. జాగ్రత్తగా "యాష్ట్రే"లో దులుపుతున్నాడు. ఎముకలు కొరికే చలిఉన్నా స్నానం చేయక టిఫిన్ చేయడు లోకం తలకిందులయినా రాత్రి పదింటికి పడకగదికి చేరుకుంటాడు.

అత్తగారు నేలమీద ఊయలేకపోతూంది. మూతికి కట్టిన ఉమ్మిపాత్ర వదిలించుకోవాలని తహతహ లాడుతూంది.

పొరపాటున పక్కింటి పిల్లలు ఇంటిలోకి వస్తే ఫాతిమా చిరచిరలాడేది. వాళ్ళఅల్లరి సహించలేక పోయేది. పిల్లల తల్లులను తూలనాడేది. 'నాదిరా' పుట్టింతరవాత ఫాతిమాకు తెలిసివచ్చింది. విటామిన్లున్నతిండి తినిపించేది. డిసంబర్ చలిలోను రెండుసార్లు స్నానం పోసేది. అల్లం బెల్లం ఆన్నీ అంట నిచ్చేదికాదు. సమయానికి ఆహారం గొంతులో కుక్కేది. అయినా నాదిరాకు అడ్డమయిన నాయనమ్మ అలవాట్లన్నీ వచ్చేశాయి. ఫాతిమా చెప్పింది అస్సలు చేసేదికాదు. ఫాతిమా సంత్రాలు తినిపించాలనుకునేది. నాదిరాకు అవి విషంలా తోచేవి. వద్దన్నపుడు సంత్రాలకోసం పొర్లి ఏడ్చేది. చప్పని కూరలంటే ఆమెకు అసహ్యం. మసాలాలు, కారం ఉన్న కూరలకోసం ఉవ్విళ్ళూరేది.

ఒక్క నాదిరాతోనే పడలేకుండా ఉంది ఫాతిమా, చూస్తూ చూస్తుండంగానే ఆల్లరిపిల్లలు అనేకమంది తయారయినారు. గిల్లికయ్యాలు పెట్టుకునే పిల్లల సంఖ్య పెరిగిపోతూంది. ఫాతిమా చాకిరిచేసే గొడ్డులా తయారయింది. ఒకనికి స్నానంచేయించి, రెండోవాణ్ణి పట్టుకునేది. అప్పటికి మొదటివాడు మట్టి పులుము కొని మళ్ళీతయారు.

కుటుంబంలో క్రమశిక్షణ తలక్రిందులైంది. ఎప్పుడూ ఇంట్లో అల్లరే. నాదిరా జబ్బునపడుతుంది. ఆమెకు మందు పస్తుంది. ఇంతలో శన్నూ మెల్ల మించి పడుతుంది. మరోరోజు వప్పు కాళ్ళ చచ్చుపడ్తాయి. ఫాతిమాను వెక్కిరించడానికా అన్నట్లు పిల్లల జబ్బులు పరిగెత్తుకొని వచ్చేవి.

కుటుంబ నిర్వహణ ఫాతిమాకు అలవికాకుండా పోయినపుడు అత్తగారు పాతకొట్టుతాళం తీయాల్సివచ్చింది. అది అత్తగారి తండ్రిసామాను ఉన్నగది. వీలునామాప్రకారం ఆ సామానుకు వారిపిల్లలే వారసులు. ప్రస్తుతం అత్తగారే వాటికి వారసురాలు.

అత్తగారు గదితలుపు తెరిచింది. తప్పలేదు. అందులోని బట్టల్ని పట్టుకొని బోరున ఏడ్చింది. అన్నం మానివేసింది. గుండెదడ ఎక్కువయింది. తండ్రి పోయింతరువాత వచ్చిన నష్టాలన్నీ గుర్తుకుతెచ్చుకుంది. అందులోనుంచి ఒక అల్మారీ బయటికి తీసింది. అస్లమ్ వ్యాపారిని తీసుకవచ్చాడు. ఆ తరవాత పీనుగును పారేసిన ఇంటిలా ఇల్లంతా వెలవెల బోయింది.

అలా ఒకనెల హాయిగా గడిచింది. మళ్ళీ భార్యాభర్తల కీచులాట మొదలు. పిల్లల ఏడ్పులు. ఇవన్నీ విన్న అత్తగారు కన్నీళ్లు తుడుచుకుంటుంది. కొట్టుకున్న ఉప్పుపట్టిన తాళం తీస్తుంది. ఒకనాడు అక్రమ్ ఖజానా చూచాడు తల్లిపెట్టెలోంచి తాళంచెవి తీశాడు. ఇప్పుడతనికి రెండోఆట సినిమాచూడ్డం, అస్పాటుగా సిగరెట్లు కాల్చడం సురువయింది.

తాతగారు మాత్రం చేసిందేమిటి-ఏదో కొద్దిపాటి వకాల్తీ, ఆమాత్రంతో అలవేం బొక్కసాలు నింపిపోయాడా? అత్తగారి వెలసిపోయిన కోరికల్లాంటి ముక్కలు చెక్కలయిన సామగ్రి ఏడాదిలో దారిచూచుకుంది. మిగిలింది కొట్టుకొట్లో చిమ్మ చీకటి, పందికొక్కులు తోడిపోసిన మట్టిరాసులు, చిందర వందరగా పడిన కుండపెంకులు, కాగితం ముక్కలు చూడ్డానికి అసహ్యంగా ఉంది. మట్టిరాసులు - గాలిదూరని కొంపాలోన అడుగుపెడ్తే తలతిరిగిపోతుంది ఇక ఆ గదిలో మిగిలింది గోడకు తగిలించిన నిలువుటద్దం మాత్రమే. ఆ అద్దంచూస్తే అత్తగారికి తండ్రి గుర్తుకువస్తాడు. అతడుకొట్టుకు వెళ్ళేప్పుడు ఆ అద్దంలో చూస్తూ కోటువేసుకునేవారు. ఆ అద్దంచూస్తే తండ్రి నుంచున్నట్టు అనిపించేది అత్తగారికి. పసిడిఛాయ ముఖం. తెల్లని గడ్డం, నల్లని కోటు - నిలువెత్తు విగ్రహం - ఆమె కళ్లు చెమ్మగిల్లుతాయి. అందుకే అద్దంగోడ పైవుండేటట్లు తగిలించింది. గది ఖాళీ అయింతరువాత అద్దందాగలేదు.బయట పడింది.

నెలలు దొర్లిపోతున్నాయి. మందుకు డబ్బు లేనపుడు జబ్బులుమాత్రం ఏంముఖంపెట్టుకొని వస్తాయి? అంటూపప్పాకాళ్లు మాత్రం బత్తాయీలు లేకుండా బాగుకావని బిర్రబిగిసి కూర్చున్నాయి.రోజంతా పక్కలోపడి మూలుగుతుంటాడు

ఫాతిమా వైద్యులచుట్టూ, డాక్టర్లచుట్టూ తిరిగి తిరిగి కాళ్లు అరగతీసు కుంది. అస్లమ్ చెప్పిన సలహాలను అనుసరించింది, అయితే ఎంతకాలమని! రోజూ మందుకు అర్ధరూపాయి పెట్టడం పెద్దసమస్యఅయి పోయింది. పైసకుపైస కూడబెట్టి వండిన వంట రాత్రిళ్లు అలాగే పడిఉండేది. అస్లమ్ ఇంటికి వచ్చి ఫాతిమాతో పోట్లాటలో పడిపోయేవాడు. అలసిపోయి కన్ను మూతపడేది. ఫాతిమా పిల్లలతో పడలేక చెవులు మూసుకొని ఏడ్చేది. అస్లం నిరాకరించిన భోజనపుపళ్ళెం అత్తగారు ఫాతిమా ముందుంచేది. ఆమెతోనూ చీవాట్లుపడి పళ్ళెం అల్మారీమీద పెట్టేసేది

చివరకు అత్తగారు గుండె రాయిచేసుకుంది. కొట్టోనుంచి అద్దం తెచ్చింది బయట బడేసింది. ఆనాడు సొంతం కన్నీటితో కొంగు తడుపుకుంది. సాయంత్రం అస్లమ్ ఆఫీసునుంచివచ్చాడు. చూస్తే తనముందు నిలువెడు మనిషి నుంచొని ఉన్నాడు. వంగి జుట్టు సవరించుకున్నాడు షేర్వానీ గుండీలు సవరించు కొని, చిరునవ్వుపోజు పెట్టాడు. తన అందానికి తానే మురిశాడు చెమటతోనూ, సిరాతోనూ తడిసిన చేతుల్తో అద్దపు ఫ్రేమును అంటుకున్నాడు ఎంతబావుంది అనుకున్నాడు.

భర్త అద్దంలో చూచుకొని మురిసిపోవడం చూచింది ఫాతిమా. పొయ్యి దగ్గర్నుంచి లేచింది. మసిచేతులు తుడుచుకుంటూ వచ్చేసింది.

"ఫాతిక, ముప్పైరూపాయలకు పోవచ్చు...." మాటపూర్తికాకుండానే బెదిరినట్లయి వెనకడుగు వేసింది అద్దంలో మామడి వరుగులాంటి ఎండి పోయిన స్త్రీ కనిపించింది, ఎండిన దేహం, పీచువలె రేగిన జుట్టు, మురికి కారుతున్న చీర అస్లమ్ పక్కన నుంచుంటే భయంకరంగా కనిపిస్తుంది ఈమె ఎవరు? తన కన్నుల్లో దివ్వెలు దాచుకొన్న ఫాతిమాయేనా? అందంలో పందెం వేసి గెల్చుకొన్న పాతిమాయేనా? ఎచీర కట్టినా అద్దినట్లు కనిపించిన పాతిమా యేనా తన పొడవైన కురులను చూచి పొంగిపోయిన పాతిమాయేనా?

లోన కుండమాడి మసిబొగ్గయింది. అక్కడినుంచి అమాంతంగా పరుగుతీసింది.

ఆ రాత్రి కుటుంబపు సాంఘిక, ఆర్థిక, రాజకీయ సమస్యలన్నింటికీ ఒకేఒక పరిష్కారం నిలువు టద్దంగా నిర్ణయించింది. అయినా ఆ విషయం అస్లమ్ బుర్రకు బొత్తిగా ఎక్కలేదు. అతనికి అది మాంత్రికుని అద్దంలా కనిపించింది. అందులో భవిష్యత్తుకు సంబంధించిన అందమైన అప్సరసల నాట్యాలు గోచరించాయి.

ఫాతిమా చెప్పిన ప్రతిమాటకూ అడ్డు తగిలాడు అస్లమ్. అద్దం అమ్మినా అద్దెహాపాయసమించి రాదు. అద్దం అమ్మితే అమ్మ గుండె పగులుతుంది. ఒప్పుకు ఇప్పుడు బతాయీలు పెట్టినా ప్రయోజనంలేదు. ఫారూఖ్ భాయి ఇచ్చిన అప్పు అడగడం మానేశాడు ఇదీ వరస.

తల్లి కొడుకునే వెనకేసుకు వస్తుంది. అమె ఆ అద్దంలో తనతండ్రి ప్రతిరూపం చూసుకుంటుంది. ఇక అస్లమ్ ఇంటో ఉన్నంత సేపూ అద్దం పట్టీ తిరుగుతుంటాడు అక్కడే బోంచేస్తాడు. గడ్డం గీక్కుంటాడు, దువ్వుకుంటాడు అద్దంలో చూచుకున్నప్పటినుంచి అతనికి వళ్లుపెంచుకోవాలనే పంధి పట్టింది. ఫాతిమాఏమో అతని ఆరోగ్యం అడుగంటడానికి కావలసిన ప్రయత్నాలన్నీ చేస్తోంది. అస్లమ్ ఇంటికి వస్తాడా పిల్లలంతా స్వరయుక్తంగా ఏడుస్తారు. రోజూ అదే కేపేజీకూర అస్లమ్‌కు అదంటే బొత్తిగా ఇష్టంఉండదు

ఒకనాడు అక్రమ్ తల్లి కొంగులోంచి డబ్బు దొంగిలించాడు. లెక్కపెట్టుకుంటున్నాడు. చప్పున అద్దం కనిపించింది, బయటవాడికి ఎంత పనో! అయినా లెక్కచెయలేదు. తీక్షగా చూచాడు, అద్దాన్నిచూస్తే ఏంకనిపిస్తుంది? అతడే కనిపించాడు. ముఖం జిడ్డుకారుతూంది, దొంగల్లా వెంట్రుకలు పెరిగాయి. కాళ్లకు చెప్పుల్లేవు, అంగలార్చుకుంటూ నడుస్తున్నాడు, అద్దంలోని గూండాను ఆపాదమస్తకం చూశాడు, ఊశాడు ఛ అన్నీ పోయినాయి ఇంకా ఈ అద్దం బద్దలు కాదు, అనుకున్నాడు అదృష్టం ఏమంటే దేనిమీదా అతని ధ్యాస నిముషాన్ని మించి ఉండదు. అటికాక సిగరెట్లుకోసం మండిపడుతున్నాడు కాకుంటే అద్దంరెండు తన్నుల్ను మించి తట్టుకోగలదా?

రెండోరోజు అక్రమ్ సైకిలు ఎత్తుకొచ్చాడు. మల్లేశం దుకాణానికి తెచ్చాడు. మళ్ళీ ఆ అద్దం ముందున్నట్లనిపించింది, అదే జిడ్డుముఖం దొంగల్లాంటి పొడవైన జుట్టు! మల్లేశం దుకాణంలో అద్దంకాదు వెలుగుముఖం కనిపించదు. చిమ్మచీకటి అంతటా సైకిళ్ళ స్పేర్స్ పడిఉన్నాయి. దొంగ సైకిళ్ళను విడదీసి ముక్కలమ్మడం అతని వ్యాపారం.

ఆ సాయంత్రం అక్రమ్ రిక్షాతెచ్చాడు. అద్దం తీసికెళ్ళి అమ్మేయడానికి సిద్ధపడ్డాడు మల్లేశం పదిహేను రూపాయలకు కొంటానన్నాడని చెప్పాడు. అస్లమ్‌కు అమ్మడం ఇష్టంలేదు. అమ్మ అద్దానికి యాభై రావాలంది. వాళ్ళనాన్న దాన్ని నూటికి కొన్నాడంది. నుంచుంటే దానిలో నలుగురి రూపాలు కనిపిస్తాయంది.

అక్రమ్, ఫాతిమా అద్దంవెంట అలా ఎందుకు పడ్డారో అర్థంకాలేదు అస్లమ్‌కు. అతనికి అద్దం అంటే గర్వం అలాంటిది. బంగలాల్లో కూడా ఉండదని అతని అభిప్రాయం. అందంగా అమర్చిన గదిలో ఈ అద్దం ఉంచితే వెలిగిపోతుందనుకుంటాడు. రావాలంటే అన్నీ ఒకేసారి వస్తాయా? ఇవ్వాళ అద్దముంది. రేపు సోఫా వస్తుంది. ఆ తరవాత రేడియో. అటుపై ఫర్నీచర్ ఇలాగే అన్నీ, అలా ఊహల్లో ఇంటినంతా తీర్చిదిద్దాడు. అయితే కనిపించింది ఒక్క అద్దం మాత్రమే దాన్ని తనగదిలో పెట్టుకున్నాడు. చూడగానే తాను సొంతం కనిపించేట్టు పెట్టాడు. మంచం దానిపక్కనేవేసి పడుకుంటున్నాడు. ఫాతిమా కేకలు కాస్త తగ్గాయి. ఎంచేతంటె అతని జీతమూ అలవెన్సులూ కాస్త పెరిగాయి. అందువల్ల పప్పాకు బత్తాయీలు లభిస్తున్నాయి.

అస్లమ్ ఆఫీసునుంచి వచ్చేపుడు ప్రతిరోజూ నాలుగు బత్తాయీలు తెచ్చేవాడు. అతని అలికిడి విని పిల్లలంతా పరిగెత్తి వచ్చేవాళ్లు. కాళ్లకు చుట్టేసుకుంటారు. అవి పళ్లుకావు మందు మాత్రలంటాడు. పప్పా చేదుమందు అందులో ఉందంటాడు, పిల్లలు వినరు ఏడుపు లంకించుకుంటారు. అప్పుడు

ఫాతిమా లేచి పిల్లలను నాలుగు బాదుతుంది. పిల్లలు ప్రాణం పోయినట్లే పొర్లి పొర్లి ఏడుస్తారు.

ఈ పళ్ళ వల్ల ఒకని ఆరోగ్యం బాగుపడుతుందనుకుంటే పాపం ఇందరు పిల్లల ప్రాణాలు పోతున్నాయి! ఇందును గురించి అస్లమ్ తప్ప ఎవరూ ఆలోచించేవారు కారు. అందువల్ల పప్పూ దగ్గర కూర్చుని జాగ్రత్తగా ఒలిచిపెట్టేవాడు వజ్రాలలో చేసిన లేహ్యం తినిపించినట్లు, మరొక బత్తాయి పిల్లలందరికీ పెట్టేవాడు. తాను కష్టపడుతున్నాడు. సంపాదిస్తున్నాడు. తాను ఆరోగ్యంగా ఉండాలి అద్దంచూసుకుంటే ఆరోగ్యం దిగజారుతున్నట్లుంది. 'పిల్లలకేం - ఎలాగూ ఎదుగుతారు తినాల్సింది మనం. తానుండేనే లోకం అనేది అమ్మ. అందువల్ల మూడో బత్తాయి అస్లమ్ తినేవాడు. ఇక నాలుగోది ఉట్టిలో వేశాడు. తెల్లవారే సరికి ఉండేదికాదు ముందు ఫాతిమా చూచింది. ఆమె గుండె దడదడలాడింది భర్తను లేపింది. అస్లమ్ కళ్లు నలుపుకుంటూ లేచాడు

"కాకి ఎత్తుకుపోయిందేమో" ముఖం కడుక్కుంటూ అత్తగారు అన్నారు.

"కాకులు పళ్లు తినవమ్మా!"

"పిల్లలింకా లేవనేలేదు" ఫాతిమా పిల్లల్ని కాపాడుకుంది. ఈనేరం పిల్లల మీద వేస్తారేమో నని ఆమె భయం. "పడుకునేప్పుడు నేను స్వయంగా చూచాను"

"ఈ ఇంట్లో దేనికి ఒక పద్ధతిలేదు. అంత కరీదైనపళ్లు ఆలా ఎందుకు పారేశారు?" అత్తగారు అటూ ఇటూ తిప్పి కోడలు మీద నేరం మోపటానికి చూచింది.

"ఏమిటి? ఏమన్నావు?" అని కోడలు లేచింది. పప్పూను నాలు గంటించింది. నువ్వెంత అంటే నువ్వెంత అని జగడం సాగింది. దాన్ని ఆపడం అస్లమ్‌కు సాధ్యంపడలేదు. అల్లరివిని పిల్లలు లేచారు. చూస్తే చిక్కంలో బత్తాయి కనిపించలేదు పప్పూకు. ఆతడు ఎక్కెక్కి ఏడుపు సాగించాడు.

రెండోరోజు ఉదయం మళ్ళీ బత్తాయి మాయం.

అది అక్రమ్ పనేనని ఫాతిమా - అస్లమ్ అనుకున్నారు. అందుకు కారణం లేకపోలేదు. అత్తగారు తాను, అక్రమ్ నిర్దోషులమని గంటకొట్టి చెబుతూంది. అక్రమ్ మాత్రం ఉలకడంలేదు. పలకడంలేదు. తనకేమీ పట్టిలేనట్లు ప్రవర్తిస్తున్నాడు. భోజనాలప్పుడు కందగడ్డయిన అన్న ముఖం చూస్తాడు. చెమ్మగిలిన వదిన కళ్లు చూస్తాడు. "ఏమైంది? అలా ఉన్నారు." అని అడుగు తాడు. అత్తగారు నోరు విప్పదు. అస్లాం కలుపుకుంటుంది. ఫాతిమా అర్థ యుక్తం అయిన చూపుల్తో అస్లమ్‌ను చూస్తుంది. అస్లమ్ విషపు చూపుల్తో దొంగలాగా ఉన్న అక్రమ్‌ను చూస్తాడు

అస్లమ్ భోంచేసి పడుకుంటే అద్దంలో అక్రమ్ కనిపించాడు. నిశ్చింతగా పిల్లలతో ఆడుకుంటున్నాడు. వెధవ ఇంత పెద్దవాడయినాడు - ఆటలాడ్తాడు! పనిలేదు పాటలేదు భోజనానికి సిద్ధం. సరే చదివించడానికి డబ్బులేదు నిజమే. ఏదైనాపని చేసుకోవచ్చుగా. వెదుకుతె భగవంతుడైనా దొరుకుతాడు. వాడికేం పట్టింది. తిండి దొరుకుతోంది. పనికోసం ఎందుకు వెదుకుతాడు! దొరకదని ఇంట్లో కూర్చున్నాడు. పిల్లల్తో ఆడుకుంటున్నాడు బత్తాయిలూ తినీతినీ వళ్లుపెంచు కుంటున్నాడు వెధవ.

మొలకెత్తుతున్న యవ్వన దశలో ఉన్నాడు అక్రమ్. ఆతన్నిచూస్తే అస్లమ్‌కు మంట. అద్దంలో తన ఉంగిరాల జుట్టు చూసుకున్నాడు. అది రోజు కింత రాలిపోతుంది. ఇద్దరూ ఒకే తల్లి సంతానం - అయినా ఎంతవ్యత్యాసం! అస్లమ్ బక్కపల్చగా ఉంటాడు. అక్రమ్ ఆరోగ్యంగా నిర్లక్ష్యంగా ఉంటాడు.

అద్దంలో పొయ్యిదగ్గర కూర్చున్న తల్లి కనిపించింది. తల్లి అమాంతంగా ముసలిది అయిపోయినట్లనిపించింది. పరిగ చేనులా ఆమె వెంట్రుకలన్నీ ఊడి పోయాయి. జనపనారలా తెల్లబడి పోయాయి. ముఖం మీద ముడుతలు వచ్చే శాయి. ఇవంతా క్షణంలో జరిగి పోయింది. తల్లి అస్లమ్ ముందు కూర్చొని అవతారం మార్చినట్లనిపించింది.

బత్తాయిలు మాయం అయిన్నాటినుంచి ముసలమ్మ నోరు మూతపడింది. ఆమెకు బత్తాయి ఒకలెక్కా? ఆమె రోజుల్లో ఇల్లాంటిపళ్లను తొక్కి పారేసి

ఉంటుంది. నోరు ఎదపకున్నా ఫాతిమా ఏమనుకుంటూందో ఆమెకు తెలుసు నేరం సొంతం అత్తమీద మోపే ప్రయత్నం జరుగుతోంది.

ఫాతిమా నోరు తల్లినోరు మూయించిందని అస్లమ్ గ్రహించాడు. ఏమిటిది – ఒక్క బత్తాయి కోసం ఇల్లంతా తలక్రిందు చేస్తుంది అనుకున్నాడు. పగలంతా ఆఫీసులో పళ్ల హానం చేసుకొని ఇంటికొస్తే ఏముంది అత్తా కోడలు పోట్లాడీ పోట్లాడీ అలసి పోయి ఉంటారు. పిల్లలు ఏడిగిపోయి బయటికి వెళ్ళిపోయారు. పప్పా ఏడ్చి ఏడ్చి సొక్కిపోయాడు. అందువల్ల అతని రాకనే ఎవరూ గమనించలేదు. చాలసేపు ఒళ్లువిరుస్తూ కూర్చున్నాడు. అప్పుడు ఫాతిమా లేచింది. పొరుగింటి నుంచి పేపరు అడిగి తెచ్చింది. పత్రికలో సినిమా ప్రకటనలు మాత్రమే చదవలేదని నిరూపించడానికి, లోకంలోని వార్తలను నమిలింది.

"రోజూ ఈ జగడాల్తో చచ్చిపోతున్నానమ్మా! ఒకొక్కరే గొంతుపిసికి నీళ్లుతాగి చల్లబడరాదూ"

"ఎవరో చంపడం ఎందుకూ. ఏంటి చావాలనుకుంటే వాళ్లు ఉరిపోసుకుంటే సరిపోదూ" అత్తగారు పక్కలు ఒత్తిరిస్తూ రాజాయుద్ధానికి తయారయింది.

"ఎందుకూ మీ సందుకా పొందాను పేరేపెత్తుతాయె" ఫాతిమాకు తెలుసు అత్తగారి ప్రాణం వాటిలోనే కొట్టుకులాడుతుందని.

"అవును నా ప్రాణం వాటిల్లోనే దాచుకున్నానేదూ" అత్తగారికి అనేక పాత స్మృతులు గుర్తుకు వచ్చాయి. ఢిల్లీలో చిన్నకొడుకు గోకేఉంది. ఈ ఇంట్లో నేరేడు చెట్టు నాటింది. ఇంకా ఎన్నెన్నో జ్ఞాపకాలు ఆమె ముఖంలో మసలాయి. అర్ధరాత్రి అమాంతంగా దివ్వెలు వెలిగించినట్లుంది ఆమె వదనం!

అస్లమ్ అన్నీ విన్నాడు. అన్నీ చూశాడు. అయినా కిమ్మనలేదు. రాత్రి సొంతం మెలుకువతో ఉండి దొంగను పట్టాలని నిశ్చయించుకున్నాడు. అప్పుడు

పాతిమా అంతుతేల్చాలనుకున్నాడు. నోరుపారేసుకునే ఈముండవల్ల తల్లి బానిసలా పడిఉంటుందనుకున్నాడు. అమె పాపం విషంమింగి ఊరుకుంటుంది.

రాత్రి పదకొండు దాకా 'మేడమ్‌బావరీ' చదువుతూ మేలికతో ఉండడానికి ప్రయత్నించాడు. చిక్కం పక్కనుంచి అద్దం వైపుకు తిరిగాడు. బత్తాయి దొంగిలిస్తున్న అక్రమ్‌ను అద్దంలో చూచి పట్టుకోవాలని అతని ప్రయత్నం. తెల్లవారుజామైంది. ఎక్కడో కనిపించే కలల ఊహలు పొద్దటిసందడిలో కరిగిపోతున్నాయి. అస్లమ్ చప్పున లేచికూర్చున్నాడు. కళ్లుతెరిచి చూశాడు. శరీరం అలసిఉంది. చిరాగ్గాఉంది. వేళ్లు విరుచుకోడానికి సిద్ధపడుతున్నాడు.

అతడు 'మేడమ్ బావరీ' చదువుతూ పడుకున్నాడు. రాల్ఫ్‌స్థానంలో తాను ఎమ్మా ను కూర్చోబెట్టుకుని 'కోచ్' నడిపించాడు. మంచులాంటి ఎమ్మా శరీరం అతని చేతుల్లో కరిగిపోతూంది. ఉలిక్కిపడి లేచికూర్చున్నాడు. రాత్రంతా మేలికతో ఉండి దొంగను పట్టాల్సింది గుర్తుకు వచ్చింది. ఉలిక్కిపడి లేచాడు.

అటు తిరక్కుండానే చిక్కాన్ని చూడాడు. గుడ్డి సంజవెలుగులో బలహీనం అయిన ఒకచేయి చిక్కం వైపు సాగింది. పరిగచేనులాంటి జుట్టు వంగింది. అస్లమ్ పరిగముళ్ళల్లో ఇరుక్కున్నాడు. కిమ్మనలేదు.

పదకొండు గంటలకు పాతిమా వంటలో ఉంది. అస్లమ్ పొద్దున్నే అద్దం తీసుకొని బయల్దేరాడు. అద్దం అమ్మకుంటే అటంబాంబు పేలుతుం దన్నంత ఆదుర్దాతో వెళ్ళాడు.

"నాలుగు నెల్లనుంచి మొత్తుకుంటున్నాను. చెవికెక్కలేదు. అద్దంలో ఏదయ్యాం కనిపించిందో........ పాతిమా ఆలోచించలేక పోయింది.

ప్రతి దానికి ఇలాగే ఏడుస్తుంది. నయం ఈ గొడవలో దానికి బత్తాయి గుర్తుకురాలేదు" అని ముసిముసి నవ్వుకుంది అత్తగారు. ఎండిపోయిన చేతులకు బలం వచ్చిందేమోనని చికిలించిన కళ్ళతో చూచుకుంది,

# మోక్షం

అది రావణుని బొమ్మ తగలపెట్టేరోజు - విజయదశమి.

నేడులోకంలోని అన్యాయానికీ, దుష్టత్వానికీ అగ్గిపెట్టడం జరుగుతుంది, నేడు తమ ఆత్మకు మోక్షం లభించనున్నదన్నట్లు, జనుల వదనాల్లో హృదయాల ఉత్సాహం వెల్లివిరిస్తోంది.

రావణుని పేరు ఇంకా నిలిచి ఉండేందుకు ? లోకం చెడును గుర్తించడానికి. శిక్షించడానికి. అగ్గిపెట్టడానికి.

ఇది పండుగరోజు. వాన పడ్తోంది. అయినా సహిస్తున్నారు జనం - పాతప్రియురాలి టెక్కును సహించినట్లు.

మేఘాలు, జనుల నిరాశల్లా, కమ్ముకుంటున్నాయి. వేల చూపులు, మళ్ళి పోవాల్సిందని మేఘాల్ని వేడుకుంటున్నాయి. ఊరి జాతరనాడు వాన రావడం సీతారాములమధ్య రావణుడు ఊడిపడట్లుంది.

చాలసేపు సుందరం కవితలు చదివాను. కాస్త విశ్రాంతికోసం కిటికీ ముందు నుంచున్నాను.

దూరంగా కొండల్లో దేవాలయం ఉంది. అక్కడికి జనులు రాకపోకలు అప్పుడేసాగాయి. అయినా విశేషం ఏమీలేదు. కొత్తదనమూ కనిపించడంలేదు. బురదలో పొర్లే పందులు, కుక్కలు, కోళ్లు, చెత్తకుప్పలు, అత్తాకోడళ్ళ అరుపులు, తోటికోడళ్ళకేకలు అన్నీమామూలే. ఊరుదాటి కాలిబాటల పక్కన కూరగాయల తోటలు, తోటలను చుట్టేసిన కొండలు, చిత్రకారుని కేన్వాస్ మీది బొమ్మల్లా చిన్నచిన్నగా కనిపిస్తున్నాయి. కాని వాటికి మనం దగ్గరవుతుంటే నరుని కోరికల్లా పెరిగిపోతుంటాయి. గుడికివెళ్ళేదోవలో అనేకరాళ్ళకు రంగులు వేసి బంతిపూలూ, దీపాలూ పెట్టారు. ఈ రాళ్ళు కొన్నిరోజుల్లో గుళ్ళయి

పోతాయి. ఎంచాతంటే వాటిచుట్టూ అనేక కథలూ, ఆచారాలూ కూడి ఉన్నాయి. నావరకూ నా కనిపించేదేమంటే జానపదుల ఆచారవ్యవహారాలు ఒకదానిమీద ఒకటి పేరుకొని పర్వతాలుగా మారి ఉంటాయని! వీటిలో కొత్త ఎమీలేదు. చూడాల్సిందీలేదు. అయినా కిటికీ దగ్గరికి వచ్చి నుంచుంటాను. అనుకోకుండానే అలావచ్చినుంచుంటాను.

మా ఇంటిముందు రత్తమ్మ గుడిపే ఉందని బహుషా మీకు తెలియదు. రత్నమ్మ ఎవరు? అనిమీరు నన్ను అడిగారనుకోండి నేను ప్రపంచ ప్రఖ్యాతమైన రోమాంటిక్ కవుల కవితలన్నీ వినిపించేస్తాను.

జాతరకు బయలుదేరడానికి ఇంకా సమయంఉంది. ముందున్న గొందిలో అడావుడిగా ఉంది. పిల్లలు కొత్త బట్టలు కట్టుకొని సంబరపడు తున్నారు. ముకుతాడు వేయని ఎద్దుల్లా ఇవ్వాళ వారి ఆనందానికి వ్యాఘాతుల్లేవు. వంటిమీది బట్టవిడిచి ఎరుగని మగాళ్లుసైతం బట్టలు మార్చారు. వాళ్లను చూస్తుంటే అక్కడక్కడా సున్నంకొట్టిన పాతగుడిలా ఉన్నారు. వారు పిల్లల్ని ఎత్తుకొని చంకనేసుకుంటున్నారు, ఆడపిల్లలతో పరాచికాలాడుతున్నారు.

స్త్రీలు మామూలుకన్నా గంభీరంగా ఉన్నారు. అలంకరించుకున్నా అందులో ప్రత్యేకత లేదని కనబరచ ప్రయత్నిస్తున్నారు. డబ్బు ఎక్కువ ఖర్చవుతూందని, పని ఎక్కువ అయిందనీ విసుగుతున్నారు. అంత శృంగారం ఎందుకని అమ్మాయిలను కసురుతున్నారు. అమ్మాయిలు మామూలే వాళ్లను పట్టించుకోవడంలేదు. పందాలు వేసుకున్నట్లు ఒకరినిమించి ఒకరు అలంకరించుకుంటున్నారు. అయితే అందరూ కొప్పుల్లో బంతిపూలు తురుము కున్నారు కాళ్లకు పసుపు రాసుకున్నారు, వారు కదలిపోయినా బంతిపూల పచ్చ దనం వాతావరణంలో కనిపిస్తూంది. అది క్రమంగా ఆకాశంలో మబ్బులా వ్యాపిస్తుంది చెమ్మగిలిన కండ్లకు అది వర్షంలా కనిపిస్తూంది. గుండెల్లో మబ్బులు చేరుకుంటున్నాయి ఆ మబ్బుల్లోంచి వడగళ్లు నామీద పడకముందే లోనికి వెళదామనుకున్నాను. అమాంతంగా మెరుపు మెరిసింది.

కాదు - మెరిసింది మెరుపుకాదు. పరిసరాలు నవ్వాయి. పరిసరాలుకాదు రత్తమ్మ నవ్వింది. ఆమె తన చిరునవ్వుల వెలుగులు నాకళ్లలో కురిసింది. అంతే ఉత్తరదిశకు తిరిగింది. అయినా అందంగానే ఉంది తాజ్‌మహల్‌ను ఏ కోణంనుంచి చూచినా సుందరంగానే ఉంటుంది.

రత్తమ్మను సంవత్సరంగా చూస్తున్నాను. వంగినమెడ నాసికపు నీడలో పెదపై ముఖాన్ని అందుకుంటూ నలుపు వెంట్రుకల కొండల్లోని సెలఏటిలాంటి పాపిటను అంటుకుంటాయి. ఆమె కళ్లు అవనతంగా ఉంటాయి. కన్నెత్తదు. చూపు నేల కానించి కూర్చుంటుంది.

అందుకు విరుద్ధంగా నేడు చీకటి గదిలో ఉదయించింది. ఆమె పెదవులు స్వర్గద్వారాల్లా ఉన్నాయి. ఆమె గుండెలోనుంచి వచ్చిన చిరునవ్వు చెంపలమీద తాండవమాడింది.

ఈ రోజు ఆమెకూడా తన చిరునవ్వును కానుకగా అర్పించి తన అందాన్ని కోరికల చూపు తూపులనుంచి రక్షించుకొని పవిత్రం కాదలచు కుందేమో!

ఆమె కనురెప్పలు నాదిశగా తెరుచుకున్నాయి — ఒక దేవాలయ ద్వారాలు హరిజనులకు తెరచుకున్నట్లు, నేను ఇందుకు అర్హుడనా? ఒక మాలలా ఆలోచించాను.

రత్తమ్మ ముఖంమీద నాచూపు గుమ్మరించేముందు, ఎందుకో తెలీదు. బదరీనాథుని పవిత్రదేవాలయం గుర్తుకువస్తుంది. ఆ దేవాలయంలోని భక్త్యావేశాలను చూచి అక్కడి మెట్లు ఎక్కలేను.

అస్పృశ్యులు చేసిన పాపం ఏమిటి! వారు ఏ దేవాలయానికి వెళ్ళినా ద్వారాలు తెరుచుకోవు. వారి అపవిత్ర పాదాలు నేలనంటుతే భగవంతుడు ఎందు కలా మూతి ముడుచుకొని పారిపోతాడు. వీరికీ భగవానునికీమధ్య పాపాలగోడ అడ్డుంది. భగవంతుడు ఆలోచనల అడుగులసవ్వడిసైతం వినగలడట — హరి జనుల ఆక్రందనలు ఎందుకు వినడు.

నాకు రత్తమ్మ గుర్తుకు వచ్చినప్పుడల్లా నామనసులో దాగిన మాల గుర్తుకు వస్తాడు. నయం ఈ విషయం మా అమ్మకు తెలియలేదు. తెలిస్తే నామనసులో మాలను ప్రవేశపెట్టే రత్తమ్మను ఇంటికే రానిచ్చేదికాదు.

పట్నంలోని నామిత్రులు నా మానసిక ప్రేమను అపహాస్యం చేసేవారు. ప్రేమపిడుల్లో రగులుకొనవలసిన నిప్పురవ్వ అంటే వారికి గిట్టదు. పెట్రోలుపోసి తగలపెట్టడం వారి అలవాటు. వారు దీన్ని ప్రేమగాభావించరు. నేను క్రమంగా వేదాంతంలోకి దిగజారుతున్నానని వారి నమ్మకం మూడు నాలు గేళ్లలో నేను భక్తుణ్ణి అయిపోతానని ఒక మందిరంలో కూర్చుంటాననీ అప్పుడు తమ వలపుల వరాలు అడగడానికి వస్తామనీ భవిష్యద్దర్శనం చేసేవాళ్లు

కాని నేడు పరిసరాల్లోని మానసికశక్తులు మాట్లాడు తున్నట్లున్నాయి. ఇది భగవానుడు దుష్టత్వాన్ని అంతంచేసేరోజు. ఆతనికి నామూగ కోరికల గుసగుసలు వినిపించాయేమో : క్షణంలో ఈ ఆలోచనలన్నీ వచ్చేశాయి. మరు క్షణంలో నిరాశా మేఘాలు తొంగిచూచాయి. మరుక్షణం జాతరకు వెళ్ళేవాళ్ళ గడబడలు ఎక్కువయినాయి నేను తడబడి నలువైపులా చూచాను. నాకూ రత్తమ్మకూ ఉన్నదూరం కొలచాను. అది ఏడేడు సంద్రాలంత ఉంది.

మానవుని హృదయం పరితప్తం అయినపుడు. పేద వాని ఆలోచనల్లా, చూపు నలువైపుల పరుగుతీస్తుంది.

విజయదశమి హడావుడి తారస్థాయిని అందుకుంది. మురికిమీద మక్షి కాల్లా సాధువులు సన్యాసులు గుమికూడారు. ద్వారాలకు మామిడి తోరణాలు పచ్చగా కనిపిస్తున్నాయి. మామిడి ఆకుల కొనలకు చేరిన వర్షబిందువులు ముత్యాల మాలలా ఉన్నాయి. కాస్తంత కదలికకు ముత్యాలు వెండితీగ అయి జారుతున్నాయి. వాకిళ్లలో కళాపి చల్లారు. అంగనలు రంగవల్లులు తీర్చారు. కాని అవి వానకు కొట్టుకుపోయాయి,

ఆడవారంతా తలంట్లుపోసుకొని, వెంట్రుకలు విరబోసుకున్నారు. వారి దేహాలు పరిశుద్ధములు అయినాయి. ఆత్మల పారిశుద్ధ్యంకోసం చేతుల్లో పళ్ళెరాలతో చెరువువైపు తరలి పోతున్నారు.

కాళికా దేవాలయానికి బస్తీనుంచి సాధువులు వచ్చారట. వారి దగ్గర రకరకాల దేవతల గుర్తులున్నాయట. వారిదగ్గరున్న మంత్రాల్లో మాహాత్మ్యం ఏమో గాని ఆడవారి కోరికల్నీ గ్యారెంటీగా తీరుస్తారట. సర్వపాప పరిహారానికి బాధ్యత వహిస్తారట, సాధువులగుంపు దేవాలయపువెనుక ఉన్న సత్రంలో విడిశారట.

బస్తీవాళ్ళ కోరికల్నీ పీక్ల తీర్చి ఉండాలి, లేదా పాపం వాళ్ళ గుండెల్లో కోర్కెలే లేకుండాలి, ఈ సాధువులు మా గ్రామానికి విచ్చేశారు.

ఈవార్త ఊళ్ళో అగ్గిలా వ్యాపించింది. ఊరివాళ్ళకు ఉన్నవీ లేనివీ కోరికలు మొలుకెత్తాయి. చేసిన చిన్నా, పెద్దా పాపాలు వాళ్ళను చిరాకు పరుస్తున్నాయి.

మా ఇంట్లోకూడా అడావుడిగా ఉంది. గిన్నెల చప్పుళ్ళు, కోళ్ళ అరుపులు మా చెల్లెళ్ళకేకలు - రొదగా ఉంది. వసారాలో పూజకు పళ్ళాలు తయారవుతున్నాయి. మా అమ్మ చందనం, కొబ్బరితాయలు, కుంకుమ సర్దుతూంది. బలిహరణానికి అయిదు రంగుల బియ్యం ఉడుకుతున్నాయి. మా చెల్లెళ్ళు మంచి మంచి చీరలు తీస్తున్నారు - కట్టడానికి. వాళ్ల అలంకారాలకు అంతులేదు.

దసరా అసలు ఆడపిల్లలపండుగ. కొన్నివారాలు ముందునుంచే సీతకథ పాడుకుంటారు. రాసలీల జరుగుతుంది. భరతనాట్యం ఆడ్తారు. పూలు, ప్రమిదల మధ్యనుంచీ చుట్టు తిరుగుతూ సీతావనవాసానికి సంబంధించిన కథలు గానం చేస్తూ రావణుని దుష్టతలంపు మరిచిపోతారు. వారికి చిత్రాంగదా అర్జునుల ప్రేమగాథలు గుర్తుకువస్తాయి. ఒక్కొక్కసారి కృష్ణలీలలు గానంచేస్తూ వెన్నెల్లో చెట్లక్రింద, తమను తాము మరచి పోతారు.

నా చెల్లెళ్లు పోట్లాడి మరీ కొత్తగాజులు వేయించుకున్నారు సిగలో బంతిపూలు తురుముకున్నారు. కాళ్లకు పసుపు రాసుకున్నారు. కోడిపుంజులా వక్షవిరుచుకునే గంజిపెట్టిన చీరలు కట్టుకున్నారు. వాళ్లునడుస్తుంటే గాలి తాకిడికి చీరలు సవ్వడి చేస్తున్నాయి. గత నాలుగయిదు రోజులుగా ఆటల్లో మునిగి గది ఊడ్వడం సహితం మరచారు.

"నీ స్నేహితురాలు రత్తమ్మ ఇవ్వాళకూడా మురికి చీర కట్టుకుంది. చూస్తే ఎలాగో అనిపిస్తూంది'' నా చెల్లెలు వనితాలక్ష్మితో అన్నాను.

"పాపం వాళ్ళ అవు చచ్చిపోయింది. ఆ దుఃఖంతో ఆటల్లోకూడా పాల్గొనదు" అని వీళ్ళల్లో తననీడ చూచుకొని బొట్టు సవరించుకుంది.

ఆవు చావుకూ - ఆటకూ ఏం సంబంధం? ఆవు చనిపోతే పండుగ చేసుకోదా?

నాన్న చనిపోయి ఎంతోకాలం కాలేదు. మేము మరిచిపోలేదూ? నాన్నను వారు ప్రతి నిత్యం గీత చదవకుండా అమ్మను కొట్టేవారుకాదు. రైతుల దగ్గర డబ్బువసూలుచేసి భూమిలో పాతిపెట్టిండే మాకు సీతాఫలాలు కొనుక్కోవడానికి పైస ఇచ్చేవారు కారు. అలాంటివారు పోతే ఏడవకుండా ఎలాఉంటాం? మా నాన్న మట్లోకలిస్తే వారు పాతిపెట్టిన ఆనందాలన్నీ వెలకి వచ్చాయి.

"ఇప్పుడీ డబ్బంతా ఏంకాను?" డబ్బునుచూచి మాఅమ్మ మూర్ఛ పోయినంత పనిచేసింది. రత్తమ్మ తల్లి విధవరాలు అయినప్పటివలె! ఆతర్వాత డబ్బుల అజీర్ణంతో రోజులకొద్ది మంచంలోపడి రత్తమ్మ ధ్యాసలో రోజులు గడపసాగాను.

పనేమీలేనప్పుడు వలపువెల్లువ ముంచుకొస్తుంది.

మనం మన వలపుల చావుకు ఏడవం. కాని తన్నిమిత్తపదార్థం మన నుండి దూరం అయినపుడు దుఃఖిస్తాం అది మాతకావచ్చు లేదా గోమాతకావచ్చు

"రత్తమ్మకు ఆవు అమ్మనుమించింది." అమ్మ రత్తమ్మ యింటికి వెళ్లి మందలించి వచ్చి అన్నది. "పాపం ఆ ఆవువల్లనే ఇంటి ఖర్చంతా వెళ్ళేది. ఇహ వీధివాళ్లు అప్పు సహితం ఇస్తారనే నమ్మకం లేదు.

భూమిని మోసే ఆవు అలసిపోతుందట. అప్పుడది కొమ్ము మార్చుకుంటుందట అప్పుడే భూకంపం వచ్చేది. వావుంది. కాని ఆవు ఆలసిపడిపోతే!

నాకు భయం వేసింది. రత్తమ్మ ఇంటిని చూశాను. ఇంకా అక్కడికి దసరా చేరలేదు. ఒక తెల్లపిల్లి గుమ్మంలో కూర్చొని పాదాలు నాకుతూంది. అప్పుడప్పుడు ఎక్కువెరిచి, ముకుపుటాలు పెంచి వీధిలో వండే వంటల వాసన చూస్తోంది.

అప్పుడే వాజాలవాళ్ళు వచ్చేశారు. డోళ్ళు మోగుతున్నాయి. శంఖనాదం విన్న స్త్రీలు మైమరచి, తాగినవారివలె వెంట్రుకలు విరయబోసుకొని నాట్యం సాగించారు. వీధిలోని మగాళ్ళు వేపాకునీళ్ళలో ముంచి దిగతుడుపు తీస్తున్నారు. కానినేడు ఏ ఆడది భర్తప్రేమగాని. సంతానంగాని, సంపదగాని అడగలేదు. కన్నెపిల్లలు తమ కళ్ళలో కోరికలదీపాలు వెలిగించి వాటిని తీర్చమనే వరాలు కోరడానికి రాలేదు.

వీరు దేవదాసీలు. పురుషుని ప్రేమించిన నేరానికి దేవాలయంనుండి గెంటివేయబడ్డారు. ఇది పూజాదినం. ఈరోజు మళ్లీవారు జ్ఞానంతో వెలుగొందుతారు. అలాంటప్పుడు అందరూ తమతమ విన్నపాలతో వీరిని ఆశ్రయిస్తారు. కాని నేటి స్థితివేరు. సాధువులబృందం చేరింది. అందువలన వీరి ప్రాముఖ్యత తగ్గింది. కొందరు ముదుసళ్లు మాత్రం ఆచారం ప్రకారం కేలు పెట్టి ప్రార్థిస్తున్నారు.

చెరువులో విడవడానికి పూజపళ్ళాలు తీసుకొని ఆడవాళ్లు కూడుతున్నారు వాతావరణంలో ఒక వెలుగు పరుచుకుంది. బుట్టలో రంగురంగుల పూలు విసురుతే ఎలా ఉంటుంది? అలా ఉన్నారు రంగురంగుల చీరలు కట్టిన చిన్నారులు. వీరి నల్లని శిరోజాల్లో తెల్లని నీటి బిందువుల ముత్యాలు లక్షలకొద్ది

మెరుస్తున్నాయి. పళ్ళెంలోఉన్న ప్రమిదలు నేరం పప్పుకున్న నేరస్తుల్లా
గడలాడు తున్నాయి. అమ్మాయిలు వేరు వేరు వరుసలుగా నుంచున్నా
ఒకరిని ఒకరు విమర్శించుకుంటున్నారు. లేయింబవళ్ళు కనిపించే ఈ
యిలు ఎంతో అందంగా కనిపిస్తున్నారు. ప్రియంగా కనిపిస్తున్నారు.

నేటి రత్తమ్మ నవ్వు ప్రకృతి శోభను ఎంతో పెంచింది.

నేనూ గబగబా జాతరకు వెళ్ళే ఏర్పాట్లలో మునిగి పోయా
పట్నంలో ఎగ్జిబిషన్‌కన్నా పల్లెజాతరనాకు బాగనుపిస్తుంది. జాతరలో
సంతోష పడ్డాన్నేను. అక్కడ గేదెలు, ఆవులు కుండలు అమ్ము
అప్పడాలు, ఎండుచేపలు. మేకపేగుల కూరతిని కల్లుతాగుతారు. ఊళ్ళో
అందమైన అమ్మాయిదగ్గర నుంచుని బుర్రకథ వినవచ్చు.

ఇవ్వాళ మిత్రులకు దూరంగా ఉండాలని అనుకున్నా చెల్లెళ్ళ
ఉండడం మంచిది. ఊరి అమ్మాయిలంతా వాళ్ళదగ్గరికి వస్తారు. నా ప్యాంటు
చేత్తో ఇస్త్రీ చేస్తుండగా రత్తమ్మ పిలుపు లోకానికి వినవచ్చింది.

'లోనికి రావాలా రాజ్యలక్ష్మీ!"

'రావమ్మ రా-రా' వనితాలక్ష్మి అన్నది.

'రా-రా...." నేనూ పిలవాలనుకున్నాను. చీనుఇంటికి శివుడు చె
వస్తాడా? వసంతం అడిగి వస్తుందా? సూర్యుడు వచ్చేముందు హెచ్చరిస్తాడా

ఇహ గుమ్మందగ్గరికి ఎవరినీ రానివ్వరు. రత్తమ్మ అడుగుపెట్టి లోనికి
వచ్చిన భూభాగం ఒదిలి వేరయిందనుకున్నా. అర్థంకాదు లోకం ఈ జే
దీపావళి పండుగ ఎందుకు చేయదు? ఏమీ ఒక్కసీత రాముని ఇంటికి వస్తే
దీపావళి అవుతుందా?

రత్తమ్మ రోజులాగే పాతచీర కట్టుకుంది. వెంట్రుకలు చింపిరిగా
ఉన్నాయి. చిరిగిన చీరలోంచి కనిపించే ....

రత్తమ్మ సిగకెక్కిన పూవును మించిన అదృష్టంగల పూవు ఇహ ఈ ఊళ్ళో లేదు.

లోపలినుంచి ఆమె మాటమెల్లగా వినిపిస్తూంది. ఆమె వనితా లక్ష్మికి జడ అల్లింది. రాజ్య లక్ష్మికి నగలు పెట్టింది.

"ఇవ్వాళ పులగం వండుతారుకదూ। మా నాయన బతికిఉన్నప్పుడు అమ్మకూడా వండేది' అన్నది రత్తమ్మ.

షేవ్ చేసుకునేవాణ్ణి ఆగిపోయాను. గదిదాటి బయటికి వెళ్ళే ధైర్యం లేదు. ఆమె అప్పుడే మొలకెత్తిన మొలక లాంటిది. నా వంటిపేడికి కనలి పోతుందేమో పారిపోతుంతేమో!

పులగం వండారుగా రాజూ మీస్నేహితురాలికి పెట్టరాదూ అందామను కున్నా, కాని మాట పెకల్లేదు. అమ్మకు రత్తమ్మంటే అంత అభిమానంలేదు. ఎందుకంటె వాళ్ళు మా రైతులు.

ఆ ముందున్న మట్టిఇళ్లు జాగీర్దారు ఆస్తిగా మారకముందు ఎప్పుడో మాతాతలనాడు మా ఆస్థి అట. అందుకే ఆడవాళ్ళంతా మమ్మలను యజమానులవలె గౌరవిస్తారు.

మా ఊరివాళ్ల జ్ఞాపకశక్తి గొప్పది. వారు మంచీ, చెడూ అన్నింటినీ గూర్చి శతాబ్దాల తరబడి గుర్తుంచుకుంటారు, వారు రత్తమ్మ తండ్రినీ మరచి పోలేదు, అతడు కాలుకుంటి అనే నెపంతో ఏ పనీ చేసేవాడు కాడు. చేల్లో దొంగతనం చేసేవాడు. ఒకసారి సొరకాయ దొంగతనం చేస్తూంటే వంతులు పట్టుకున్నాడు. దేవుని గుడికి పిలిచాడు. ఆలాంటి వెధవ పనులు చేసినందుకు కులం నుంచి వారు వెలివేశాడు. సుందరంపేట చెరువులోపడి చచ్చాడు.

తరువాత అతని భార్య పిడకలు చేస్తుంది. ఆవుపాలు అమ్ముతూంది. రత్తమ్మ కూలినాలికి పోతుంది. అకష్టం, ఆ కులంతక్కువదనం ఆమె పెదవుల

ఓంచి చిరునవ్వు చెరిపివేశారు. ఆమె ముఖంలో ముకుళించిన మొగ్గలు వణుకుతుంటాయి. అవి పేదతనపు ఎండకు, జనుల కొంచెపుచూపు తుపానులకు వికసించవు.

రత్తమ్మ దుఃఖపూరిత విశాలనేత్రాల్లో నాకు ఆమె తండ్రి శవం కనిపిస్తుంది.

"రత్తమ్మా! ఇవ్వాళ జాతరకుకూడా వెళ్లవా ?" వనితాలక్ష్మి విచారంగా అడిగింది. కాని ఆమె జవాబు వినిపించలేదు. బహుశా తల ఆడించి చెప్పి ఉంటుంది.

"అయితే వరాలు అడగటానికి సాధువుల దగ్గరికీ వెళ్లవా?" రాజ్యలక్ష్మి బెదిరినట్లు అడిగింది. నేను గోడకు చెవిపెట్టాను.

"రాజా ఇవ్వాళ నా కోరిక ఒక్కటే - ఎక్కడైనా ఒక రూపాయి దొరకాలి" ఆమె ధ్వని బావిలోనుంచి మాట్లాడినట్లున్నది.

కాని రాజ్యలక్ష్మి, వనిత ఆమెను వదలలేదు. ఏవేవో గుసగుసలు చెప్పారు. ముచ్చట్లుచెప్పారు. ఆమెను మురిపించారు. ఆమె ఒకసారి నవ్వినట్లూ ఉంది.

నేను వణికే చేతులతో అమ్మ పెట్టెతెరిచాను. ఒకరూపాయినోటు తీసాను గడపమీద పెట్టాను. నాగుండె దడదడలాడుతుంది. గడపమీది రూపాయి రత్తమ్మ అందుకొకుంటే జీవితాంతం రత్తమ్మను పొందలే ననుకున్నాను. నేను తొలిసారి హనుమంతుని పటానికి మొక్కాను. రెండు ప్రేమించుకునే హృదయాల నడుమ ఉన్న లంకను ముంచేయమని ప్రార్థించాను.

"చిన్నమ్మా! ఏదన్నా పనిచెప్పండి చేస్తా" అని పొయ్యిదగ్గర కూర్చున్న అమ్మదగ్గరికి వెళ్ళింది రత్తమ్మ.

"మీ అమ్మకు జబ్బుగాఉంది. ఆమె దగ్గరికివెళ్లు. ఈ పనికేంలే . ....." మా అమ్మ వండుగనాడు ఇలాంటి వాళ్ళను చేరనివ్వదు.

దానమే ఇవ్వాలనుకుంటే గుడిదగ్గర కూడిన సాధువులకివ్వు. ఇలా వ్యాపారం కాకుండా ఇస్తే దేవుడైనా చూడడు

"ఆగు" ఆమెను గడపమీద ఆపాను "వెళ్ళేప్పుడు తలుపు వేసుకుంటూ వెళ్లు" అన్నాను.

అప్పుడు నాకు పరీక్షలో పాసైన విద్యార్థిలా సంతోషం కలిగింది - పొంగిపోయాను.

జాతరనుంచి తిరిగివచ్చేప్పుడు బాగా అలిసిపోయాం. జాతరలో పాత లంబాడ్లెన్ని. నేను గాడిద బరువు మోస్తున్నాను. గాజులు, దువ్వెనలు, చెక్క బొమ్మలు, జలెప్ప, కుండలు, అవికాక చాటుగా నేనొక ముత్యాలహారం కొన్నాను. అది గుండె దగ్గరున్న నాజేబులో ఉంది. ఎవరైనా నావైపు సంజ్ఞచేస్తే అదిరి పోతున్నాను. కాళ్ళకెవరో రాళ్లు కట్టినట్లున్నారు. గుంపు తోపిడిలో ఎన్నోసార్లు రత్తమ్మ ఇల్లుచేరాను కాని ఆమె మాల ధరించలేదు. మా నాన్న శవం చూడు మానాన్న శవంచూడు .. " అన్నది.

"తొలగించండి. ఏమిటిది ఇంకా ఎందుకు తగలపెట్టరు?" నేను కేక వేస్తున్నాను.

"ఈ ఊరి వాళ్ళకు ఇష్టంలేదు" ఆమె భయకంపిత స్వరంతో అంటుంది మళ్ళీ జాతరకు తిరిగివస్తుంది. ఒక్కోసారి వనితకు మట్టిబొమ్మలు బేరమాడు తున్నాను. మరోసారి రాజా అదృష్టం పరీక్షించడానికి లాటరీ వేస్తున్నా.

"రత్తమ్మా....రత్తమ్మా..." రాజ్యలక్ష్మి కేకవిని అదిరిపడ్డాను వాస్తవంగానే రత్తమ్మ మా దగ్గరికి వస్తూంది. వెంట వాళ్ళ పిన్ని ఉంది. దండం పెట్టింది. ఊళ్లోంచి వెళ్ళగొట్టిన దుఃఖంసాంతం రత్తమ్మముఖంలో కూడింది. ఇప్పటికీ ఆమె ఆ బట్టలే కట్టింది. కుడి చెంపకు ఏదో అంటింది. నల్లని మచ్చ లావుంది. పొయ్యిదగ్గర్నుంచి వచ్చినట్లుంది. ఆ మచ్చ అసహ్యంగా ఉంది. నాకెందుకో చిరాకనిపించింది. ఆ మచ్చను ఎవరూఆచెరపరేం? వనిత రత్తమ్మ దగ్గరికి చేరింది.

"బట్టలు మార్చుకొని రాకపోయావా?"

"జాతరలో ఏమేమి చూశావు?"

"చూడు నేను ఏమేమి కొన్నానో?" ఆమెను చూచి పిల్లల ఆనందం పట్టలేనంతగా ఉంది.

రత్తమ్మ తన స్నేహితురాండ్ర మెరిసే చీరలు చూచింది. జాతరలో కొన్న వస్తువులు చూచింది. తరవాత ఆమెదృష్టి నాప్యాంటుమీద పడింది. ఆమె కనుల్లో అనాథ బాలల దీనత్వం గోచరించింది.

ఆమె నాకనుచూపు చూడడం ఇది రెండోసారి. నా మనసు చిచ్చుబుడ్డిలా ఎగిసిపోతూంది.

'వినండి వినండి. అని చేయిచాచి బుర్రకథవాళ్లలా అందరినీ పిలవాలనుకుంటాను. ఆ తదుపరి వినేవాళ్లు విన్నారు, అనేవాళ్లు అన్నారు, ఏమని? దేవి రెండోసారి ఈ పురుషుని ముఖం చూసిందని అంతేకాదు చిరునవ్వు నవ్విందని అంతేకాదు ఆ పురుషునిముందు స్వర్గద్వారాలు తెరుచుకున్నాయని, ఇంకా ఏమయిందయా అంటే ఆకాశవాణి పలికింది.... ఆకాశవాణి.

నాచేయి మాటి మాటికి హారమున్న జేబులోకి పోతూంది. నేను ఏ ఆకాశాల్లో విహరించానో తెలియదు. వనిత నాచేయి పట్టిలాగింది.

"కాస్తమల్లి గుడిదాకా వెళ్దాంపా. రత్తమ్మ వెళ్ళాలంటూంది.

బావుందనుకున్నాను. ఇదీ మంచికే మేమిద్దరం ఒకేసారి సాధువులను వరాలు కోర్దాం. ఈ రోజు ఎలాంటిది? పవిత్ర హృదయాలనడుమ నడయాడే రావణున్ని తగలపెట్టేది.

గుళ్ళో మళ్ళీ ఆపేబేరాలు.

మెట్లమీదఉన్న సాధువులు తమకు తగిలిన గాయాల ప్రదర్శనం ఏర్పాటు చేసి అణా వసూలుచేశారు.

‘ఇక్కడ నుంచొని దేవికి నమస్కరించండి.’ అని చెప్పి మరో సాధువు మంకో అణా వసూలు చేశాడు.

‘ఇది విష్ణుస్థానం ఇక్కడ్నుంచే అతడు వరాలు కురిపిస్తాడు.’

వనిత, రాజా గబగబా నాలుగేసి అణాలు మట్టిముంతలో వేశారు రత్తమ్మ వెనక నుంచుంది కాని నేను ముందడుగు వేశాను. మా ఇద్దరికీ చెరి పావలా పుణ్యం కొన్నాను.

మరోసాధువు మాకు బాట చూపడానికి వచ్చాడు. “ఇదిగో ఇలారండి, ఇదిగో శివుడు. మీ ఇష్టంవచ్చిన పాపాలు శమింప చేసుకోండి. ఇష్టంవచ్చిన వరాలు కోరుకోండి.” అతని ఉదార హృదయాన్ని చూస్తుంటే రైతులకు ఉచితంగా భూములు పంచిపెడ్తావని ప్రకటించే ఆచార్య వినోబాభావే గుర్తుకు వస్తున్నారు.

ఎదుట విలయతాండవం చేస్తున్న శివస్వామి పటంఉంది. శివుడు శవాలమీద నృత్యం చేస్తున్నాడు. శివుడు ప్రళయదేవత ప్రళయం తరవాత అతడే ఉంటాడు. మరేమీ మిగలదు.

దిగువన ఒక సాధువు కళ్లుమూసుకున్నాడు. ఏదో జపిస్తున్నాడు, అనేక సాంబ్రాణి పాత్రల్లోంచి సుగంధ ధూమం చుట్టుకుంటూంది. ప్రాణాలు కూడా ఆవిరిగా మారిపోతున్నట్లుంది. శరీరం సెగలు పొగలయి ఆత్మనుంచి విడి పోతూంది. నిరాకారుడైన భగవచ్ఛక్తి సర్వత్రా వ్యాపిస్తున్నట్లుంది. మాకు నిద్రలో ఉన్నట్లుంది. ఏదో కలగంటున్నట్లుంది.

ఇక్కడి ఫీజు రూపాయి. వనిత రాజు ముందడుగు వేయడానికి జంకారు కాని రత్తమ్మ సాధువుల మాట పూర్తిగా వినకుండానే ముందడుగు వేసింది. పెళ్లికాని తల్లితన బిడ్డను పారేసినట్లు, ముత్తమ్మ అదే రూపాయని అక్కడ పడేసింది.

“నన్ను క్షమించండి. నేను దొంగతనం చేశాను.... దొంగ........” రత్తమ్మ గుసుస్తూంది.

నాకు తొలిసారి రత్తమ్మమీద కోపం వచ్చింది. ఆమెను పక్కకులాగి నేనే ఈ బాహాయి ఇచ్చానని అందామనిపించింది. కాని నాకన్నాముందే ఒక పొడుగుపాటి సాధు ముందడుగువేశాడు. అతడు రత్తమ్మను తీక్షణంగా చూశాడు మెడపట్టి దగ్గరికి లాక్కున్నాడు. "నువ్వు మహాపాపం చేశావు. పాప పరిహారం కోసం వచ్చావు" అన్నాడు. అతని చూపులు రత్తమ్మ శరీరాన్ని చీల్చి ఆత్మకోసం అన్వేషిస్తున్నట్లున్నాడు.

'అయితే ఇటురా మోక్షం ఇక్కడ లభించదు.'

రత్తమ్మ భయంతో గడగడలాడుతూంది. సాధు భయంకరంగా కనిపించాడు అతన్ని చూస్తూ ఉండిపోయింది. ఇంతలో చుట్టుతక్కలవాళ్లు కనిపించారు వాళ్లను చూచింది.

అప్పుడు రత్తమ్మ కళ్ళలో చంద్రికవం వెలుతూ కనిపించింది.

సాధు, రత్తమ్మను గుడివెనుక అంధకారం వ్యాపించిన అరణ్యంలోకి తీసికెళ్ళాడు.

మా చుట్టూ జనం ఉన్నారు. గుడిగంటలు మోగుతున్నాయి. బలి ఇస్తున్న మేకల, కోళ్ల అరుపులు మిన్ను ముట్టున్నాయి వరాలు కోరుకునేవాళ్ల వరుస వేచి ఉంది కళ్లు మూసుకొని కూర్చున్న సాధువు అమాంతంగా కళ్లుతెరచి ఆడవాళ్ళను చూస్తున్నాడు, ఒకర్తెను చూస్తున్నాడు, తన దగ్గరికి పిలుస్తున్నాడు.

మరో పడుచు సాధువచ్చాడు. అతడు అందంగా ఉన్నాడు. జాజు రాసుకునే ముందు వంటికి తైల మర్దనం చేసుకున్నట్లున్నాడు. నిగనిగలాడుతున్నాడు. కమండలం అందుకొని ఆడవాళ్ళమీదికి వంగుతున్నాడు. "ముందు మీశరీరాలను శుభ్రపరచుకోండి. కన్నునుంచి కామవను దూరంచేయండి అప్పుడు భగవంతుడు మీ ఆత్మలకు పవిత్రత ప్రసాదిస్తాడు" అంటున్నాడు. సాగిపోతున్నాడు. అలా వెళ్ళేప్పుడు స్త్రీరక్షణ చేయాల్సివస్తూంది. వారి పైటలు దీపాలకు అంటుకోకుండా చూడాల్సివస్తూంది. అలా కొంత ఆలస్యం జరుగుతూంది.

"మా పాపాయిలు భూమికి భారం అయినాయి. అందుకే భగవంతుడు అదృశ్యుడు అయినాడు. మేం పాపులం.... పాపాలు చేశాం"

రత్తమ్మను తీసుకొని సాధువెటువెళ్ళాడు? చీకట్లో చాలదూరంవరకు చూచాను. ఒకే కొట్లో ఇరుక్కిన కైదీల్లా అనుమానాలు నాగుండెలో కూడు కుంటున్నాయి.

దానివెంటా ఎవరైనా వెళ్ళినా బాగుండేది. అనుకుంటూంది. రత్తమ్మ పిన్ని.

హరిఃఓమ్ . . హరిఓమ్ , శాంతిశ్శాంతి" వడుచు సాధువు అనుమాన దృక్కుల్తో చూస్తూ నాదగ్గరికి వచ్చేశాడు. భూమపాత్ర నాముఖం ముందుంచాడు.

అమ్మా మనసులో పాపం చేరనీయకు. ఇదే దేవాలయం" అన్నాడు రత్తమ్మ పిన్నితో.

మేమిద్దరమూ అవమానంతో కుంగిపోయాం ఆ మాదక వాతావరణంలో నా వళ్లు జరజరలాడింది. చేసుకున్న పాపాల పశ్చాత్తాప తృష్ణ వెలికివచ్చింది. నా దేహం మాయం అయింది. పాపాలే కళ్ళకు కనిపిస్తున్నాయి. ఎదుట నిలిచిన సాధువు నన్ను పరిహసిస్తున్నాడు.

గంట గడిచింది. మేము మా హృదయాల్లోని పాపాలను దూరంచేయ డానికి ప్రయత్నిస్తున్నాం.

శివుని పటం ఎదుగుతూంది. నృత్య, తాళ స్థాయి పెరుగుతూంది. కింద శవాల రాసులు పెరుగుతున్నాయి. ప్రళయకాలం వచ్చినట్లుంది. శివుడు విలయాన్ని గురించి ప్రకటిస్తున్నట్లున్నాడు.

దూరం తరిమిన పాపాలు నామీద దాడి సాగించాయి. విపశునాయి చీకటి వైపు సాగిపోతున్నాను. నా వెనుక కొందరు స్త్రీలూ సాగారు. మేం అంధ కారంలోకి అడుగువేయక ముందే బైరాగి కనిపించాడు. రత్తమ్మను ఈడ్చు కొని వస్తున్నాడు.

రత్తమ్మ జుట్టు చెదిరింది. చీర అక్కడక్కడా చిరిగింది. ఆమెదేహం చెమటతో తడిసింది. నేను ఎర్రవారిన ఆమె చెంపను చూచాను. అక్కడ ఆ మచ్చలేదు. చెరిగి పోయింది.

"రాం....రాం" వైరాగి రెండూ చేతులెత్తి కళ్ళు మూసుకొని ఆకాశాన్ని చూస్తూ "ఈదేవి చాల మంకుది. భగవద్దర్శనం అవుతే బెదిరిపోయింది అన్నాడు. అన్నాడు అంతే, గుంపులోకి మాయం అయినాడు.

చేష్టలుడిగిన రత్తమ్మను చేతుల్లో పట్టుకున్నాను. ఈ మందిరంలో అడుగుపెడ్తే భగవంతునికి కోపం వస్తుందని నాకు తెలియలేదు. అప్పుడు ఈ గుళ్ళో అడుగుపెట్టే భాగ్యానికి మళ్ళినోచుకోనని అర్థంకాలేదు.

రత్తమ్మ పిన్ని భయంతో వణకిపోయింది. వనిత, రాజు రత్తమ్మ చీ సవరించారు. ముఖం మీద పడ్డ వెంట్రుకలు తొలగించారు.

'రత్తమ్మ....రత్తమ్మ" అని పిలిచారు.

"ఇహనేను ఇంటికి రాను" రత్తమ్మ మెడ నా బుజం మీద కదులుగూ .పి

"నాకు.... మోక్షం....లభించింది"

మీరు మరిచిపోలేదుగదా అదే ఏరోజు గుర్తుందా? దుష్టత్వపు ప్రతి క అగ్గిపెట్టెరోజు.

# మనసొకచోట......

'హాఫిజ్‌గారు వచ్చారు। వణుకుతున్న బామ్మ తలను వదలకుండా పట్టుకొని చెవిలో మూతిపెట్టి చెప్పింది. జరీనా

హాఫిజ్‌గారు వస్తున్నారనే కబురు విన్న బామ్మ ముగ్గుబుట్టలాంటి తల సవరదీసింది. నల్లమందు డబ్బా చప్పున దిండుకింద దాచేసింది. ఖురాన్ మంచపు పట్టె మీద పెట్టింది. కాంతిహీనములైన కన్నుల్లోంచి కారే కన్నీరు తుడుచుకుంది. ముసుగువేసుకోవడానికి దుప్పటి వెదుకుతూంది.

ఆమె మనుమడు సలీం అతనికి ముసలమ్మ చేష్టలు బొత్తిగా గిట్టవు. డెబ్బైఅయిదేళ్ళ ముసలి దానికి ముసుగేమిటి? హాఫిజ్‌గారు వస్తున్నారనే వార్త విని ముసుగుకు దుప్పటి వెదుకుతుంది. ఎటన్నా వెళ్ళాలంటే టాంగాకు తెరలు కట్టాలి. ఆడది బామ్మలా ఎండిన నారింజపండు అయినా అహంభావం చావదు. హాఫిజ్ గారికి పాపం కళ్ళు కనిపించవు, చెవులు వినిపించవు అయినా బామ్మ పెళ్ళి చూపులకు వచ్చినట్లు ఉలికి పడుతూంది.

అదిరే సలీం పెదవులు చూచి బామ్మ గ్రహించింది. సలీం తనకేదో నీతి బోధిస్తున్నాడని.

"చచ్చినా ఆడదానికి సిగ్గుభారం తప్పదు ఇంతవరకూ పరాయి మగాని కంటపడలేదు. నీ అక్కా చెల్లెళ్ళలా వెంట్రుకలు విరబోసుకుని, నోరువెళ్ళబెట్టుకొని, రొమ్ములు కనబరుస్తూ టిక్కు టిక్కుమని తిరగమంటావా!"

ఇంతకూ ఆ హాఫిజ్ గారు ఎవరయా అంటె బామ్మ శత్రువర్గంలోని వారు బామ్మ కుటుంబానికీ, ఉప్పు నీటి బావి దారికీ కలకాలంగా కార్పణ్యం రగులుతూంది. తగాదా వచ్చింది ఎప్పుడయా అంటే తాతలకాలం నాడు హాఫిజ్‌జీ తాతకూ బామ్మతాతకూ భూముల విషయంలో తగాదా వచ్చింది. ఆది అంతటితో

ఆగలేదు, అగ్గిరగులు సాగింది. 'బామ్మతాత హాఫిజ్‌గారి పెద్దల్లో ఎవరితోనో నడి వీధిలో అన్నారట! 'ఇవ్వాళ్లనుంచి మాకూ ఉప్పునీటి బావి వారికీ బంధు-త్వాలు తెగిపోయాయి ఇహ నుంచి మా సంతానంలో ఎవరైనా మీ గడప-తొక్కితే మహాపాపం చేసినట్లే''

ఆ అన్నపెద్దలు ఎలాంటి వారయా అంటే యునానీ దేవతల్లా ప్రకృతి రహస్యాలన్నీ గుప్పెట్లో పెట్టుకున్న వారు. అందుకే వారిమాట వేదం అయింది. ఎవరూ అతిక్రమించలేదు. వచ్చిన వాళ్లు వచ్చారు కాని పిల్లలను ఇచ్చి పుచ్చు-కోవడం మాత్రం చేయలేదు. ఎదురు బదురు ఇండ్లు—మూతికట్టుకొని ఎలా-కూచుంటారు. పిల్లలు కలిసి ఆడుకొనేవారు. యువతీ యువకులు ప్రేమలో ఒకరిని మించాలని ఒకరుచూచేవారు ముసలి వాళ్లుకూడా వంటరిగా కలుసుకునే వాళ్ల కాని నలుగురిలో పడితే ఒకరిమీద ఒకరు సవరించడానికి చూచేవారు.

హాఫిజ్‌గారికి ఎనభయ్యోపడి ఆ కాలపు తిండి కాబట్టి ఈ వయస్సు-లోనూ కర్రపట్టుకొని వీధిదాటగలరు. ఆరిపోనున్న కళ్ళతో పెరిగిన పిల్లగాజుల సులోచనాల్లోంచి మనుషుల ముఖాల్ను గుర్తించ యత్నించేవారు. కాళ్లుచేతులు-వణుకు. భూమి దగ్గరకు పిలుస్తున్నట్లు వంగిపోయారు. పైగా దమ్మరోగం క్షణం విరామంలేదు. యముణ్ణిమోసగించి బ్రతుకుతున్నారు.

అసలు విషయం ఏమంటే బామ్మవారిని పిలువనంపింది. పిలిపించిన-కారణం విని హాఫిజ్‌గారి చల్లారిన రక్తం సెగలు పొగలు లేచింది. ఆవేశంతో ఊగి పోయారు కదలడం చాతకాకున్న కదిలారు. ఒక చేయికర్రని బుజం—మీద వేశారు. మరో చేత్తో కర్రపట్టుకున్నారు. కదిలారు బామ్మను చూడ్డానికి వారి కర్రచప్పుడు విన్నది. అమ్మ చిన్నకోడలు ఉరికివచ్చింది. చేయి పట్టుకొని దోవ చూపింతామని హాఫిజ్‌గారు విదిలించారు 'ఇదేం నాకు కొత్తచోటా? ఈ ముంగిలి లోనే బిల్లంగోడు ఆడాం॥ అన్నాడు.

హాఫిజ్‌గారి మాట విని అంతా గొల్లున నవ్వారు. ఏమిటీ—వీరు ఆట-లాడారా? ఏమో? ఎవరికీ నమ్మకం కలుగలేదు.

"చావున్నావా?" వారికి పుష్టైడు చెవుడు. చెవిటివానికి చెప్పినట్లు అరిచే వాడు. బామ్మకు చెవుడే! ఆమెకు వినిపించినట్లుంది. జవాబు ఇవ్వడానికి నారి సారించింది.

"బాగుంది ఎవర్ని ఉద్ధరించడానికి. కాటికి కాళ్లుచాచు కూర్చున్నా. ఆ గడియ రావడంలేదు. అంతే" పణికే తలను దిండుకావిచ్చింది. ఆలోచనలో పడిపోయింది. దేన్ని గురించి ముందు వివరించాలి - దగ్గును గురించి చెప్పాలా? గుండె దడను గురించి చెప్పాలా? కాళ్లకు వచ్చిన నంజును గురించి చెప్పాలా? కీళ్ళనొప్పులను గురించి చెప్పాలా?

అందరూ కలిసి హాఫిజ్ గారిని మంచం మీద పడేశారు, దాంతోవారు ఉక్కిరి బిక్కిరి అయినారు, కాస్త సర్దుకొని నిట్టూర్పు విడుస్తూ అన్నారు. 'బాగా చెప్పావు మనదేముంది కొనకు ఒచ్చాం, చేసుకున్న పుణ్యం చెట్టంతయి రక్షించింది. ఏం వెంట తీసికెళతాం - మంచీ చెడు రెండే'

ఇంతలో ఒక నౌకరు హుక్కా తెచ్చిపెట్టాడు, గొట్టం హాఫిజ్‌గారి చేతికి అందించాడు.

బామ్మ వారి పూర్తివాక్యం వినలేదు, ఏదో పోగాలాన్ని గురించి ఆమె చెవిని పడింది.

'కాకుంటె ఏమిటి - కలికాలం దాపురించింది, ఈ పాపాలు చూస్తున్నా ప్రాణం పోదుగదా!

ఆమె నల్లమందు డబ్బాకోసం వెదుకుతూంది, అప్పుడే ఆవలింతలు వస్తున్నాయి.

'అంతా వానిలీల!' హాఫిజ్ జీ హుక్కా పొగ గుప్పుగుప్పున వదులుతూ వేలుపైకి చూపించి 'కాలం కాగిపోతూంది. చూస్తుండు ప్రళయం వస్తుంది' అని చప్పున నోరుమూసుకొన్నారు. ప్రళయం వచ్చి పడ్తుందేమో అన్నట్లు,

"ఇదేం ప్రళయం కంటే తక్కువా" బామ్మ ముక్కుమీద వేలేసుకొని హవ్వ! ఆడపిల్లలు మొగుణ్ణి కోరుకుంటున్నారు! అన్నది.

హఫీజ్‌గారు ఉలిక్కిపడ్డారు. చేతినుంచి హుక్కాగొట్టం జారిపడింది, ప్రళయపు కొలిరాయి తన మీదనే పడినట్లు జంకారు. ఇంకా ఆ దెబ్బకు కోలుకోకముందే బామ్మ రాళ్లు విసరడం సాగించింది.

“ఏడ పోయిందా పౌరుషం.. మాటకు పొడుస్తాం చీరుస్తాం అని ఉరికారే! పడుచు పిల్లలు లేచిపోతున్నారు!! ఆ దేవుడు దయదలచడు ఇవన్నీ చూడ్డానికి ఇంకా నూకలుంచాడు నేలమీద”

హఫీజ్‌గారు దిగులుతో తల్లడిల్లారు. మాట పెగలడంలేదు. నిస్సహాయంగా చేతులుమాత్రం ఆడిస్తున్నారు.

బామ్మకు వాస్తవంగానే బతుకంటే విసుగు పుట్టింది. జగన్నాటకం సాంతం చూచింది. భర్తమీద పెత్తనం చలాయించింది. అత్తతో తన్నులు తిన్నది ఒక పడుచు కొడుక్కి పాడె కట్టింది. ఇద్దరి కొడుకులకు బాసింగాలు కట్టింది. వాళ్ళ కొడుకులనూ తన చేతులతో పెళ్లికొడుకులను చేసింది. ముగ్గురు అల్లుళ్ళకు స్వాగతం పలికింది. ముప్పై ఏళ్లయింది ముంజేతి గాజులు చిట్లి పోయాయి. జీవితపు హాలాహలం కూడా గ్రుక్కల కొద్ది మింగాల్సి వచ్చింది. ఇహ ఇప్పుడు వీధివాళ్లందరితోనూ “బామ్మ” అనిపించుకుంటూంది. ముసలి ముఖపు ముడుతలుచూచి దారే పోయేవాడు నిలిచిపోతాడు. నమస్కరిస్తాడు. వినమ్రుడై బామ్మ దీవెనలకోసం వేచి ఉంటాడు బామ్మ మనస్ఫూర్తిగా దీవిస్తే కోరిన కోరిక తీరుతుందంటారు లోకులు.

వెండి తీగల్లాంటి వెంట్రుకల్లో దాగిన ముఖపు ముడుతల్లో అనుభవాల అంబరాలు కనిపిస్తాయి. ఆమె ముఖంలో అస్తమిస్తున్న సూర్యుని అందాలు కనిపిస్తాయి. ఇవాళ్టికి ఆమె ఇంటివాళ్లకు సలసల కాగే పాలలా పరిణమించింది. మింగాలేరు కక్కాలేరు. ఆమె వాగుడుకు అంతా విసిగిపోయారు. మాట్లాడితే మాకాలంలోనైతేనా? అంటుంది. ప్రతిదానికీ తప్పుపడుతుంది. మనవలు మనవరాళ్ళది కల్తీరక్తం అనుకుందాం- స్వంతకొడుకులూ-కూతుళ్ళకే

ఆమె అంటే గిట్టేదికాదు దేవుని దగ్గర ఈమె ఆయుర్దాయానికి సంబంధించిన లెక్కపత్రాలు ఎలుకలు ఈడ్చుకు పోయినట్లున్నాయి! అందుకే ఇంకా బతుకుతూంది.

ఇది నూరేండ్లు—ఏడు తరాలనుంచి ఉప్పునీటి బావి వాళ్ళతో సంబంధాలు తెగిపోయాయా? ఇవ్వాళ బామ్మ మనుమడు సలీం పెళ్ళాడ్తే హాఫిజ్‌గారి మనుమరాలు 'గజాలానే, పెళ్ళాడ్తానని కూర్చున్నాడు. ఉభయుల తల్లిదండ్రులూ సంబంధం చేయడానికి సంబరంగా ఒప్పుకుంటున్నారు.

ఈ విషయం బామ్మకు తెలిసింది. ఇక తలబాదుకుంది. కేకలుపెట్టి ఇల్లంతా ఒక్కటి చేసింది. తనను ముందు గోరీలోపడేసి రమ్మని కొడుకుని పట్టుకొని ఏడ్చింది. అప్పుడు ఉప్పునీటి నూతి వాళ్ళపిల్లను కోడలుగా తెచ్చు-కొమ్మంది.

బామ్మ కొడుకు ఈ మధ్యనే ప్రొఫెసర్‌గా రిటైర్ అయి ఇంట్లో కూర్చున్నాడు. రిటైర్ అయింతరువాత కుటుంబాన్ని చక్కదిద్దాలనీ, పాత ఆచారాల్ని పట్టుకొని వేళ్ళాడాలనీ బుద్ధులు పుడుతాయి. కాని వీస్తున్న గాలికి అడ్డు-కట్టలు కట్టలేం. ఈ విషయం డెబ్బయి ఐదేళ్ళ బామ్మకు అర్థంకాక పోవచ్చు కాని రిటైరైన ప్రొఫెసర్ అర్థంచేసుకోగలడు కదా।

బామ్మ నిరాశ చెందింది. హాఫిజ్‌గారిని పిలిచింది. ఆమె వీధికంతటికీ బామ్మ అతను కుటుంబంలో పవిత్ర విగ్రహంలాంటివారు. కొడుకులు, కూతుళ్లు, మనుమలు, మనుమరాండ్రు, మునిమనుమలు అంతాకలిసి వారిసంతతి వందదాకా ఉంటుంది. వాళ్ళకే వీరంటేగిట్టదు. తమ పూర్వులు ఎవరో ఒంటెల మీద కుంకుమపూవుతెచ్చి వ్యాపారం చేశారట. వాళ్ళసంతతిగా చెప్పుకుంటారు వీళ్లు. ఏది చెప్పినా వినాల్సిందే. ఎవడు చూచాడు వాళ్ళరాక, వంశగౌరవం కాపాడుకోవాలని హాఫీజ్‌గారి ఆరాటం. హాఫీజ్‌గారి ఆజ్ఞాబలం ఉంటే "గజాలాను" పూడ్చిపెట్టేవారు. అయితే గజాలా తన తండ్రిమాటే లెక్క చేయదు.

"అదేం చిన్నపిల్లా? మెడిసన్ చదివింది. తన మంచిచెడు ఆలోచించుకో గలదు" అంటాడు హాఫీజ్‌గారి అల్లుడు – గజాల తండ్రి. అల్లుని మాటవిని హాఫీజ్‌జీ తల తిరిగిపోయింది. ఏమిటీ ఆడపిల్లలకూ మెదడుంటుందా? వారూ మంచీ-చెడూ ఆలోచించగలరా? అప్పుడు కర్ర అందుకొని బామ్మదగ్గరికి బయల్దేరారు.

అందరూ ఒకే పడవలో ఉన్నారు. భయం దేనికి? అయినా బామ్మ ముళ్ళ పొదలా మీదపడింది. ఒకటే దగ్గు అటుపై విషం కక్కే బామ్మమాటలు. జవాబుకోసం పదాల అన్వేషణ. పడిగాలికి రెపరెపలాడే పతాకంలా ఉంది. హాఫీజ్‌గారి స్థితి.

"నీ ఎత్తులన్నీ నాకుతెలుసు. అదే భూముల పగతీర్చుకోవాలనుకుం టున్నావు - కాని జ్ఞాపకం పెట్టుకో - నువ్వు కాటికి కాళ్లుచాచే"

బామ్మవాక్యం పూర్తికానివ్వలేదు. అడ్డుకుంది. సాగించింది.

"అరే వచ్చావయ్యా మొనగాడు గోరీగుడ్డ తెచ్చేవాడు. బుద్ధిచెప్పుకో మనుమరాలుకు నీముఖాన్నే మసిపూస్తూంది ఏంలాభం గడ్డం తెల్లపడి?

ఇదిగో .... నా .... నా .... నా మనుమరాలిని ఏమన్నా అంటే ...." అటువెనుక మాట పెగల్లేదు. సంజ్ఞతో వాక్యం పూర్తిచేశారు. వాదన మరి సాగ లేదు. పూర్తిచేశారు. హాఫీజ్‌గారికి బామ్మలాంటి ఏకీళ్ళతో తలపడ్డం తటస్థ పడలేదు.

"వచ్చాడయ్యా పెద్ద మొనగాడు - అందరికీ తెలుసు నీ మనుమరాలు వేషాలు. పెంచండి పాపాలు పదుచుదనం పొడుచుకొచ్చిందయ్యా మ్మిండణ్ణి ఎన్ను కోవడానికి" ఊపిరి సలుపకున్నా గబగబా అనేసింది.

"అయితే నీ .... నీ ........" హాఫీజ్‌జీ కోపంతో వణికిపోయారు. చేయెత్తి ఏదో అందామనుకున్నాడు, ఇంతలో హుక్కా నేలపడి ముక్కలయింది.

"వాల్చాలు చెప్పావు. నా తప్పులు ఎన్నుతావా! శీలంకోసం ప్రాణాలిచ్చే దాన్ని"

ఆడదానితో వాదించి ఎవడునెగ్గాడు – హాఫిజ్ జీ నెగ్గడానికి! హాఫీజుగారి నరాల్లో రక్తం సలసలకాగింది. ఆ నోటిదురుసు ముసల్దానికి బుద్ధిచెప్పాలనిపించింది. చాతనైతే చేతికర్రతో వాదాలనిపించింది. ఆడదాని నోటికి ఎదుర్కోడానికి మగాడు ఉపయోగించే ఒకేఒక ఆయుధం అతని బలం – బలప్రయోగం కాని హాఫీజుగారిస్థితి ఎలాఉంది? కాలు చేయీ కదల్చలేని అశక్తి. అడుగు వేయాలంటే ఆసరకావాలి. నోటికి బలంలేదు. కళ్లు వెలవెల పోతున్నాయి. పురుషునికి అంతకంటే అవమానకరం అయిన శిక్ష మరోటి ఉండదు.

ఈ గొడవ విన్నారు. ఇంటివాళ్లంతా పనులు వదులుకొని ఉరికివచ్చారు. ఆ మాటా, ఈ మాటా చెప్పి ఇద్దరినీ శాంత పరిచారు.

"ఏమిటిది పిల్లల్లా పోట్లాడుకొనే వయసామీది?"

"హాఫిజజీ మా తాతగారితో సమానం" బామ్మ మనవరాలు జరీనాఅన్నది

"అనండి అనండి. ఇంకా అనండి. నీకే చాతనయితే నన్ను బతికి ఉండగానే పూడ్చివచ్చేదానివి" బామ్మ కోపం తారాస్థాయి నందుకుంది.

'ఈకాలపు పోరల....హుఁ....మా కాలంలో...." హాఫీజ్ జీ వెక్కిరిస్తూ అని ఆకాశం చూడసాగారు.

'కాకుంటే మా కాలంతో నయితే....' బామ్మ కోపంగా హాఫిజుజీని చూచింది. ఎవరో వెనక్కి నెట్టినట్లు పడిపోయింది. అలా పడడం దుఃఖతప్త బాష్పగాథల్లోకి పడిపోయింది. స్మృతిలో గతంమీద పడిపోయిన తెరతొలగింది. ఎదుట అంగణంలో మామిడి చెట్టు కనిపించింది. అది ఆమె నాటినమొక్క. ఈనాడు శాఖోపశాఖలయి ముంగిలి సొంతం ఆక్రమించింది.

ఈ మొక్కను బామ్మ నాన్న తెచ్చారు. మొక్కను చూచి పిల్లలంతా గుమిగూడారు. దాంతో ఆడుకుంటామన్నారు. తమకు ఇచ్చెయ్యమన్నారు.

అది మంచిజాతి మామిడి మొక్క. అందుకే నాన్న అందరినీ అదిలించారు. బొమ్మకు ఇచ్చాడు. బొమ్మ అప్పటికి పసిపిల్ల. బొమ్మ గునపం తీసుకొని తవ్వుతుంటే హాఫిజుగారు వచ్చి పక్కన కూర్చున్నారు. బొమ్మ హాఫిజును రజాభయ్యా అని పిలిచేది. ఆమెకు ప్రాయంలో ఉన్న రజాఅగుపడ్డాడు. తనచేయి పట్టుకొని లాక్కొని పోతున్నాడు. బావుల్లో ముంచుతున్నాడు. అయినా ఆ విషయం తల్లికి ఎన్నడూ చెప్పలేదు. ఆమెకు భయం. అప్పుడు ఆమె వయసెంతో గుర్తులేదుకాని చేలల్లో పిల్లలతో ఉరకడం మానేసి నెమ్మది నడక సాగించింది. అయినా ఆ తపగలంతా ఆమె దగ్గరే ఉంచుకునేది. కుట్టు నేర్పే నెపంతో తనపిల్లల బట్టలు కుట్టించుకునేది. కుట్టు తప్పు పడితే సూది గుచ్చేది. అయినా నవ్వుతుండేది.

రజా బొమ్మదగ్గర్నుంచి గునపం లాక్కోపోయాడు. ఆమె విదిలించింది రజాకు ఆశ్చర్యం కలిగింది. అతను బాధగా బొమ్మను చూచాడు. ఒక బొష్ప బిందువు ముక్కుమీద జారి, ముక్కెరలో ముత్యంలా మెరిసింది. రజా మన సుకు బానిసఅయ్యే వయసులో ఉన్నాడు. మెదడు మాట మనసు విననిప్రాయం అది.

ఉప్పునీటిబావి వాళ్ళతో సంబందం కుదరదు. ఈ విషయం ఆమెకు బాగా తెలుసు. అయినా రజాతో చింతకాయలు తెప్పించుకునేది. తల్లి ఎంత వని ఓరుస్తుంది? రజాతో గట్టిగా చెప్పేసింది. "పిల్ల పెద్దదిఅవుతూంది కలవడానికి రావద్దని'

రజా ఆమాట విన్నాడు. కాళ్లు వేళ్ళాడ బడ్డాయి. కాళ్లు విరిగినట్లు బల్లమీదినుంచి లేవలేకపోయాడు. ఇహ అక్కడ అతనికి మిగిలిందేమిటి? నాలుగు చేతులు కలిపి మామిడిమొక్క నాటిన్నాడు. కన్నీటితో మొక్కను తడుపుతూ "కావాలనుకుంటే జీవితాంతం నీతో గడపాలనిఉంది" అన్నాడు. తరవాత చేతుల మట్టి దులుపుకుంటూ వెళ్లిపోయేప్పుడు 'ఆలోచించుకో'అన్నాడు

'అయితే వెళ్లకు' అనేపదాలు ఆమె గుండె లోతుల్ని పెకలించుకొని

బయట పడ్డాయి కాని పెదవిని కదిలించలేక పోయాయి. తరవాత ఆమె ఆలో చించనేలేదు, అదిపిల్లలకు ఆలోచన ఏమిటి?

ఒకనాడు వీధిలో బాజాలు మోగాయి. వీధివాళ్ళంతా బొమ్మపెళ్లి ఊరే గింపు చూడకూడారు. రజ్జు కూడా వీధిలోకి వచ్చాడు మతాబుల వెలుగు చూడ్డానికి. ఒకడు చిచ్చుబుడ్డికి నిప్పంటించాడు. చిచ్చుబుడ్డి కిలకిల నవ్వుతూ ఆకాశానికి ఎగిసింది. నవ్వుల దివ్వెలు నలువైపులా వెలిగాయి. ఇంతలో ఊడిపడ్డ నక్షత్రాల్లా నలువైపులా గాఢాంధకారం అలముకుంది. నలువైపులా చీకట్లు నడయాడాయి. అతడు అడుగు ముందుకు వేశాడు. కాలిపోయిన చిచ్చు బుడ్డిని అందుకోవాలనుకున్నాడు. చేతికి చురుక్కుమని తాకింది. వేలుపట్టుకొని చాలసేపు ఉస్సురుమంటూ ఉండిపోయాడు.

ఆరోజు బొమ్మ ఆలోచనలకు అంతులేదు. కన్నీరు కాలువలు కట్టింది. అప్పగింతలప్పుడు తల్లిని పట్టుకొని భోరున ఏడ్చేసింది 'అమ్మా నేను నిజంగా మామిడి చెట్టును వదిలి పోతున్నానా?' అంటూ ఏడ్చింది.

నాటినుంచి రజ్జు అమ్మాయిల జోలికి పోవడం మానేశాడు. అమ్మాయి లను చూస్తే అగ్నికణాలు గుర్తుకువచ్చేవి పసి పిల్లలకు పరిచయంలేని ముఖం కనిపిస్తే భయపడ్డట్టు ఆడ పిల్లల్ని చూస్తే అతనికి బుగులుగా ఉండేది.

అనంతరం అతడు ఖురాన్ను హాఫజు - కంఠోపాఠం - చేయడంవల్ల హాఫిజు అనే బిరుదం పొందాడు. తరవాత 'గులిస్తాన్' బోస్తాన్, చదివారు. అతనికి చదువు చెప్పే మౌలానా తాహరలీ అతని జ్ఞాపకశక్తిని అతిగా మెచ్చు కునేవారు. హాఫిజు పాఠంగాని, మాటగాని మరిచిపోడు అనేవాడు గురువు.

"మరిచిపోలేనా? అనుకుంటే అనేకం మరచి పోగలను." అని బెదిరి నట్లు గురువుగారి ముఖం చూస్తూ ఉండిపోయేవారు హాపిజుగారు.

తరవాత వీధిపెద్దఅయి అనేకుల అదృష్టాలను నిముషాల్లో తేల్చేశాడు— తగాదాల్లో తీర్పులు ఇచ్చి.

ఒక శుభవేళ వీధిలో సన్నాయి మోగింది. వీధిలో అడావుడి కనిపిం చింది. వారు దాసింగం సవరించుకుంటూ గుర్రం ఎక్కారు. ఒకడు చిచ్చుబుడ్డి అంటించాడు. హాఫిజు గారి వేలు చురుక్కుమంది. ఆ నిప్పు బట్టల్లో పడింది. అంటుకుంది. వారు గుర్రంమీంచి పడిపోయారు. ఉక్కిరి బిక్కిరి అయినారు. కాని కొండపల్లి బొమ్మలాంటి వధువు ఆప్యాయతతో మంటలు ఆరిపోయాయి. జీవితంలో ఆనందం ప్రవేశించింది – హాయిగా గడిచిపోతూంది

వేసవి పగలు కొడుకులు కూతుళ్ళతో మామిడి పళ్ళు తినడానికి కూర్చునే వారు. బామ్మనుంచి వచ్చిన మామిడి పళ్ళు హాపిజుగారి పళ్ళు పులపించేవి. పులుపు దనం నరనరాల్లో వ్యాపించేది. ఆ చెట్టుపళ్ళు ఇంత పులుపుదేలాయి!

బామ్మ ఏండ్లకు పుట్టింటికి వచ్చేది

'అమ్మా ఏలలు వస్తాయా! చాల ఏలల్లో ఈ మామిడి చెట్టుకనిపిస్తుంది. నేను కనిపిస్తాను నేనే మామిడి చెట్టుకు నిప్పంటిస్తున్నట్లు కలగంటాను.'

కలల వృత్తాంతం విని అంతా దిగ్గునలేచి కూర్చుంటారు' నువ్వేగదనే ఈ చెట్టును పసిపిల్లను సాకినట్టు సాకావు' అంటుంది అమ్మ.

"ఆరోజంతా గుండె దడదడలాడుతుంది పిల్లలమీద కోపం తీర్చుకుం టాను. వాళ్ళతో పోట్లాడుతాను. అయినా వాళ్లు మాట్లాడరు. పాపం చూస్తూ ఉండిపోతారు.

భర్త పోయింతరవాత ఈ ఇంటికే వచ్చేసింది అప్పుడు అమాంతంగా తన పెత్తనం గుర్తుకువచ్చింది. ఉప్పు నీటి నూతివాళ్ళ పాతపైరాన్ని గురించి పిల్లల బుర్రలకు ఎక్కించింది. వాళ్ళవల్లనే తనకు జీవితంలో అనేక ఇక్కట్లు వచ్చాయని నూరి పోసింది.

ఇటు రజ్జా హాఫిజు అయినాడు వీధిపెద్ద అయినాడు. తాత అయినాడు. అన్ని దశలుదాటి వీధి వాళ్ళకు హాఫీజు అయ్యాడు. పిల్లలకు ఖురాన్ చదివించే వారు. ఎవరో ఒకతల్లివచ్చి దీవనలు కోరేది. వారి ఆయువుకూడా ఆనందంగా కొనసాగుతూంది. మంచంమీద కూర్చొని, జపమాల తిప్పుతూ సర్వజగత్తునూ

చూపిస్తారు. ప్రార్థన సార్థకం కావాలంటే మనఃపూర్తి కావాలి. ఎందుకో తెలియదు కాని వారెన్నడూ మనఃపూర్తిగా ప్రార్థించినట్లులేదు. నమాజు చేసేప్పుడు పరధ్యానం, నమస్కరించేప్పుడో అన్యమనస్కత వార్థక్యంలోనూ వదల్లేదు రాత్రులంటు రాత్రులు జాగారంచేసి ప్రాయశ్చిత్తం చేసుకుంటారు. గంటలతరబడి సాష్టాంగపడి ముక్కు నేలకు రాస్తారు. జీవితంలోని సుఖాలన్నీ అనుభవించారు. అయినా ఏమిటీ మనస్తాపం! జీవితాంతం ఒకదోసెడు చల్లనినీళ్ళకోసం నిరీక్షించినట్లు తల్లడిల్లిపోతారు జపమాల నేలకొరిగిస్తారు.

"ముసలివాళ్ళను చాలమందిని చూచాను కాని మామగారివలె ముక్కు మీద కోపం ఉండేవాళ్ళను మాత్రం చూడలేదు" పెద్దకోడలు ఆజీజా అంటుంది

"ఊరుకో - పెద్దమనిషి - ఏమిటిది?" కొడుకు వారిస్తాడు.

ఇంతలో గజాలా పెద్దగా నవ్వేస్తుంది. ఆ నవ్వువిని వారినరాల్లో చిచ్చు రగుల్తుంతి. "మేమూ ఒకప్పుడు పడుచు వాళ్ళమే - కాని మీవలె తుక్కుల్లా తిరగలేదు. మనుష్యుల్లా ప్రవర్తించాం .... ...... ...." మరేదో అనబోయారు కాని మరకు ఇచ్చిన బిస వడిసిపోయింది. దగ్గుతెరవచ్చి సతమతం అయినారు "భగవంతుడు పిల్లలను రక్షించుగాక" అన్నారు సంపూర్ణ విశ్వాసంతో.

అలా ఏదో మత్తులో ఉభయుల మధ్య కొన్ని గంటలు జారిపోయాయి. వారి మనో నేత్రాల్లో మరెన్ని దృశ్యాలు కనిపించాయో!

"అయితే వెళ్ళనా .... ...." అమాంతంగా అన్నాడు - ఏదో స్వప్న జగత్తునుంచి బయట పడినట్లు.

"ఎక్కడికి వెళ్లతావు కూర్చో .... .... .... " అనడం అన్నది కాని బామ్మ గుర్తొచ్చింది. అది ఈ నాడు అనాల్సిన మాట కాదని.

"ఏమిటి నేనన్నది. .... .... .... ?" చెయ్యి నొసట పెట్టుకొని ఆలోచించసాగింది. ఆలోచనా తరంగాలు వచ్చి వచ్చి మామిడిచెట్టును తాకి ఆగిపోయాయి .... .

"ఇంకా అనేదేమున్నది. .... ।" హాఫీజుజీ వడకే చేతుల్తో కర్ర అందుకొని లేవబోయారు.

ఇప్పుడు నువ్వూ, నేనూ అంటే వినేదెవడు ....'' అంటూ చప్పున ఆగిపోయింది - నొప్పితో తల్లడిల్లేవానికి మందుగుర్తుకు వచ్చినట్లు.

"నేననేదేమంటే చేసెయ్యండి ఆపెఘవలపెళ్ళి - కనీసం అర్థంలేని ప్రార్థనలు చేయరు - మనసయినా నిర్మలంగా ఉంటుంది"

హఫిజ్ అన్నారు.

# దొంగ సొమ్ము

కొంతకాలం గుసగుసలు - ఇరుగు పొరుగుల గుట్టు గుండెలో దాచుకోలేక గుబగుబలాడ్తాయి.

పొరుగున కొత్తవారు వస్తే కొత్తవార్తలు, వృత్తాంతాలూ వెంటతెస్తారు. ఏడు తరాలవారి కథలు బయటపడతాయి. ఆడవాళ్ల ఆరాటం చెప్పలేం - రాత్రిళ్ల నిద్దర్లుండవు - పిల్లలు నిముషానికి ఒక వార్త తెస్తుంటారు.

"ఛాయ మార్కెట్టునుంచి కొబ్బరిబోండాలు తెచ్చింది"

"ఛాయ మిద్దెమీద బట్టలు ఆరేస్తుంది"

"ఛాయ వెండిచెంబులు నరసమ్మకు అమ్ముతూంది"

కొత్త పొరుగుల ప్రతి కదలికలో రహస్యాలు దాగి ఉంటాయి. వాళ్ళ ప్రతిమాటలో అనేక అర్థాలు కనిపిస్తాయి. వారి ప్రతి ప్రవర్తనా వీధిసాంతాన్ని కదలిస్తుంది.

కాని ఛాయ, ఆమె తల్లి అతిగుట్టుగా ఉంటున్నారు. వారి విషయాలేమీ బయటికి రావడంలేదు.

ఛాయ తండ్రి అమాంతంగా చనిపోతే సంసారం నెత్తిన వేసుకొని ఇక్కడికి వచ్చారనీ, ఉద్యోగం వెదుక్కుంటామనీ చెప్పుకున్నారు. అయితే ఆమాట ఎవరూ నమ్మలేదు. ఇద్దరు ఆడవాళ్లు - ఒంటరిగా - ఉపాధి వెతుక్కోవడానికి ప్రయత్నించడం మామూలు నేరమా? అంత తేలిగ్గా ఎలా వదిలేయడం!

వీధిలోని మగాళ్లకు ఛాయకు మగదిక్కులేదని తెలిసిపోయింది. వారందరికీ ఆమె మీద అమాంతంగా సానుభూతి పుట్టుకొచ్చింది. దాంతో ఆడవాళ్ళంతా అప్రమత్తులయ్యారు.

నాకు చాలాసార్లు అనిపించింది ఛాయ – పలకరించాలని. తల దువ్వు కుంటుంది. ఆమె వెంట్రుకలు చాలపొడవు. ఆకర్షించే నవ్వు నవ్వుతుంది. నమస్కరించి మాట్లాడాలనుకుంటుంది. అప్పుడు నాకున్న వేలెడుజుట్టు గుర్తుకు వస్తుంది. మాట్లాడలేను అంటే కాదు ఏముంది – వానిదగ్గర? రంగు పచ్చదే కాని అక్షరాలేమీ కిష్ట పదాల్లా ఉంటాయి. ఎప్పుడూ విరిగిపోయిన హార్మో నియం మీద స్వరంలేని రాగం ఆలాపిస్తుంటుంది. ఇంగ్లీషునవల చదువుతుం టుంది – డిక్షనరీ సాయంతో అంత ఓపికగాను చూస్తే నాకు ఎక్కసంత ముఖ్యంగా కాలేజీకి వెళ్ళేప్పుడు ఆమె కాటుక కంటిచూపు నాగుండెలోకి దూసుకు పోతుంది.

ఆ తల్లీ కూతుళ్లతో పరిచయం కలిగించుకోవటం ఏమో గాని పట్టించు కునేవాళ్లుకారు వీధివాళ్లు అంతేకాదు వాళ్ళంటే వీళ్ళకు గిట్టదు – మంట కూడా అందుకు మూడు కారణాలు వారి సంపద - స్వేచ్ఛ – సౌందర్యం.

వాస్తవానికి ఆ తల్లీకూతుర్ల దగ్గర ఆమూడిట్లో ఏదీలేదు. పాపం ఛాయతల్లి రెక్కలు ముక్కలుచేసుకొని అప్పడాలుచేస్తుంది వాటిని మార్కెట్లో అమ్ము తుంది. దాంతోనూ పొట్టనిండకుంటే ఛాయ పొరుగింట్లో ఉంగరం అమ్ముతుంది– కడియాలు కుదువపెడుతుంది.

వీధిలోని ఆడవాళ్ళంతా అనేక తర్జనభర్జనల తరువాత నిర్ణయించిందే మనగా అదంతా దొంగసొమ్మని. ఈ నిర్ణయం అనేకమంది ఆరాటాన్ని తగ్గించింది. అందులో ఏదో మహారహస్యం ఉందని నిరీక్షించినవారికి నిరాశ కలిగింది. వాళ్ళకు ఆనిర్ణయంలో నమ్మకం కలగలేదు. ఎందుకంటారా ఆంతటితో ఆ కథ ముగిసిందిగా! కథ ముగియటం చాలమందికి ఇష్టం ఉండదు. అయినా ఏం చేయగలరు? కొత్తగా వచ్చిన పొరుగులమీద కుక్కల్లా మొరగ్గలరు.

ఆ రోజు ఒక నిర్ణయానికి వచ్చారు – ఛాయ తెచ్చిన వస్తువులు కొనరాదని మా అమ్మ మరో అడుగు ముందుకు వేస్తింది. ఎప్పుడో ఒకప్పుడు పోలీసులు విరుచుకు పడ్తారనీ – దొంగసొమ్ము కొన్న వీధివాళ్ళందరినీ పట్టుకపోతారని!

పనులు ముగించుకున్న అమ్మలక్కలు మధ్యాహ్నం మా ఇంట్లో కూడుతారు. అప్పుడు వారికి ఛాయ, ఛాయతల్లిని గురించిన ముచ్చట్లకంటే ఆసక్తికరమైన విషయం మరొకటి కనిపించదు. ఏమిటిది? ఎందుకిలా జరుగుతుంది? అనేకపుష్పాలు వికసిస్తే వాతావరణం సురభిళమౌతుంది. అనేక చుక్కల వెలుగుకు ఆకాశం వెలుగుతోంది. అనేక మంది ఆడవాళ్లు కూడుతే ద్వేషానల జ్వాలలు రగుల్తాయి

గుసగుసలు, కర్కశదృక్కులు. మగమహారాయిల హావభావాలు ఛాయను కుంగదీశాయి, వెండిగిన్నె పయ్యెద మాటునదాచి, బిచ్చగత్తెవలె ఇంటింకీ తిరిగేది. వాడపిల్లలు గారడివానిచుట్టువలె ఆమె చుట్టూ గుమిగూడేవారు. దర్వాజాల్లో నుంచున్న ఆడవాళ్లు ఆమెను చూచి తలుపులు మూసుకొని గునిసేవారు. "వెండిగిన్నెలు మీ ఇంట్లో ఉండగలవు – మేం వాటిని కొనగలమా?" అని.

తరవాత ఛాయతల్లి దుకాణాలకు తిరిగింది. ఇహ మా ఇళ్ళకు వాళ్ళరాకపోకలు తగ్గాయి. క్రమ క్రమంగా నగలు, వెండి సామగ్రి హరించింది. పాత చీరలు పాత హార్మోనియం తీసుకొని తిరిగారు. తరవాత రోజులు తరబడి బయటికి వచ్చేవారు కారు.

తన్నులుపడి తిట్లు తిట్టినవార్ని మరో తన్ను తన్నొచ్చు.... ఒకే దెబ్బకు పడిపోయినవాణ్ణి లేవనెత్తక తప్పదు. ఛాయ ఇంటిపొయ్యిలో పిల్లి లేవకపోవడం. వారి వేడి నిట్టూర్పులు అందరి గుండెలు కరిగించాయి. తల్లీ కూతుళ్ళ శవాలు ఆ యింట్లో కుళ్ళాలనుకున్నారా ఎవరన్నా? అలా జరుగుతే ఆ పీడసొంతం వాడవాళ్ళకు కొట్టదూ।

తమ ప్రాముఖ్యాన్ని గుర్తింపజేసుకున్న వీధి వనితలు మళ్ళీ ఛాయను తమ ఇళ్ళకు రానిచ్చారు. వాళ్ళంతా ఛాయకు సాయపడాలనీ చిత్తశుద్ధితోనే అలా చేశారనుకొండి, అయితే పదిరూపాయీల సరకు ఒక్కరూపాయికే కొన్నారు – అదీ ఏదో దానధర్మం చేసినట్లె !

ఒకనాడు కాలేజీకి వెళ్ళడానికి సిద్ధంగా ఉన్నాను. గుమ్మంలో నుంచున్నాను, రిక్షాపిలుస్తున్నాను. ఛాయ కిటికీలోనుంచి చూచింది. నా దగ్గరికి వచ్చింది.

ఆమె కళ్ళల్లో కన్నీరు నిండుకుంది నలువైపులా భయం భయంగా చూస్తోంది. ఆమె చేతిలో చిన్న పాలరాతి తాజుమహల్ ఉంది. ఎందుకు ఆ చిన్న తాజుమహల్ నీడ వణుకుతూంది. మార్గశీర్షపు చలిలో చన్నీళ్ళస్నానం చేసినట్లు వణకి పోతూంది ఛాయ.

జట్టుపట్టుకొని మార్కెట్టుకు వెళ్ళేరామయ్య భార్యను భయం భయంగా చూచింది. ఆమె వెళ్ళిపోయేవరకూచూచి చిన్నతాజుమహల్ నా చేతికి అందించింది. - చూడమన్నట్లు. నాకు అమ్మ చెప్పిననీతులు గుర్తుకు వచ్చాయి. అయినా ఎలా కాదనడం?

"ఇదిమీకు ఎలా వచ్చింది" మెల్లగా అడిగాను.

ఆమె నేలమీద ఏదో వెదికినట్లు చూచింది. తరువాత తనచేతులు చూచు కుంది. తరువాత ఆమె విశాల నేత్రాలు నన్ను చూచాయి నా గుండెలో గుచ్చు కున్నాయి.

"తాజ్, చాల మంది అమ్మాయిల దగ్గరికి ఎలాగో వచ్చేస్తుంది. నా దగ్గ రికీ వచ్చేసింది-ఆయితే ఆది దొంగ సొమ్ముకాదని నమ్మండి. అసలు-తాజ్ మహల్‌ను ఎవరు దొంగిలించగలరు?

ఆ రోజు తొలిసారి ఛాయను ధ్యాసగా చూచాను. వికారంగా లేదు ఆమె కోసం ఒక తాజ్ మహల్ కట్టించవచ్చు.

"అవును-ఎందుకీ 'తాజ్'ను అమ్ముతున్నారు?"

"ఇది అమ్మకు పోయేవస్తువు కాదు కాబట్టి"
ఆమె"తాజు"ను తన చేతిలోకి తీసుకొని, తల్లి తన వంటరి బిడ్డను తుడిచినట్లు, తుడిచింది. ఇహ ఇప్పుడిది ఆటబొమ్మ ఆంతే బొమ్మల దుకాణాల్లో మీరు చూచి ఉంటారు ఇలాంటివి వరసలుగా పెట్టిఉంటాయి. అయిదు రూపాయాల కొకటి అమ్ముతారు.

పక్కలోని ఆడపిల్లల గుంపు నావైపు వస్తూంది. ఛాయ బెదురు చూపులు చూసింది. చప్పున ఆమె చేతిలో రెండు రూపాయిలు పెట్టాను "తాజ్"ను టేబిల్ లేసి తెచ్చి పర్సులో దాచేశాను.

అలా ఛాయకు అంత ఉదార హృదయంతో సాయం చేసినందుకు నా కెంతో గర్వంగా ఉంది–ఆరోజంతా–రెండు రూపాయిలు ఆమెకు దానం చేశా ననుకున్నాను. ఎప్పుడైనా ఛాయ కష్టాలు గురించి ప్రస్తావిస్తే నేనిచ్చిన రెండు రూపాయిలు నాకు చప్పున గుర్తొస్తాయి–కాని నా టేబిల్ మీద ఉన్న చిన్న 'తాజ్' గుర్తుకు రాదు.

ఆ చిన్ని తాజ్ వెనుక సిరాతో ఏదో రాసి ఉంది. ఛాయ దాన్ని దాచడానికి ప్రయత్నించింది–కాని చెరపలేక పోయింది. జారిన బాష్పబిందువులా, ఒక సిరా చుక్క అక్కడ చెదిరిపోయింది. తాజ్ నా టేబిల్ మీద ఉంది. రాత్రికి లాంపు వెలిగిస్తాను చదువుకోడానికి అప్పుడు దాని నీడ గోడమీద మహా సౌధంలా విరాజిల్లుతుంది. దీన్ని తయారు చేయడానికీ, దీన్ని ప్రేమ కానుకగా అందించడానికి ఎన్ని కోరికలు మలచాలో? ఎన్ని పూల రేకులు వజ్రపు గుండెకు గాట్లు పెట్టాయో! రాజమహల్ అంచు చుట్టూనా ఎన్ని స్వప్నదీపాలు వెలిగాయో! విడిపోయిన షాజహాన్ ఎన్ని ఎన్నేటి దీపావళులు జరుపుకున్నాడో!

ఛాయ మరోసారి నాదగ్గరికి వచ్చింది.

ఆ రోజు జాగ్రత్తపడి వచ్చింది–అయినా కనుకొనల్లో చెమ్మ. చెదరిన వెంట్రుకలు ఆమె బాధను వ్యక్తపరుస్తూనే ఉన్నాయి. ఎవరో లోపలికి బలవంతంగా నెట్టినట్లు బెరుకుగా గదిలో ప్రవేశించింది. ఆమె చేతిలో ఒక బట్టల ప్యాకెట్ ఉంది. అది చేతిలోంచి జారిపోకుండా గట్టిగా పట్టుకుంది. గదిలో ప్రవేశించి వేళ్ళు ఆడిస్తూ నుంచుంది. నాతో మాట్లాడే ధైర్యం లేనట్లు–నుంచుంది. ఎలా చెప్పాలో తెలపక తడబడుతూంది.

నేను ఆమె చెప్పకుండానే గ్రహించాను–ఏదో పనికిరాని వస్తువు తెచ్చింది అమ్మడానికని దాన్ని కొనాలి. ఈ లోగా ఎవరైనా వస్తే ఛాయ వెళ్ళిపోతుంది. అమ్మలేదు అమ్మేరావచ్చు గద్దించి వెళ్ళగొట్టచ్చు.

ఈ ఛాయకు మేమే దొరికినట్లున్నాం దోచుకోవడానికి రూపాయా, అర్థా ఇచ్చి వదిలించుకోవడం మంచిదనుకున్నాను.

"అచ్ఛా! ఒక రూపాయి ఇస్తే గడుస్తుందా?'

'నాకు మీ రూపాయి అక్కరలేదు' ఆమె స్వరంలో దుఃఖపు జీరలున్నాయి ఆమె కన్నుల్లో దిగంతవ్యాప్తమైన ఎడారులు కనిపించాయి. వాటిల్లో అడుగు పెట్టాలంటే జంకాను.

'అయితే ఆ ప్యాకెట్‌లో ఏముంది?' త్వరగా వదిలించుకోవాలని అడిగాను.

ఆమె కష్టాలు గట్టెక్కినట్లు ఒక నిట్టూర్పు విడిచింది. పేకట్ విప్పింది. అందులోంచి చిరిగిన ఒక ఉర్దూనవల 'దాగ్ ఇన్సాన్ మర్ గయా' (మానవత-చచ్చిపోయింది), ఒక పెన్ను, ఒక బనారస్ పట్టుచీర తీసింది.

"ఇది దొంగసొమ్ము కాదు. ఇవన్నీ నావి'

నేను నిర్దయగా పుస్తకం అందుకున్నాను. పాత పుస్తకాన్ని అంటుకోవడం అంటే గిట్టదు నాకు అయినా అతి శ్రద్ధగా చూడాల్సి వచ్చింది. పుస్త-కానికి అట్టలేదు. తొలి పుటమీద 'నాఛాయకు, 'అస్లమ్, అని రాసి ఉంది. పుస్తకం పక్కన పెట్టి చీర అందుకున్నాను. సర్రున జారిపడి పోయింది.

"కాస్త జాగ్రత్తగా పరిశీలించండి" నా నిర్లక్ష్యాన్ని ఓర్చలేక పోయింది.

అది ఎరుపు జరీచీర. రంగు వెలిసిపోయింది. ఇలాంటి చీరలు సాధారణంగా హిందూ వధువులు ధరిస్తారు.

"ఈ చీర మీదేనా?"

"అవును. కాని ఎన్నడూ కట్టలేదు" చప్పున వివరించింది

"అలాగా! అయితే పెళ్ళినాడు కట్టుకుంటారేమో!" ఆమె సిగ్గుతో తల వంచుకుంది. వెంటనే బొట్టు చెరిపేసింది. అప్పుడు ఆమె ముఖంమీద చీకట్లు మరీ ముసిరాయి.

"చీర అమ్మడానికి తెచ్చాను"

అయితే ఇందులో ఏదో ఐకటి కొనక తప్పదన్నట్లు తలమీద చేతులు పెట్టుకొని కూర్చున్నాను. ఛాయకు. సాయపడ్డానికి నా దగ్గర అంతడబ్బులేదు. కాదని మాత్రం ఎలా అనడం ?

"ఏమిటిలా చిరాగ్గా ఉన్నారివాళ్ళ?" ఆమె నా దగ్గరకు జరిగింది.

"అవును చిరాకేమరి నిన్నటినుంచి కాలేజీకి వెళ్ళలేదు" చిరాకుకు ఏదో కారణం ఉండాలిగదా అని అన్నాను.

'మీరు కాలేజీ మానేశారా?'' ఆమె చీర తీసి పక్కకు పెట్టింది'' మీరు కాలేజీకి వెళ్తుంటే నాకు చాల సంతోషంగా ఉంటుంది. నాకూ మీలాగే కాలేజీకి వెళ్ళాలని ఉంటుంది.

జవాబుకోసం చాలసేపు ఎదిరిచూచి బలవంతంగా నాతలపైకెత్తి "మీరు ఫీజు కట్టలేక పోయారా?" అని అడిగింది.

"అవును" నేను కృతజ్ఞతా దృక్కులతో చూచాను. అవును నేను విచారంగా ఉండడానికి ఇలాంటిదే కారణం కావచ్చు ననుకున్నాను.

ఆమె మళ్ళీపెళ్లు ఆడించింది. ఆమె కనుల ఎడార్లలో మబ్బులు కమ్ముకో సాగేయి. నామాట పూర్తిగా నమ్మింది పాపం "మీరు విచారించకండి — నేనేదో ఏర్పాటు చేస్తాను" అన్నది.

"నిజం!" ఆశ్చర్యంగా అడిగాను.

ఇంత తొందరగా విముక్తి లభిస్తుందనుకోలేదు. ఎంతో కృతజ్ఞత నటిస్తూ ఆమెవస్తువులుఆమెకు అందించాను. నన్ను ఓదారుస్తూ వెళ్ళిపోయింది.

అయిదారురోజులు గడిచాయి. ఛాయ వచ్చింది. నాముందు నిలచింది! నేను జంకాను. చూస్తే ఆమె చేతిలో కవరుంది. ఏముందబ్బా కవర్లో ........

ఆమెకూడా నాఎలెనే బెదిరిపోతుంది — ముఖంలో రక్తపుచుక్కలేదు. బాగా అలసినట్లుంది. అలసట కొట్టవచ్చినట్లు కనిపిస్తూంది.

"మీరు చాలబాధ పడుతున్నారు........" అని నా చేయి అందుకుంది. ఆమె చేయి చల్లగా ఉంది. నా చేతిని వెనక్కు లాక్కుంటున్నాను — ఆ కవరు చేతిలో పెడ్తుందని తెలుసు నాకు. అయినా బలవంతంగా కవరు నా చేతిలో పెట్టింది.

"ఇందులో మీ ఫీజుంది"

నేను అదరిపడ్డాను నేనిచ్చిన రూపాయలు ఛాయ నాముఖాన విస్సిరి కొట్టినట్లనిపించింది.

ఆమె వీధివాళ్ళందరి వ్యర్థద్వేషానికి జవాబు చెప్పుతున్నట్లు నుంచుంది.

ఇంత ప్రేమను, ఆత్మీయతను ఎలా భరించడం !

"అయితే ఆ చీర అమ్మేశారా ?"

"అవును దానికి తగినంత డబ్బురాలేదు" ఆమె కుర్చీలో కూలబడి తల వెనక్కు ఆనించింది.

"నా రక్తం అమ్మాను"

"ఏమిటి?" నేను ఎగిరి గంతేశాను. పక్కనే బాంబు పేలినట్లనిపించింది. కొన్ని క్షణాలు మెదడు మొద్దుబారిపోయింది. మళ్ళీ చైతన్యం కలుగుతున్నపుడు మెల్లగా ఏవో మాటలు వినిపించాయి.

"ఆస్పత్రి వాళ్లు సంతోషంగా రక్తంకొనేస్తారు. వాళ్ళకు ఇది దొంగసొమ్ము అనే అనుమానంరాదు"

# సతీ సావిత్రి

ఆడపిల్లలు "ఆవారాలు" ఎందుకు అవుతారో అర్థంకాదు - ఎంత ఆలోచించినా. ఆడదాపి కదలాడే ఎడదను కాపాడే కమల ముకురం ఉండదా పీళ్ళ దగ్గర?

దేవునితోడు నాకైతే వాళ్ల కాకమ్మ కథలో కనిపించే గంధర్వాంగనల్లా కనిపిస్తారు. ఏమిటి పరపురుషుల్తో కళ్లు కలపడం - ప్రేమలేఖలురాయడం. .... ఇంకా .... ఇంకా .... అబ్బా! సిగ్గేస్తుందబ్బా! విన్నమాటలుకాదు కంటితో కన్న కథ చెపుతాను.

ఇంకా నేను ఏడో క్లాసులోనే ఉన్నాను. పాతాల్లో కాదు కాని అమ్మా అక్కా చెప్పేది నరకాన్ని గురించి. అబ్బో ఎడికి పోయేదాన్ని. ఎంత ఏడ్చేదాన్నో - నన్ను మించిన వారుండేవారుకారు. పన్నెండేళ్ళన్నా లేవు - మాటంటే పడదు - మూతిముడుచుకూర్చుంటుంది. అనేది బామ్మ. అవును అర్థంలేని ఆలోచనలు. నా గుండె అంత - ఏం చేయమంటారు?

మరిస్తిని.... ఏమిటీ చెప్పదల్చుకున్న కథ.... ? ఆఁ జ్ఞాపకం వచ్చింది- నేను ఏడో క్లాసులో ఉన్నప్పుడు ఒక అప్సరసను చూచాను షీలా మెట్రిక్‌లో ఉంది. అబ్బా మెట్రిక్ చదివేవాళ్ళు పెక్కు క్రింది క్లాసులవాళ్లు వాళ్ళను నిజంగానే అప్సరలనుకుంటారు నేనైతే షీలాకంటే అందమైన అమ్మాయిని చూశ్చేదబ్బా! రానా అంటుంది. సజ్జా! షీలా నీ కాలిగోటికి కొరగాదని. సిరాజు ఏమంటాడంటే నాకళ్లుచేయడానికి దేవుడు పాపం చాల కష్టపడ్డాట్ల లక్షసార్లో స్కెచ్చులు వేసిచెరిపి ఉంటాడంటాడు. మరి నవాజు .... నవాజు .... అతనికి సిగ్గేలేదు. వాడి కళ్ళు ఎప్పుడూ నా .... నా మీదే ఛ ఏమిటిది. నా కథ వినిపిస్తున్నానా మీకు!

ఏమోనబ్బా బాగా చదువుతారు - అందంగానూ ఉంటారు .... వాళ్ళ చేష్టలు చూస్తేనే చిర్రు. షీలావిషయమే చూడరాదూ-ఎప్పుడూ ఫస్టుడివిజన్‌లో

పోసవుఘంది. స్కూలు వార్షికోత్సవం అవుతుందా పది పది ప్రైజులు కొట్టే స్తుంది. డాన్స్‌లో ఫస్టు, డ్రామాలో ఫస్టు, రన్నింగ్‌లో ఫస్టు, ఆమె పరుగు వేగం ఒకనాడు గ్రహించాను. ఆమె చేతిలో గులాబీ కవరుంది. ఉరుకుతూంది. అష్రఫ్ ఆమెను అడ్డగించాడు - నిండు క్లాసులో. అప్పుడు చూడాలి ఆమెగతి! ఏమైందనుకున్నారు-బిక్క చచ్చిపోయింది. ఇహ అష్రఫ్ ఏంచేశాడో తెలుసా? ఉత్తరం తెరిచాడు. టీచర్స్ రూములో గట్టిగా చదివాడు. అమ్మాయిలంతా కిటికీ ల్లోంచి తొంగి తొంగి చూడ్డం. టీచర్లు గద్దిస్తే ఊరుకుంటున్నారా - పగలపడి నవ్వుతున్నారు. అది నవ్వడానికి కరువులేని కాలం. ఎందుకు నవ్వాలేమిటి? నవ్వడమే పని. ఏమీ లేదనుకోండి—అమ్మా అక్క ఎలకతోక జడపాలు - లేదా తొంట హెడ్‌మిస్ట్రెస్ టిక్కు టిక్కు నడక! ఏదైతేనేం నవ్వడం - అది నవ్వుల కాలం.

రెండోరోజు స్కూలుకెళ్లితే షీలా ఖుర్ర్. మాకంటే చిన్నపిల్లలు కూడా గుటుకలు మింగుతూ చెప్పుకుంటున్నారు — షీలామీద మహమూద్ పడిచస్తాడని ఈ విషయాల్లో అబ్బాయిలంత మొద్దులుకారు - అమ్మాయిలు. అబ్బోవాళ్ళు చాల తెలివైనవాళ్లు' బొమ్మలాటలోనే గ్రహిస్తారు. ఏ బొమ్మంటే ఏ బొమ్మపడి చస్తుందో, ఆహా - షీలా అదృష్టమే అదృష్టం. ఏమంటారా? మహమూద్‌కు మోటర్‌సైకిలుంది మహమూద్ అంటే బళ్ళో ఆడపిల్లరందరికీ ప్రాణం. సాదిఖ్ అక్కను స్కూలుకు తెచ్చేవాడు మోటర్‌సైకిల్‌మీద. ఇహ మా ఆషూ అత్త ఉంది. అబద్దం ఎందుకు చెప్పాలి కాని వరుసకు బావల్ని నలుగురైదుగురిని ఎంచుకుంది. వారిమీద పడిచస్తానని ఆఫర్ ఇచ్చింది.

అబ్బో! మా అమ్మమ్మకు వలపు వాసన మైళ్ళదూరంనుంచే వస్తుంది. వాసనబట్టి మొరుగుడు సాగిస్తుంది. ఇహ మా అమ్మ! వయసులో ఉన్న ఆడ పిల్లలంటే టైంబాంబుకంటె తక్కువగా భావించదు. అయినా ఆషూఅత్త ఆటలు చూస్తూ ఊరుకునేవాళ్లు - పెదవి కదిలేదికాదు, ఎందుకంటారా ఆమె వయసు మా చిన్నమ్మకంటే ఎక్కువ. చిన్నమ్మ కూతురు రాహత్ నా క్లాస్‌మేటు పరే అమ్మ అన్నదే నిజం అనుకుందాం. ఆషూఅత్త నల్లది - అందవికారి.

అయితేమాత్రం—వరుసి వాళ్ళ మాఇంటి గడపేతొక్కడం మానేయడం ఎందుకు? ఇహ నసీం పిన్ని ఉంది పెళ్ళికోసం నిరీక్షిస్తూనె మెట్రిక్ పాసైంది. ఎఫ్ ఏ అయింది, బి.ఎ. ఐంది. ఎం.ఏ దాకా వచ్చేసింది. బామ్మ పెరునికోసం కట్టించి నపెట్టి బట్టల ఫేషన్ మారిపోయింది. జలతారు మాసిపోయింది అమ్మ, బామ్మ పొరుగున జరిగే పెళ్లిని గుర్ంచి ముచ్చటపడ్తే, నసీం పిన్ని కాలేజీ కథలు వందలు చెపుతుంది. ఒక అమ్మాయి అబ్బాయిని ప్రేమించింది. కట్నం గిట్నం లేవు—క్షణంలో పెళ్ళి జరిగిపోయింది. మొదలు మొదలు ఇలాంటి కథలు వినేదా బామ్మ—బీరాలు తీసేది. తుదకు నసీం పిన్నిని తనదారి చూచుకొమ్మంది. అయినా పప్పులు ఉడకలేదు. కాలేజీలో నసీంను అంతా "అక్కా" అని పిలువసాగారు

ఇంతకూ ఏమిటబ్బా నేను చెప్పవచ్చింది? ఆఁ గుర్తుకు వచ్చింది. స్కూలు విషయంగదా! ఆ మోటర్ సైకిల్ అబ్బాయి షీలా కళ్ళమీదపడి చచ్చే వాడు. అలా అనుకునేవారు స్కూల్లో అంతా. ఆరోజుల్లోనే అమాంతంగా నాకు నా కనుల వెలుగును గురించి ధ్యాస కలిగింది. రానాకు నా—కళ్ళంటె చాల ఇష్టం. నా కనుచూపుచాలా విలువైందని అర్థంఅయింది. అబ్బ ఎంతభయం నాకు? ప్రతివాడూ దోచుకునేవాడే అనిపించేది. రాత్రిళ్ల దడుచుకొవి లేచేవాన్ని ఎవరో నా పక్కన ఉన్నాడని భయం! వెవవ కళ్ల - వాటివెలుగు ఎక్కువవు తూంది. స్కూలుకు వెళ్తుంటూనా దారినడిచేవాళ్ళంతా తిరిగి చూసేవాళ్లు ఇహ టీచర్లు బుగ్గలు నిమురుతూ వెళ్ళేవారు, నా వళ్ల మండేది.

దీన్నిమీద కథలని చదువుతుంటారు. అవునా! మీకెలాంటి అపోహలు కలుగుతాయో చెప్పనా? చందమామలాంటి నా ముఖంతో నేదేదో చాల లాభ పడ్డానని. మట్టి అలాంటిదేమీ లేదు. నన్నేం షీలా అనుకున్నారా మీరు రాత్రికి రాత్రే లేచి పోవడానికి! బాల్యం నుంచే నాప్రణాళికవేరు. ఒక ఆదర్శ పురుషుణ్ణి గురించి కలలు కంటున్నాను, ఇహ ఈనేలమీద నడిచేవాళ్ళూ పురుగుల్లాంటి జనం, కోరికలు మింగిన కొంచపు యువకులూ నాకళ్ళకు ఆనుతారా? పూర్వకాలంలోనైతే నావలె అసదృశ చాతుర్యం కలిగి,

అసమాన రూప సౌందర్యం గల రాజకుమారి జన్మిస్తే భగవంతుడు ఆమెకోసం దూరదేశాల్నుంచి చంద్రునిలాంటి రాజకుమారుణ్ణి పంపేవాడట. అట్టి సుందర రాజకుమారుడు ఏడు ప్రశ్నలకు సమాధానంచెప్పేవాడు, ఏడు సముద్రాలు దాటేవాడు. ఏడు పర్వతాలు ఎక్కేవాడు అప్పుడు రాజకుమారి దగ్గరికి వచ్చేవాడు అమె ఏంచేసేది తన హృదయ కమలంలో అతణ్ణి దాచేసేది. అందుకే నా కాలేజీ మిత్రులతోను, వరుసకు సోదరులతోనూ ఢంకా బజాయించి చెప్పాను నేను అలాంటి ఇలాంటి అమ్మాయిని కానని. నా చాయలకు వచ్చిచూడండి, నేనెలాంటి బట్టలు కట్టినా, ఎంత మేకప్ చేసినా, నాకళ్లు ఎన్ని వెలుగులు విరజిమ్మినా, నా బుగ్గలో ఎన్ని గులాబీలు విరిసినా....నా....నా ఛ ఈ మగాళ్ళ చూపులు ఎంత చెడ్డవి! మగాళ్లా! వాళ్ళకు గుణపాఠం చెప్పడం వాదగ్గర నేర్చుకోండి. ఎంతోమందికి బుద్ధి చెప్పాను. ఎంతోమంది బుర్రలు సరిచేశాను, అయినా ఏకి నన్ను ఆదరించేవాడు? నా విలువ గనుగొన్నవాడు?

నిన్నంటే నిన్నటి మాటబల్కీస్‌లేదూ వెధవముండ. అది ఒక వెధవ బట్టల దుకాణంముందు నుంచుంది. దానిపక్కన వాడులేడూ కన్ను నెత్తికెక్కిన అహమద్ వాడున్నాడు. ఆ ఏడుపుముఖం ముండ ఒక చీమిడిముక్కు పోరణ్ణి ఎత్తుకుంది.ఆ పుండాకోరు వేషంలోకూడ తనను ఫిలింహీరోయిన్ అనుకుంటుంది హుం. అందరూ అనుకునేదేమంటే ఏ సినీతారా బల్కీస్ అందంతో పోటీ పడలేదని నా కళ్ళకేమో దానికంటే వికారి కనిపించందే! అహమద్ ఉన్నాడే వాడు నన్ను గుటకలు మింగుతూ చూస్తున్నాడు. అప్పుడు బల్కీస్ నామీద ప్రేమ ఒలకబోసింది. 'అరే సజ్జూ ఎంత మారిపోయావ్ సురేందర్ నిన్ను వదిలేశాడని తెలిసి చాల బాధపడ్డాననుకో. అరే నువ్వు మాపాపను చూశావా? మాటలు నేర్చింది. నిన్న ఏమందో విన్నావా "మమ్మీ నాపెళ్లి చేసెయ్" అంటూంది. తరవాత పెళ్ళాం మొగుడు నవ్వుకుంటూ వెళ్లిపోయారు జనానికి ఈ నవ్వుల ఖజానా ఎక్కడ దొరికిందో!

సురేందర్ నన్నువదిలేశాడమ్మా బల్కీస్‌కు ఎందుకుబాధ? ఏమనుకుంటుందని? నేను ముగ్గురు చీమిడికారే పిల్లల్ని ఎత్తుకొని నా సౌందర్యం వది

పించుకోవాలనా! నేనేంచేశానో తెలుసా సురేందర్ ముఖాన ఊశాను. నన్ను వలచేవారు తక్కువ ఉన్నారనా! నేనేమిటో దానికి తెలీదు. ఒక్క కులుకు కులికానో వేలమంది చావడానికి సంసిద్ధం. అయినా నాకు అహమద్‌ను గురించి ఆశ్చర్యం కలుగుతుంది! ఎంతరసికుడు ఎలా పాడైనాడు. అతనికి "ఆడదాని ఆత్మ" అని పేరుపెట్టాడు సిరాజ్. వేలమంది ఆడవాళ్ళలో ఆడదాని ఆత్మను వెదుకుతున్నానంటాట్ట! వెర్రివాడు!!

సిరాజుతో వెళ్ళినప్పుడు అహమద్ కనిపించేవాడు ఎవతో ఆంగ్లో ఇండియన్‌తో - సినిమాలోనో - క్లబ్బులోనో-నేను అడిగేదాన్ని ఆత్మ లభించిందాఅని. అతడు నిట్టూర్చి 'ఆత్మదాకానా సజీవశరీరాలే దొరకడంలేదు' అనేవాడు అహమద్ ఈ వాగుడుంది చూచారూ. నాకూ నచ్చదు. ఏమనుకుంటాడు మొనగాడు. నన్ను లెక్కచెయడు. నేను సజీవశరీరాన్నికాను నాకు ఆత్మలేదా కొందరు మొగాళ్లు తాము మొనగాళ్ళమనుకుంటారు.

సిరాజ్ కూడా అలాంటివాడే. మా దగ్గరికి వచ్చేవాడు. గంటలతరబడి కూర్చునేవాడు. భోజనభాజనాలూ జరిగేవి. కాని, నాప్రాముఖ్యత గమనించేవాడుకాడు. నేను ఇంట్లో ఉన్నట్లే అనిపించేదికాదు. రాగానే పాపల దగ్గర కూర్చునేవాడు. ఆటలాడేవాడు అరే నన్ను చూడడే! నా కన్నుల్లో ఆకర్షణలేదా నా నవ్వు గారడి చేయదా నాకువాడి ముఖం చూస్తే అసహ్యం కలిగింది. అంటే ఏమనుకుంటున్నారు? నేను వాణ్ణిలెక్కచేసే దాన్ననా! ఛ తప్పు అయినా మీరెలా చెప్పడం సాక్ష్యానికి సిరాజును ఏడిపించితేను, నేను ధిక్కరిస్తే పెళ్ళాం పిల్లల్ని తీసికొని అమెరికా వెళ్ళిపోయాడు. కాదు లండన్ అనుకోండి. అతని పెళానికి నేనంటె భయం, మొగుణ్ణి ఏసుకొని ఏక్కడికో ఎగిరిపోయింది, ఛ ఈ ఆడ జాతిఉంది చూచారు దీనికున్నంత స్వార్థం మరెవరికీ లేదేమో! మొత్తం జీవితపు కోరికలన్నీ ఒకే పురుషుడు చెల్లించాలంటారు. ఇహ మగాళ్లు మురిసిపోతారు, ఆత్మలభించిందని వాళ్ళ సంబరం,

ఆ ఏమిటీ చెబుతుంటివి? ఆఁ జ్ఞాపకం వచ్చింది, షిలాముండ కథకదా! ఛీ ఛీ ఆడదానికి సిగ్గుండాలి, సిగ్గులేనిపోరి. దొంగచాటుగా మహమూద్‌ను

కలుసుకునేది, తల్లితో చెప్పేసింది, మహమూద్ లేకుంటే తాను చచ్చిపోతానని ఎంతధైర్యం ఆమాట విన్నానూ, ఆడపిల్లలమంతా వడకిపోయాం. గొంతులు ఆరిపోయాయి అరచేతులు చెమటతో తడిసిపోయాయి,

ఒకసారి నవ్వులాట కన్నాను పెళ్ళాడనని మగాని మోచేతికింది నీళ్లుతాగడం నా కిష్టంలేదని, అంతే అన్నది నవ్వులాటకే. మా అమ్మ ఏడ్చిఏడ్చి సుడిబడ్డది. అమ్మమ్మకు నా మాటలు విషంలాతోచాయి. మీకు చాతనైతే ప్రపంచంలో ఉన్న ముసలి వాళ్ళందర్నీ పరీక్షించండి. నవ్వుమీద 'కంట్రోల్' ఉన్నముసలిది మా అమ్మమ్మమాత్రమే అని తెల్సుకుంటారు. ఇప్పుడు చచ్చిందట లెండి. నా చెల్లెళ్ళు ప్రతి తద్దినానికి ఆమె పేరుమీద బిర్యానీ తింటుంటారు.

సిరాజు తనమిత్రుడు నవాజు రొమాన్సునుగురించి వినిపిస్తున్నాడండి. మీరే చెప్పండి నవ్వు ఎలా ఆగుతుంది? సరిపోయింది. ఇహ ఇప్పుడు నవాజు కథ చెప్పాలిగావాలు. సరే వినండి. ఆతడు రసికుడు గొప్పవాడి బిడ్డ. వలపుల పందేలు ఆతని హాబీ. కాని ఒకటి నిజం. అంత అందగాణ్ణి నేను చూడలేదు. ఆతడు సూదంటురాయంటే నమ్మండి. అమ్మాయిలు ఆతడంటే ప్రాణాలు అర్పించేవారు. అయితే ఆతనికో నియమం ఉంది. ఏడాదికి ఇద్దరితో మాత్రమే వలపులాడుతాడు అందును గురించి సిరాజు రుచికరంగా చెపుతాడు. ఒకదాని ముద్దతు అయిపోకముందే నవాజు మిత్రులు బయల్దేర్తారట. బావుల్లో వలలువేసి వెదకుతారట. అందరూ సంప్రదించి ఒక అమ్మాయిని నిర్ణయిస్తారట. ముందు మిత్రులు పరికిస్తారట. ఆ తరువాత నవాజు ప్రియురాలు అవుతుంది. ఆర్నెల్లు నవాజు కథలు వింటుంటే నాకు ఒకటేనవ్వు. వేయిరూపాయీల ఉంగరంతో అతని పారితోషికాలు ప్రారంభం అవుతాయని సిరాజు చెబుతాడు.

వేయా! ఖర్మ ఇక్కడ వెండి ఉంగరమేగతిలేదు. నాన్న సంపాదన ఆడ, మగపిల్లల చదువులకే సరిపోయేది. మగపిల్లల్ని చదివించడం రూపాయీలు వడ్డీకి నడపడంలాంటిదని నాన్న అభిప్రాయం. తరవాత వడ్డీసహితంగా వసూ లవుతాయి. సిరాజు మాటల్లో స్వారస్యం ఉంది! గంటలు విన్నా గుండెనిండదు. కాని అమ్మమ్మకు నా ఆనందం అంటే వైరం.

"ఓసే! ఏమిటే సిరాజు నీకు తవ్వి తలకెత్తేది? మూతిలో మూతిపెట్టి ముచ్చట్లాడుతూ గంటలు కూర్చుంటావు" చూశారా చేయని నేరానికి మోసిన శిక్ష !

షీలాకథ ప్రచారమయిన నాటినుంచి అమ్మ నన్ను దయ్యంలా చూచేది. ఇంతకూ చెప్పుతున్నది. షీలా కథ! అబ్బ! దాని ధైర్యాన్ని మెచ్చుకోవాల. తండ్రి గదిలో పెట్టాశాట్ట. రెండో అంతస్సునుండి దూకిందట. పారిపోయిందట. వలపువెంట ఏదో మనోబలం ఉంటుందని ఆనాడు నాకు అర్థం అయింది. కాకుంటే రెండో అంతస్సునుంచే దూకిన మనిషి బతికి బయట పడడంఏమిటి. అమాంతంగా షీలా స్కూల్లో హిరోయిన్ అయిపోయింది. ఆమెతో మాట్లాడిన విషయమూ, ఆటలాడిన విషయమూ, తిట్టుతిన్న విషయమూ అమ్మాయిలంతా బహు గర్వంతో చెప్పుకొసాగారు, ఈ ఆడపిల్లల మనస్తత్వమే విచిత్రం. పుట్టింటిని ఇట్టేమరిచిపోతారు. ముఖమెరుగని మగాని వెంట బుర్రున లేచి పోతారు !

ఎక్కడిదాకానో ఎందుకు మా కుటుంబంలోనే ఒకళ్ళను మించినవాళ్ళొ కళ్లున్నారు. మా కుటుంబం అంటారా-ఉన్నతం అయింది. ఖ్యాతిగలది. కుటుంబం పెద్దదే అనుకొండి - నాకేం ఒరగపెట్టిందని ! కుటుంబంలోని లొసుగులు దాచుకుంటే దాగుతాయా ? ఇంకా నేమ ఓణివేసుకొవడమే ఎరుగను మా నటీఖా అక్క తన పసందుపెళ్లి చేసుకుంది. ఇహ షమీమా పిన్నివిషయం ఏంచెప్పను? స్వయంగా ఆమె తండ్రి ఉత్తరాలు పట్టేశాడు. ఇలాంటి కుటుంబమండీ మాది. ఇహ నేను చేసిన తప్పూ చెప్పొద్దూ - ఏంలేదండీ-సిరాజ్‌తో సినిమాకెళ్ళాను. ఇహా చూడండి ఏదో ఆపదముంచుకు వచ్చినట్లే విరుచుకు పడ్డారు.

నేనేం తక్కువ తిన్నదాన్నా! సిరాజ్‌కు. పాపం నేనంటే వణుకు. నా సాహసానికి అదిరిపోయేవాడు. నేను అతని వెంట సినిమాలు చూచాను, హొటళ్ళకు వెళ్ళాను, గంటల తరబడి అతనిగదిలో కూర్చున్నాను. ఇదంతా ఎందుకు చేశానంటారు? అతడంటే నాకు భయంలేదని నిరూపించడానికే ! అంతే కాదు నాకు ఏ యువకుడన్నా భయంలేదు. అది సిరాజ్‌కు తలవంపులయింది.

అలిగాడు "సజ్జా నే నంటే భయంలేదా?" అన్నాడు. తరవాత నా నవ్వులో గర్వంలేదు ఎగిరిపోయింది. నా కన్నుల కాంతి కరిగిపోతుంది. చూచాడు. నివ్వెర పోయాను. కన్నీరు నింపుకున్నాడు. నన్ను దీనురాలిని చూచినట్లు చూచాడు. నిజం చెప్పాలంటే నేను అతని కన్నీటిలో కొట్టుకుపోయాను.



నేనెందుకని పనికొస్తాను? నాతో జరిగే పనేమిటి? ఇంటికీ కాలేజీకి తిరగడం – అంతే నాపని. సిరాజ్‌కు విజయగర్వం రాకూడదనుకున్నాను, నేను మరచాను. అతడు మరవం దే! జీవితాంతపు బంధం ఏర్పరచుకుందామనుకున్నాడు. ఎక్కణ్ణించో ఒక ఉంగరం కొనితెచ్చాడు. ఆ ఉంగరంలో ఇరుక్కొని నా జీవితాంతపు స్వేచ్ఛను పోగొట్టుకుంటా ననుకున్నాడు. తన గెలుపును చూచుకొని పొంగిపోదామనుకున్నాడు. సిరాజ్ అంటే నాకు అసహ్యత ఏర్పడింది.



షీలా ఆ మహమూద్ అంటే ఎలా పడి చచ్చిందబ్బా! బతుకంతా వాడితోనే ఉండడానికి ఒప్పుకుంది – పరించింది. ఏమోనబ్బా ఈ ఆడ పిల్లల్ని గురించి ఆలోచిస్తే ఆశ్చర్యం వేస్తుంది. వాళ్ళనంటే ఏంలాభం? ఈ మగాళ్లున్నారే వాళ్ళది అసలు తప్పు. ఈ మగాళ్ళదగ్గర ఏదోగారడి ఉంది. అందాకా ఎందుకూ నవాజ్‌సంగతి చూడరాదూ! ఒకనాడు నన్ను సిరాజ్ గదిలోచూచాడు. ఇహ నావిషయం నేను అతన్ని చూస్తూనే ఉండిపోయా, అప్పుడు నాకు అర్థం అయింది అతని నవ్వులో ఆకర్షణఉందని. అమ్మాయిలు అతనుతెచ్చే ఉంగరాలక్కాదు. అతని చిరునవ్వుకు కట్టుబడిపోతారని. నా కళ్ళలో ఎలాంటి కాంతి ఉందో....? నాబుగ్గల్లో గులాబీల ఎలాంటి పరిమళం ఉందో.........? ఏమో.... ఏమో.... నాకేమీ గుర్తులేదు. నవాజ్ నాకు నగలు తెచ్చాడు. విలువైన చీరలు తెచ్చాడు. అవన్నీ ఎప్పుడు గుర్తుకు వచ్చాయంటారు నాకు? సురేందర్ ఇంట్లోంచి నూలు చీర కట్టుకొని బయటపడి, రాత్రిసాంతం రోడ్డు మీద చలికి వణికిన్నాడు! అప్పుడలా ఎందుకు చేశానంటారు? మా ఇంటివాళ్లను

ఏడిపించడానికి, ఎందుకూ వాళ్లు నేనంటే నిప్పులు పోసుకుంటారు? నా మీద వారికి నమ్మకం ఎందుకుండ కూడదు?

ఆసాయంత్రం కాస్త ఆలస్యంగా ఇంటికి వచ్చానండీ ఇహ మా అమ్మ కాళ్ళ వంటికాలిమీద లేచింది. మా అమ్మ తలబాదుకుంటుంది ఒక్కొక్కప్పుడు నా కేమనిపించేదంటే మా అమ్మకు ఒక పోకిరి కూతురు ఉండాల్సిందని నవాజ్ అనేది నిజం అనిపిస్తుంది - లోకం మనకు ఎన్నడూ అనుకూలం కాదు - అలాంటప్పుడు స్వేచ్ఛగా తిరిగి చద్దాం.

రొమాన్స్ దట్టించిన ఇంగ్లీష్‌ఫిలిం చూడాలని మంచి మంచి చీరలు కట్టి సింగారించుకొని అబ్బాయి వెంట అలా అలా విహరించాలని పిస్తుంది. సిరాజ్ అనే మాట నిజం-అణిగి ఉండే ఆడవాళ్ళనే ఇంకా అణగదొక్కుతారు ఆడవాళ్ళు తమను గురించి తాము ఆలోచించుకోంది పరులకేం పట్టింది? స్వేచ్ఛా సుమాలు పళ్ళెరంలో పెట్టి హాజరు పరుస్తారా? నేను అదే ఆలోచించాను. నా విషయం నేనే చూచుకోవాలి ఏం! లోకంలోని అమ్మాయిలంతా ఈ మగాళ్ళకోసమే జీవించాలా? వాళ్ళకోసమే చచ్చి పిడికెడు బూడిద కావాలా? నాకు సీతలు, సావిత్రులు, మరియమ్మలంటే అసహ్యం వాళ్ళంతా మగాళ్ళకోసం చచ్చారు. మట్టిలో కలిసి పోయారు! ఆత్మ ఆత్మఅంటారు.....అదేమిటో నాకు ఇంత వరకూ అర్థం కాలేదు.

జీవితం జీవితమే - దాన్ని బొప్పబిందువు చేసుకొంటావో నవాజ్ వలె నవ్వులగని చేసుకొంటావో.... నా కోరికల్లో నవాజు తీర్చవిదంటూలేదు. జీవితంలో మళ్ళీ ఆనందతరంగాలు అందకపోవచ్చు కాని అందిన ఆనందాలు పరిహారం కోరవుగా! నవాజుప్రేమ సూర్యకాంతివలె నమ్మకమైందనుకున్నాను, కాని అమాంతంగా కటిక చీకటి అయిపోయింది - కాళరాత్రి అయింది. నవాజు ప్రేమ, కేలండర్‌లా మారిపోయింది.

మా వాళ్లకు చాతనైతే నన్ను నమిలి మింగేవాళ్లు. నాకేంతెలును మగవాళ్లకు మరుపెక్కువవి - అన్నీ ఇట్టే మరుస్తారని. నేను అమాయికను! ఆడపిల్లను!! నేనేమన్నా గడుగ్గాయనా? పది మందిని పాడుచేశానా!

ఛ! అసలు నా అదృష్టం బావుండలేదు, నారాత వంకర. ఎంత మగాళ్లకు దూరంగా ఉందామనుకుంటానో అంతగా అవతరిస్తుంటారు. మా ఇంటిపక్కన లలితఉంది. ఆమె చేయనిదంటూ లేదు. చివరకు బొంబాయి వెళ్లింది. తల్లి అయింది. కూతురుతో దిగింది. విచిత్రం విన్నారా? తెచ్చిన కూతురును ఆమెకు చెల్లెలన్నారు. అలాంటిదంటే లలిత. ఆమె ఇవ్వాళ మొగుడితో సంసారం చేస్తూంది. పాపం మొగుడు పిల్లిలాంటివాడు. ఎటు ఉరకమంటే అటు ఉరుకుతాడు.

రాత్రింబగళ్లు మా అమ్మ ఒకటే సాపించడం ఇక ఎవడూ. ఊయ దానికి కూడా మా ఇంటికి రాదని. ఇంటి వాళ్ల సాపెనలు పడలేక లలితను శరణుపేడాను. లలిత అన్న సురేందర్. అతడు నన్ను శరణుపేడాడు. బావుంది కాదూ! 'సజ్జు ఈ జనం మనను ఊరికే బద్నాం చేస్తారు. ఈమగాళ్ల మాయలు ఎవరూ గమనించరు" అంటుంది లలిత. నిజం. ఆమె అనేది అక్షరాలా నిజం.

సురేందర్ ఒక వింతమనిషి. ఒక స్ఫోటకం మచ్చల అమ్మాయంటే వచ్చేవాడు. అబ్బ! అది అందవికారి. ఇక ఆమె పెక్కువిన్నారా? కన్నెత్తి చూచేదికాదు. సురేందర్ విరహం భరించలేకపోయాడు. యోగి అయినాడు యోగి. అందమైన అమ్మాయి కనిపిస్తే చాలు తనప్రేయసిని ఆమెలో చూచేవాడు ఆ అమ్మాయి ప్రస్తావన రాగానే 'గాజర్‌హల్వా' గుర్తుకు వచ్చేది. మరిఆమెలో ఉన్న మాధుర్యం ఏమోగాని విరహవిషాన్నికూడా అమృతంగా భావించేవాడు. ఆతని విరహాగ్నిలోనేను దగ్ధం కాసాగాను. అలాఅవి సురేందర్ అంటే నాకు సానుభూతి ఉందనుకునేరు. బొత్తిగాలేదు. అసలు విషయం ఏమంటె మా వాళ్ళమీద పంతం నెగ్గించుకోవాలని! నాకు పెళ్లికాకుండా చూచేవారున్నారే వారిమీద పగతీర్చుకోవాలని పంతంఒకనాడు మానాన్న నన్ను కొట్టడానికేవచ్చాడు ఇక ఆరోజు నిర్ణయించుకున్నాను ఆ ఇంట్లో ఉండరాదని. అమ్మాయిలు పోకిర్లు అవుతారని ప్రేమికులవెంట లేచిపోతారనీ అపవాదలు వేస్తుంది లోకం. ఆ ప్రేమికులు పాడుకాను - నాకేమీ తెలియదు. వట్టి అమాయకురాలిని. నేను

ఇంటినుంచి బయటపడానా! అప్పుడు నావెంట ఎవరున్నారు చెప్పండి. ఒంటరి దాన్నేగా! ఒక్కర్తినేగా బయటపడింది!

ఆరాత్రి ఏమిటో అంతా విచిత్రంగా జరిగిపోయింది. కలలోలాగె లేచాను సురేందర్ ఇంటికిచేరాను. అతడు నన్ను చూచాడు. నివ్వెరపోయాడు నాలాంటి గర్విష్ఠి అందగత్తె అర్ధరాత్రి శరణుకోరి తన ఇంటికి వస్తుందని అతడు కలనైనా అనుకొని ఉండడు. ఏంచేయను తప్పేమైనా నాదా? మా నాన్నది. సురేందర్ కారులో తన ఊరికి తీసికెళ్ళాడు వారం తరవాత కలలోంచి మేల్కొన్నాను. నెలదాకా గదిదాటి బయటికి రాలేదు. ఆ తరువాత లోకంలో మిగిలిందేమి!

తన ప్రియురాలి ముఖంలోలా నాముఖంలోనూ స్ఫోటకపు మచ్చలుండాలనుకున్నాడు సురేందర్. నేను తనకు వండిపెట్టాలనుకున్నాడు. గాజర్ హల్వాలో బాగా తీపి నింపాలనుకున్నాడు. ఉదయం ఊరు మేల్కొంటే మొగుళ్ల పెళ్ళాలను బాదడంతో ప్రారంభం అయ్యేవి. సురేందర్ కన్నీటితో ఆ దృశ్యాలు చూచేవాడు. వింత జీవితాలు! ప్రేమించుకోవడం - ద్వేషించుకోవడం! ప్రేమ - ద్వేషం - ద్వేషం - ప్రేమ! సురేందర్‌కు నేనంటే ప్రాణం క్షణం విడిచి ఉండేవాడుకాదు. కానినాకు మనశ్శాంతి ఏది? ప్రతి అలికిడికి ఉలికిపడేదాన్ని. సురేందర్ నన్ను వకీలుదగ్గరికి తీసికెళ్లాడు. మా నాన్నకు వ్యతిరేకంగా కోర్టులో చెప్పాల్సిన సాక్ష్యాల్ని అతడు బట్టీపెట్టించాడు. బయటికి వెళ్లాలంటే భయం- నాన్న చంపిస్తాడని! ఎవరో బలవంతగా ఇంటికి లాక్కుపోతారని బుగులు! ఒకనాడు అహమద్ చెప్పాడు - నాన్న నామీద ఎలాంటి కేసూ పెట్టలేదని. వాళ్లకు నన్ను ఇంటికి తీసుకెళ్లాలనీ లేదట. నాకు అగ్గిలో దూకినట్లనిపించింది ఈ అవమానం సహించడం ఎలా? కిరసనాయిలు పోసుకుని నిప్పంటించుకోవాలనిపించింది. ఇటు ఆ స్ఫోటకపు మచ్చలది నా జీవితంలో హాలాహలం నింపింది. ఆ ముండ ఏదోమందు పెట్టింది. కాకుంటే ఎందుకు దానిమీద అలాపడిచస్తాడు. అలాంటి ముండలు ఏదైనా చేయగలరు. 'గాజర్‌హల్వా వండిపెట్టిందట ఏమిటాగొప్ప? అదేం అమృతమా? రోజూ

మిఠాయి దుకాణంనుంచి తెప్పించిపెడ్తానన్నానండీ అదీ తప్పు. అయ్యగారు అలిగారు. అంతే ఆధారం తెగిపోయింది. ఆ బంధం విడిపోయింది. నేను మాత్రం వీడితో బతుకంతా పడిఉండడానికి కంకణం కట్టుకున్నానా నేనేవాడి! ముఖాన ఊద్దామనుకున్నాను. ఎందుకంటారా చింపిరి చీరలకోసం వాడివెంట విరాగిని అయిందేమిరాఅనుకోరూ లోకం. నాస్కూలు పిల్లలు కలిసినప్పుడు నవ్వేవాళ్లు నాబట్టలు చూచి ఎగతాళి చేసేవాళ్లు. ఒక స్నేహితురాలు ఇంటికే వచ్చేసింది. ఈ పిసినారిగాణ్ణి కట్టుకోవడానికేనా కలలు కన్నావు అన్నది. ఇహ ప్రళయమే వచ్చేసింది.

అబ్బ ఎంత పోకిరితనం పెరిగిపోయిందబ్బా శీలానూ ఆమె మిండణ్ణి రైల్లో పట్టుకున్నారట! హవ్వ ఎంత అన్యాయం! ఎంతధైర్యమండి ఈఆడ పిల్లలకు! అబ్బో ఎంత సాహసం దానికి! కోర్టులో వాఙ్మూలం ఇచ్చిందట! ఆ వకీళ్లు ఎన్ని ప్రశ్నలు వేసిఉంటారు? ఛ ఏమోనబ్బా నాకైతే ఒంటికి ముళ్లు వస్తున్నాయి. వెలుకనయి వన్నంలో కాలం గడుపుతే బావుండుననిపిస్తోంది. ఆలా కాకుంటే నాలాంటి శీలవంతులకు రక్షణలేదండీ నా కళ్లల్లో వెలుగు ముఖంలోని వర్చస్సు, ఏంచేయమంటారు చెప్పండి. చూసినవాడల్లా గుటకలు మింగడమేనాయె.

ఒట్టు నిజం చెబుతున్నాను శీలావలె లేచి పోవాలనే ఆలోచన నాకు క్షణంపాటు **కూడా** రాలేదు. నమ్మండి అంతే నాకు సతీసావిత్రి కావాలనే కాంక్ష ఉందనుకునేరు! బొత్తిగా లేదు, మగవాని అదుపు ఆజ్ఞల్లో పడిఉండడం నాకు అసహ్యం. మగాడు సాధించిన విజయం ఏమిటి? పెళ్ళాం! పెళ్ళామేనండీ అది ఆడదాని నికృష్టభావం అనిపిస్తుందినాకు, మగానికి బానిసగా పడుండడమే ఆడదాని బ్రతుకా?

ఆడదానికి స్వాతంత్ర్యం అక్కరలేదా? ఆమెకు స్వేచ్ఛవద్దా? నా ఎదలో కదలాడే గుండెలేదా? నా గుండెలోతుల్లో ఉన్న ముత్యాలు వెలికి తీయగల పురుషుణ్ణి వెదుక్కోవడం తప్పా? నేరమా! ఆ అన్వేషణలోనె ఇంతదూరం వచ్చాను. కాని ప్రతిస్త్రీఒకపురుషుని ఆశ్రయం వెదుక్కుంటుంది. ప్రతిపురుషుడు

తన భార్యను తన సొత్తుగానే భావిస్తాడు. గర్విస్తాడు. ఇది తలచుకుంటే బాధ కలుగుతుంది.

సురేశ్ పాపం మంచి యువకుడు. అతనిభార్య అతన్ని ఆటలాడిస్తుంది. వచ్చిన జీతం సొంతం లాక్కుంటుంది. తాగి వస్తే ఇంట్లోనుంచి గెంటేస్తుంది. మరో ఆడదాన్ని కన్నెత్తిచూస్తే పుట్టింటికి వెళ్ళిపోతుంది. సురేశ్‌ను సంతోష పెట్టడానికి ఎన్నెన్నిచేశానని ! ఎందుకు చేశావు అంటారు. ఏంలేదు - ఆడదాని సాహచర్యం గొప్పది - అందుకు పెళ్ళాంఅనే గుది బండే అక్కరలేదని నిరూపించడానికి మేమిద్దరం స్వేచ్ఛగా ఎగిరే పక్షుల్లా ఎందుకుండలేం? అతణ్ణి నా ఇంటికి పిలిచేదాన్ని. తాగించేదాన్ని. రోజూ సినీమా చూపించేదాన్ని. మంచి హోటల్లో భోజనాలు చేసేవాళ్ళం. రోజంతా రమ్మీ ఆడేవాళ్ళం. ఒకనాడు అతడు ఓడిపోసాగాడు. రూపాయీలు అయిపోయాయి. గడియారం వంతు వచ్చింది. అదీ అయిపోయింది. ఉంగరం లాక్కోపోయాను. అతనికి చప్పున కోపం వచ్చింది. "ఈ ఉంగరం సీత గుర్తు. దీన్ని పణం పెట్టలేను. దీన్ని నీవు తాకకు" అన్నాడు.

అమాంతంగా ఆ ఉంగరంలో నాకు పాముపడగ కనిపించింది. ఈ మగాళ్ళు తమను గురించి ఎన్ని గొప్పలు చెప్పుకున్నా ఆడదాన్ని దగ్గరికివస్తే పాత చింతకాయ పచ్చడేకావాలి. అదిలేకుంటె వాళ్ళ కడుపు నిండదు.

నా మనసు పరితపించింది. గడచినకాలం గిర్రున తిరిగిరావాలనిపించింది, మళ్ళీ నేను పుట్టాలి. అమ్మమ్మ కోప్పడాలి. కన్నీరు దిగమింగాలి. లోకాన్ని చూడకుండా కళ్లమూసుకోవాలి. నాగుండెను తన గుండెలో దాచుకోగల పురుషుణి చేయిపట్టుకోవాలి. అలాంటి వాడికోసం రెండో అంతస్తునుంచి దూకగలను. జీవితాంతం పొయ్యిముందు కూర్చొని కళ్లపోగొట్టుకోగలను. అతనికి "గాజర్‌హల్వా" వండిపెట్టగలను అలాంటి వానికి ఆత్మార్పణం చేసికోగలను.

తన పాతివ్రత్యం నిరూపించడానికి శకుంతల పన్నెండేళ్ల తపస్సు చేసింది. పునీత సీతకోసం భూదేవి తన హృదయ కవాటాలు తెరిచింది - సీతను

తనలో దాచుకొని సీత పాతివ్రత్య ప్రకాశాన్ని సూర్యునిలా సర్వదా వెలగించ డానికి, నేనూ క్రమక్రమంగా భూమిలోకి కూరుకు పోతున్నాను. నా ధనుల ఖజానాలు ఖాళీ అయినాయి. నా బుగ్గల్లోని గులాబీలు వాడిపోయాయి - ఏడీ ఆరాకు మారుడు నన్ను వెదుక్కుంటూ రాడేమి ? ఏపతో తొత్తుముండ పెళ్ళాం రూపం ధరించి అతన్ని చెరపెట్టలేదుకదా ? నేను నా జీవిత హవన కుండంలో కోరికలు ఆహుతి చేశానని ఎవరికి తెలుసు? నేనూ వికసించని కుసుమంలా పవిత్ర హృదయం కలదాన్నే అని ఎవరు గ్రహిస్తారు? గమనిస్తారు ?

ఓ సావిత్రీ ! ఓ సీతా ! ఓ మరియమ్మా ! మీకు నా కథ వినిపించ బోవడం లేదు.

ఆడపిల్లలు "అవారాలు" ఎందుకు అవుతారో నాకు అర్థంకాదు. ఆడదాని కదలాడే ఎడదను కాపాడే ధనుల ముకురం ఉండదా వీళ్ళ దగ్గర ?

ఆం ఏమిటి నేను చెప్పింది ..? ఆం ఏమిటి నేను చెపుతున్నది ?

# శ్యామల

డిసంబర్ నెల చలి. అమాంతంగా వాన చుట్టుకుంది. అలాంటప్పుడు ఏ రిపోర్టరూ మంచిరిపోర్టు రాయలేడు. పైగా శ్యామలాదేవి ఇంకా గేటే తెరువలేదు.

నేను ఆ కవయిత్రిని అంతకుముందు చూడలేదు. ఆమె తన కవితకంటె అందం అయిందని అనుకుంటారు. అందుకే చలిలోనూ వానలోనూ గేటు ముందు నుంచున్నాను.

అప్పటికి రాత్రి తొమ్మిదిమాత్రం అయింది. అయినా ఇంట్లో చీకటి ఉంది. ఇల్లుసాంతం మౌనంగాఉంది. వర్షం పడుతున్నప్పుడు, పిడుగుల రొద వినిపించినపుడు కవులు కలవరంగా కదులుతుంటారని విన్నాను. కాని శ్యామలా దేవి ఏమో కలల్లో కరిగిపోతూందేమో!

శ్యామలాదేవి ఇంటర్వ్యూచూచి జాయంట్ ఎడిటర్ చేస్తానన్నారు ఎడిటర్. జాయంట్ఎడిటర్ అవుతానన్న ఆశతో మరోసారి గేటు చప్పుడు చేశాను. చప్పున పోర్టికోలోని లైటు వెలిగింది. ఒక స్త్రీ తలుపు తెరిచింది. తల బయటికి పెట్టింది.

"ఎవరది? ఇప్పుడెందుకొచ్చారు? ఉదయంరండి" చిరాకుగా అన్నది.

'నేనండీ _ నేను 'ఉహ' పత్రిక ఆఫీసునుండి.........'

"అవును బాబూ. కావచ్చు. ఎవరివైనా ఒక తల్లికి బిడ్డవేగా అలాంటప్పుడు ఈవానలో ప్రాణాలు ఎందుకు తీసుకుంటావ్!"

అది నాభవిష్యత్తుకు సంబంధించిన సమస్య. అదృష్ట ద్వారంముందు నుంచున్నాను. అది తెరుచుకుంది. అందులో ఒక మర్యాద తెలియనిఆడది మంచీ వెధవవాగుడు వాగుతూంది. ఎలా ఉంటుందంటారు. విషంలాతోచదూ!

నాకు శ్యామలాదేవిమీద కోపం వచ్చింది. ఇంటర్వ్యూకు టైమ్ ఇచ్చింది. ఇప్పుడీ అమర్యాద ఏమిటి? రిపోర్టర్ బలం ఆమెను శిక్షించలేదనా ఏమిటి ధీమా!

చూడండి ఇవ్వాళ వారి ఇంటర్వ్యూ చేయడం అత్యవసరం. కొద్ది సమయం దొరికినా ఇది చాలముఖ్యమైన పనిఅని వారికి నచ్చచెప్పగలను .... ఇంకా ....'

"అచ్చా....అచ్ఛా" ఆమె చేయిచాచి నా మాటను ఆపేసింది.

'రండి.... లోపలికిరండి. రేపు ఉదయం శ్యామలాదేవి ఇంటర్వ్యూ రాదు సరిగదా - ఒక మంచి రిపోర్టరును కోల్పోయిన వార్త తప్పక వస్తుంది. రండి లోపకి రండి.'

ఎంత స్వచ్ఛంగా ఉంది పనిమనిషి భాష! ఒక మంచి కళాకారుడు ఎన్నుకునే ప్రతిదాంట్లోనూ అందం తొంగి చూస్తుంటుంది. నేను గదిలో అడుగుపెట్టాను. హోటు పైంచి కారే నీటి ధారల్లోంచి ఆమెను చూచాను. ఎందుకో పాత పుస్తకం గుర్తుకు వచ్చింది. దుమ్మునిండిన పుస్తకం - పాత పుస్తకాల దుకాణంలోపడి-చెదలుతినని పుస్తకం-పిల్లలు చించిన పుస్తకం-చదివే వాళ్ళ చేతి చెమటకు తడిసినపుస్తకం.

శ్యామలాదేవి అందమైన కవితరాస్తుంది. ఇలాంటి అందవికారం అయి పాతపుస్తకం లాంటి ముఖం ఉన్నదాన్ని పనికి పెట్టుకుంది.

గదిలో విలువైన వస్తువులు ఉన్నాయి. అయిన చిందర వందరగ పడి ఉన్నాయి. బల్లమీది తివాచీమీద కుర్చీలమీద ఎక్కడ చూచినా పుస్తకాలు పడిఉన్నాయి. పాత కాపీలు పడిఉన్నాయి. కాగితాల గుట్టలు పడిఉన్నాయి. గోడలకు చాల పటాలున్నాయి. దంపతులపటం ఒకటుంది. అందులోని వధువు ముఖంమీద ముసుగుంది. వరుడు కెమెరాను తొలిసారి చూచినట్లు కళ్ళు వెళ్ళబెట్టాడు. ఒక అందమైన అమ్మాయిపటం ఉంది. అది పెద్దగా ఉంది. ఆమె ముఖంలోని కొంటెదనపు కిరణాలు: గదిలోని ఔదాసీన్యపు చీకటిని

పారదోలుతున్నాయి, ఒక యువకుని పటంఉంది. అతడు బక్క పల్చగా ఉన్నాడు. రెండు చేతుల్తో తలపట్టుకొని కూర్చున్నాడు. ఏదో ఆలోచనలో మునిగినట్లున్నాడు. అందమైన ఒక కాశ్మీర దృశ్యపు పెయింటింగ్ ఉంది. అందులో ఒక వేటకాడు వెళ్లిపోతున్నాడు. పడుకొనున్న యువతి వేదెత్తి వీడ్కోలు ఇస్తోంది.

నేను గదిలో అడుగు పెట్టగానే ఆమె స్టూలుమీంచి ఒకసీసా, అగ్గిపెట్టె తీసింది. అప్పుడు ఆమె నన్ను చూచిన చూపు ఎలా ఉందంటే నేను ఆమెను షూట్ చేస్తానేమో అని భయపడ్డట్లుంది. ఆమె ఎడకే చేతుల్తో అగ్గిపెట్టె సీసా ఒల్లకింద దాస్తుంటే అది పెట్రోలుసీసా అనే విషయం నా ముక్కు కనిపెట్టేసింది

ఆమె లోనికి వెళ్లిపోయింది. శ్యామలాదేవికి చెప్పడానికేమో? చాల సమయం గడిచింది. ఈలోగా తడిసిన హేటు తీశాను. బూట్లువిప్పి ఒక పక్కన పెట్టాను. ఎన్నో సిగరెట్లు కాల్చేశాను. గదిలో ఉన్నవాటినన్నిటినీ పరిశీలించాను. దిండుకింద ఒక ఉత్తరం కనిపించింది. అది రంజన్ శ్యామలా దేవికి రాసింది. అదీ చదివేశాను. రంజన్ శ్యామలాదేవి భర్త. కాని ఆ ఉత్తరంలో అలా లేదు. ఆమె అతని ప్రేయసి అని ఉంది. ఆమె మందిరంలో సింహాసనం మీద కూర్చున్న దేవి. ఆమెను కన్నెత్తిచూడ్డం రంజన్‌కు జీవితం లాగూ ఉంది, మృత్యువు లానూఉంది.

తివాచీని ఒక పక్కకు జరిపి, తడిసిన బట్టలు ముడుచుకుని కూర్చుం దామంటే దానికిందినుంచి కొన్ని కాగితాలు ఊడిపడ్డాయి అందులో మాఎడిటర్ గారి ఉత్తరం కనిపించింది. అది వారు శ్యామలా దేవికి రాశారు. ఒకమంచి కవిత పంపమని ప్రార్థించిన లేఖఅది.

శ్యామలాదేవి కవితలో దుఃఖం మెరుపులా కనిపిస్తుంది. ఆమె ఒక సుందర యువకుని ప్రియమైన భార్య. ఆమె జీవితం అందాలరాశి అని విన్నాను అయినా ఆమె కవితలో ఒంటరితనం, ఉదాసీనతా చోటు చేసుకుంటాయి. శ్యామలాదేవి ఏకాగ్రంగా రాయగలుగుతే అజరామరమైన అతిసుందర కవిత

రచించగూడదని మా ఎడిటర్‌గారి అభిప్రాయం. వచ్చేప్పుడు వారు నాకు ఆమాటా చెప్పారు. కవయిత్రితో అందును గురించి ముచ్చటించ వలసిందని ఆదేశించారు

పదిహేను నిమిషాలు గడిచాయి. ఎవరూ రాలేదు, నాకు విసుగుపుట్టింది తలుపు తట్టామనుకుంటుండగానే అప్పటి అడది కప్పులో వేడి కాఫీ తీసుకొని ప్రవేశించింది.

"మిమ్మల్ని చాలసేపు ఎక్షంలో నుంచోపెట్టాను. ఇదిగో అందుకి పరిహారం" అని కాఫీ కప్పు అందించింది.

"కృతజ్ఞతలు" అని కప్పు బల్లమీద పెట్టాను. "శ్యామలాదేవికి చెప్పారా-? అని అడిగాను.

"శ్యామలాదేవి... అవును నేనే శ్యామలాదేవిని" ఆమె విబ్బరంగా అన్నది.

అది విన్నాను-నాకు వణుకు వచ్చింది. చేతులు వత్తుకున్నాను. బట్టలు చించుకునేంత పనిచేశాను. కాఫీ కప్పు పవిత్ర గ్రంథమా అన్నట్లు అందుకున్నాను. నిప్పును అంటుకున్నట్లు వదిలేశాను. నమస్కరించడం, క్షమాపణ కోరడం కూడా మరచాను. నన్ను చూచుకుంటే నాకే నవ్వువచ్చింది. నాలో నేను నవ్వుకున్నాను. నాకు నేను నాటకంలో హాస్యపాత్రలా కనిపించాను.

శ్యామలాదేవిది విశాల హృదయం, ఆమెను చూస్తూనుంచున్నాను. ఆమె నిరాడంబరతకు ముగ్ధుణ్ణి అయ్యాను. తెల్లని మామూలు చీర, నగలులేనిమెడ, అలంకరణ లేని వదనం అతి సాధారణంగా ఉంది. వయసు 30,35 ఉంటుం-దేమో। అయినా వదనంలో బాల్యపు అమాయికత కనిపిస్తుంది. జీవితపు ఓటమి గుండెలో దాగదు. కామిలా రోగంలా ముఖం మీద తాండవం ఆడుతుంటుంది శ్యామలాదేవి వదనంలో అలాంటి 'కామిల' కనిపించింది. అది ఆమె కవితను గుండె లోతుల్లో నొక్కివేస్తుందేమో అనిపిస్తుంది. ఆమె అంత అందం అయిందేమీ కాదు అయినా జనం అలా ఎందుకనుకుంటారు?

"మీరు ఇంటర్వ్యూ చేయడానికి వచ్చారు కదూ! నా జీవిత విషయాలు కూడా అడుగుతారనుకుంటా"

"అవును" నేను అబద్ధంచెప్పేశాను. నేను వచ్చింది సాహిత్యవిషయాలు చర్చించడానికి.

"అలాగా?" ఆమెలో విషాదచ్ఛాయలు గోచరించాయి. అరచేయి గద్దవకు ఆనించి ఆలోచించింది.

"శ్యామల జీవితాన్ని గురించి ఇప్పుడేవినండి. రేపు ఈ సుందరకావ్యం మీద ఎవరి దృష్టి పడక పోవచ్చు" ఆమెలో అశాంతి, ఆవేదన గోచరించాయి.

"శ్యామల ఒక ఆటోగ్రాఫ్ పుస్తకం. అది జీర్ణం అయిపోయింది. దానిలోని రాతలు చెరిగిపోతున్నాయి–చదువరావు॥ మెల్లగా, మెల మెల్లగా చెపుతూంది

కొందరుస్త్రీలు జలతారు అట్టగల పుస్తకాలు అవుతారు. అవి ఆదరణీయుల ఆస్తి అవుంది. వాటిని అద్దాల అలమారులో దాచిపెడ్తారు. వాటివి ప్రేమగల చేతులతో విప్పుతారు. చదువుతారు. కొందరు స్త్రీలు మరొరకం పుస్తకాలు అవుతారు. పాఠకుడు దాని శీర్షిక చూస్తాడు, విసిరివేస్తాడు. పనికిమాలిన వారు వీటిని చదివి కాలక్షేపంచేయాలనుకుంటారు. సంచార గ్రంథాలయం వాటిని ఊరూరా తిప్పుతుంది. రెండుపైసలకు ఒకవి చొప్పున చేతులు మారుతుంది. చివరకు పచారీ దుకానానికి వెళ్లిపోతుంది. అక్కడవాడు పొట్లాలు కట్టేస్తాడు. అంతటితో పుస్తక జీవితం ముగుస్తుంది.

ఆమె నిట్టూర్పు విడిచింది.

"పుస్తకాలకూ జీవితం ఉంటుందా?" నాకు నవ్వువస్తూంది. "పుస్తకాలు స్త్రీలుగా మారిపోతున్నాయి"

"అయితే పుస్తకాలకూ స్త్రీలకూ ఏదో వ్యత్యాసం ఉందనుకుంటున్నారు. రెండూ ఒకలాంటివే రెంటిలో దేనినీ చదవకుండా కొనడానికి ఇష్టపడరు. అంతే కాదు చదివిన కథల్ని వినడానికీ ఎవరూ ఇచ్చగించరు.

మాట్లాడేప్పుడు ఆమెలో అందంవెల్లివిరుస్తుంది. గేయాల్లో ఈమె భాషాసౌందర్యం తొణికిసలాడుతుంటుంది.

"మీరూ జలతారు అట్టగల పుస్తకమే కదా!' అడిగాను-అంత ధైర్యం ఎలా వచ్చిందో!

"నేను ...నేనా?' తొలిసారిగా అంతర్దర్శనం అయినట్లు చూచుకుంది. తరువాత నన్ను చూచింది. ఆమె చూపుల్లో ఔదాసీన్యం కనిపించింది.

"నేను ఆటోగ్రాఫ్ పుస్తకాన్ని దాని సాదాపుటలమీద జనం అభిప్రా-యాలు రాశారు సంతకాలు చేశారు. వెళ్లిపోయారు" ఆమెకళ్ళలో నీళ్ళు నిండు-కున్నాయి. దుముక డానికి సిద్ధంగా ఉన్నాయి. నేను భయపడ్డాను. నా రిపోర్టు-పుట్టి మునిగిందను కున్నాను.

నేను మిమ్మల్ని మీ పూర్వ జీవితాన్ని గురించి అడిగాను ఆడవాళ్ళ పూర్వజీవితం రోమాంచకంగా ఉంటుందని నా ఉద్దేశం.

"అవును అదే చెప్తున్నాను. ఇంకా నాకు పద్నాలుగేళ్ళు నిండకముందే విధవను అయినాను"

'విధవ....' నేను ఉలిక్కి పడ్డాను. నా మనోనేత్రంలో శ్యామలాదేవి భర్తరంజన్ కనిపించాడు. అతడు తరచుగా మా ఆఫీసుకు వస్తుంటాడు. ఆమె నన్ను చూడ్డంలేదు. నా అవస్థచూడ్డంలేదు. శూన్యంలోకి చూస్తోంది.

"విఠల్ నేను చిన్న నాటి నుంచి కలిసి ఆడుకున్నాం. కలిసి పెరిగాం. నేను అతని భార్యను అయినాను. అతడు అలిగాడు. విఠల్ చనిపోయాడంటే నమ్మకం కలిగేది కాదు. దాగుడు మూతల్లో దాక్కున్నాడనిపించేది. ఆనాడే నాముఖంమీద ముద్రవేశారు 'అరిష్టము' అని.

"సరే అదంతా రాయకండి. ఇరవై ఏళ్ళ వయసులో మెట్రిక్ పాసైనానని రాయండి. అది మాత్రం ఎలా? నాకు చదువుమీద ధ్యాసపడింది కిట్టిపెళ్ళి

తరవాత. కాకుంటే ఒక మహాకవినాకు చదువుమీద ధ్యాస కలిగించాడని రాయండి. అతనే నన్ను శ్యామలాదేవిని చేశాడు. అవును అది మాత్రం ఎందుకు? రాశారా? కొట్టేయండి, అక్కర్లెదు.

ఆమె సోఫాకు తలఆనించి ఇంటి కప్పును చూస్తోంది. నిముషాలు గడుస్తున్నాయి.

నేను కలంపట్టుకుని కూర్చున్నాను.

"వింత జీవితం గడిపాను" తన లోతాను గునుగుకుంది.

'ఈ దరినుంచి ఆదరిదాకా నావెంట ఎవరూ లేరు. నేను వంటరినికాను. ఏ ఆడదయినా ఆలా జీవించగలదా?" తను సంబాళించుకొని నన్ను అడిగింది. ఆమె పెదవులు అదరుతున్నాయి ఎంత విగ్రహించినా కన్నీరు చెంపలమీంచి జారుతోంది

నేను జవాబు చెప్పలేదు. ఇదంతా నానెత్తిన వేసుకొని సిగ్గుతో క్రుంగి పోయాను.

ఇహ ఇలా చెప్పడం సాధ్యపడదు. రాసేస్తాను ఏమంటారు? మీరు మాత్రం ఇక్కడే కూర్చోవాలి. ఈ పని ఇవ్వాళే చెయ్యాలి." అన్నది గొంతు సరరించుకుంటూ.

,సరే ఆలాగేకానివ్వండి' నేను అన్ని షరతులకూ సిద్ధంగా ఉన్నాను. నేను కలంమూసి జేబులో పెట్టుకుంటే పద్నాలుగు సంవత్సరాల జైలు జీవితం నుంచి విముక్తి కలిగినట్లు నిట్టూర్చింది.
నేను పైలు కట్టేశాను. సిగరెట్టు ముట్టించాను.

"రంజన్ గారు ఇంట్లోలెరా"?

"లేరు, బయటికి వెళ్ళారు. రేపు వస్తారు."

"ఈ పోటో మీ పెళ్లినాటిది అనుకుంటా, అవునా"?

అవును ఆప్పటికి నాకు పధ్నాలుగేళ్లు. అయినా పసిపిల్లలా ప్రవర్తించే దాన్ని. నేనువెధవను అవుతే మా అమ్మ సైతం నన్ను మృత్యువును చూసినట్లు చూసేది. పగలంతా ఒక మూలకు కూలబడేదాన్ని. ఏంచేయాలో అర్థం అయ్యేది కాదు ఆలోచనలకు అంతు ఉండేది కాదు. ఒకనాడు ఉదాసీనంగా ఉన్న నన్ను రత్నం చూశాడు "ఎన్నాళ్లయింది నవ్వు నవ్వక...." అన్నాడు. నన్ను ఎవరో కుదిపినట్లనిపించింది,

మనం మనకోసం నవ్వుతాం, మనకోసం ఏడుస్తాం. ఆవిషయం పరులకు ఎందుకు ? అయినా జీవితంలో ఒకరోజు వస్తుంది ఆనాడుతెలుస్తుంది మన ఒన్నిటికై పియత్తులు, నవ్వుల లెక్కలు మరొకని దగ్గర ఉన్నాయని. అది తెలిసిన్నాడుఎలాఉంటుంది ? కుదిపినట్లుంటుంది కదిపినట్లుంది విద్యుల్లతను అంటుకున్నట్లుంటుంది. అప్పుడు మనం సూర్యునిలా వెలుగుతున్నామనీ, భూమి మన చుట్టేగుండ్రంగా పరిభ్రమిస్తూందని అనుకుంటాం రత్నం మాబాబాయి కొడుకు. నాకంటే అయిదారేళ్లపెద్ద. ఎంసకు మేం అన్నా చెల్లెళ్ళం. చిన్ననాటి పోట్లాటలు ఇంకా మరపురాని రోజులు. అతని పెళ్ళాం ముందే అతని జుట్టుపట్టుకొని లాగేదాన్ని. అతడు నాముఖాన మసిపూసేవాడు అతడు మసిపూసినా నేను నవ్వేదాన్ని. నాలుక బయట పెట్టి వెక్కిరించేదాన్ని.

నేను వెక్కిరించానా ? అతడు నాజుట్టుపట్టుకోడానికి వచ్చేవాడుకాదు. ఎంచేతంటే అదితెలుసుకొని ముందే నేనుకేకలు పెట్టేదాన్ని. ఏదైనా మనం అనుకున్నట్లు కాకుంటే సిగ్గువేస్తుంది. ఎవరో నోటిముందటి ముద్దలాక్కున్నట్లు అనిపిస్తుంది.

నేను తిరిగి చూచాను - పెళ్ళాం రత్నం జుట్టుపట్టుకొని ఊపుతూంది - ఇద్దరూ విరగబడి నవ్వుతున్నారు. నాకేమైందో తెలియదు — ఉరికానూ - రత్నాన్ని విడిపించాను - జారిపోయిన వదిన పయ్యెద సవరించాను.

"ఎందుకలా సతాయిస్తావు రత్నాన్ని?' అన్నాను. ఎవరూ మాట్లాల్లేదు. ఇద్దరూ ప్రతి మల్లా నుంచున్నారు. రత్నం తలవంచుకున్నాడు. చొక్కాకు

అంటిన దుమ్ము దులుపు కుంటున్నాడు. వదిన రెప్పవాల్చడంలేదు. నన్నే-చూస్తుంది. నాకేదో బుసలయింది. తలవంచుకున్నాను-ముఖం దాచుకున్నాను. మళ్ళీ ఎవరో నోటి ముందరి ముద్ద లాక్కుంటున్నట్లు అనిపించింది.

నా కాళ్ళు బలవంతంగా నన్నుగది పైపు లాక్కెళ్తుంటే వదిన చూపుల అగ్నిజ్వాల దోపలో పరుచుకున్నట్లు అనిపించింది. రాజ్యం శత్రువశమైన రాజులా నేను మంచంలో పడిపోయాను. నాకు తెలియకుండానే కన్నీరు దుమికింది. ఆడ పిల్లలు పెళ్ళాలు కాగానే ఇలా ఎందుకవుతారు? రత్నానికి తలనొప్పి లేచిందను కొంటే-పెళ్ళానికెందుకు బాధ?

చూడండి-ఒకేచోటఉంటే పశువులతో కూడా అనుబంధం కలుగుతుంది-ఏమంటారు అలాంటిది రత్నం నా చిన్ననాటి తోటివాడు. రత్నం నాసావాసకాడు-ముద్దుల అన్న. నేను విధవను అయినప్పుడు మాపిన్ని చాల దుఃఖించింది. మా అమ్మను తిట్టి, సాపించింది. నాకు పెళ్లి చేసి బావిలో తోశావంది. కాస్త ఓపిక వస్తే రత్నానికి చేసుకునేవాన్ని అన్నది. వారిద్దరూ ఎంత ప్రేమించుకునేవారు!

వారిద్దరూ ఎంత ప్రేమించుకునేవారు! నేను కళ్లుమూసుకున్నాను. ఆలోచించాను-ఒకడు ఒకే ఒకడున్నాడు నాకన్నీరు తుడిచేవాడు. అలాంటి వాడు నాకు అన్యాయం జరుగుతే సహించగలడా? అతడు నాముందుంటే నేను మనిషినే అనిపించేది నాప్రాముఖ్యం కనిపించేది. కాంతి కిరణం అద్దం మీద పడి చమక్కుమంటుందేఅలా!

"అదిగో అదీ రత్నంపటం" అని ఆలోచనలు ముసిరిన ఒక యువకుని పటం చూపింది.

పటంలో ఏముంది? రత్నం అంతా మాత్రంగా కూడాలేదు. అతన్ని ఒక్క సారి చూస్తే జీవితాంతం మరచి పోలేరు. అసలు ఆతన్ని మరచిపోవడం అసంభవం. రత్నంతో మాట్లాడుతుంటే కలల లోకంలో విహరించినట్లుంటుంది. మన చుట్టు పట్ల ఉన్నవారు కల్పనాపోగత్తులోని పాత్రల్లా కనిపిస్తారు.

లోకంలో అన్నింటికీ మించిన వాస్తవం రత్నం. అతడు మన ముందుంటే మనం ఏమీ ఆలోచించలేం, అతడు నాకడి-అవిశ్వాసి. కాని అతడు తన భార్య ఒడిలోంచి తన బిడ్డను లాక్కున్నప్పుడు నేను అతణ్ణి గుర్తించలేనంతగా మారి పోయేవాడు. అదొక వింత-సిద్ధాంతం, క్షణంలో ఒకవ్యక్తి ఒక వలపుకథలో పాత్ర అవుతాడు-మరుక్షణంలో చంద్రునిలో పోయి కూర్చుంటాడు. తెగిపడిన తారలా మనసునుంచి రాలిపోతాడు. కన్నీరు జల జల రాల్తుంది.

కన్నీటి వెలె రత్నాలన్నీ నా కంటినుంచి రాలుస్తున్నప్పుడు రత్నం భార్య ఆపడానికి చాల ప్రయత్నించింది. ఆరోజుల్లో రత్నం నాతో మాట్లాడ్డం మానే శాడు. ఎడిటర్ గారు! ఎందుకో నాకు అర్థంకాదు-భార్యలు భర్తల్ని పండిన మామిడి పళ్ళను తింటారు-అలాచెప్పవాలిందో దొంగలు విరుచుకు పడ్తారని భయపడ్తారు.

“అప్పనంటి ఆడవాళ్ళకు అనుమానాలు మెండు” నేను విన్నవించు కున్నాను.

“అంతేకాదు విధవల కోరికలు అక్రమసంతానం లాంటివి” ఆమె నా మాట విన్నట్లులేదు.

జనం వేలెత్తిచూపే కోరికల గొంతు నులిమెయ్యడం మంచిది. నేను వెళ్ళిపోతానని తెలిసింది. రత్నం జబ్బునపడ్డాడు. అతని బాధ చూడలేక పోయాను. మామగారి సేవలో జీవితం గడుపుదామని నిశ్చయించుకున్నాను. ఏ మాట కామాటే-వదిన వారించింది-వద్దంది, రత్నం అది విన్నాడు. కోపంగా ఊరికి వచ్చాడు 'లలితా! ఆమెను, ఆమెను ఆపకు. మామ గారింట్లో మనకన్నా తన వారు దొరుకుతారు' అన్నాడు.

రత్నం అన్నదానికి నేను ఏమి అనుకోలేదు. నాజీవితం తెల్లకాగితం లాంటిది. ఇష్టం వచ్చిన అభిప్రాయాలు రాసుకుంటారు. ఎడిటర్ గారు! గుండెలో

అనుమానాల అగ్గిరగులు తుంటే చేకిలో ప్రేమ పుష్పాలు వాడి పోకుండా ఉంటాయా?

"అవునండీ, నిజమేనండీ" అన్నాను. నాకు తెలుసు నేను ఉన్నాననే విషయం ఆమెకు అనవసరంఅని.

"అప్పుడు మామగారి ఇంటికి వెళ్ళిపోయాను"

"అయితే మీరు రత్నంను మరచి పోయారా" ? అడిగాను.

"అవును" అమె నిట్టూర్పు దిగమింగుతూ అన్నది. మరచి పోవడం అంత పెద్దవిషయమేమీకాదు. నగల దుకాణంలో ఉన్న వజ్రాల ఉంగరం ఊహా మాత్రంగా ఎంతకాలం ధరించగలం ?

"అయితే మామగారింట్లో ఆనందంగా ఉండి పోయారన్నమాట.

ఉంటాననుకోలేదు. ఎందుకంటే మా అత్తస్వభావం మంచిదికాదు జగడాల మారి. మా ఇంటికివచ్చినప్పుడు పోట్లాడి వెళ్ళిపోయేది. పాపం మా మామ మంచివాడు. ఈమెతో పడలేక మొత్తుకునేవాడు.

"తన పిల్లల్ని కూడా బాదేదేమో!"

"ఎక్కడి పిల్లలు - ఒక్కతే కూతురుకుట్టి" ఎంతోఆప్యాయంగా అన్నది.

పన్నెండు, పదమూడేళ్ళుంటాయి. ఎంత మంచిదనుకున్నారు? మతాబాగా వెలుగుతుండేది. పూలలా నవ్వుతుండేది, అలాంటి అమ్మాయిని మీరు చూచి ఉండరు, చూచిన వాడల్లా ముగ్ధుడు అయ్యేవాడు. ఆమె నామనసులో కాపురం పెట్టింది. ఇంతకాలం ఆమెకు దూరంగా ఎలా ఉండగలిగానో అర్థం కాదు. అంత మంచి బిడ్డనుకనీ అత్తకొంతమెత్తపడింది వేయిసార్లు దెబ్బలు కొడ్తే ఒక్కసారి ప్రేమగా పిలిచేది.

"అవును తల్లులైతే ఆడవాళ్ళ గుండె మెత్తపడుతుంది" నేను అన్నాను- కొత్త సిగిరెట్టు వెలిగిస్తూ.

మెత్తదనంలేదు. మన్నులేదు మోసం చేయడంలో మొనగత్తె. కడుపు కట్టుకొని పైన పైన కూడ పెట్టేది. కుండలో డబ్బు, బంగారం ఉంచి పొయ్యి దగ్గర పాతిపెట్టింది. కుట్టిపెళ్ళిని గురించిన ఆలోచన ఆమెను కుంగ తీసింది'

"అలాంటిది మిమ్మల్ని ఎలా సహించింది"?

"అది నిజమేకాని అత్తచాల దూరదృష్టి గలది. వయసులో ఉన్న విధవ ఇష్టం వచ్చినట్లు తిరిగిందనుకోండి. నిప్పులు ఎవరిమీద కురుస్తాయి? పెళ్లికాని పిల్లమీదనేగా! కంటి భవిష్యత్తును తీర్చిదిద్దాలంటే నన్ను పోషించడం అవసరం అయిపోయింది. కుట్టి ఎప్పుడూ నాచుట్టు తిరుగుతుండేది. ఆమె నామనసులో ఓతం వేసింది, ఆమెను పొంది రత్నాన్ని మరచాను. నా గుండెలో బల్లెములై గుచ్చుకున్న అతని కటుపైన పదాల్ని మరిచిపోయాను. కుట్టి స్కూలుకు వెళితే ఆమె వస్తువులు సర్దేదాన్ని ఆమెకోసం బొమ్మలు తయారు చేసేదాన్ని ఫ్రాకులు కుట్టేదాన్ని సూటర్లు అల్లేదాన్ని ఆయినా పొద్దుగడిచేదికాదు, అంత చిన్న వయసులో పిల్లలు చదువుకు అంటుకుపోవడం నాకేం బాగనిపించేదికాదు కుట్టిసాయంత్రం ఇంటికి వచ్చేది హోంవర్క్ స్వయంగా చేసుకునేది. నా కాళ్లమీద పడుకొని మొక్కజొన్న కంకులు తినేది. రిజల్టు వచ్చింది. కుట్టి ఫెయిలయింది. నా గుండెలో ఎవరో తుపాకి దట్టించినట్లయింది. ఏడ్చిఏడ్చి పిచ్చిదాన్ని అయినాను. నన్నుచూచి కుట్టి ఏడ్చింది ఇవ్వాళ రేపు చదువు కున్న అమ్మాయిలకు ఆదరంఉంది. మామ దగ్గర డబ్బేముందని బంగారం లాంటి పిల్లవాణ్ణి తేవడానికి. గుణాన్ని చూచే చేసుకుంటాడని పెళ్లిచేయాలని నిశ్చయించారు.

"అదేమిటీ" ఆశ్చర్యంగా అడిగాను.

మీకు ఇదికూడా తెలయదా? బాల్య వివాహాల వలన ఎన్నో ప్రయోజ నాలున్నాయి. పిల్లచిన్నదయితే ఆమె ప్రవర్తన చూడరు. పిల్లవాడు చిన్నవా డయితే ఎలాంటి పిల్లనయినా కట్టబెట్టవచ్చు."

"అయితే కుట్టిపెళ్లి అయింది.

"అవును ఎంత ఆప్యాయంగా రత్నాన్ని పెళ్లికొడుకును చేశానో, అంత ఆప్యాయంగా కుట్టిని పెళ్లికూతుర్ని చేశాను. కుట్టి వెళ్ళిపోతే నాసర్వస్వం దొంగలు దోచుకున్నట్లు అనిపించింది. ఎడిటర్ గారూ! ఎంత బుద్ధిహీనురాలిని నేను. ఒకేసారి విశల్‌తో సహగమనం చేస్తే సరిపోయేది, ఇహ ఇప్పుడు సగంకాలిన నాదేహాన్ని చితినుంచి తెస్తున్నారు.

కుట్టి భర్తరంజన్ మంచివాడు,

'ఏమిటి రంజన్ కుట్టికి మొగుడా?' నేను కూర్చున్న చోట నిలువ లేక పోయాను.

'అవును....' నిబ్బరంగా అన్నది.'మంచి కుర్రాడు కుట్టిఅత్తవారింట్లో ఏడుస్తే మోటర్ సైకిల్‌మీద నాదగ్గరికి తెచ్చేవాడు.॥

'మేమిద్దరమూ మీ కోసం ఏడుస్తున్నాం" అనేవాడు

'అది విని ముగ్గురమూ నవ్వాం. అతను బాగా చదువుకున్నవాడు, కాలేజీలో చదువు చెప్పుతాడు. అందుకే కుట్టిఅంటే అంత ఇష్టం. నా విషయంలో చాల శ్రద్ధతీసుకునేవాడు. నాఒంటరితనం చూళ్ళేక పోయేవాడు. ప్రతి ఆదివారం ఇంటికి వచ్చేవాడు. నాతో మెట్రిక్ పరీక్ష ఇప్పిస్తానన్నాడు. బస్సీకి తీసికెళ్ళాడు. అతడు మంచి కవి అతని అందమైన గేయాలు విని నేనుఏడ్చేదాన్ని. నేను పటికి బెల్లపు గడ్డను కాస్త తడి తగుల్తే చాలు కరిగిపోతాను.

ఊరికి అవల, చేలపక్కన, చింతచెట్టుకింద మేము చదువుకునేవాళ్ళం. కుట్టి సీతాకోక చిలుకల్ని పట్టడానికి వెళ్ళిపోయేది. మేమిద్దరం చెరకు తింటూ షేక్స్పియర్ "హమ్లెట్' చదివేవాళ్ళం. అప్పుడప్పుడు అతడు 'ఒడిసీ' వినిపించేవాడు 'పెనూలెప్, సహనం చూస్తే నాకు ఏడుపువచ్చేది. నా కన్నీరుచూచి అతను సంతృప్తుడుచుకునేవాడు. రాత్రిళ్లు చాలసేపు మేలికతో ఉండి కవిత రాసేవాడు మరునటిరోజు పొలాల ప్రక్కన కూర్చున్నప్పుడు తనకొత్తకవిత నా పదముల వద్ద పెట్టి పోయేవాడు. మేమిద్దరం అలా మిన్న కుండడం చూసి కుట్టి నవ్వేది.

నా పేరుతో ప్రచురింపబడిన రంజన్ కవితలుగల పత్రికలు చూపాడు అది చూచి నేను విడమకున్నాను. నేను అనాథను పేరూ ఊరు తెలియని ఆడదాన్ని ఎవరికన్నా తెలిస్తే? అతను నన్నుచాల ప్రఖ్యాతిపాలు చేశాడు! అ మాట అంటే నవ్వేవాడు"

"మిమ్మల్ని గురించి నా అభిప్రాయం అదే'

"అభిప్రాయం! నేను అదిరి పడ్డాను."నన్ను గురించి మీకూ అభిప్రాయం ఉంది." అని ఏడ్చేశాను. ఏమిటిది నా జీవితపు అన్ని పుటల మీదా పరుల అభిప్రాయాలు రాసేస్తున్నారు!

'ఒకరోజు ముగ్గురం ఇంటికి తిరిగి వస్తే అత్తకు చాల కోపం వచ్చింది. రంజన్ను కూడా రత్నం అనుకుంటున్నావా అన్నది

ఇవాళ మళ్ళీ విషం పూసిన బాణం నాగుండెలో దిగింది.ఇప్పుడు స్మృతుల సమాధులున్న గుండెల ఆడదానికి అది ఎంత బాధాకరమో మీకు తెలియదు.'

ఆమె కళ్ళను కొంగుతో తుడుచుకుంది. గదిలో గంభీరమైన నిశ్శబ్దం ఆవహించింది. నేను ఊపిరి బిగపట్టి కూర్చున్నాను. ఎన్ని రకాల తలపులు తలచుకుందో కొంత సేపు అలాగే ఉండి పోయింది. తరువాత మెల్లగా చెప్పింది.

"మరుసటి రోజు నన్ను పొగడుతూ వచ్చిన సంపాదక లేఖలు చూచాను రంజన్ రాసిన కవితలన్నీ కుట్టివడిలో వేశాను. నేటి నుంచి కవితలునీవి పేరు నాది, అన్నాను. రంజన్ను కోప్పడ్డాను.'ఇహ మీరిద్దరూ పట్నం వెళ్ళిపొండి. మళ్ళీ ఇటు ముఖం చూపించ వద్దు తెలిసిందా?'అన్నాను.

"అది విన్నాడు అతడు అలిగాడు 'ఇంత రాతి గుండె దానివని అను-కోలేదు, అన్నాడు'

వెళ్ళిపోయేప్పుడు వాస్తవంగానే కోపంతో పెదివి కొరికేస్తున్నాడు.

"సరే నేను విఫల కామనల స్వప్నాల మధ్య మున్నాను. నన్ను గురించిన అభిప్రాయాలన్నీ మున్నెప్పుడో విన్నట్లే ఉంటాయి. కాని కుట్టి పట్నం పోయి చాల సుఖపడింది. ఆమె బి ఏ పాసైంది. ఆమె గొప్ప కవయిత్రి అయింది. ఆమెకు పట్నంలో గొప్ప ఆదరాభిమానాలు ఉన్నాయని విన్నాను. రంజ వంటే ఆమెకు చాల ఇష్టం. ప్రతివారం నాకు ఉత్తరం రాస్తుంది. దాన్నిండా రంజన ప్రేమకు సంబంధించిన ముచ్చట్లే ఉంటాయి. గతవారం మీ సంపాదకుని ఒక లేఖ నాకు పంపింది. మీ ఎడిటర్ చాల కఠినుడు'

'ఏమి? ఏమైంది?, ఆమె మాట్లాడలేదు. కాని ఆమె ముఖంలో ఆవేదన చూచి నాకే సిగ్గనిపించింది.

"మీగీతాల్లో వేదన చూచి మీరు రుచికరమైన బాధాకవితరాయ గలరని పిస్తూంది. ప్రయత్నించగూడదూ అని రాశారు. కుట్టికి మీసంపాదకుడు' ఆ ఉత్తరం చదివి రంజన్ చాల బాధపడ్డాట్ట. శ్యామలాదేవి ఊళ్ళో నవ్వుతూ ఉన్నన్నాళ్ళు నా కలా ప్రశాంతంగా ఉంటుంది. ట్రాజిడీ రాయలేను అన్నాట్ట అసలా ఉత్తరం అతడు చించేసేవాడేనట. కుట్టి లాక్కొని రహస్యంగా నాకు పంపింది"

"నిజం"! నేను నిస్సహాయునిలా కేక పెట్టాను. ఆమె జారిపడనున్న బాష్పబిందువులా వడకింది.

'అయితే మీరు కుట్టికి ఏంరాశారు'

'ఏమీలేదు' ఆమె పంటితో పెదవిని కొరుకుతూ అన్నది.

'ఆ ఉత్తరానికి జవాబుగా ఇక్కడికే వచ్చేశాను. నేను ఇక్కడికి రావడం కుట్టికి ఏమాత్రం ఇష్టంలేదు. ఇంకా ఆమె పసిపిల్ల కాదుగా ఊరికే నవ్వుతూ ఉండిపోవడానికి! అయినా నేను ఆమెను సమాధాన పరచగలను. ఇక్కడే రంజన్‌ముందే అకస్మాత్తుగా ఏదైనా ప్రమాదం జరుగుతే రంజన్ చాల బాధ పడ్తాడు. కుట్టి కోరిక తప్పక పూర్తి అవుతుంది.'

నాకు భయం అయింది. శ్యామల దాచిపెట్టిన సీసా అగ్గిపెట్టె చూడ సాగాను. పదాలు గొంతులో ఇరుక్కున్నాయి. బయటపడ్డంలేదు. నేను చకితుణ్ణయి కూర్చున్నాను - ప్రతిమలా. ఆమె మెల్లగా కళ్లుతెరిచింది. నన్ను చూచింది. ఉలికి పడ్డది. చప్పున లేచింది. నుంచుంది.

'క్షమించండి. అనవసరంగా మీ సమయం వ్యర్థపరచాను. లోకం శ్యామలాదేవి అని పిలిచేవారి ఇంటర్వ్యూకోసం వచ్చారు మీరు' అని లోనికి వెళ్ళిపోయింది.

నేను నిశ్చేష్టుణ్ణయినాను. మొత్తంమీద కదలడానికి సిద్ధపడ్డాను. అదే సమయంలో జలతారు బైండు పుస్తకంలాంటి అందమైన ఆడది గదిలో ప్రవేశించింది. ఆమె ధరించిన అందమైన బట్టలు వలపుకవితలు సంకలనంలా ఉన్నాయి.

"క్షమించండి - ఆలస్యం అయింది. నా కవితా శిల్పాన్నిగురించి అడగ దలచుకున్నారు కదూ" అన్నది. ఆమె ధ్వనిలో ఒక మహాకళాకారిణికి ఉండే దర్పంఉంది. సోయగం వలకబోస్తూ సోఫాలో కూర్చుంది.

'అవును నిజమే - కాని ఇప్పటికే ఆలస్యం అయింది' అని లేచి నుంచున్నాను.

# శాలువ

సర్వర్‌కు ఎలా చెప్పడం? ఎలా సమాధాన పర్చడం? తల్లికి అది సాధ్యం కాలేదు. ఆమె ఓడిపోయింది - కాదు - మాతృహృదయం ఓడిపోయింది. ఆమె వార్ధక్యపు బరువుకు కుంగిపోయింది. శక్తి ఉడిగింది. పగిలిన ట్రంకుపెట్టెకు తాళ్లుకట్టి వసారాలో పెట్టేరోజు వచ్చేసింది. సర్వర్ పురికొసతో కట్టిన పక్కచుట్ట పెట్టెపైన పెట్టాడు. పళ్లెం, పాందాన్, లోటా పక్కన పెట్టేశాడు. ఆమెకో బురఖా వుంది. అది పాతబడ్డది. చిరుగులు పడ్డాయి. దాన్ని బాగుచేసింది కోడలు. తెచ్చి అందించింది. బురఖా అవసరం అయిన వయసుకాదు ఆమెది. పరువం దొర్లిపోయింది. వదనంలో వర్చస్సులేదు

ఆమె వేసుకునే 'సలీంషాహీ' చెప్పులు అరిగిపోయాయి. విరిగిపోయాయి. వాటినే వేసుకుంటుంది. అవి సగం కాళ్లకే వస్తాయి. ఆచెప్పుల్తో 'సటర్ పటర్' మంటూ ఇల్లంతా తిరిగుతూంది. ఆమె చెదిరిన స్మృతులను కూడగడ్తూంది. సర్దాల్సిన వస్తువులను గురించి ఆలోచిస్తూంది. ప్రయాణానికి ముందు ఒకరకపు భయం ఆవహిస్తుంది. అలాంటి బుగులు పట్టుకుంది ఆమెకు

ఆమె గదిదాటింది. అంతే మనుమడు తోఖీర్, అతని చెల్లెలు 'జమాల్' గదిలో ప్రవేశించారు. సర్వే ప్రారంభించారు. అక్కడ ఉన్నదల్లా విరిగిన సామగ్రికుప్ప - దానిమీద సాలీని గూళ్లు! ఆ కుప్పకు ఈ ముసలమ్మ కాపలా! ధన రాసులకు కాపుంటుందంటారే సర్పం. అలా కావుంటుందా కుప్పకు మనవలకు బామ్మను సతాయించాలని సరదా. తమలపాకు తొడిమపడుంది. దాన్ని అందుకు జమాల్.

'బేటా! ఏమిటి తీశావు? అది నాకు అక్కరకు వచ్చేది' అనేసింది. అంత దూరంనుంచి కనిపిస్తుందా ఏమన్నా. ఏదో అనాలని అనేసింది.

'తమలంపాకు తొడిమ......' తోడిమ చూపుతూ అన్నది జమాల్

"ఏదీ చూస్తా" అంటుంది అరచేతిలో వేసికొని కంటి దగ్గరగా పెట్టు కొని చూస్తుంది. అప్పుడు గాని నమ్మకం కుదరదు ఆమెకు. అయినా ఊరుకోదు. 'ఏమిటా వెధవ అలవాటు ప్రతీది అందుకుంటావు' అని గునుస్తుంది.

ఈ పిల్లలు ఆమె మెడమీది కత్తిలా తయారయ్యారు. తలప్రాణం తోకకు తెస్తున్నారు. మనవలంటే ఆమెకేం ద్వేషంలేదు. డబ్బుదగ్గరున్న దోషం అది. ఉన్నవారి గుండెలు ఎప్పుడూ దడదడ లాడుతుంటాయి. వారికి సర్వత్రా దొంగలే కనిపిస్తారు.

నలుగురు కొడుకులు, ఒక కూతురూ పాకిస్తాన్ వెళ్లిపోయారు. మిగిలిన వాడు చిన్నకొడుకు 'సర్వర్' క్లార్కు ఉద్యోగం వెలగ పెడుతున్నాడు. ఇది పాత కొంప. తండ్రి తాతల సొత్తు. ఈ కొంపలో దీపం పెట్టడానికి ఉన్నాడు సర్వర్ కొంప చాల పాతది. అమ్మ నడుంలాగే వంగింది. దానికి పళ్లులేవు. రాలి పోయాయి. అత్తకింద సంసారం చేయడం సర్వర్ పెళ్ళానికి గిట్టదు. అత్తేమో ఇల్లువదలనని కూర్చుంది. కోడలు మెడమీద అంకుశంలా నిలిచింది.

అది పాతకొంప. కొంపలా లేదు. గోడులా ఉంది. అందులోకి కోడళ్లు వచ్చారు. వారికి పిల్లలు పలిగారు. ఆమె వెనక్కు జరుగుతూ పోయింది. ఇప్పుడామె ఉన్నది ఇల్లుకాదు. కొట్టడి. కప్పు కురుస్తుంది. అయినా దాన్నే పట్టుకొని కూర్చుంది. ఎక్కడెక్కడి నుంచో తెస్తుంది. ఏవేవో తెస్తుంది. అక్కడ దాస్తుంది. అవన్నీ వెధవ సామాన్లు. పారేయాల్సినవి అని కోడళ్ల అభిప్రాయము.

అక్కడ విరిగిన ముక్కలున్నాయి. చిలుం పట్టిన తుక్కుంది. రంగు రంగుల గాజు ముక్కలున్నాయి. కత్తిరించిన బట్టల ముక్కలున్నాయి. పాత బొమ్మలున్నాయి. ఆ బొమ్మలు ఆమె బిడ్డలవి. బిడ్డలకూ అవి పనికి రావివ్వాళ వీటన్నింటినీ సందుకల్లో పెట్టి దాచింది. జాగ్రత్తగా కట్టిపెట్టింది. పురాతన స్మృతులను భద్రపరచుకున్నంత పదిలంగా భద్రపరిచింది.

వాటిల్లో ఒక జరీ చొక్కా ఉంది. అది ఆమె తండ్రి పెండ్లికి కుట్టించింది. కొన్ని పింగాణీ రికాబీల ముక్కలున్నాయి. ఆరికాబీలు వాళ్ళమ్మ పుట్టింటినుంచి ఆరణంగా తెచ్చినవి. వాటిల్లో ఆమె తండ్రి బొంత ఉంది. అతని తాతకు సంబంధించిన చరిత్రాత్మకమైన శాలువా ఉంది.

ఆమె జీవితపు అన్ని పోరాటాల్లోనూ ఓడిపోయింది ఇప్పుడు దరిలేని జీవన సముద్రంలో మునకలు వేస్తోంది అలాంటప్పుడు ఆ శాలువ మీద అభిమానంఏర్పడింది. అది సంద్రంలో ఓవిలా ఉపకరిస్తోంది.-మునగకుండా కాపాడుతూంది. ఆమె ఉన్నది చీకటి కొట్టిది. అందులో ఈ శాలువ వేయి క్యాండల్సుబల్బుగా వెలుగు విస్తోంది. ఆవెలుగుతో ఆమె కఠినాతికఠినం అయిన మార్గాన్నయినా పయనించ గలదు.

శాలువలో బట్టేంలేదు. అది అప్పడంలా ముక్కలయింది. అయినా జరీ ఉంది అందులోంచి కొన్ని సేర్ల వెండి రాగలదు. ఈవిషయం, ఒకనొకనాడు సర్వార్ భార్య భర్తతో చెప్పింది.

మర్నాడు ముసలమ్మ గదివదిలి వెళ్ళింది. ఆమె మేనల్లుడు జబ్బుగా ఉన్నాడు. చూచిరావడానికి వెళ్ళింది పెళ్ళాం మొగుడూ కలిశారు. శాలువ జాగ్రత్తగా తీశారు. దానిస్థానంలో పెళ్ళాం తన పాతదుప్పటి ఉంచింది, జాగ్రత్తగా పెట్టె మూసింది. పెట్టెమీది మూటలు మళ్ళీమామూలుగా సర్దింది. దానిమీద మూటలు, నల్లమందు డబ్బా, మందుల సీసాలు వగైరా అన్నీ ఉన్నవి ఉన్నట్లు ఏర్పాటు చేశారు. దుమ్ముకు తప్ప దేనికి స్థాన చలనం కలిగినట్లు కనిపించదు.

అన్నిటినీ దింపి, పెట్టెతెరిచి, శాలువను చూచుకొనేంత శక్తిలేదు ముసలమ్మకు. కాబట్టి కోడలుపెట్టిన పాత దుప్పటినే శాలువ అనుకుంటూ బతుకు లాగుతూంది. దాన్ని కాపాడ్డానికి రాత్రిళ్లు నిద్రపోదు. కోడలు మీదికి ఎంటి కాలిమీద లేస్తుంది. కొడుకుంటె లెక్కలేదామెకు. ఏమిటీ పైస పైసకు పరితపిస్తాడు: తానో- శాలువ అమ్మితే సామ్రాజ్యాన్ని కొనేయగలదు శాలువ ఆమె సర్వస్వం, దాన్ని కాపాడ్డానికి రంగు రంగుల కలలు వాకిటి దాకా వచ్చి

విరిచి పోతాయి. ఏ మాత్రం కన్ను మలిగినా తాలువ ఉండదు. అదిపోతే ఆమె అందమైన బాల్యం పోతుంది సొగసైన కౌమార్యం పోతుంది. వివాహ జీవి-తపు మాధుర్యం పోతుంది. ఈ ముసలి తనపు ముక్కిళ్ళో.... ఇన్నిటి కోసం ఏడవడానికి కన్నీరేది? ఏది మిగిలింది? ఎక్కడవుంది? అందుకోసమే అయిదు గురు బిడ్డల్ని మరిచింది. వారి సంతానాన్ని మరిచింది. అక్కణ్ణుంచి వచ్చే ప్రతి ఉత్తరంలోనూ తల్లికోసం పరితాపమే ఉంటుంది. వారికేంతెలుసు దేని-కోసం తల్లి ఈ ఇంటిని అంటి పెట్టుకొని ఉందో? చిన్నకొడుకు మీద పడి-ఏడుస్తూంటుంటారు. అయినా స్వదేశం వదల్లేదను కుంటారు కాని ఈ కొట్టిడీని నరకంలో పారేయండి. అక్కడా ఆమె హాయిగా ఉండగలదు. అక్కడా ఆమె సంచుగను అనుకొని జపమాల తిప్పగలదు, అక్కరకు రెండు మూడు సార్లు తప్ప ఆకాశం ముఖం చూడదామె—అది హిందూస్తాన్ ఆకాశం అయి-తేనేం? పాకిస్తాన్ ఆకాశం అయితేనేం?

అప్పుడప్పుడు జమాల్ ముసలమ్మ కొంగు పట్టుకొని "అవ్వా! మా ముత్తాత తాలువ చూపెట్టవా?" అని గిమాలుతుంది.

"చూపిస్తాలే" అని తప్పుకొనేది. ఆమెకు పెట్టెతెరవడం ఇష్టంలేదు. సామాను పరచడం అంటే భయం ఎందుకంటే మనవలు సామాను మీద పడ్తారు. ఒకరు రంగుల అద్దాలు లాక్కొని ఉరుకుతారు. ఇంకొందరు మట్టిబొమ్మ అందుకుని మాయం అవుతారు. ఇలా దానం చేయడం మొదలు పెడ్తే ఇన్నింటిని ఎలా కూడబెట్ట కలగేది? ఆ కూడ బెట్టడంలో ఉన్న కష్టం ఏమిటో ఆమెకే తెలియాలి ఇందుకోసం ఆమె అన్ని సుఖాల్ని వదులుకుంది.

ఇహ మిగిలిన రోజులు ఇలాగే వెళ్ళబుచ్చాలనుకుంది. ఇంతలో పెద్ద కొడుకునుంచి ఉత్తరం వచ్చింది. మనవరాలు పెళ్ళి నిశ్చయం అయింది. ఆమె ఇప్పుడు రాలేకుంటే ఎప్పటికీ రాలేదని రాశాడు కొడుకు ఆ మాటల కింద ముసల్ది బంగారు ఇటుకలు దాచిందని కొడుకుల నమ్మకం. ముసల్ది గుటుక్కు మంటే సర్వర్ అదృష్టం పండుతుందని వాళ్ళమంట.

ముసలమ్మకు కొట్టిడిలో సంపద ప్రాణంలా ప్రియమైందేగాని ప్రాణం మాత్రం కాదుగా! ఎవడికి తెలుసు ఆమాంతంగా కళ్లుమూస్తే పాకిస్తాన్‌లో బిడ్డలు పిలుస్తూనే ఉండిపోతారు. అందుకే ఆమె పాకిస్తాన్‌వెళ్ళడానికి అంగీకరించింది. దాంతో సర్వర్ అదృష్టం పండింది. పాస్‌పోర్టు తయారుచేయించాడు. వెంటవెళ్ళడానికి ఒక మిత్రుణ్ణి వెదికివెలికి తీశాడు. కోడలు గబ గబా ముసలమ్మ సామాను బయట పెట్టింది. కోడలుకు ప్రేమ అమాంతంగా పుట్టుకవచ్చింది మంచినేతిఐని వనస్పతిలో ఖర్జూరకాయలు వేపి పెట్టింది.

శాలువ అతి విలువయింది దాన్ని వెంట తీసికెళ్ళడం బాగనిపించలేదు అక్కడ కొడుకులు ఆమాటా ఈ మాటా చెప్పి లాగేసుకున్నా లాగేసుకోవచ్చు అందుకే పెట్టెలో పట్టినన్ని పెట్టుకుంది, కొట్టిడికి తాళం పెట్టింది. తాళాన్ని చూస్తే ఆమె కళ్లకు వరదలు వచ్చాయి. ఆమె జీవితపు జయాపజయాలు మూట కట్టి అందులో దాచుకుంది, అందుకే ఆమెగుండె పొంగింది. కోడలుమీదపడి ఏడ్చింది.

'ఈ కొట్టిడి నీకు అప్పగిస్తున్నాను నా తరవాత ఇదంతా నీదే' ఈమాట ఆమె బాగా ఆలోచించే అన్నది. ఎంచేతంటే కోడలుకు నమ్మకం కలగాలని ఆమె తొందర పడొద్దని!

'అవ్వా మా ముత్తాత శాలువ ఏ పెట్టెలో దాచిపోతున్నావు?' తోఖీర్ అడిగాడు.

'వెధవ, వెళ్ళేప్పుడు సతాయిస్తాడు' అని కొడుకును నాలుగు బాదింది. తల్లి. తాను కొట్లోని ఏ వస్తువూ అంటుకోనని ప్రమాణంచేసి చెప్పింది ముసలమ్మకు

రైల్లోకూర్చుంటే ఆమెప్రాణం హాయిగా ఉంది. గదికి అలీగఢ్ తాళం వేసి వచ్చింది. అది చాలలావుపాటిది. ఎంతా మూణ్ణేళ్లేగా అనుకుంది. సంచీలో తాళంచేయి చూచుకుంది.

బొంబాయి చేరారు, వారంరోజులు హోటల్లో ఉండాల్సి వచ్చింది. ఆఖరుకు అల్లా అల్లా అని అవ్వ ఓడలో కూర్చుంది. సర్వర్ స్నేహితుడు వెంట ఉన్నాడు. అతడు జేబులోంచి ఒక కార్డుతీశాడు, అది ఆమెమనవడు తోఖీర్ రాసింది. మంచి ఉర్దూలో రాశాడు. సర్వర్ మిత్రుడు చదివి విని పిస్తున్నాడు

ప్రాణ సమానురాలైన నాన్నమ్మకు,

పాదాభివందనములు ఇక్కడ మేమంతా క్షేమం. మీ క్షేమం తెలియ పరచవలెను. ఇంకను విశేషములేమనగా మా ముత్తాతగారి శాలువ ఎక్కడను కనిపించలేదు. నేనూ జమాల్ గదిసాంతం గాలించాం, శాలువ ఎక్కడ దాచిన విషయం తిరుగు టపాలో తెలియజేయవలసింది.

మీ సేవకుడు
తోఖీర్ మిర్జా - అయిదవ తరగతి (అలీఫ్)
స్వదస్తూరితో రాసినది

సర్వర్ మిత్రుడు ఉత్తరం వినిపించాడు, చూస్తే ముసలమ్మ శాలువ వెదకడానికి ఎక్కడికో వెళ్ళిపోయింది. ఆశ్చర్యంతో ఆమె నోరు తెరిచేవుంది. శాలువను పట్టుకొని వ్రేలాడుతున్నట్లు పిడికిళ్లు బిగించి ఉన్నాయి.

# సరస్వతి

ఈ చౌరస్తా మీదనే నా గౌరవ మర్యాదలూ, వలపూ ముక్కలు ముక్కలయి పోయాయి. ఆ ముక్కల్ని వెదకడంలో నా వేళ్లు రక్త సిక్తములు అయినాయి.

ఆ పాత స్మృతులు నా మెదడును రక్తపంకిలం చేస్తున్నాయి. నా జీవితపు వెలుగుల దొంతరను ఎంచుతున్నాను—ఎకనామిక్స్ నోట్సు రాస్తున్నాను.

ఆనాడు నా కుడికన్ను ఆదే పనిగా అదురుతూంది. సూర్యుడు ఎన్నడూ లేనంతగా వెలిగిపోతున్నాడు—కప్పులో గూళ్ళు పెట్టుకున్న పిచ్చుకలు కిచ కిచ మని సందేశాలు ఇస్తున్నాయి పిచ్చుకతో నాకు చిక్కని స్నేహం, అది నా చిరిగిన బట్టల్ని చూచి నవ్వదు—అవహేళన చేయదు. అందువల్ల అలాంటి స్నేహం నాకు అపచాల గడ్డురోజులు అతి కష్టంగా కాలం గడుస్తూంది. అందుకే ఆరోజుల్లో మంచిఆలోచనలు వచ్చేవి. నేను బి.ఏ పాసైనాను. అప్పుడు నాజీతం పెరుగుతుంది అంత డబ్బు ఎలా కర్చుచేయడం అలాంటి ఆలోచలు వచ్చేవి.

ఈ లోగా పిచ్చుక కిచ కిచ మన్నది. స్వాగతం పలికింది. రాస్తున్న నోట్ బుక్కు మూశాను తలపైకెత్తి చూచాను. గద్దువ మీద ఏదో వేడిగా పడ్డది. చేత్తో తాకి చూచాను—పిట్టరెట్టవేసింది.

చేపలు వేపుతున్నారని నాముక్కు పసి కట్టింది. చేపలు రుచి కరములు అవి వేగుచున్నాయి. అయినా నాకు అందుబాటు లేవు. నేనూ మొండివాన్ని వేన్నీళ్ల నెపంతో వంటింట్లో దూరాను. చలి కాగుదని పొయ్యి ఊదడం సాగించాను. మా పిన్ని తెలివైంది. వెంటనే వారించింది. వాకిట్లో కట్టెలు పడి ఉన్నాయి—వాటిని కొట్టమని ఆజ్ఞాపించింది. బొగ్గును పాలల్లో ముంచి తీయండి.

ఆయినా మాపిన్ని లాంటి రంగురాదు. నేను కట్టెలు కొట్టడంలో పడిపోయాను. చాల చురుగ్గా పనిచేస్తున్నాను. దగ్గు వచ్చింది. లెక్క చేయలేదు. చేతులకు బొబ్బలు వచ్చాయి. చూచుకోలేదు. క్షణంలో కర్రలు చీల్చిపారేశాను. చేపల వేపుడు వాసన అంతపనీచేయించింది. ఇహ నీరసించిపోయాను. వంటింటివరకు వెళ్ళే ధైర్యం లేకపోయింది. అయినా నా కెందుకో ఒక ఆశ చెలరేగింది–పిన్ని నా కివ్వాళ చేపలు పెడుతుందని!

నా ఆలోచనలకు అంతులేదు. అదిసాగుతూనే ఉన్నాయి వయసు ముప్పైఅయిదే. అయినా కంటిచూపు పోయింది వెంట్రుకల నలుపుపోయింది మెరిసే పళ్లు రాలేయి. చూస్తేచాలు జనం జోకర్నుచూచినట్టు నవ్వుతారు. మరి ఈ మనిషి నవ్వాలంటేనో? అబ్బాచాలా బొమ్మలు కావలసి వస్తాయి

ఇంతలో చప్పుళ్లు వినిపించాయి–అనేక ఇంజన్లు షంటింగ్ చేస్తున్నట్లు యుద్ధం జరుగుతున్నట్లు – బాంబులు పేలుతున్నట్లు, నా గది తలుపు విరుగుతున ట్లనిపించింది. నేను అదిరిపడ్డాను. లేచి నుంచున్నాను అమాంతంగా నా కంటి వెలుగు తిరిగి వచ్చింది. మనసు ఒక చోట నిలిచింది. చూపుకు పిన్ని కనిపించింది. ఆమెకు ఉన్నదే ఒక్క పన్ను అది బల్లెంలా ఉంది. ఆమె శరీరం భారమైంది. అంత బరువు మోస్తూ అంగలారుస్తూ వస్తూంది.

నన్ను కొట్టేప్పుడు పిన్ని తన బంటి పన్ను ఎన్నడూ ఉపయోగించలేదు. అయినా ఆ పన్నే గుచ్చుకున్నట్లని పించేది నాకు. అనేక సార్లు మొక్కు కు–న్నాను–పిన్ని పన్నుపోతే మొత్తం అణాది "బర్ఫీ" తింటానని! అబ్బో! పిడ–తల దండులా పిన్ని నా మీద దాడి చేసింది.

"ఆరే! విఠల్‌ది కొత్తగద బద్దలు కొట్టావు. అంత పెద్ద గద కనిపించ లేదూ–కళ్లు బతికి పోయాయా?"

మళ్ళీ మామూలు కథే పిన్ని రొద్ధాళించింది. ఇంట్లోంచి వెళ్లిపొమ్మంది. ఎప్పటిలానే నేనది విన నట్లు నటించాను. తరవాత కావలసిందే అయింది. పిన్ని నా సామాను ఒక్కొక్కటీ తీసి వీధిలోకి విసిరివేసింది. నేను చౌరస్తాలో

కూర్చొని ప్రాణాలకంటే ప్రియం అయిన పుస్తకాలను గాయం తగిలిన బిడ్డల్ని దుఃఖంలో ఉన్న తల్లి ఓదార్చినట్లు ఓదారుస్తున్నాను. చుట్టుపక్క వాళ్లు కూడీ 'తమాషా' చూస్తున్నారు. నన్ను సతాయించడానికి పిల్లలు పుస్తకాలు తీసుకొని పరిగెత్తు తున్నారు. ఆడవాళ్లు నా స్థితి చూచి చకితులై చూస్తున్నారు. అమ్మాయిలు వడకుతున్న నా చేతులను అనుకరిస్తూ జనాన్ని నవ్విస్తున్నారు.

"సుందరం మామా పుస్తకం కావాలా?"

అరే మామా! మొదలు ఉరుకు. పిన్ని పొరక తెస్తుంది బాదడానికి"

నేను అదిరి పడ్డాను. దర్వాజా వైపు చూచాను. నాకు అతి ప్రియం-అయిన నవల 'కల్పన' కిటికీ లోంచి బయలు దేరింది ఒక అమ్మాయికి తాకింది. నేల కూలింది. స్టేజిమీది హాస్యగాడు 'జోక్' విసిరి నట్లు అంతా ఫక్కున నవ్వారు. అమ్మాయి ప్రాణాలు పైపైనే పోయాయి. ప్రాణాలు మళ్ళీ తెచ్చుకుంది. చూస్తే నన్ను డీకొన్నది.

'క్షమించు తాతా"

అమ్మాయిని తీవ్రంగా చూచాను. అద్దంలో చూచి నట్లు చూచాను ఆ చూపులో అనేక అర్థాలున్నాయి. ముప్పైఆయిదేళ్ళ మనిషీ నీకు తాత కాలేదు. నా వెంట్రుకలు నెరిశాయి-నా కళ్ళు ఎప్పుడూ నీరు కారుస్తుంటాయి-పిన్ని కోపానికి నేను గడ గడ లాడుతుంటాను. అన్నీ నిజమే కాని వీటన్నింటికీ యవ్వనంతో ఏమి సంబంధం? నేను చదువురాని మొద్దును కాను నా వద్ద మెట్రిక్ సర్టిఫికేటుంది. త్వరలో ఎఫ్ ఏ పాసవుతాను అని ఆ అమ్మాయికి వివరించాలనుకున్నాను. నిజం నమ్మండి.

ఏం చెయ్యను? ఆ అమ్మాయి పిన్ని ఇంట్లోకి వెళ్ళింది.

నేను పుస్తకాలు. బట్టలు మూట కట్టు కున్నాను. మూట పట్టుకుని పుట్ పాత్ మీద కూర్చున్నాను. ఎలా కూర్చున్నాననుకున్నారు-మయూర సింహాసనం మీద కూర్చున్నట్లు! గోడకు ఆనుకొని కూర్చున్నాను. పిన్ని పిలుపుకై

నిరీక్షించ సాగాను. ఎంచేతంటే పిన్నినా సామాను ఎప్పుడూ ఇలాగే పారేస్తుం-టుంది. మళ్ళీ ఎవరినైనా పంపుతుంది. నన్ను పిలవడానికి. ఆమె పిలవ నంపడం న్యాయం. అదే నా నమ్మకం.

ఇప్పటి బాధ అది కాదు. నా కుడి కన్ను అదిరింది. అది అబద్ధం ఎందుకు చెప్పింది? అభిమోసం ఎందుకు చేసింది?

కాస్త ఆగండి నన్ను పరిచయం చేసుకుంటాను. పోనీండి అక్కరలేదు మీరు నా మాట నమ్మరు పిన్ని చెప్పిందే నమ్ముతారు. ఆమె మా చెల్లెలు పెళ్ళి కోసం మా నాన్నకు వంద రూపాయిలు అప్పు పెట్టింది. మా నాన్న మోసం చేశాడు. పెళ్ళాన్ని తోడుచేసుకొని చచ్చాడు.

పాపం పిన్ని ఏడ్చింది. మొత్తుకుంది. తల బాదుకుంది. అలాంటి సమయంలో నేను కనిపించానామెకు. నేనెలా ఉన్నానయా అంటే 'ట్రిమ్' గా ఉన్నాను. పాంటూ, షర్టూ వేసుకున్నాను, కాళ్లకు కొత్త చెప్పులున్నాయి. ఠీవిగా సిగరెట్టు కాలుస్తున్నాను. మీరు నమ్మరు నాకుతెలుసు. కావాలంటే పిన్నినే అడగండి. ఆనాడు ఆమెకు నన్నుగురించి కొన్నివిషయాలు తెలిశాయి. అవిఏవి? నేను అంట్లుతోముకుంటూ మెట్రిక్ పాసయ్యాను. నేను స్కూల్లో టీచర్‌గా ఉన్నాను. నెలకు ఇరవైఅయిదు సంపాదిస్తున్నాను.

ఇంకేముంది - మాపిన్ని తలదాచుకుంది. మా అమ్మను నరకంనుంచి తప్పించమంది. తనకు నెలకు పది చొప్పున అప్పు తీర్చమంది. అప్పు తీర్చకుంటె మాఅమ్మ నరకంలోనే ఉండిపోతుందని బెదిరించింది, ఇహ మా అమ్మ జీవితంఅనే నరకాన్ని మృత్యువు అనే స్వర్గం కోసం నిరీక్షించుతూ గడిపింది. ఇంకా ఆమెను నరకంలో ఉంచడం ఇష్టంలేదు. నెలకు పదిచ్చి మా అమ్మకు స్వర్గం కొనిపెట్టడానికి అంగీకరించాను.

నాకు పదిహేనే మిగిలాయి పదిహేనుతో బతకడం అసంభవం అంటే పిన్నికి పదిరూపాయిలు అందడం లేదని అర్థం. అందుకే ఆమె నా కుటుంబానికి

మరో ఉపకారం తలపెట్టింది, నా పిల్లలనుంచి ఇరవై వసూలు చెయ్యొచ్చును కుంది. నన్ను పోషించే బాధ్యత వహించింది

తరవాత ఏమైంది? నా స్థితి చూచి వీధివాళ్ల జాలి పడ్డారు దూరంగా వెళ్లిపొమ్మన్నారు. మరోవీధికి పారిపొమ్మన్నారు మాపిన్ని బాగా బలిసి పోయింది కదల్లేదు. నన్ను వెదకడానికి రాలేదు అన్నారు, అయినానేను పిన్ని ఇల్లు వదల్లేదు. వదిలిఉంటే పిన్ని ఇంట్లోకి సరస్వతి తచ్చివుండేదికాదు.

పిన్ని చిన్నచిన్ని మోసాలు చేయడంలో మొనగత్తె. కూరగాయలు అమ్మడానికి వస్తారా — వాళ్ళబుట్టలోంచి టమాటాలు కొట్టేస్తుంది, పాలల్లో నీళ్లపోసి అమ్ముతుంది. సరుకులు అమ్మేవాళ్ళతో తగాదా పడుతుంది. ఆమె భర్త లక్ష రూపాయల ఆస్తి సహితంగా ఆమెను వదలి చనిపోయాడు. ఒక కొడుకు యూరొపు వెళ్ళాడు. భారతదేశపు బాట మరిచాడు. అక్కడ పిన్నికి కోడలుందని కోడలుకు పిల్లలున్నారనీ వినికిడి

కొడుకు రాడని తెలుసుకుంది. పిన్ని మరిది విఠల్‌ను ఇంటికి తెచ్చుకుంది. విఠల్ను సొంత సంతానంలా సాకింది. ఇప్పుడు కదిరే వస్తువులా సహిస్తోంది. డబ్బుసొంతం అతనికి దోచిపెట్టింది అతనికి మౌనం అంటేనూ. ఒంటరి తనం అంటేనూ ఇష్టం రోజంతా మత్తులోమునిగి గదిలో పడి ఉంటాడు. అప్పుడప్పుడూ అతని కాళ్ళకు సత్తువ వస్తుంది. లేచి నుంచో గలుగుతాడు. అలాంటప్పుడు పిన్ని మెత్తని డొక్కలో తంతాడు. ఈ మాట పిన్ని ఎవరికీ చెప్పదు. దాచిపెడ్తుంది. నాకూ సరస్వతికి కూడా అబద్ధాలు చెప్తుతుంది. విఠల్ కొట్టాడనే విషయం దాచి ఉంచుతుంది,

నేను ఆ విషయాలు మీకు చెప్పాలను కోవడం లేదు. నా విషయంలో మీకు చెప్పాలని—అదీ నేను జన్మతః ఏవినని, నాకు అందమైనవన్నీ బాగని పిస్తాయి. రంగు రంగుల కలలు వస్తాయి మంచి మంచి ఆలోచనలు వస్తాయి. నేను మెట్రిక్ పాసైనాను. అందుకే నన్ను పుస్తక బండారం అంటారు. నా దగ్గర "కల్పన" నవల ఉంది. 'కల్పన' నాకు చాల ఇష్టం. ఆ నవలా

రచయిత నా ఒడిలో చేరిపోయాడు. ఆ నవలా నాయిక అందకత్తె—అమాయకు రాలు అమాంతంగా ఆకాశం నుంచి దిగివచ్చిన అప్సరలా అనిపిస్తుంది.

ఉలికి పడ్డాను. లేచి నుంచున్నాను. తరవాత కూర్చున్నాను. కన్నీరు తుడుచుకున్నాను. చూస్తే పిన్ని ఇంట్లోంచి ఆ అమ్మాయే వస్తోంది—అదే 'కల్పన' నాయిక—ఆకాశం నుంచి దిగి వస్తోంది—నా వైపే.

'పిన్ని పిలుస్తోంది' అంటూ నాంతం పంటితో చించుతూ అన్నది కవిని అవుతే ఎంత బాగుండేది? జీవితంలో ఒక్క ఒకే ఒక కవిత రాయ గలిగినా దాని శీర్షిక ఇప్పుడే రాసేవాణ్ణి!

ఆనందంతో గుండె గంతులు వేసింది. అమాంతంగా లేచాను. కాళ్లు ఊగిసలాడాయి. పడిపోయాను. మూట విచ్చుకుంది. మళ్లీ బాటన పోయే పిల్లలు పకపకా నవ్వారు.

మళ్లీ ఇంట్లో చేరాను. గదిలో సామాను సర్దుతున్నాను. పిన్ని కేకలు పెడ్తోంది. 'మరో పుక్కిటి మనిషి పెరిగింది. ఉంచుకో పెద్దను కుంటే పిచ్చి ముండ ఎక్కడెక్కడ చూపులు ఎలుపుతూ తిరుగుతుందో! నా ఎంకావికేం వచ్చ తెస్తుందో! నా ముఖాన మసి పూస్తుందో! పిచ్చిముండ దాని ముఖం చెక్కి పారేస్తా"

ఇప్పుడు అర్థం అయింది. కుడికన్ను ఎందుకు అదిరిందో!

పిన్నినాకు పాసిపోయిన అన్నం, పప్పు పెట్టేది. అదే అమృతంలా ఉండేది. అందమైన కలలు వచ్చేవి. ఆకాశంలో ఎగిరేవాణ్ణి. నా బలహీనత మరిచాను. పేదరికం మరచాను. పిన్నినాకు మరోగదిచ్చింది. అందులో కూర్చుంటాను. ఆ గది సగంలో పిడకలున్నాయి. మధ్యన నా చాప ఉంది. ఒక మూలకు పుస్తకాలున్నాయి. చూరులో పిచ్చుకల బృందం ఉంది. ఆపిచ్చుకలు నాకు బంధువులు. అది ఎడతెగని బంధం. పిడకలకింద తేళ్లు బస్తీలు ఏర్పరచుకున్నాయి. అవీ నాకు పొరుగులే. వాటి అలవాట్లు పిన్నిఅలవాట్ల

లాంటివి. రాత్రిళ్లు నేను మొత్తుకునేవాణ్ణి - సరస్వతి నిద్రలేవాల్సివచ్చేది. ఉల్లి రసం అంటించేది. సిరా రాసేది. ఏది రాసినా ఆమె తాకితే చేదు విషం అమృతం అయిపోయేది. ఆమెలో ఏదో ఆ ఆకర్షణ ఉంది. అలాచూస్తే ఇలా తనవి చేసుకుంటుంది. ఇహ నా విషయం చెబుతావినండి. పొద్దుతిరుగుడు పూవులా నా చూపు ఆమెనే అంటి వుంటుంది.

ఆమెకు పూలంటే చాల ఇష్టం. రంగు రంగుల బట్టలు, నగలు, అందమైన ఆడవాళ్లు, కీవిగల మగాళ్ళ మీదినుంచి ఆమెచూపు కదలదు. ఆవిడా నాలాంటిదే. పేదరికం ఏమిటో తెలీదు పేదవాళ్ళకోరికలు అక్రమ సంతానం లాంటివి వాటిని ఎవరూ పట్టించుకోరు. పేదలు తమ కోరికలు తాబేలుతలలా దాచుకోవాల్సిందే. వెళ్ళబెట్టలేరు - రాదు అయినా ఆమె తెలివైంది, నేనుఆమె ముందు మూర్ఖుణ్ణి అయినాను. ఆవిడ మెట్రిక్ పాస్ కాలేదు. అయినా నాకు తెలివి చెప్పేది. సరే నేనైతే మొద్దునే. పిన్ని నన్ను గాడిదగా నిరూపించింది. అందుకు ఆవిడ దగ్గర అనేక ఆధారాలున్నాయి స్కూల్లో పిల్లలునన్ను ఆటలాడిస్తారు. రాత్రికి మున్నా, షబ్బో చదువుకోవడానికి వస్తారు. వాళ్లు సతాయిస్తారు సరస్వతే అడ్డుతగులుతుంది. నన్ను కాపాడుతుంది ఈ వెధవలకు చదువు చెప్పొద్దు అంటుంది. కాని ఎలా? జీతంసొంతం పిన్ని తన్నుకపోతుంది ఈ రెండు రూపాయలే నా స్వంతం.

ఒకోక్కసారి పిన్ని విఠల్ని సంతోష పెట్టడానికి నా "కల్పన" లాక్కుంటానని బెదిరించేది. అది విని నేను ఏడ్చేవాణ్ణి, ఆ పుస్తకం నాకు ప్రాణం అంలాంటిది దుఃఖం దిగమింగడానికీ, ఆనందం అనుభవించడానికీ సాధనం. దులోవే సరస్వతికి అందమైన విషయాలు వి-రిస్తాను అని అంటుంది ఆమె నవ్వుతుంది. అలాంటి పుస్తకం లాక్కుంటానంటే ఏడుపు రాక ఏమవుతుంది? నేను ఏడుస్తానా? నన్ను చూస్తాడు-వాగుతున్న విఠల్ నవ్వుతాడు. విన్నారా-నా కన్నీరు ఈ ఇంటిలో వెలుగులు పంపుతుంది. ఏమంటారా? విఠల్ నవ్వు-తాడుగా! అది పిన్నికిష్టం ఒక్క పన్ను బయట పడుతుంది. సరస్వతి నవ్వడం తప్పనిసరి. అలాంటప్పుడు ఏదైనా మన్నిస్తుంది, అది గ్రహిస్తుంది

సరస్వతి. అన్నంలోకి ఆవకాయ వేయమని సిఫార్సు చేస్తుంది. ఇంత బెల్లం గడ్డవేయిస్తుంది. సరస్వతి నా "కల్పన" నాయిక ఆమె కోరికలన్నీ తీర్చాలని-పిస్తుంది. ఆమెకు "ఖలాఖండ్" తినిపించాలనిపిస్తుంది. మంచి మంచి బట్టలు కొని పెట్టాలని పిస్తుంది. కారులో షికార్లు చేయించాలనిపిస్తుంది. ఇవి ఏమంత పెద్ద కోరికలు చెప్పండి. అయినా ఈ విషయాలు ముచ్చటిస్తే పాపాలు చేసిన-వాడు స్వర్గసుఖాలు కోరినట్లు చూస్తుంది సరస్వతి.

'కారులో కూర్చుంటే కళ్ళు తిరగవా? మీ పుస్తకాల్లో ఏం రాసి ఉంది అని వింతగా అడుగుతుంది. ఆమె మాటలు వింటుంటే నాకు ఎకనామిక్స్ గుర్తుకు వస్తుంది. ఇందుకు కారణం అందులో వెదుకుతాను.

'ఇంత చదివారు-మీకేదో పెద్ద ఉద్యోగమే దొరుకుతుంది. కారు కొం-టారుగా' అంటుంది అమాయకంగా.

ఒకటేమిటి పది కార్లు కొందామనుకుంటాను!

ఆ రోజు నా సంతోషానికి అంతు లేదు, ఎంతో కష్టపడి దాచి పెట్టిన పావలా తవ్వి బయటికి తీశాను స్కూలుకు వెళ్ళేప్పుడు నేల మీద కాళ్ళు నిల-వడం లేదు. కార్లు, టాంగాలు, సైకిళ్ళు అన్నింటిపైగా ఎగిరిపోతున్నాను. వీధుల్లో ఆనందం వెల్లివిరుస్తూంది. నాలుక వెళ్ళపెట్టి ఒక చిన్నపిల్లవాణ్ణి దడి-పించాను. ఒక అమ్మాయి నా చిరునవ్వు చూచి నన్ను వెక్కిరించింది. ఆ రోజు నాకు చాల కవితలు గుర్తుకు వచ్చాయి. గునిశాను కూనిరాగాలు తీశాను. అణా మిషనులో వేశాను. బరువు చూచు కున్నాను. చిన్న టిక్కెట్టు వచ్చింది. 'అదృష్టపు తాళం చెవి మీ చేతిలో ఉంది' టిక్కెటు మీద ఉంది. పిడికిలి తెరిచాను. మూడణాలున్నాయి మల్లెపూలు కొన్నాను. సరస్వతికి ఇలాంటి బహుమానమే ఇవ్వాలి పూలు అందంగ ఉన్నాయి. పూలలాగే సరస్వతి నాజూకుగా ఉంది.

పిన్ని దుకాణానికి లావుపాటి స్త్రీలు వస్తుంటారు-బట్టలు కుట్టించుకోవ-డానికి సరస్వతి వారి కొలతలు తీసుకుంటుంది. వాళ్ళకు అదోలా చూస్తుంది,

బట్టలు కుట్టున్నప్పుడు పిన్ని లో అంటుంది. "ఎంత సుఖం ఉందో-ఇంత ఊరింది-ఏనుగు అయింది" అని ఆ మాట వింటుంది పిన్ని. ఆమె ఏనుగులాంటి దేహాన్ని దాచుకొని ఒంటి పంటిపి బయట పడేస్తుంది. పిన్ని ఎందుకలా నవ్వు తుంటీ అంటే దానికీ అర్థం ఉంది. సరస్వతి సంతోషంగా ఉండాలని పిన్ని సంకల్పం. ఎంచేతంటారా బట్టలు కుట్టిన డబ్బంతా పిన్ని బొక్కసంలోకి పోతుంది. దిక్కులేని సరస్వతి పిన్ని పాలబడ్డప్పుడు సరస్వకీ తనకూ ఎలాంటి సంబంధమూ లేదని చెప్పుకుంది. ఏదో పుణ్యమని ఇంత తిండి పడేస్తున్నా-నంది. సరస్వతి కుట్టుపని చూచి ఎన్నెల విసనకర్రలు కూడా ముగ్ధులవుతే సరస్వతి పిన్నికి సాక్షాత్తు మేనకోడలు అయిపోయింది. 'లేడీస్ టైలరింగ్ ఫర్మ్' అని బోర్డు తగిలించింది. ఇప్పుడు సరస్వతి ముందు ఎప్పుడూ రంగు రంగుల బట్టలు పడుంటాయి. ఆమె సదామిషను మీద వంగి ఉంటుంది.

ఇంటికి చేరుకున్నాను. సరస్వతికి పూలు సమర్పించాలి. ఎలా సమర్పించాలో అర్థం కాలేదు. దోవ పొడుగునా ఎన్నో ఆలోచిస్తు వచ్చాను. ఆమెను చూచాను అన్నీ మరిచాను. మాటలు మోసం చేశాయి. పలుకు బయట పడ్డం లేదు. మౌనంగా, ఎడకే చేతుల్తో, పూలు మిషను మీద ఉంచాను. రెండుమూడు రాలి పడ్డాయి. ఒకటి ఆమె వడిలోకి దొర్లింది. మరొక లేత మొగ్గ సూదికింద పడి ముక్కలు ముక్కలయింది. ఈ ప్రమాదం నన్ను విశ్చేష్టుణ్ణి చేసింది. ఆమె మిషను ఆపింది, నన్ను చూచింది. ఆ చూపులో గౌరవం ఉంది.

"పూలెందుకొక్కన్నారు. ఆ డబ్బుతో క్షౌరం చేయించుకోక పోయారా,

'సరూ! ఎందుకలా అంటావు? క్షౌరం కూడా అవుతుంది' మాసిన గడ్డాన్ని చేత్తో రుద్దాను 'అంతేకాదు. నీకోసం ఒకచీర కొనాలనే ప్లానూ ఉంది. ఎంత? మరొక ఏడాది. ఎఫ్.ఏ. పాసవుతాను. ఆ తరువాత బి. ఏ. ఇహ ఎమ్.ఏ. కావడం ఎంతసేపు? అప్పుడు నువ్వు రాణివి' నా జీవిత ప్రణాళిక సాంతం గబగబా ఆమె చెవుల్లో గుమ్మరిస్తుండగానే పిన్ని వచ్చేసింది.

'వచ్చారయ్యా చదువులదొర! దాన్ని పని చేయనీ. అని సరస్వతిని ఉద్దేశించి "మొనగాడినని నరుకుతున్నాడు. వట్టి అబద్దాలకోరు. మూడేళ్లయింది

ఎఫ్ ఏ లో ఫెయిలవుతూ ఇష్టం లేకుండా తిండి పోరుకుతుంటే తల ఎందుకు బిడ్డలు చేసుకుంటాడు" అని తనలో తాను నవ్వింది. సరస్వతి నవ్వలేదు. మల్లెమొగ్గ అందుకుంది. తల్లో పెట్టుకుంది.

"పూలు నచ్చలేదా? నా ధ్వనిలో ప్రాణంలేదు.

ఆమె నవ్వింది. ఒక పూవుతో నన్ను కొట్టింది. పూవు విసిరింది. దాని తాకిడికి నా కోరికల కవాటాలు తెరచుకున్నా యి-విచ్చుకున్నాయి. నా హృదయం ఆనందభారంతో క్రుంగిపోయింది. కోరికలు తీరడంలోనూ భరించరాని వ్యథ వుందని అప్పుడు నాకు అనిపించింది.

నా చీకటిగదిలో ఉన్నన వెన్నెల పరచుకుంది. చూరులోని పిచ్చుకలకూ తెలిసింటీ విషయం. అవీ నన్ను అభినందిస్తున్నాయి. వెంటనే 'కల్పన" తెరిచాను. ఇలాంటి సమయాల్లో హీరో ఏంచేస్తాడు? షబ్బా, మున్నా ఇచ్చే రెండు రూపాయిల ఫీజు దాచశక్యం కావడంలేదు. అందం అయిన బహుమతి ఏమిటది? అర్థంకావడం లేదు. నిన్నటి సాయంత్రం ఇంటిముందు కదిలింది. ఒక స్త్రీ పట్టుబ్లవుజు కుట్టించుకోవడానికి వచ్చింది. సరస్వతి పట్టుబట్టమీద తన తెల్లని వేళ్ళను తిప్పుతూంది. ఎంతబావుంది దీనిమీద గుండ్రని అద్దాలు కుడ్తే ఎంతో బావుంటుంది. చాల ఖరీదు కావచ్చు"

ఆనాటి సాయంత్రం అదే నల్లని బ్లవుజ్ తనముందు పరచుకొని కూర్చుంది సరస్వతి. నేను అద్దాలు దానిమీద గుమ్మరించాను

'ఎంత బావున్నాయి! ఎవరివి?' ఆమె కళ్లు ఆల్లల్లార్చి అడిగింది. ఆమె కన్నుల్లో అద్దాలమెరుపు నిండిపోయింది.

'నేనే తెచ్చాను - నీకోసం' నేను ఎగిరి గంతేసి అన్నాను. నా తల నిక్కింది. తలవంచి చూస్తే దీపాలు మలిగాయి.

కిణకిణలాడే విప్పుకణికల్ని ఏరినట్లు ఏరి పక్కకు పెట్టింది. ఇంత డబ్బు ఎందుకు ఖర్చుపెట్టారు? వీటితో నేనేం చేసుకుంటాను?' అన్నది

నల్లని పట్టు బ్లవుజ్ మీద అద్దాలు కుట్టుకో. చుక్కలునిండిన ఆకాశం కప్పుకున్నట్లుంటావు. నీవు నేలమీద నిలిచిన సరస్వతిలాకాక కాళిదాసు శకుంతలవు అవుతావు'

పిన్ని కన్నుకొట్టినప్పుడు పిల్లలు చూచేట్టు చూసింది, అద్దాలన్నీ ఏరి ఒక పొట్లం కట్టింది. లేచి వెళ్లిపోయింది.

సాయంకాలం ఇంటికి వచ్చాను పిన్ని లేదు బయటపోయింది సరస్వతి కనిపించలేదు పొయ్యిమీది కుండ కనిపించింది, కూర ఉడుకుతూంది కూర నన్ను పిలిచింది కాస్తరుచి చూడమన్నది ఇంకా నేను మూతతీయనే లేదు సరస్వతి వూడి పడ్డది. అద్దాల ఆనందం ఆమె ముఖంలో ఇంకా కనిపిస్తూనేఉంది ఆమె ఎగురుతూంది. గంతులు వేస్తూంది, గుండ్రంగా తిరుగుతూ ఎన్నొ ధికొన్నది

'మీకు సుబ్రమణ్యం కలిశాడా.' ఆమె ఆనందంతో ఉక్కిరి బిక్కిరి అవుతూంది

'సుబ్రమణ్యం! ఎవడా సుబ్రమణ్యం?' నేను గుర్తుతెచ్చుకోవడానికి తంటాలు పడుతున్నాను ,

'వెండి బంగారం వ్యాపారం చేయడూ అతనే ఇవ్వాళ పిన్ని దగ్గరికి వచ్చాడు" నేను దొంగనై, నా నుండి వెండి బంగారు రాసులను దాచినట్లు సిగ్గుతో తన శరీరాన్ని చింపుల చీరతో దాచుకొవడానికి ప్రయత్నిస్తూంది.

'ఏమి! మీరు అతన్ని చూళ్ళేదా? ఇహ మేం అతని కార్లో కూర్చొని వెళ్ళిపోతాం"

అది విన్నాను నేను కొయ్యబొమ్మ నైనాను చేతులు పైకం పడకలేదు, వేళ్ళసందున బీడీ పడిపోలేదు.

ఆమె అటూ ఇటూ చూచింది. నా దగ్గరికి వచ్చింది. 'వారు ఏడు చీరలు తెస్తున్నారు. ఏడు నగలు' వేళ్లు చూపించి చెప్పింది. తరవాత నవ్వింది. పొట్ట చెక్కలయ్యేట్లు నవ్వింది. తరవాత గిర గిరా తిరిగింది. కట్టెల్లో పడబోయింది.

కొప్పు పట్టుకుంది. నిలదొక్కుకుంది. “క్షమించు బాబా....” బీడీ గట్టిగా దమ్ము లాగుతూనే ఉన్నాను. అనుకోగానే బీడీ చేయిజారి పడిపోయింది.

ఆమె కనులు ఆనందాశ్రువుల్లో ఓలలాడుతున్నాయి. అటుచూస్తే ఎవరో “[illegible]”ను కిటికీ లోంచి విసిరారు. అది వచ్చి నా ముఖానికి తగిలింది. అప్పుడు నేను ఏడవడానికీ, నవ్వడానికీ ప్రయత్నించాను. ఏదీ చేయలేక పోయాను.

ఏదో విషంగా గదిలోకి చేరాను. నా ముందు ఏ పుస్తకం ఉన్నదీ తెలియదు. ఏం చదువుతున్నానో అర్థం కాదు. అమాంతంగా మల్లెపూల పరిమళం వచ్చింది. ఉలిక్కిపడి చూశాను. ఆమె చేతుల్లో పూలున్నాయి. పూలలా పరిమళం వ్యాపింపచేస్తూ వచ్చింది.

ఆమె నా చేతిలోంచి పుస్తకం లాక్కుంది. నేను వెళ్లిపోతానంటే మీకు దుఃఖంగా ఉంది కదూ!’ అన్నది.

‘సరే ఏమైనా మంచి ముచ్చట్లు చెప్పు. చూతాం నీ అదృష్టం ఎలా ఉందో?’

నా మౌనాన్ని చూసింది. విసిగింది “మాట్లాడరాదూ?” అన్నది.

‘ఏం మాట్లాడను?’ అదే ఆలోచిస్తున్నాను.

‘అబ్బా! నాకు ఎలాంటి రంగులు బావుంటాయో చెప్పండి. డబ్బుకు లెక్క చేయకు అన్నాడు సుబ్రమణ్యం. వారితో చెప్పి మీకూ ఒక కొత్తచొక్కా కుట్టిస్తా’

‘నాకు తేలు కరిచినట్లుంది’ అన్నాను.

‘హయ్యోరామా! ఎక్కడ?’ అని కాళ్ళూ చేతులూ చూచింది.

"ఎక్కడో తెలియడం లేదు. ఇదిగో ఈ చేయి ఇదిగో ఇక్కడ .." శరీరం సొంతం పరుగులు పెడుతున్న బాధను ఒక చోట నిలపడానికి ప్రయ-త్నించాను.

"ఆగండి ఉల్లిగడ్డ రసం తెస్తాను" అని ఉరికింది-చీర కుచ్చెళ్లు పట్టు-కొని.

రెండో రోజు తెరిచిన మొసలినోటి లాంటి నల్లని కారు వచ్చింది. సుబ్రమణ్యం దిగాడు. ధారమైన దేహం, పెరుగుతున్న బొర్ర, ముఖాన ముడుతలు అన్నింటిలోనూ ఒక ఠీవి ఉంది అతని నోటు నుంచి బూటుదాకా అన్నీ మెరు-స్తున్నాయి. అతను తళ తళ మెరిసే బంగారు ముద్దలా ఉన్నాడు. అణచి దువ్విన అతని తెల్లని వెంట్రుకల అందాన్ని చూచి నల్లని వెంట్రుకలు సిగ్గు-పడేట్లున్నాయి. అతను నా గదిలో అడుగు పెడితే సువాసనల వాన కురిసి-నట్లయింది. లోపలికి వచ్చి మసిపి ముడుచుకు పోయాడు. అతని ముఖం మొత్తం సీసా ఆముదం తాగినట్లయింది.

అతని మొదటి అడుగు 'కల్పన' మీద పడింది తరువాత నా దిండును తొక్కాడు. తరువాత రాత్రి బాబతు మల్లెపూలను తొక్కాడు. అన్నీ అతని బూట్ల అడుగులకింద నలిగి పోతున్నాయి. నేను ఒక మూలకు నక్కి వణకు-తున్నాను-నా మీదా ఒక అడుగువేసి వెళ్ళి పోతాడా అనిపించింది.

ఇల్లంతా తలక్రిందులు అవుతూంది. పిన్ని పయ్యెదలాక్కొని మెటికలు విరవాలని ఉబలాట పడుతూంది. మడమల మీద లేచినా వాటి బుజాలదాకా ఆమె చేతులు పోలేదు. సరస్వతి పయ్యెద సొంతం పంటితో పట్టుకొని, తలవంచి తన ముందున్న చీరలను ఆశ్చర్యంగా చూస్తూంది.

"బాగాచూడు" సుబ్రమణ్యం చీరల్ని సరస్వతి ముందు పరిచేశాడు.

"పిచ్చిదానా! కలలో సైతం ఇలాంటి చీరలు చూచి ఉండవు. అచ్చం అమీరులు కట్టేచీరలు" అన్న పిన్నిని చూచి 'నిజంపిన్ని-వీ తోడు-అయిదు వందల రూపాయీల చీరలు' అన్నాడు.

ఆ మాట విని సరస్వతి పంటికింద పయ్యెద ఊడిపోయింది. చూపుల్తో సుబ్రహ్మణ్యాన్ని కౌగిలించింది. తరువాత సిగ్గుపడ్డది చిరునవ్వింది. తేలుకొండిని పట్టినట్లు చీరలు తాకింది.

'అయితేనాకు తెలీదనా! మీరు నాసిసరుకు ఎందుకు తెస్తారు?' పిన్ని పన్ను ఆనందంతో ఊగిసలాడింది "ఆయినా ఈ పిచ్చిదానికి కట్టడం వచ్చా ఏమన్నానా? రెండు రోజుల్లో చించేస్తుంది.

'నేనుమాత్రం రెండురోజుల్లో టీ పై సరిచేయనూ' సుబ్రమణ్యం తల నిక్కించి గర్వంగా అన్నాడు.

'కొడకా! ఈ పేద ముసలిదాన్ని మాత్రం మరువకు. చంద్రునిలాంటి పడుచును ఇప్పిస్తున్నాను. వాడ వాళ్ళంతా ఆడిపోసుకుంటారు. పదిహేనేళ్ళ పిల్లను యాభైఏండ్ల వాడికి అంటగట్టిందని"

'సరే-సరే ఇహ వాగకు. రేపు చెక్కు-బుక్కు తెచ్చినపుడు జ్ఞాపకంచేయి' అనేశాడు సుబ్రమణ్యం అయిష్టంగా.

'పిన్నీ చీరలుసుందరానికి కూడా చూపించు' అని సరస్వతి చీరలను నావైపు నెట్టింది. సుబ్రమణ్యానికి అది నచ్చలేదు. నేనూ కళవళ పడ్డాను. ఏంచేయాలో తోచపడలేదు. ఇదంతా మామూలుగా కనిపించాలని ఒక చిరునవ్వు నవ్వాను. ఎడకే నాచేతులు చీరలకోసం కదలనేలేదు. సుబ్రమణ్యం చీరలు లాగేశాడు. 'ఇస్త్రీ చెడిపోతుంది. మురికి చేతులతో ముట్టవద్దు'' అన్నాడు.

సరస్వతి లేచి వెళ్ళిపోయింది. తిరిగి వచ్చేప్పుడు పొరుగింటివారి విరిగిన కుర్చీ తెచ్చింది. కుర్చీ గది మధ్యలో వేసింది. సరిగ్గా నా ముందు కూర్చుంది. పయటి కొంగు పంటితో చించుతూంది.

"కూర్చోండి" అని పిన్నితన చెంగుతో కుర్చీమీది దుమ్ముదులిపింది. అది సొంతం సుబ్రమణ్యం సూటుమీద సవారి చేసింది.

"ఉహ్" సుబ్రమణ్యం మరికొంత అముదం నాకాడు. దస్తీతో

ముఖం ముడిచాడు. రెండు జేబుల్లో చేతులు పెట్టుకొని, సంపత్తి నడుస్తున్నాడు- ఏవో తన కాళ్ళకింద నేల తలకిందులవుతున్నట్లు

"అద్దాలు" ఊపిరి బిగపట్టి చూచాడు సరస్వతి చేతిలో అద్దాలు మెరుస్తున్నాయి - అవి నేను తెచ్చినవి:

"ఇవేం ముక్కలు?" అతను సరస్వతి చేతిని తన కంటి ముందుకు తీసుకున్నాడు.

'ఇవి బట్టమీద కుట్టే అద్దాలు. చీరకి నల్లబట్ట కావాలి' వాడి తీవ్ర దృక్కుల్ని చూచి బెదిరి వెనుక్కు జరిగింది సరస్వతి

'పెనవ అద్దాలు చేసి పల్లెవేషాలు మానెయ్యి' అతడు సరస్వతి చేతిని నెట్టాడు. అద్దాలన్నీ ఎగిరి నేలమీద పడ్డాయి. నేను వేయి ముక్కలుగా విరిగి పోయాననిపించింది. ఒక ముక్క నా రొదమీద పడింది. అందులో సరస్వతి ఆనందంతో ఉక్కిరి బిక్కిరి అవుతూంది. ఇవ్వాళ ఆమె ముఖం మల్లెపూలలా లేదు - గులాబి మొగ్గలా ఉంది.

సరస్వతి తొలగిపోయింది. సుబ్రహ్మణ్యం కనిపించాడు. అతని షైమీద ఉన్న రంగురంగుల పిట్టను గద్ద తన్నుకు పోతూంది. కాలర్‌లో ఒకవాడిన ఎర్రగులాబీ మొగ్గఉంది. అతని ముక్కు ఎండిన పిడ.లవాసన భరించలేక పోయింది. 'అయితే మళ్లీ ఎల్లుండి వస్తా'నని వెళ్ళిపోయాడు.

అద్దంలోకి పిన్ని వచ్చేసింది. ఉన్నఒక్క పన్ను ఫిరంగిలాఉంది. ముఖం చేటంత అయింది. నవ్వడం వల్ల మెడకింది మాంసగ్రంథుల సంఖ్య పెరిగిపోయింది. 'పాము చచ్చింది. కర్ర విరగలేదు. రేపు అయిదువందల రూపాయలు అందురాయి" అన్నది

పిన్నికూడా తొలగిపోతే వికారి అయిన ముసలివాడు అద్దంలో మిగిలి పోయాడు. అతని ముఖంమీద బిచ్చగాని ఛాయలున్నాయి. రోడ్డుపక్కన

తూస్తున్నాడు. అంతా ఆతన్ని తప్పుకొని వెళ్తున్నారు. 'క్షమించువాళ్లా" అని సాగిపోతున్నారు.

పెళ్ళి ఏర్పాట్లు - బట్టలు కుట్టడం ఇంటికి వెల్లవేయడం అడావుడిగా ఉంది సరస్వతి నన్నుస్కూలుకు వెళ్ళనీయలేదు. ఆనందంతో ఆమె గుండె ఉప్పొంగుతూంది. ఎప్పుడూ ఏదోఒకటి మరుస్తూంది. గోరింటాకు కోసం ఉరుకుమంటుంది కంసాలి దగ్గరికి పరిగెత్తమంటుంది.

"నేనంటే నీకెంత ఇష్టం! నా కోసం ఎంత కష్టపడుతున్నావు", అంటుంది కృతజ్ఞతా దృక్కుల్తో చూస్తుంది. నాకు ఆ చూపుల నీడలో అలసట మరచాను. దుఃఖం మింగేశాను.

"పిన్నిలా లావెక్కుతానేమో నని భయంగా ఉంది" ఎరుపు చీరమీద పూలు కుడ్తూ అన్నది

'ఛ నువ్వెప్పుడూ లావు కావు' నేల మీద కూర్చొని తెగినచెప్పుకు మేకు దిగేస్తూ అన్నాను.

"పనివాళ్ళే అన్నిపనులూ చేస్తారాయె-రోజంతా నేనేం చేయను?"

'అబ్బ! ఎంత వేడిగా ఉంది!' అని ముఖం మీది చెమట తుడుచుకున్నాను

రెండోరోజు సుబ్రమన్యం ఉత్తరం తెచ్చాడు నౌకరు. నౌకరు పిన్ని ఇంటి వెల్లపురామ్ తాగనన్నాడు. సుబ్రమన్యం దస్తూరి మహాచెడ్డది. ఒక్కొక్క అక్షరం గుణించుకొని చదవాల్సివచ్చింది.

పిన్ని ఇంట్లో పెళ్లిచేయడం అతనికి ఇష్టంలేదట. రేపు సాయంత్రం సరస్వతిని కారులో తీసికెళ్తారట అక్కడే అతని బంగళాలో పెళ్లి జరుగుతుందట.

కాలానికి కరుణలేదు. ఉదయానికి హృదయంలేదు. సాయంకాలానికి దిచ్చుగుండె ఎందరు విన్నవించుకున్నా చెవిపెట్టదు. నా విన్నపాలు-ప్రార్థనలు ఆ సాయంత్రానికి అందినట్లులేదు-ఉరికి వచ్చేసింది.

సరస్వతి పెళ్ళికూతురు అయింది. ఆమెను చూచాను. నా కళ్ళను నేనే నమ్మలేక పోయాను. నావి మసక కళ్లు వాటికి ఇంత వెలుగు ఎలావచ్చింది నా గుండె గుండెలోనే ఉంది. నేను మామూలు మనిషిలా ఉన్నాను. ఇంటికి చాలా మంది వచ్చారు. అల్లరిగా ఉంది. ఏమీ అర్థం కావడం లేదు.

వచ్చిన వాళ్లు వధువును చూచారు. వెళ్ళిపోయారు. నన్ను ఉరికించడానికి ఎవరూ లేరు. అలసినట్లు కూలబడ్డాను. నన్ను చూచింది. సరస్వతి నవ్వింది.

"ఏమిటి ఆలోచిస్తున్నారో... "

'అదే....నువ్వు వెళ్ళిపోతావు గదా అని"

"ఆఁ" సరస్వతి ఉలికి పడ్డది. అప్పుడే నిద్ర లేచినట్లు నలువైపులా పరికించింది. తన బట్టలను చూచుకుంది. 'ఏమి? నిజం! మిమ్మల్ని వదలి వెళ్ళిపోతానా?' అది సంతోషసమయం. అయినా ఎక్కెక్కి ఏడ్చింది. నేనూ కన్నీటి కోసం తపించాను. కాని ఎడారిలో మబ్బుముక్క లేదు!!

సరస్వతిని పిన్ని ఓదార్చింది. ఇతర స్త్రీలు ఏడవరాదన్నారు విఠల్ కూడ వచ్చాడు, అయినా ఆగలేదు నగలు ఒక్కొక్కటే తీసి విసరుతూంది,

'సరే. ఇహ బుద్ధితెచ్చుకో. ఆతడు వచ్చేవేళ అయింది'

"ఎవరూ....?" ఆమె పిచ్చిదానిలా గుమ్మంవైపు చూచింది, 'నాకు భయంగా ఉంది. కాళ్లో కూర్చుంటే కళ్లు తిరుగుతాయి. నేను పోను' అనేసింది,

అది విన్నాను. లేచాను. ఎక్కడికీ వెళ్ళడం? ముందు కటిక చీకటి బుద్ధికి సంబంధించిన దీపాలన్నీ ఆరిపోయాయి. మండుతున్న జ్వాలల్లోంచి బయట పడినట్లు సరస్వతిని తప్పుకొని బయటపడ్డాను. ఒక్కొక్క మెట్టు దిగాను. దర్వాజాలోకి వచ్చాను.

"సుబ్రమణ్యం వస్తున్నాడు...." ఎవడో రోడ్డుమీదనుంచి అరచాడు.

'ఎక్కడికి వెళ్తున్నారు? వెళ్ళొద్దు ......' సరస్వతి అరుస్తోంది.

నేను మాట్లాడ్లేదు. ఫుట్‌పాత్ దాటాను చౌరస్తావైపు సాగాను,

"వెళ్ళొద్దు....వెళ్ళొద్దు' ఆమె వేగంగా మెట్లుదిగి ఉరికి వస్తోంది_నన్ను ఫిరంగుల గుళ్ళనుంచి రక్షించడానికన్నట్లు - బయట హంతకుల వీరవిహారం విన్నట్లు ఉరికి వస్తోంది_

"వెళ్ళొద్దు....ఓ' వాతావరణంలో ఒక ఫిరంగి పేలింది,

తరవాత ఆకాశంలో ఎరుపు వలయాలు ఏర్పడాయి. మలిగాయి. చెరిగాయి వండే కళ్ళమొసలి నోరు తెరచుకొని దుమికింది. చిన్నారి మల్లెమొగ్గ కేక పెట్టింది....

భయంకర స్వప్నంనుంచి బయటపడ్డట్టు అంతా ఆచేతనంగా ఉంది. మౌనంగాఉంది నిశ్శబ్దంగా ఉంది.

పిచ్చి సరస్వతి బంగారు నగలను ఒకచోట పోగుచేసింది. సుబ్రమణ్యం వాటిమీద వంగి విరిగిన అవయవాల్లో ఇరుకున్న గాజులనూ, ఉంగరాల్నూ, గొలుసుల్నూ, గుర్తిస్తున్నాడు. పిచ్చి నా 'కల్పన' ను వీధిలోకి విసరుతే జాగ్రత్తగా దావిగాయాలు నవరించినట్లు అతి జాగ్రత్తగా నగలు తొలగిస్తున్నాను.

# నిరీక్షణ

ముందు అందరూ నన్ను రాణిని చేశారు. తరవాత నేను దొంగనయినాను.

నా కళ్లకు గుడ్డకట్టారు. నేను చేతులతో వెదుకుతూ తిరుగుతున్నాను. ఎవరివో ఎరుగని చూపులు నా చేయిపట్టుకొని నడుస్తున్నాయి. నేను వెదిరాను కట్టిన గుడ్డవిప్పిపారేశాను. చుట్టుపక్కలా ఎవరూ లేరు. పిల్లలందరూ నన్ను వదిలేశారు, వామ్మల దుప్పట్లలో చేరారు. పేదరాశి పెద్దమ్మ కథల్లో మునిగిపోయారు.

నేను ఒంటరిగా నుంచున్నాను. ముందు వామ్మను నిద్రపుత్తునా? నేను నిద్రపోదునా? అని ఆలోచిస్తున్నాను.

అప్పుడు ఉరికి వచ్చాడు. ఎక్కణ్ణుంచి వచ్చాడో తెలీదు. బరువుతో వంగిపోతున్నాడు. పూలతో నిండిన బుట్టనాకు అందించాడు. వెళ్లిపోయాడు వెళుతూ వెళుతూ నిలిచాడు.

'ఇక్కడేఉండు ఇప్పుడే వస్తాను' అన్నాడు.

నా నోట మాట రాలేదు. బుట్టనూ చూడలేదు ఎంత నిర్దయుడు మొగ్గల్ని తెంచాడు! ఇవి వికసించ డానికి ఇంకా చాలరోజులుకావాలి.

ఇదేమిటి? జీవితాంతం ఇక్కడే నుంచొని ఉంటానా? షబ్బా, మున్నీ, సారా అంతా నన్ను వదిలేశారు. అత్తవారింట్లకు వెళ్ళిపోయారు. అటు అమ్మ కేకలు-ఏమోనమ్మా మే మెరగం-మనిషి జాడ పడనీయదు. మేంరాము మమ్మల్ను ఎవరూ పిలవద్దు! బావుంది. ఏమిటీ బలవంతం! ఎప్పుడూ గదిలోనే కూర్చోవాలా? ఏమిటో ఈ పేరంటాలు-గిరంటాలు. గుర్తించగలడా ఎప్పుడైనా? వెదకడానికి వస్తే వెళ్ళిపోవాల్సిందే.

ఇవ్వాళతేదీఎంత? ఓ చిన్నకోడలా ఇవ్వాళ 'గుడ్డూ' జన్మదినం. ఈ కాలపు పిల్లల తెలివి తెల్లవారినట్లే ఉంది. ఏదీ గుర్తుండదు. కాస్త తేదీలు వారాలు గుర్తుంచుకోండి. మేం కొండలాంటి జీవితాన్ని దాటేశాం. మేం ఏదీ మరువలేదు. ఇప్పుడు ముసలిదాన్ని అయినానా అయినా ప్రతి ఒక్కటి గుర్తు ఉంటుంది.

ఏమే పిల్లలూ కాస్త రొద తగ్గించండి. గుమ్మంలోకి ఎవరొచ్చారో చూడండి. ఇప్పుడు నాకేమీ వినరావడంలేదు - గుమ్మందాకా ఎవరో వస్తున్నట్లు మళ్ళీ పోతున్నట్లూ అనిపిస్తుంది.

చాలు కొడకా! చాలించు. ముసలితనానికి మందెక్కడ? చావును తప్పించగలవా? నన్ను వంటరిగా ఉండనీ। ఏదులు ఇక్కణ్ణించి. అవును ఇప్పుడు అల్లాను ఎందుకు స్మరిస్తాను! నా కష్టాలు గట్టెక్కించే అల్లాను పిలుస్తాను- అతడు నా కనుల వెలుగు లాక్కొని వెళ్లిపోతాడు. నా కళ్ళమంకువి-మొండివి ఇంత ముసలి తనంలో కళ్ళలో ఈ వెలుగేమిటి? గుండె పడిపోయింది. కాళ్ల చేతులు మాట వినడంలేదు. అయినా కళ్ళల్లో జ్యోతులు వెలుగుతునే ఉన్నాయి. కంటికీ, కంటి వెలుగుకూ వార్ధక్యం లేదా?

పిల్లలూ! నా ప్రాణం దేనిమీదా లేదు. నేను డబ్బు దాచుకోలేదు-మూట కట్టలేదు. నా పూలబుట్టఉంది చూచారా? దాన్ని జాగ్రత్త పరచండి. పిల్లలు తాకకుండా కాపాడండి. పిల్లలకు తెలివి ఉండదు.

ఎవడైనా ఇలాంటి మొగ్గలను తెంపుతాడా?

# పరుల ఇల్లు

'ఇళ్ళన్నీ ఒకేరకంగా ఉన్నాయి. నేను పరులఇంట్లో ప్రవేశించలేదుకదా

నన్ను ఆస్పత్రినుంచి ఇంటికి తీసికెళ్ళేప్పుడు తేప తేప నాకు అదే ఆలోచనవచ్చింది.

కారు ప్రమాదంలో బలమైన గాయం తగిలిందన్నారు డాక్టర్లు. అంతా అబద్ధం. గాయంతగుల్తే బాధపెట్టాలిగా నాకేమి బాధలేందే.

వాళ్లంతా అదోలా చూస్తున్నారు నన్ను. నాకు కాపలా కాస్తున్నారు. నేను పారిపోతానేమో అన్నట్లు చుట్టి వేశారు.

నేను అనుకున్నంతా అయింది.

నన్ను పరులఇంట్లో వదిలి వెళ్ళారు. నన్నుపట్టి మంచంలో పడుకో బెట్టారు. ఎవరో ఆడది పెద్దగా ఏడుస్తూంది. "హయ్యో! ఏమాయే!! ఇతడు నా హామిద్ ఎలా అవుతాడు? ఎందుకిలా అయింది" అని మొత్తుకుంటూంది.

'అమ్మా! ఆ దుప్పటి కప్పుకున్నదెవరు? నాన్న మంచంమీద ఎందుకు పడుకున్నాడు"? ఒక పిల్లవాడు అడుగుతున్నాడు

ఇహ ఎలాంటి అనుమానం లేదు. పొరపాటున మరో ఇంటికి వచ్చేశాను.

పొరపాటున మరొకరి ఇంటిలో దూరుతే ఏమౌతుంది. అని నేను ఎప్పుడూ ఆలోచిస్తుండేవాణ్ణి. ఏమౌతుంది ఇంట్లోవాళ్లు వస్తారు. నన్ను తరుము తారు. నేను పారిపోతాను

కాని ఇక్కడ అలాలేదే! నాలుగువేపులా మనుషులున్నారు. నన్ను పట్టుకుని కూర్చున్నారు.

'ఏడినా ఊరుకో, ఏమిటా ఏడుపు' అని ఎవరో వారిస్తున్నారు. మీరు ఇంతగోలచేస్తే అతను ఇప్పుడే పిచ్చివాడయిపోతాడు. మీరంతా శాంతంగా ఉండాలి. అతణ్ణి మరిపించాలి. అతని ధ్యాస ఇంటివైపు మళ్ళేట్లు చేయాలి"

"మరిపించండి — మరిపించండి" ఏమిటిది? ఎందుకు అంటున్నారు వీళ్ళంతా ఇలా? అంటే నేను పరాయి ఇంటికి వచ్చినట్లేగా! ఎవడా వెధవ — పిరికిపంద — పెళ్ళాం పిల్లల్ని సాదలేక పారిపోయాడు? నన్నెందుకు ఇలా పడుకోబెడ్తున్నారు? అందరూ దొంగల్లా ఉన్నారు — దోపిడీదార్లు. నన్ను దోచు కుంటున్నారు. అవును. నా తాళం చెవులేవి? తాళంచెవులివ్వండి—నాతాళంచెవులు!

ఏమిటీ వెధవ ఇల్లు — ఈ గదిలో వెలుగేలేదు? ఏమిటి — ఇవ్వాళ ఇంకా సూర్యుడు రాలేదా? సూర్యుణ్ణి మరోకరి ఇంట్లో చెరపెట్టారేమో! ఉహూ! ఇది రాత్రిలా ఉంది. రాత్రి అవుతే చంద్రుడుండాలిగా! చుక్కలుండాలి.

చందమామ రావే
జాబిల్లి రావే

ఓహో! వచ్చిందెవరు? సూర్యుడుగారా! రాండి, రాండి. ఇహ సూర్యుడు రావలసిందే. సూర్యుడులేని పగలు! ఏమిటది? ప్రళయం కాదూ!

సూర్యుడు రాకుంటే నేను గడ్డం ఎలా గీక్కుంటున్నాను. టీ ఎలా తాగుతాను? చీకటిగదిలో షేవ్ చేసుకొను వస్తుందా? ఛీ మెడకోసుకోను. అదేమిటి డాక్టర్ నన్ను షేవ్ చేసుకోవద్దంటాడు? ఏమీ, నా కేమైంది? కారు ప్రమాదంలో చేతులుకూడా విరిగాయనుకుంటున్నారా? వెర్రివాళ్ళు.

నాకు షేవ్ సామాను ఎలా దొరుకుతుంది? తాళంచెవులు పోయినాయే! అన్నీ పోయినాయి. అంతా మాయం అయింది దొంగలు దొంగలు నాసొత్తంతా దోచుకున్నారు. పారి పోయారు. ఇది ఇల్లుకాదు. దొంగల బస్తీ. ఏమిటలా చూస్తారు — అందరూ నన్ను — వింతగా — విచిత్రంగా. ఏమిటా గుసగుసలు. వాడెవడు? అన్నంతెచ్చే ఫజ్లూ. వాడూ నన్ను చూచి నవ్వుతున్నాడు వెధవ,

పాపం వీళ్ళంతా పిచ్చివాళ్ళలా ఉన్నారు. కారు ప్రమాదంలో కావచ్చు-అంతా కార్లో వెళ్తున్నారు ఎక్కడికో-అమాంతంగా-అబ్బ! ఏమిటి నాతల ఇలా బద్దలవుతూందేమీ? అవును. నిజమే ఎవడో రాయితో కొట్టాడు నన్ను. నేనేం చేయాలి? నేనూ మళ్ళీ రాయితోనే కొట్టాలి. అందరినీ కొట్టాలి. కసి తీర్చుకోవాలి. కాని ఇప్పుడెలా? ఈ పరుపు మెత్తగా ఉంది. హాయిగా ఉంది. లేవాలనిపించడంలేదు. ఎవడా మనిషి-కిటికీలో కూర్చున్నాడు. నన్నేచూస్తు న్నాడు. ఎందుకలా చూస్తాడు నన్ను? భయంకరంగా ఉన్నాడు. నాకు భయంగా ఉంది. ఎలా లేస్తానుమరి, వాడే "మూశావా పట్టేశాం" అంటున్నాడు. వాడెవడు నన్ను పట్టడానికి?

"అరే వెధవా! పో ఇక్కడనుంచీ వెళ్లు. నన్నువదులు" కేకపెట్టాను.

నా కేకలు విన్నారు. ఒకస్త్రీ గదిలోకి వచ్చింది. ఆమె లావుగా ఉంది. బొద్దుగా ఉంది. ఆమెపేరు "నిమ్మో".

అవును ఆమెపేరు నాకేలా తెలిసింది? విచిత్రమే. ఇందులో ఒక నాటకం ఉంది. ఆమె నాభార్యట!! ఛ. చూస్తేనే అసహ్యంగా ఉంది. దాని ముఖం అదీ, అబ్బే! 'చూడు. నిన్ను నాకాలితోకూడా తాకను అ', అని చెప్పేశాను ముందే అయినా నాగదిలోకి వస్తుంది. ఒక్కసారికాదు. అనేకసార్లు. అంతేకాదు. కోప్పడు తుంది. మెదలకుండా పడుకొమ్మంటుంది. హుకుం జారీ చేస్తుంది. వచ్చేజన్మలో నాలాంటి వాడి పెళ్ళాం కావడం ఖాయం.

ఆమె గదిలోకి వచ్చింది. "ఎవరు వచ్చారు? ఎందుకా కేకలు?" అని అడిగింది.

"ఎవడువాడు? ఎందుకు ఎప్పుడూ నన్ను కొరకొర చూస్తుంటాడు?" అడిగాను కిటికీలో కూర్చున్నవాణ్ణి చూపి.

"యా! అల్లా! నామీద దయదలచు" అని నొసలు బాదుకుంది.

"వాడు మనిషా? వాణ్ణిచూచి దడుపేమి? అదిఫోటు! ఏమిటి మిమ్మల్నే మీరు మరచారా?"

కాదు కాపడానికి వీల్లేదు. వాడు "నేను" ఎలా అవుతాను? తప్పు 'వాడు' 'నేను' అవుతే మరి నేనెవరు? కాదు ఏదో గొడవ అయింది. మా ఇద్దరిలో "అసలు నేను" ఎవరు? అరే! నిజం మనిషి మరొకడని తెలుస్తే! ఇంకేముంది- వీల్లేదు-నేను దాక్కోవాలి. ఏదీ నాదుప్పటి. ఇహ ఎవరన్నా మొత్తుకోనీ-పలకను ఆహఁ పలకనే పలకను.

మరోగదిలోనుంచి ఎవరో అంటున్నారు. అవును. అతను పతికేది వాపేరే! ఏమంటున్నాడు?

"వాడికి పిచ్చెక్కలేదు. మీరు వాడికి చికిత్స చేయించరు. వాడు బాగు కావడం మీకు ఇష్టంలేదు. బాగవుతే మీ మీదపెత్తనం చెలాయిస్తాడని భయం.

ఇంత ఆస్తి! బ్యాంకులో డబ్బు! ఏడువందల పెన్షన్ !!!

ఎవరువాడు? 'నిమ్మో' మొగుడు కావచ్చు. ఖాయం వాడే. పిచ్చెక్కినట్లుంది. అంతా కలిసి నన్ను పిచ్చివాణ్ణి చేయాలను కుంటున్నారు. కుట్ర చేస్తున్నారు. 'నన్ను' రెండు ముక్కలు చేశారు. వేలాడ తీశారు. ఇదీ కుట్రలో భాగమే. నన్ను ఆస్పత్రినుంచి ఎత్తుకొని వచ్చారు. నన్ను దొంగిలించారు. వీళ్ల దొంగలు.

ఎవరది ఎవరు నా దుప్పటి గుంజేది. నేనిక్కడ లేను పైనఉన్నాను-గోడకు. కిటికీలోంచి తొంగి చూస్తున్నాను.

అబ్బా నిమ్మో మళ్ళీ వచ్చింది. ఆమె చేతిలో ద్రాక్షపళ్ల పొట్లంఉంది. వెంటకొందరు జనం ఉన్నారు. వింత చూడ్డానికి వచ్చినట్లున్నారు. వాళ్ళకు నన్ను చూపించాలనుకుంది. తీసుకు వచ్చింది.

ప్రేమగా ద్రాక్షపండు నానోటిలో పెట్టింది. 'హమీద్! కాస్త తెలివి తెచ్చుకోండి. చూడండి ఎవరొచ్చారో? మీ పిన్ని వచ్చింది. నిషాత్, అక్తర్ వచ్చారు. వీళ్ళనూ మరచారా। అడిగింది.

ఒక పెద్దమనిషి నా దగ్గరకు వచ్చాడు, కూర్చున్నాడు. అడిగాడు 'ఎలా ఉంద'ని

"అచ్చా అచ్చా అర్థమైంది. మీరు ఆస్పత్రి మనుషులు ఇంజక్షన్ ఇవ్వడానికి వచ్చారు,' అని లేచాను. నారక్షణకు పక్కనున్న గ్లాసు అందుకున్నాను. "వెళ్ళండి ఇక్కడినుంచి కదలకుంటే కాళ్ళు విరక్కొడ్తాను" అని అరచాను.

నిమ్మో ఏడుస్తూంది. ఆమెను ఒక తన్ను తన్నాను. "ఏమిటీ నటన! నన్ను గారడిని చేయాలనుకున్నావు. అందరికీ ఆటచూపాలనుకున్నావు. ఏమను కున్నావో-నీఆట పట్టించగలను"

ఇహ ఇక్కడ ఉండలేను. వెళ్ళిపోవాలి. పారిపోవాలి. ఎంతబావుంటుంది వీళ్ళకు కనిపించను. కాళీమంచం కనిపిస్తుంది. వాళ్లు ఏడుస్తారు- నా ఆస్తికోసం- పెన్షన్ కోసరం విలపిస్తారు! వాహ్! వాహ్! చాలా బావుంటుంది. సరదాగా ఉంటుంది. మజాగా ఉంటుంది.

హాయ్యో! ఎలా? ఈ రెండో "నేను" ఉన్నాడు. వాడు పథకం పాడు చేశాడు! వెధవ! వాడునాకు కాపలా! అసలునేను రెండు ముక్కలు ఎందుకయి నట్లు? ముక్కలయిన మనిషి ఏంచేయగలడు?

ఆ రోజు ఇద్దరు పిల్లల్ని గదిలోకి పంపించారు.

ఒకడు పదిపదకొండేళ్ల పిల్లవాడు. వాడికి బెదురు. భయం, అనుమానం. నా చేతినిచూస్తున్నాడు - రాయి ఉందేమోనని భయం. వాడు "పప్పా". ఇంకో అమ్మాయి మున్నీ, అందంగా ఉంది, చేతిలో బొమ్మ ఉంది, కీ ఇస్తే కదులుతుంది-పలుకుతుంది.

"చూం చూం ఆవో ఆవో" అంటూంది బొమ్మ.

మున్నీని నేను పిలవలేదు. "పప్పా" వారిస్తున్నాడు, అయినా ఉరికి వచ్చింది. నామీద పడ్డది. ఆమె బంగారు వెంట్రుకలు నా గుండెమీద ఫరచు కున్నాయి.

"నాన్నా! నాన్నా! మీకు దెబ్బ ఎలాతగిలింది? పప్పా ఉన్నాడు మాకారా వాడికి మీరంటే భయం! నాన్నా మీరు మమ్మల్ని కొట్టరుగా" మున్నీ రెండు చిన్ని చేతుల్తో నా చెంపలు పట్టుకొని అడిగింది- మెల్లగా-సన్నగా!

"మాకొక విమానం తెచ్చిపెట్టండి అందులో కూర్చుందాం. ఎగిరిపోదాం-దూరం-చాలదూరం.... వెళ్ళిపోదాం- నాన్నా"

అమాంతంగా మేమిద్దరం విమానంలో పడ్డాం. ఎగిరిపోతూంది విమానం. పోతూంది....పోతుంది.

బొమ్మ మావెంట ఎలా వస్తుంది? వెధవది నేలమీద పడుండేది?

"టాటా....టాటా ఆగండి. మీరెక్కడికి?" కొత్త ఇంటి వాళిని వారించాను.

"ఆగండి....ఎక్కడికి వెళ్ళడం?"

వెధవలు మళ్ళీ వచ్చేశారు!

"మీ ఆరోగ్యం బావుండలేదు. అంతవేగంగా పరిగెత్తకండి" "నిమ్మో" వెనుకనుంచి నన్ను పట్టుకుంది.

"మున్నీ దిగు. మీనాన్న బుజం ఎక్కి సరదా మానుకో .... వారి ఆరోగ్యం అంత బావుండలేదు"

"విడువండి .... వదలండి .... మేం విమానంలో డిల్లీపోతున్నాం. దూరం....చాలదూరం వెళ్తున్నాం....టాటా"

మున్నీని బలవంతంగా దింపారు. నేను నాగదిలోకి వచ్చి పడుకోవాల్సి వచ్చింది.

నిమ్మో నాదగ్గర కూర్చుంటుంది. "భగవంతుని దయ మీరు పిల్లల్ని మరిచిపోలేదు" గారాబంగా అంటుంది. "నిజం. మీరు పిల్లల్ని మరిచిపోతే మాగతేం కాను"

"ఏం. నీకేమి అవుతుంది?" నేను దూరంగా జరిగి కూర్చుంటాను.

"బావుంది. నేనేం సంపాదించగలను? మీ పెన్షన్ వస్తుంటే గడుస్తూంది. ఏదో కొద్దిగా ఆస్తి ఉంది. ఇమ్తియాజ్ తల్లి బాగా సుఖపడ్డది. వెళ్ళిపోయింది. మీరు నన్ను చేసుకున్నారు. పిల్లల్ని తీసుకొని నేను ఎక్కడికి వెళ్ళను?"

ఇది నిజంగా పిచ్చిదే. దానికి పిచ్చెక్కింది. ఇప్పుడే ఏడ్చింది. మళ్ళీ నవ్వుతూంది.

"ఇదిగో! దీనిమీద సంతకం చేయండి"

ఏమిటిది? జాగ్రత్తగా చూశాను. నన్ను బానిసను చేసే కాగితంకాదు కదా! నేను రెండుగా విడిపోయాననే ఖరారునామా కాదుకదా! నాలో ఒకభాగం కిటికీ లోంచి తొంగిచూస్తూంది. మరోభాగం ఈ దుర్మార్గుల చేతికి చిక్కింది.

"ఏమిటి చూస్తారు? సంతకం చేయండి" నిమ్మో నిప్పులమీద నుంచున్నట్లుంది. ఆమెకు తొందరగా ఉంది. ఆతాటంగా ఉంది.

నేను కాగితాన్ని చూచాను తీక్షగా చూచాను. ఒకవేళ ఏదో వేలమాట. ఇది డబ్బునుగురించింది. ఇంతే! దబ్బేగా! సంతకం పెట్టేశాను.

"అమ్మా! నాన్న సంతకం చేయడమూ మరచారనుకో అప్పుడు ఏమి అవుతుంది" దగ్గరనుంచున్న పప్పూ అడుగుతున్నాడు. పప్పూ పక్కని ఫజ్లూ' ఫజ్లూ పక్కన షమ్మీ, ఇంకెవరో అమ్మీ టమ్మీ అంతా ఉన్నారు.

"అయ్యో కలంపట్టటం మరిచిండనుకో—ఇగపైన చీతికేడ వచ్చును?"

ఫజ్లూగారు పాకుదు పళ్ళతో ఇగిలించారు.

"ముయ్—నోర్ముయ్" నేను వాడిమీద వంటికాలితో లేచాను. "వచ్చాడయా మహా దబ్బులగారడీ చూడ్డానికి! ఎందుకుబే—అదే నన్నుచూచి నవ్వుతావ్. ఆ( ఇక్కడేం కోతుల ఆడుతున్నాయా? నా తలకు కొమ్ములు వచ్చాయా?"

నా మాట విన్నారు. అంతా ఖళ్లున నవ్వారు.

అప్పుడు నాకు నిజంగానే అనుమానం కలిగింది. అవును నాముఖంలో ఏవో మార్పు వచ్చింది. కాకుంటే వాళ్ళందరూ ఎందుకు నవ్వుతారు? ఆ తెలిసింది. నేను పిచ్చివాడినైపోయానుగా- రెండుగా అందుకే అలా చూస్తున్నారు అంతా అంతేకాదు నేను కిటికీలో కూర్చున్నానుగా. అనేనూ నమ్మి ఆశ్చర్యంగా చూస్తున్నాను. ఏమిటి వెఢవవేషాలు! ఇహామానెయ్యాలి.

నిన్న ఏం జరిగింది? ఈగను చంపాలనుకున్నాను. చక్ర అందుకున్నాను ఇల్లంతా ఉరికాను. దాంతో బల్బులన్నీ పగిలిపోయాయి. అద్దాల బీరువా తల కిందులైంది. జనమంతా కూడారు. 'తమాషా' చూడ్డానికి, ఏమిటేది - జనం ఇంతగా వచ్చేశారు? పట్నంలో సినిమాహాళ్ళన్నీ మూసేశారా?

నిన్న పగలు మాడైనింగ్ హాల్లో మాట్నీషో ఆడింది! అందంగా ఉంది అమ్మాయి షమ్మి-హీరోయిన్ నల్లగా పొడుగ్గా ఉన్నాడు యువకుడు హీరో. వాళ్లు 'రొమాంటిక్‌మూడ్' లో ఉన్నారు. వలపు ఒలకబోస్తున్నారు. ఇది చాటు ఏడుపు! వీళ్ళది దొంగ ఏడుపు!! అయినా వింత ఏముంది? ఇది అన్ని భారతీయ పిక్చర్లలో ఉండేది. అదిగో పాట ప్రారంభం—'తూ మేరా చాంద్ .... మై తెరీ చాంద్నీ' అది పాట. పాడేగా. అపాట నిజంగా వినిపిస్తే నేను పిచ్చివాణ్ణి అవుతాను.

"ఆపండి. ఆపండి'' అరిచావ్నేను.

నా అరుపువిని అర్ధాంతరంగానే ఆగిపోయింది సీను.

హీరో పరుగు లంకించుకున్నాడు. హీరోయిన్ నాకళ్ళకు చూపేసింది. "నాన్నా క్షమించు' ఆమె ఉత్తుత్త కన్నీరు కారుస్తుంది.

నేను చేయిచాపి సినిమాలో హీరోయిన్ తండ్రిలా "నన్ను క్షమించు అర్థంలేని పిచ్చిడ్రామాలో నేను వేషం వేయలేను'' అన్నాను.

ఇంతలో చూం చూం వచ్చింది. ఆమె వడినిండా కాగితం ముక్కలున్నాయి.

"నాన్నా! చూడండి ఎన్ని నోట్లు తెచ్చానో!" అని ఒడిలో కాగితా లన్నీ గుమ్మరించింది. అవి నిజంగానే నోట్లు అయిపోయాయి – చిన్న చిన్న నోట్లు – బుల్లి బుల్లి నోట్లు!

"ఈ నోటుతో కేకులు కొంటా.... ఈ నోటుతో విమానం... ఈ నోటుతో నాన్నకు సిగరెట్లు.... ఒక్కొక్క నోటుతీసి మహా ఇల్లాలులా లెక్క పెడ్తూంది.

"ఈనోటుతో నాన్న...."

"హుత్ పిచ్చిదానా! నోటుతో నాన్నను కొంటారా ఎక్కడన్నా! పప్పు అంటాడు.

"అవును. కొనవచ్చు" చూఁచూఁ చాల నిబ్బరంగా అంటుంది.

"పినాన్నా! నువ్వు మాఅందర్నీ ఒక్కనోటిచ్చి కొన్నావుకదూ!"

"అవును అలాగే కొన్నాను. మీరంతా నా బానిసలు. నేను ఆజ్ఞాపిస్తున్నాను. ఇలారండి ఇక్కడ నుంచోండి"

"పప్పూ వట్టిమొద్దు" మున్నీ అంటుంది.

"డబ్బుంటే అన్నీ కొనవచ్చుంటుంది అమ్మ"

అయితే నాలో రెండోభాగం ఉండే దాన్ని కొంటాను. భలే అయిడియా! మున్నీదగ్గరున్న రూపాయలన్నీ లాక్కున్నాను.

"వెళ్లండి వెళ్లిపొండి. ఈ రూపాయలన్నీనావి"

"కాదు నావి" మున్నీ ఏడుపు సాగించింది "నా రూపాయాలు నాన్న తీసుకున్నారు. ఇప్పించు"

"ఈ కాగితాలు పంచేసుకుంటారు? ఇచ్చెయ్యరాదూ" నిమ్మో లోనికి వచ్చేసింది.

"ఇవ్వను. ఈ రూపాయలతో నా రెండోభాగం కొనుక్కుంటాను, ఎప్పుడూ సగంగా ఉండాలనా నీఉద్దేశం. ఎప్పుడూ నేను రెండుగా ఉండాలనా ఏ నాటకం"

నా గద్దింపు విని నిమ్మో నిలిచిపోయింది. బొమ్మలా.

"పిల్లలూ నడవండి బయటికి. మీనాన్నకు మళ్ళీ వచ్చేట్లుంది"

నిమ్మో గదితలుపులు వేసింది. వెళ్లిపోయింది.

ఇవ్వాళ పేపర్లో వార్తవచ్చింది- రాబర్ట్ కెన్నడీని ఎవరో కాల్చేశారట- హత్యచేశారట!

నేను నా శత్రువులందరినీ లెక్కపెట్టి కాల్చేస్తాను. కాని నాపిస్తోలేది? వాడు ఎవడు? కెన్నడీని చంపినవాడు అరువుతీసుకున్నాడు! ఏమిటి? నాపిస్తోలు. అలాకాకుంటే ఈ దుర్మార్గుల్ని బతకనిచ్చేవాణ్ణా! ముఖ్యంగా నిమ్మో, ఫజ్లూ, ఇమ్తియాజ్ పిల్లకు షూట్ చేసేవాణ్ణి- కాల్చిపారేసేవాణ్ణి. ఓహ్! ఆనాడు సూర్యుడు పూర్తిగా వెలుగుతాడు. జనం గుండెలిచ్చి నవ్వుతారు.

ఠప్.ఠప్.ఠప్. నాచేతికి బందూకు వచ్చింది. ఇదిగో పేలుస్తున్నాను. కాలుస్తున్నాను. నాగురి సరిగ్గా తాకుతూంది. ఒక్కొక్కడూ ఒరుగుతున్నాడు. ధన్ ధన్ ధన్. అంతా పడిపోతున్నారు. నిమ్మో, ఫజ్లూ- నన్ను ఈ ఇంట్లోకి బలవంతంగా నెట్టిన డాక్టరు, నన్నుచూచి ప్రతినెలా నవ్వే పెన్షన్ ఆఫీసు క్లార్కు-- అంతా పడిపోయారు. ఆహ్హాహ. బావుంది. ఖుషీగా ఉంది. ఇహ మజాఉడాయించు- కబాబులు తిను-

ఏమిటివాళ ఇంత ఆకలి. ఆకలి. ఆకలి. దహించుకు పోతూంది. ఏడాది నుంచి తిండిలేదు. ఇవ్వాళ కబాబులు తింటాను- మిర్చిమసాలా దట్టించినవి తింటాను, కబాబులు దొరక్కుంటే ఇమ్తియాజ్ను కాల్చుకు తినేస్తాను.

"కబాబులు కావాలి, త్వరగా కబాబ్ వాంటెడ్"

కబాబులు రాలేదు. ఇమ్తియాజ్ వచ్చాడు.

ఇతడూ ఈకుటుంబ సభ్యుడే. ఈ కుమార శేఖరుడు నా సంతానమేనన ఇతనితల్లి- మహామాత- ఎప్పటికీ నాకు జ్ఞాపకం చేస్తుంటుంది. గత జన్మలో

కూడా మేమిద్దరం శత్రువులమేమో! ఎందుకంటారా? ఇప్పటికీ ఇష్టియాజ్ నన్ను ద్వేషదృష్టితో చూస్తాడు. అతని చూపులో అసభ్యత కనిపిస్తుంది. నేను అతన్ని చూస్తే "బిడ్డా! చూసుకుందాంలే" అనాలనిపిస్తుంది.

ఏమిటీ వీడి టెక్కు? ఎవడి ఆస్తి చూసుకుని వీడి నిక్కు! సిగరెట్టు పొగ ముఖంమీద ఊదుతుంటాడు. తల్లీ కొడుకులకు ఎప్పుడూ డబ్బును గురించి తగాదాలే: వాడు రావడం రాత్రికో అర్ధరాత్రికో! ఆరావడమూ తాగి తూలుతూ పేలుస్తాడు. వాడేమనుకుంటాడు- నేను వారికంపు గుర్తించలేననా? వాడితల్లి ధైర్యానికీ గుండె నిబ్బరానికీ ఆశ్చర్యం వేస్తుంది. ఎంతధైర్యం ఆమెకు? ఆపె ఛవను నాకొడుకును చేసింది.

ఇప్పుడంటారా నేను ముసలివాణ్ణై అయిపోయాను. నేనూ చూచాను లోకాన్ని! ఇష్టియాజ్ను తాగి చెంపదెబ్బలు కొట్టాలనిపిస్తుంది. వాడి నిజపు తండ్రి గుర్తువచ్చేదాకా బాదాలనిపిస్తుంది, కాని అమ్మో వాడు ఎలా ఉన్నాడు దుంగలా. వాడి శరీరం ఎలాఉంది? ఇనుపముక్కలా! అందుకే వాడంటేభయం -ఏమిచేయలేను. ఆతండ్రి దురదృష్టవంతుడు- వాడి ముఖాన ఇలాంటి సంతానం రాసిపెట్టాడు దేవుడు!

ఇవ్వాళా అంతే, గదిలోకి వచ్చాడు- రాగానే హుకుం జారీచేశాడు.

"త్వరగా తయారుకండి. ఇవ్వాళ 7వ తేదీ పెన్షన్ తేవడానికి నావెంట రావాలి"

పెన్షన్ తెచ్చుకోవడానికి బయటికి వెళ్లడమంటె నాకు భలే సరదా. ఎందుకంటారా? వీధుల్లో స్వేచ్ఛగా తిరగొచ్చు పెన్షన్డబ్బు- అంతమొత్తం- నా జేబులో ఉంటే ఎంత ఖుషీ! కాని ఇష్టియాజ్ ఉండనివ్వడు. ఆడబ్బుతో అయిస్క్రీమ్ తెచ్చిపెడ్తాడు- నన్ను ఇంటికి తెచ్చి విడిచేస్తాడు. తరవాత తల్లి ఆతనిమీద కేకలు వేస్తుంది.

7వ తేదీ విచిత్రం అయింది. ఆరోజు నేను అందరికీ కావాలి. నిమ్మో నేను ఆవిడవాన్నంటుంది. తానే నన్ను పెన్షనుకోసం తీసికెళ్తానంటుంది. ఇష్టియాజ్ నామీద తన అధికారం ఉందంటాడు. తానే తీసికెళతానంటాడు.

ఇవ్వాళ నేను ఇష్తియాజ్‌ను విడిపించాలనుకున్నాను. అతని మాట విని నవ్వే 'నాకు కవాబులు కావాలి. ఏవి? త్వరగా తే. ఆకలి మండిపోతూంది." అన్నాను.

ఇష్తియాజ్ అతిప్రేమతో అన్నాడు.

"మీరు బట్టలు మార్చుకోండి. ఇవాళ పెన్షనుడబ్బు సొంతం కవాబులకే ఖర్చుచేస్తాను, మీకే తినిపిస్తాను"

ఇష్తియాజ్ ఎంతమంచివాడైనాడు! ఎంత ప్రేమగా మాట్లాడుతున్నాడు! నన్ను గద్దించడంలేదు- దెబ్బలుకొట్టి బట్టలు కట్టించడంలేదు! అబ్బ! ఇష్తియాజ్ ఎంతమంచివాడు.

యాఅల్లా! కవాబులు ఎంతమండి పోతున్నాయి! ఏడువందలకు ప్లేటు కవాబులు. వద్దు. నాకొద్దు. తీసెయండి. నేను కవాబులు తినను, ఇష్తియాజ్ వెంట బజారుకు వెళ్ళను. ఎందుకువెళ్ళాలి నేను పెన్షను తేవడానికి? నాకేంపని? దుప్పటి కప్పుకొని పడుకుంటాను. మళ్ళీ కళ్ళు తెరవను అంతే. ఇహకదలను.

మనం బట్టలు మార్చడం- బయటికి వెళ్ళడం ప్రళయంలాంటివి. ఇల్లు సొంతం కదులుతుంది ఒకడు గడ్డం గీయిస్తాడు. ఒకడు ముఖం కడిగిస్తాడు. చూడండి ఇష్తియాజ్ స్వయంగా ఇస్త్రీచేసి తెస్తున్నాడు బట్టలు. ఇలాంటినన్ను చూచి లోకం ఏమనుకుంటుంది?

లోకం....లోకులు.... ఏమిటి వారంటే అంతభయం. ఈ ఇంటివాళ్ళెం దుకు అలా జడుస్తారు! ఏరి ఆలోకులు— ఏరి ఆ జనం? వారు నాక్కనిపిస్తే వాళ్ళకు కథలన్నీ చెప్పేసేవాణ్ణి, నిమ్మో లేనప్పుడు ఇష్తియాజ్ మారుతాళం చెవితో అల్మారీ తెరిచి నగలు ఎత్తుకుపోయాడు. హమ్మి అందినకాడికి అందు కుని ఆ కుర్రాడితో లేచిపోతుంది. నేను తెరచాటునుంచి అన్నీ చూస్తుంటాను. ఒకనాడు పప్పు గిన్నెలోని ఎముకల ఏరుకొని తింటున్నాడు. నేను వాణ్ణి ఆదిరించాను. అదిచూచి అంతా ఆశ్చర్యపోయారు- అసలు నేను వంటింట్లోకి ఎలా వచ్చానా అని- వస్తే అక్కడ ఎంతసేపునుంచి నుంచున్నానో అని.

ఫజ్లూఉన్నాడే- వాడికి అతి తెలివి. నాకోసం భోజనం తెస్తాడు. స్టూలు మీద పెడ్తాడు. తానే తినేస్తాడు. ఒకనాడు వాడు వెళ్ళిపోయాడు. నిమ్మోతో అంటున్నాడు నాకు. భోజనం పెట్టానని. నేను చాటుగా విన్నాను "కాదు. అబద్ధం. నేను తినలేదు నాకు ఆకలిగా ఉంది. నాకు అన్నం కావాలి' అని వంటింట్లోకి వెళ్ళి అరచాను.

"ఇదేంఖర్మ! ఇప్పుడే ఫజ్లూ అన్నం పెట్టాడు మళ్ళీ ఆకలి అని ఊడి పడ్డాడు!" నిమ్మో షమ్మీతో అన్నది.

'ఎక్కువ తింటే మీ ఆరోగ్యం పాడవుతుంది. వెళ్లండి గదిలో పడు కోండి" షమ్మీ నన్ను గదివైపు నెట్టుతూంది.

"నాకు ఆకలిగా ఉంది. అన్నంపెట్టండి. కావాలంటే ఫజ్లూను అడగండి నేను తినలేదు"

ఫజ్లూ మాట్లాడడు. నిమ్మోను చూస్తాడు నవ్వుతాడు.

"అయినా మీరిక్కడికి ఎందుకువచ్చారు టేబుల్ పాడుచేస్తారు, నడవండి గదిలోకి, అక్కడికే పంపిస్తాను" నిమ్మోనన్ను లాక్కెళ్లింది. గదిలోపడేసింది. బయటినుంచి గొళ్ళెం పెట్టింది.

'నాన్నను కొట్టకండి....కొట్టకండి' మున్నీ అరుస్తూంది—ఏడుస్తూంది.

"నోర్ముయ్....వచ్చింది....పెద్ద-నాన్న కూతురు" నిమ్మో మున్నీని బాదుతూంది. మున్నీ ఏడుస్తూంది.

'తలుపు తియ్యండి' నేను తలుపుకు తలబాదుతూ అరచాను.

తలుపు తెరుచుకుంది,

'చూ(చూ(ను చంపేశారా?' నా నొసటిరక్తం తుడుచుకుంటూ చూచాను.

మున్నీ మూలకు నుంచుంది. ఎక్కెక్కి- ఏడుస్తూంది. మున్నీ చేతులు చాచింది. నేను చేతులు చాచాను. ఇద్దరం ఒకరిమీద ఒకరం పడిపోయాం.

నన్ను గదిలో ఉంచడానికి నిమ్మో ఒక ఉపాయం చేసింది ఆమె రక రకాల వ్యక్తులను నా దగ్గరికి పంపుతుంది. నేను వారితో మాట్లాడితే ఉల్లాసంగా ఉంటానని ఆమె ఉద్దేశం.

మొన్న ఒక పిచ్చివాడొచ్చాడు. అతవిది నకిలీగడ్డం. అది మాటిమాటికీ గాలిలో ఎగురుతుంది. అది ఊడుతుందేమోనని భయం. గుట్టురట్టవుతుందని నకిలీగడ్డం పట్టుకొని కూర్చుంటాడు. నన్ను చూచాడు. అంతే గట్టిగా కావిలించు కున్నాడు- కలకాలపు మిత్రునిలా.

'చెప్పు మిత్రమా! ఎలావున్నావు? ఆరోగ్యం బావుంటూందికదా?' అతను అడిగాడు.

'నీకథ చెప్పవయ్యా! ఆ నకిలీగడ్డం అమ్ముతావా?'

ఆమాట విన్నాడు వెనకడుగు వేశాడు. నేను లాగి కూర్చోపెట్టాను. కాసేపు పిచ్చివాడితో మాట్లాడ్డాం తప్పేం. సరదాగా ఉంటుంది అనుకున్నాను.

అతడు దూరం జరిగాడు. స్టూలుమీద కూర్చున్నాడు.

"చాలాసార్లు అనుకున్నాను నిన్ను చూడాలని, నీవు గుర్తిస్తావో లేదో అని భయం. అందుకే రాలేదు" గడ్డం సర్దుకుంటూ అన్నాడు.

'అవునుపాపం! నీకు మెదడు జబ్బుగామరి. నీవ్వు చాలా మారిపోయావు'

'అబ్బే అదేంలేదు. ఏంలేదే. లేందే. అన్నాడు. నన్నుచూచి నవ్వుతున్నాడు. ఎందుకలా నవ్వుతాడు? పిచ్చివాళ్ల అంతేనట. ఎదుటివాణ్ణి పిచ్చివాడనుకుంటాడట! వాడు పిచ్చివాడు. నన్ను పిచ్చివాడనుకుంటునట్లున్నాడు.

'మిత్రమా! నన్నుచూస్తే చాల బాధగా ఉంది. ఏంచేస్తాం - జబ్బు అలాంటిది.'

'నాకు మీ నకిలీ గడ్డం ముద్దొస్తుంది. ఈ ఒక్కనాటికి అరువియ్యరాదూ, చూచూతో దొంగల ఆట ఆడుకుంటాం'

అతడు నామాట విన్నాడు. దర్వాజావైపు నడిచాడు. కొంతదూరంవెళ్లి నిలిచాడు, 'మిత్రమా! కాస్త తెలివిగా మాట్లాడు. వదిన నీ చికిత్సకోసం ఏర్పాటేమీ చేయలేదని విన్నాను. నీ పెన్షను సాంతం వీళ్లకే అర్పిస్తావా! నిన్ను గురించి జాగ్రత్త పడవా ?

మళ్లీ పెన్షన్‌మాట! నా రెండోభాగం కూడా మాయం అయినట్లుంది. మిగిలింది నేనే-నాపేరు పెన్షన్. నేను మనిషినికాను-పెన్షన్ను అన్నట్లు చూస్తు-న్నారంతా వెధవ పెన్షన్! విస్సిరి పారెయ్యాలనిపిస్తుంది అప్పుడు. పారేస్తాను నిజమే. తరవాత నన్నెవరైనా లెక్క పెడ్తారా ఈ ఇంట్లో? నన్ను కానేవా రుంటారా? ఏమంటారు ?

ఆ పిచ్చి వెధవను ఎప్పుడు వదిలించుకున్నానో గుర్తులేదు. ఫల్లా చెప్పిందేమంటే-నేను వాడి గడ్డం గుంజడానికి ప్రయత్నించానట వాడు వెదిరి పారిపోయాడట.

వాడు తలతిరిగిన పిచ్చివాడు. వాడితో ఇంకెలా ప్రవర్తించాలంటారు?

అచ్చా అలాంటి మరో పెద్దమనిషి వచ్చాడు. మామూలు నాటకమంతా ఆడాడు. కలకాలంగా పరిచయం ఉన్నట్లు మాట్లాడాడు. ఏవో పాతకతలన్నీ చెప్పాడు. అన్నీ అబద్ధం. వాటిలో ఒక్కటి నిజంలేదు. కనుమరుగుచేసి నా పార్కర్ పెన్ను తన జేబులో వేసుకున్నాడు. నా సిగరెట్లన్నీ కాల్చేశాడు. పైగా తన అనుగ్రహం సాంతం వలంబోశాడు. నిమ్మోను ఓదారుస్తున్నాట్ట. నా జబ్బును గురించి ఆమె గుండె బద్దలు చేసుకునేట్టుందిట. అందుకేనట ఆ ఓదార్పు, అందుకే సమయం దొరకడం లేదట-నన్ను చూడ్డానికి. ఇంకావినండి. ఆస్పత్రి నుంచి ఈ వింతఇంటికి ఆయనే తెచ్చాట్ట! ఆమాట విన్నావా ఇహనేను వశం తప్పాను.

"అచ్చా! నువ్వేనా నాయనా ఈ పరాయి కొంపలో నన్ను తోసింది-నరకంలో నన్నునెట్టింది! ఏం నాయనా నన్ను ఇలా నతాయిస్తే నీకేమొచ్చింది

"ఇంకా ఏమీరాలేదు, కాని వస్తుంది" అని తలఊపాడు-చిరునవ్వాడు.

'అదా సంగతి, అయితే ఇప్పుడే పోలీసును పిలుస్తాను. నీ వ్యవహారం తేలుస్తాను' అని టెలిఫోను డయల్ డయల్ చేశాను. హాలో....హాలో.

"నా ఫోను నా కిచ్చేయండి" చూ౦ చూ౦ వచ్చి తన చిన్ని ఫోను లాక్కుంది "చెప్పండి ఎవరికి ఫోన్ చేయాలో_నేను చేసి పెడ్తాగా" అంటుంది.

"పోలీస్ స్టేషన్! చూ౦చూ౦ పోలీస్‌ను అర్జంటుగా పిలువ్ – దొంగ పారిపోతాడు" నేను ఆతురతతో అన్నాను.

"హలో" చూ౦చూ౦ టెలిఫోను చెవికి తాకించి, గంభీరంగా కూలబడ్డది" అర్జంటుగా రాండి_ మా నాన్నను సతాయిస్తున్నారు. అన్నం పెట్టడంలేదు." అంటూంది.

కాస్సేపు అలా గడిచింది. ఆ ఆట విసుగొచ్చింది.

"ఫోను ఆట అయిపోయింది. ఇహ దొంగను పట్టుకుందాం," అని బైల్దేరాం దొంగను వెదకటానికి.

"ఉస్సె మెల్లగా నడవండి" చూ౦ చూ౦ చేయి నోటికి అడ్డం పెట్టుకుంటుంది.

మే మిద్దరం మోకాళ్ళమీద దేకుతున్నాం. మంచాలకింద వెదకుతున్నాం. నా తల కోడుకు తగిలింది. చప్పుడువిని ఎవడో మంచంకింద దాక్కున్నాడు.

"దొంగ దొంగ" నేను దొంగ కాలు పట్టుకున్నాను. అరచాను "నాపిస్తోలు తెండి, దొంగను పట్టుకున్నాను.

"దొంగను పట్టేశాం, దొంగను పట్టేశాం" చూ౦చూ౦ చప్పట్లు కొడ్తూ కేకలు పెట్టింది.

ఇతణ్ణ వదలండి: వదలండి, పిల్లలు వస్తారు. గొడవ చేయకండి, నిమ్మో మంచంమీంచి లేచి అంటూంది. అప్పుడు నేను ధ్యానంగా చూచాను_ఎవడీ

దొంగ అని. వాడే ఇందాక నాతో మాట్లాడినవాడు! మా గొడవ విన్నారు. ఇల్లంతా గదిలో కూడింది-షమ్మీ, ఫజ్లూ, పప్పూ, ఇమ్తియాజ్. అంతా ఆశ్చర్యంగా ఒకసారి నన్ను ఒకసారి ఆ వ్యక్తిని చూస్తున్నారు. తరవాత అంతా తలలు వంచుకున్నారు. గదినుంచి వెళ్ళిపోయారు.

పిరికిపందలు! దొంగను శిక్షించేధైర్యంకూడా లేదు అనుకున్నాను.

ఆయనేం పిచ్చివాడుకాడు. అంతా నాటకం తనను మరిచారు. నన్ను కాపుండటం మరువలేదు. అంటూ నిమ్మో రాత్రిసాంతం గునుస్తూనే ఉంది.

ఒకనాడు విచిత్రం జరిగింది.

రాత్రి గడిచింది. జనం మేల్కొన్నారు. నా గదిలోకీ వెలుగువచ్చింది. కాని ఎండలేదు. రేయిదొంగ సూర్యుణ్ణి దొంగిలించలేదుగదా అని అనుమానం. నాకు ఆందోళనగా ఉంది. ఆతురతగా ఉంది. టెలిఫోనుతో గదిలోకి చూఁ చూఁ వచ్చింది. ఈ వార్త వినిపించాను:-

“రేయిదొంగ సూర్యుణ్ణి దొంగలించాడు”

చూఁచూఁ పాపం చాల బాధపడ్డది, “ఎక్కడికి తీసికెళ్ళాడు?” అని గంభీరంగా అడిగింది. ఈ ఇంట్లో ఆ పిల్లను మించిన తెలివిమంతులు ఉన్నట్లు కనిపించలేదు.

“ఎలాతెలుస్తుంది? చూస్తున్నావుగా చీకటి చీకటి ఉంది. ఇహ నాసంపద సాంతం పోయినట్లే! సూర్యుడులేడు. ఉదయం ఎలా అవుతుంది? నేను లేవడం ఎలా?” నాకు దుఃఖం పొంగింది. ఏడుపుసాగించాను చూఁ చూఁ చూచింది. బొమ్మలు పారేసింది. అలవాటుచొప్పున నా గుండెమీద వాలింది. బంగారు వెంట్రుకలు పరిచింది. “ఏడవకండి నాన్నా! నేనొక సూర్యుణ్ణి కొనితెస్తాను. నా దగ్గర రెండుపైసలున్నాయి” అన్నది.

“పిచ్చిదానా! సూర్యుడు బజార్లో దొరుకుతాడా?” అని పాప వెర్రిదనానికి నవ్వాను.

"అయితే మీదగ్గరికి ఏలావచ్చేవాడు?" కళ్లు పెద్దవిచేసి ప్రశ్నించింది.

అదిగో - కొత్తసమస్య - అవును - సూర్యుడు నాదగ్గరకు ఎందుకు వచ్చేవాడు? వాడూ నా పెన్షన్ గురించి విన్నాడా? అయితే వాడికి నా రెండో భాగాన్ని గురించికూడా తెలియాలి.

"వాడెవడు?" కూఁ కూఁను అడిగాను- వేలితో పైకి చూపించి.

"ఎవరు? అతనా? అతను" చాలాసేపు తల ఎత్తిచూచింది. ఆలోచించింది. "వారు నాన్నగారు" అన్నది.

నేను చాలసంతోషించాను-పురోహితుడు కాలేదని-"ఎవరినాన్న?" అడిగాను.

"మానాన్న" రెండు చిన్నిచేతులు గుండెమీద పెట్టుకొని అన్నది. "వారు మీరే" అని.

"నేనా?" చూచారా ఇంతింత పిల్లలకుకూడా తెలిసి పోయింది-నేను రెండు భాగాలు అయినానని.

"చూఁచూఁ నీకు తెలుసా నన్ను అక్కడ ఎవరు తగిలించారో" అటూఇటూ చూచి స్వేచ్ఛగా అడిగాడు.

"అమ్మ" ఆమెకూడా అంతజాగ్రత్తపడి చెవిలో అన్నిది. 'ఒకనాడు అమ్మ మిమ్మల్ని అద్దంలో కట్టి- తాడుతో అక్కడ తగిలించింది'

అద్దంలో కట్టి? తాడు తగిలించి? అంటే ఏమర్థం? నన్ను చంపినట్లేగా- అంటే ఉరితీసినట్లు! నేను చచ్చిపోయాను. ఈ మంచంలో ఎలా పడుకుంటాను? నేను చచ్చిపోయాను- నాకీలోకంలో స్థానంలేదు- నాకీలోకంతో సంబంధంలేదు.

నేను మౌనంగానుంచున్నాను- గోడనుచూస్తూ. నిమ్మో ప్రవేశించింది. నేను దొంగను పట్టానా? ఆనాటినుంచి నామీద కోపంగా ఉంది. ఇప్పుడుమాత్రం అలాలేదు. ధ్వనిలో కాస్త చక్కెర కలుపుకుని వచ్చింది. ముందు నన్ను గోడ దగ్గరనుంచి కదిలించడానికి ప్రయత్నించింది. తరవాత ఓటమిని అంగీకరించి

నాదగ్గిరికి వచ్చి కూర్చుంది. ఆమె సంప్రదించడానికి వచ్చింది- నన్ను- అతి ముఖ్య విషయాల్లో! ఆమె నా పెన్షన్ను తన పెన్షన్ అంటున్నది. తనపిల్లల్ని నా పిల్లలు అంటుంది.

ఆమెకు ముప్పైవేలు కావాలి. అందుకు ఇల్లు అమ్మాలనుకుంటూంది. బ్యాంకులో ఉన్నడబ్బు తన దగ్గర ఉంచుకోవాలనుకుంటూంది. ఎందుకంటే షమ్మీ పెండ్లికావాలి. ఇమ్తియాజ్ కు వాడి వాటా ఇచ్చి పంపించెయ్యాలి.

నాకు పెన్షన్, బ్యాంకు అనే మాటలంటే బోరు. అయినావిన్నాను. భవిష్యత్తు గురించి ఆలోచించినట్లు నటించాను. అప్పుడు ఆమెను కోప్పడ్డాను. "నోర్ముయ్ నువ్వు చెప్పింది ఏదీ వినను. నువ్వు నన్ను చంపేశావు. మెడకు తాడు కట్టావు ఉరితీశావు"

ఆమె అది విన్నది. నా కాళ్ళమీద పడ్డది. 'హమీద్ ఆనాటి రాత్రి విషయం మరిచిపో. నన్ను మన్నించు. ఇహ ఎప్పుడూ అలా చేయను. నీకు ద్రోహం తలపెట్టను'

"బాపుంది. ఎందుకు క్షమించాలి' అని ఆమెను బాదసాగాను. నువ్వు నా సూర్యుని దొంగిలించావు. కాకుంటే లోకంలో ఇంతచీకటి ఉంటుందా? నాపిస్తోలు దాచి పెట్టావు- దొంగను కాల్చకుండా. ఈ ఇంట్లో మూల మూలకు దొంగలున్నారు. అదినీకు తెలుసా? ఎవరినని చూడమంటావు నన్ను. ఇది ఇల్లేనా? ఫిలిం స్టూడియో కాదుకదా? ఇక్కడ రొమాంటిక్ ఫిల్ములు షూట్ చేస్తున్నట్లున్నారు. ఉహుఁ నేను ఈ ఉత్తుత్తి నాటకాల్లో వేషాలు వేయలేను.'

అమాంతంగా నాదృష్టి గోడకు తగిలించిన నాపటంమీద పడింది.

"నన్నెవరు ఉరితీశారు? నువ్వు నన్ను ముక్కలుగా చేశావు. ఎలాముఖం చూపించను- నలుగురికి'

నాచేతికి అందిందల్లా అందుకుంటున్నాను. నిమ్మోను కొడ్తున్నాను. ఆమె అరుస్తూంది. కేకలు పెడ్తూంది. నన్ను పట్టుకోడానికి వస్తున్నారు. వాళ్ళనూ

వాడేస్తున్నాను. "ఇవ్వాళ అందరినీ చంపేస్తాను. షూట్ చేసేస్తాను." అని అరుస్తూ పెద్ద బండ అందుకున్నాను. కేకలు పెడ్తూ ఇల్లంతా తిరుగుతున్నాను.

"చూడండి. ఈ మనిషి ఏంచేస్తున్నాడో" అని నిమ్మో కేకలేసి వీధివాళ్ళను పిలుస్తోంది. "ఇవ్వాళ ఈ ఆస్తి సొంతం నాపేర అయిపోవాలి"

'సరే, అయితే నాన్నను నావెంటతీసికెళ్తా" ఇమ్తియాజ్ గదిలోంచి బయటపడి తగాదాకు తలపడ్డాడు.

వారిని ముట్టుకున్నావో మాటదక్కదు. వచ్చాడు అయ్యమీద అనురాగం ఒలికించేవాడు. ఆయనను వెంటతీసికెళ్లి ఏడువందల పెన్షన్ కాజేయాలనుకుంటున్నావ్. నాకు చిన్నచిన్న పిల్లలున్నారు. ఉన్నది ఒకే ఆధారం. వారిని ఇంటి నుంచి తీసికెళ్ళే అధికారం ఎవరికీ లేదు' నిమ్మో చేతులు ఊపుతూ అరుస్తోంది.

వాళ్ల గట్టిగా అరుస్తున్నారు. ఆ కేకల్లో నాకేమీ వినిపించలేదు, నేను రాయి పారేశాను. నిజంగా ఇమ్తియాజ్ నన్ను ఈ పరాయి ఇంటినుంచి తీసికెళ్తాడా? ఈవిషయం నా రెండోభాగానికి తెలియరాదు, వాణ్ణి ఇక్కడే పడిలేపి పోతాను. వాడే తలపడ్తాడు ఈ దుర్మార్గుల్తో.

చూంచూం 'రా మనం పారిపోదాం'

చూంచూం వణికిపోతూంది. ఆమెను ఎత్తుకున్నాను. భుజంమీద కూర్చుండపెట్టుకున్నాను.

"ఎక్కడికి? వెళ్దాం" చూంచూం తన బొమ్మనూ. బొమ్మకు స్నానం పోసే బకెట్టునూ విసిరేసి నాభుజం ఎక్కింది.

'దూరం- చాలదూరం. అదిగో సూర్యుని దగ్గరికి'

నేను గేటు తెరిచాను. బయటికి వచ్చాను వాళ్లు పోట్లాటల్లో ఉన్నారు. ఆస్తివిభాగాల్ని గురించి తన్నుకుంటున్నారు. ఎవరూ నన్ను చూళ్ళేదు,

వాళ్ళెందుకు పోట్లాడుకుంటున్నారు, వాళ్ళవాడు ఎవడన్నా చచ్చాడా? సూర్యుడు చచ్చినట్లున్నాడు. కాదు నా పెన్షన్ చచ్చిపోయిందా?

"నాన్నా! మీ పెన్షన్‌కోసం– అన్న అమ్మను కొడ్తున్నాడు" చూఁచూఁ అంటున్నది.

'పెన్షన్‌కోసం... ఇప్పుడేంచేయాలి.... ఇమ్తియాజ్ నన్నుకొడ్తాడేమో?'

నాన్నా! మీరు మీ పెన్షన్ను ఆ ఏట్లో పారేయకూడదూ ... అప్పుడే తగాదాలూ ఉండవు" చూఁచూఁ నాకు సలహా ఇచ్చింది .. చప్పట్లు కొడ్తూంది." నాన్నా చూడండి....సూర్యుడు దొరికాడు. ఆనదిలో దాక్కున్నాడు'

అరె నిజంగా సూర్యుడు వాడినెవరూ దొంగిలించలేదు. నన్నుచూచాడు, అదిగో దాక్కుంటున్నాడు– నీళ్ళలో. దిగిపోతున్నాడు'

'నాన్నా! త్వరగా నడవండి. అమ్మవస్తోంది– పట్టుకోవటానికి.

చూఁచూఁ నా భుజంమీద కూర్చొని నలువైపుల సమాచారాలు అందిస్తోంది. నేను మరింత వేగంగా ఉరుకుతున్నాను. అయినా నిమ్మాకు దొరకకుండా ఎక్కడికి పోవడం? ఎక్కడ దాక్కోవడం?

ఎదుటనీరు....జలం....అంతట నీరే....జలం వ్యాపించి ఉంది.

చూఁచూఁ పద ఈ నీళ్ళల్లో దాక్కుందాం చూతాం మనను ఎవడు పట్టగలడో!

# చప్పటి కథ

"కథారచయితలు అబద్ధాలు ఎక్కువ రాస్తారు. అయినా మనిషి వాటిని మరువలేడు." సుందరం అన్నాడు. అతని వెంట్రుకలు చిందరవందరగా ఉన్నాయి. చేతిలో సగంకాలిన బీడీఉంది, దాన్ని ఆర్పి నలిపి జేబులో వేసుకున్నాడు. అతడు గదిని చూచాడు. గదిలో ఉన్న ఫర్నీచర్ చూచాడు.

"ఈ గదిలో ఇదే గదిలో కూర్చుని ఎన్ని ఆలోచించానో? ఏమేమి చేశానో? పట్టుపట్టుకుని చెపుతున్నాను-ఒక్కటీ గుర్తులేదు. దరిద్రం చాలచెడ్డది. బహూబాధాకరం అయింది. బతకాలనే ఆశ ఉండదు, చస్తేబావుండుననిపిస్తుంది"

'కావచ్చు' నేను ఒళ్లువిరుచుకుంటూ నిర్లక్ష్యంగా 'అవును మేం కథలు రాసేవాళ్లం. అబద్ధాలు రాయక తప్పదు. ఉదాహరణకు నీ కథ రాయాలనుకో. నీవు ప్రాణసమంగా ప్రేమించావు. ఇప్పుడు మరచావు అంటె ఎవడు నమ్ము తాడు? అలా రాశాననుకో అది చప్పచప్పని కథ అవుతుంది. ఎవడు చదువు తాడు? అన్నాను.

సుందరాన్నిచూస్తే శాంత కోపగిస్తుంది. అతని చిరిగిన బట్టలు, దగ్గు, ఊయడం ఆపై వదినా, వదినా అని పిలవడం చూస్తే ఆమె అసహ్యించు కుంటుంది. అందుకే అతన్ని త్వరగా పంపేయాలని నాప్రయత్నం.

సుందరం దగ్గాడు దగ్గుతో ఊపిరి సలపలేదు. బీడీముక్క తీశాడు.

"ఏంచేయను? స్త్రీ హృదయం నాకెలా వస్తుంది? నేను మగాణ్ణి మగాళ్లను స్వార్థపరులు అంటుంది రాజా. అన్నీ మరువగలరంటుంది. ఆమె అనేది నిజం"

నేను సుందరాన్ని చూచాను. నావి కథాకారుల చూపులు. అన్నింటిలో అబద్ధాల అందాలు మేళవించడం నాపని. అందుకే నాకీగదిలో-ఇవ్వాళ-ఇప్పుడు-ఆకవెలుగు కనిపిస్తూంది-నవప్రేమికుల నేత్రాల్లో కనిపించే కాంతిలాంటిది. ఒనాడు సుగంధపుష్పపరిమళ పరివ్యాప్తమైంది. ఈనాడు అది లుప్తమైంది.

సుందరాన్ని ధ్యాసగా చూశాను. కథా కారుని దృష్టితో కాదు వాస్తవిక దృష్టితో. అతడు నాకు ఇసుకలో కూరుకుపోయిన నావలా కనిపించాడు. ఆ నావ నాకు మళ్ళీ ఎందుకు జ్ఞాపకం వచ్చింది? అది చాలా కాలం నాటిమాట. మేధస్సు పొరల్లో ఎక్కడో అణగి పడిఉన్న పడవ ఇవ్వాళ వెలికి వచ్చింది.

నేను, శాంత, సుందరం, రాజా సాయంకాలాల్లో షికారుకని ఏటి వడ్డుకు వెళ్ళేవాళ్ళం. అక్కడికి ఏటికి దూరంగా - ఇసుకలో ఒక నావ కూరుకొని ఉండేది. వస్తూపోతూ సుందరం దాన్ని కాలితో కదలించడానికి ప్రయత్నించేవాడు. ఒక్కొక్కసారి దానికి ఆనుకొని కూర్చునేవాడు. నావమీద పేరిన ఇసుకలో వేలితో రాజా తనపేరు రాసేది.

"పాపం పడవ - ఎన్నాళ్ళయిందో నీటిముఖం చూడ-" అనేది రాజా.

"అరే రచయితా! నీ కేమనిపిస్తుంది ఇసుకలో ఇరికిపోయిన పడవను చూసి? వలపు తలపులు గుర్తుకువస్తాయా? వలపుల వగలు గుర్తుకు వస్తాయా? ఫలించని ప్రేమగా దరిచేరని నావ గుర్తుకు వస్తుందా? వలవులనావ నీటినే చేరక ఇసుకలో ఇరుక్కుపోవడం గుర్తుకు వస్తుందా?"

"వాహ్వా! కవిత బావుంది!" అని కిలకిలా నవ్వేశారు రాజా, శాంత.

"అందుకే ఇక్కడ కూర్చొని విలపిస్తారు" శాంత సుందరాన్ని అడిగింది.

"కాదు-కాదు తానూ నదిలో కొట్టుకుపోవాలని ఆలోచిస్తున్నారు" రాజా పట్టుచీర కొంగు మెలిపెడ్తూ! లిప్‌స్టిక్ చెదరకుండా పెదవి కదలించి అంటుంది.

దాంతో అంతా నవ్వేస్తారు. కాదు సుందరానికీ నవ్వొస్తుంది. ఆమాట ఎందుకు చెప్పానంటే సుందరం నవ్వడు. అతనికి నవ్వురాదు. సుందరం పరమలోభి. పైస ఖర్చుచేయాలన్నా పదిసార్లు ఆలోచిస్తాడు. నవ్వువిషయం లోనూ అంతే. వృధాగా ఖర్చుచేయడు, అతడు బాల్యాన్ని కూడా తూచి తూచి ఖర్చుచేశాడు. అందుకే పాతికేళ్లు వచ్చినా అతనిముఖంలో పసితనం కనిపిస్తుంది.

అతనికి అరవైఏళ్లు వచ్చినా, ఇరవైఏళ్ళవానిలా తుమ్మెద రెక్కలాంటి వెంట్రు కల్లో భాసిస్తాడు. ఎంచాతంటే వాళ్ళతాత రిస్టువాచి అతని ముంజేతికుండి ఇప్పటికీ సరియైన సమయం చూపుతూంది.

నాకు నావగుర్తుకు వచ్చింది. వెంటనే అడిగాను:– "సుందరం నీకు ఆనావ గుర్తుందా?" అని.

కాని సుందరం కవికాడు. భావుకుడు కాదు. నా ప్రశ్నలోని లోతులు కొలువలేక పోయాడు. బంతిపూలు నలుపుతున్న మా బేబీని చూస్తున్నాడు, "బేబీని పూలు నలపొద్దను. నలపడం, కూల్చడం అలవాటు చేయకు" అన్నాడు.

"సుందరం! అమ్మాయిలకు అవన్నీ అలవాటే!" అన్నాను.

మళ్ళీ నాకు ఇసుకలో దిగిపోయిన విరిగిన నావ గుర్తుకువచ్చింది. అది నావ కాదు. రెమ్మలువిచ్చి వెదజల్లిన బంతిపూవు. పల్లవితుంచి పారేసిన గీతం.

సుందరం ఏదో ఆలోచించాడు – లోతుగా. బీడిముక్క వెలిగించు కున్నాడు. పొగలో దాగిపోయాడు. రచయితగా నేను అనుకున్నాను జ్యోతి వెలిగిందని. కాని సుందరంతో ఎలా చెప్పను? ధోరణి మార్చడానికి శాంతను పిలచాను.

"చూడు చాలకాలం తరవాత నీ మరిది వచ్చాడు. పకోడీలు కావాలం టున్నాడు " అని " ఏం సుందరం నీకు పకోకీలు ఇష్టకదూ!" అని అడిగాను

"కాదు కాదు" సుందరం దగ్గుతూ చేతి సైగతో వారించాడు. "నేను ఉప్పుతినను" అన్నాడు.

"ఉప్పుతినవా! నువ్వు ఉప్పుమాత్రమే తినేవాడివే! అలాతింటే వంటి నిండా విషం వ్యాపిస్తుందంటారు"

"ఎవరివంట్లో? తిన్నవాని వంట్లోనా? తినిపించినవాని వంట్లోనా?" ఉలికిపడి అడిగాడు సుందరం! ఉలికిపడి అడిగాడు.

సుందరంను గురించి ఏమిటి ఇలా మాట్లాడుతున్నాను? ఆతను పదేళ్ళ క్రితం మా ఇంట్లో వ్యక్తి – నాకు రెండో ప్రాణం. అందుకే శాంతకు అతడంటే ఇష్టం. ఆ రోజుల్లో ఈ ఇల్లు ఎంతో సందడిగా ఉండేది ఎంతో అందంగా ఉండేది. రాజా ఉండే ఎదుటి ఇంటి కిటికీలు ఎప్పుడూ తెరిచి ఉండేవి. సుందరం బాల్కనీలో చదువుతుండేవాడు. ఎదుటి ఇంట్లోనిలిచి రాజా వెక్కిరించేది – కొక్కిరించేది!

ఇప్పుడు? చాలకాలం నుంచి ఆ కిటికీలు మూసి ఉన్నాయి. తలుపులకు వేసిన రంగుమీద పదేళ్ళ కన్నీటిధారల గుర్తులు కనిపిస్తున్నాయి. కప్పుమీద గడ్డి మొలచింది గడ్డినీలంరంగు పూలుపూసింది. గతపు చీకట్లను చీల్చుకుని నా హృదయంలోంచి వ్యాపించిన వెలుగులా ఉన్నాయి గడ్డిపూలు. రాజా ఇంటి కిటికీలు మూసిఉన్నాయి. అవి నాకు మూసిన కళ్ళలా కనిపిస్తున్నాయి. నిరీక్షణలో విసిగివేసారి మూసుకున్న కనురెప్పల్లా కనిపిస్తున్నాయి. వెలుగు పలిగి పోయి నట్లుంది. కప్పుమీద ఒక పిచ్చుక కూర్చుంది. బిత్తరపోయి కిచకిచ మంటూంది. నావలెనే దానికీ అమాంతంగా మారిపోయిన వాతావరణం గుర్తుకు వచ్చినట్లుంది!

రాజా తల్లి ఏది? ఆమె కప్పుమీద వాలిన కాకుల్తోమా, పిచ్చుకల్తోను పోట్లాడేది. రాజా ఎప్పుడూ సింగారించుకుని కూర్చుంటే అందును గురించి రాజా తల్లి భర్తతో పోట్లాడేది. రాజా తండ్రి ఏడి? తన చిలకముక్కు కదులు తుండగా, రాజా పక్షం వహించి, ఎప్పుడూ భార్యతో పోట్లాడు తుండేవాడు.

రాజా నగలన్నా మంచిబట్టలన్నా పడిచచ్చేది. ఏది రాజా మేకప్ చేసుకుని, పట్టుచీరలు కట్టుకుని, గంతులేస్తూ మెట్లు దిగేది – ఎక్కేది. కనిపించిన దాన్నల్లా కదలించడం, ఊపటం, బద్దలు కొట్టటం ఆమె స్వభావం. మాగదిలోకివస్తే సుడిగాలి వచ్చినట్లుండేది. కుర్చీలను పక్కకు నెట్టేది. రేడియోను ఒకపక్కకు తిప్పేది. కిటికీ తలుపులు తెరిచేది. శాంత ఫోటు అందుకుంటే ఫ్రేం విరిగిపోయేది. సుందరంతో మాట్లాడితే పోట్లాటకు సిద్ధం అయ్యేది. కాఫీ తాగుతూ చేతిలోని గ్లాసు వదిలేసేది.

"శాంతా! చూడు నాకర్మ. దేన్ని తాకినా పగిలిపోతుంది లేదా విరిగి పోతుంది" అంటుంది రాజా! నిముషంలో సగంకూడా ఉండదావాన. మరుక్షణం చేసేత్తో ఆడుతూ పూలకుండీ పొర్లిస్తుంది. శాంతా జడ కొంటెగా విప్పేస్తుంది సంత్రాలు తింటుంది. పొట్టు సుందరం మీదికి విసరుతుంది.

"ముత్యాలు వెదజల్లుతున్నాను. ఏరుకో అమెరికా వెళ్ళడానికి పనికి వస్తాయి" అంటుంది.

తన తెల్లని చొక్కామీద పొట్టుపడ్తే మండి పడ్తాడు సుందరం "ఎన్ని సార్లు చెప్పాను - నాకిలాంటిహాస్యం నచ్చనది" అంటాడు. సుందరం వట్టి డబ్బు మనిషి - రాజావంటి అందమైన అమ్మాయిని గూడా "మీరు" అని తప్ప పిలిచేవాడు కాదు.

"నాకేమో నీ తెల్లచొక్కా బాగనిపించదు - ఏంచేయమంటావ్? పైస పైస కూడబెట్టి అమెరికా వెళ్ళాలనుకుంటున్నావ్. చూస్తా ఎలాపోతావో?" అనేది.

తరవాత రసం ఉన్నచేతులో సుందరంను ఊపి "సుందరం! ఇహచెప్పు దసరా ఎన్నాళ్లుంది?" అని అడిగేది.

చొక్కాకు మరకలు అంటుతే సుందరం మండిపడేవాడు. అతనికి ఉన్నది ఒకే షర్టు. దాన్ని రాత్రిపూట ఉతుక్కుంటాడు. గంజి పెడ్తాడు. ఇస్త్రీ చేసు కుంటాడు. మల్లెపూవులాంటి చొక్కా తొడుక్కునీ మాసిపోతుందేమోనని తప్పుకుని, తప్పుకుని తిరుగుతాడు. పరిస్థితులు అతన్ని అలా తయారు చేశాయి. తలిదండ్రులు బాల్యంలోనే పోయారు. ఆపనీ, ఈపనీ చేసి జీవించాడు. వారి, వీరి దయతో ఎఫ్. ఏ. వరకు చదివాడు. లోకం అతన్ని చెంపదెబ్బలు కొట్టింది. కొన్ని గుణపాఠాలు నేర్పింది. లోకానికి పాఠం నేర్పేశక్తి డబ్బుకు మాత్రమే ఉందని గ్రహించాడు అందుకే అతడు డబ్బు సంపాదించడానికే జీవిస్తున్నాడు. అతనికి గుమాస్తాగిరి అంటే పడదు, పేదవాళ్ళంటే అసహ్యం అందుకే అతడు అమెరికా వెళ్ళాలనుకున్నాడు. అక్కడ చదవాలని అతని అభిలాష. అందుకు

అతను ఏపని చేయడానికీ వెనుకాడేవాడు. ట్యూషన్లు చెప్పేవాడు. గుమాస్తాగా చేసేవాడు. పత్రికల్లో పనిచేసేవాడు. శాంతకు సహాయం చేసేవాడు. పిల్లలకు చదువు చెప్పేవాడు. బజారునుంచి సరుకులు తెచ్చేవాడు. నీళ్లుతోడేవాడు. శాంత ఆతనికి అన్నం పెట్టేది. అందుకే సుందరాన్ని నేను "తమ్ముడూ" అనేవాణ్ణి. అతన్ని నేను "తమ్ముడు" అనుకుంటే అనేక లాభాలున్నాయి. సుందరం నన్ను అన్న అనుకుంటాడు. మా ఇంటిని తన ఇలు అనుకుంటాడు. చాకిరి సొంతం చేస్తాడు. ట్యూషన్ చెప్పుకుంటే ఎవరూ ముప్పైకి తక్కువ తీసుకోరు. నీళ్లు తోడే మనిషిని పెడ్తే కనీసం పది ఇవ్వాలి. సరుకులు తేవడానికి కుర్రానికి అయిదివ్వాలి. సరే ఇవన్నీ ఎందుకు? నేను జన్మతః కళాకారుణ్ణి. సుందరానికి నా విషయంలో ఉన్న అభిమానాన్ని గురించి మాత్రమే చెప్పాలి. కాని అతని బలహీనతలు, అతని రహస్యాలు మీకు విప్పి చెప్పక్కర్లేదుగా! అన్నింటినీ మించిన అతని ఒక రహస్యం నాకు మాత్రమే తెలుసు. అతడు అమెరికా వెళ్ల డానికి ఏడువేలు బ్యాంకులో భద్రపరచాడు. పాస్‌బుక్ అల్మారీలో పుస్తకాలకింద దాచిపెట్టాడు. ఈ ఏడువేలు అతని భవిష్యత్తుకు పునాది. మనసుకుధైర్యం. శరీరానికి ఆరోగ్యం. ఒక్క బీడీ మూడుసార్లు కాలుస్తాడు. ఒక్కచొక్కా ఎడాది తొడుగుతాడు. నాపాతబూట్లు నెలలకొద్ది వాడుతాడు. రాజాకు, శాంతాకు పట్టుచీరలు. శృంగార సామగ్రి కొంటుంటే చూచి పెళ్లి అంత కరీదైంది అయినందుకు విచారిస్తాడు.

ఆడపిల్లల ఖర్చుకు అంతులేదు. రాజా తండ్రి బట్టల దుకాణంలో గుమస్తా. అయినా తన ఒకేకూతురు కోర్కెలు చచ్చుకుంటూ తీర్చేవాడు. రాజాకు ఫిల్ములు చూడ్డం సరదా. సినిమా నటుల్లా అలంకరించుకోవడం సరదా ఆమె రకరకాల బట్టలు కడ్తుంది. నవ్వుతుంది. తుళ్లుతుంది. కనిపించిన వస్తువు నల్లా కదిలిస్తుంది. చిందర వందర చేస్తుంది.

శాంత రాజాతో పోట్లాడ్తుంది. రాజా పిచ్చిపనులన్నీ చెప్పుతూ తిరుగు తుంది. కాని రాజాదగ్గర ఒకమందుంది. శాంతను సినిమాకు తీసికెళ్తుంది. మాటలు చెపుతుంది. మనసు మారుస్తుంది.

రాజా అంటే సుందరానికి పడదు'

రాజాను పెళ్ళిచేసుకున్నవాడి బ్యాంక్ బాలెన్సు ఎలా ఉంటుందంటారు?' అవి అడిగాడు సుందరం అంట్లుతోముతూ శాంతను.

"ఏమిటి సుందరం- పెర్రివాళ్ళలా మాట్లాడ్తావ్- రాజాను పెళ్ళాడిన వాడికి బ్యాంక్ బాలెన్సేమిటి?" అన్నది శాంత.

సుందరం బూడిద దులుపుకొని అల్మారీపైపు దృష్టి సారించాడు,

రాజా అప్పుడప్పుడు పకోడీలు తెచ్చేది. "ఇదిగో సుందరింకోసం తెచ్చాను. వట్టి పిసినారి. ఇలాంటివేం తింటాడు?" అనేది. రాజాకు మిఠాయీలు పడవు కారపు వస్తువులే తినేది. ఉప్పటి వస్తువులంటే ఆమెకు మరీ ఇష్టం. ఆమెను చూచాడు. సుందరమూ మిఠాయి తినడం మానేశాడు. చాయ్‌లో కూడా ఉప్పు వేసుకోసాగాడు.

ఒకనాడు శాంత వచ్చింది. సుందరానికి బాగా తినిపించింది. వెళ్ళిపోయింది.

"వదినా! ఎప్పుడూ రాజాయే నాకోసం ఏదోఒకటి తెస్తుంటే ఏంబా వుంటుంది చెప్పు" సుందరం శాంతతో అన్నాడు.

శాంత సుందరానికి జవాబివ్వలేదు.

'విన్నారా మీ మరిది ఏమంటున్నాడో రాజాకోసం ఏదైనా కొంటాడట' అని నాతోఅన్నది శాంత.

నా చేతిలో పేపరు జారి పడిపోయింది. నాలోని కథాకారుడు ఎగిరిపోయాడు. 'నిజం?' అన్నాను.

"అవును" అన్నది సుందరం. రెప్ప ఆర్పకుండా రాజాఇంటి కిటికీలు చూస్తున్నాడు. కిటికీలకు నీలంరంగు చీటీ తెర్లున్నాయి. అవి గాలికి ఎగురుతున్నాయి.

'అన్నింటినీ బద్దలు కొట్టాలనిపిస్తోంది. అప్పుడు తెలుస్తుంది అసలు లోన ఏమున్నది?' అంటూంది రాజా తెరల వెనుకనుంచి.

'ఏమి ఇవ్వడం మంచిది? దాని ఖరీదు ఎంత ఉండాలి?' సుందరంనన్ను అడిగాడు_ చూపుతిప్పి.

ఇదొక సమస్యే! బహుమతి చౌగ్గానూ ఉండాలి. రాజాకు నచ్చేట్టూఉం డాలి. శాంత, సుందరం కలిసి అరోజంతా ఆలోచించారు. చీరలు, ఉంగరం_ సినీమాకెళ్ళడం శాంత ప్రతిపాదించింది. కాని వాటి ఖరీదు విని సుందరం అదిరి పోయాడు.

'ఏదినా! నాకు సాధ్యం అయ్యేది ఏదైనా చెప్పు ఫోటో ఫ్రేంఅప్పుతే ఎలా ఉంటుంది. అందులో రాజా ఫోటో మాత్రమేకాక మరో ఫోటోపెట్ట కలగాలి."

సమస్య పరిష్కారం అయింది. తరవాత రోజులు గడిచాయి. వారం అయింది. వారాలు గడిచాయి. నెల అయింది. రాజా సుందరానికి ఊరగాయలు, అప్పడాలు. పకోడీలు తెచ్చి పెడుతూనే ఉంది. సుందరం ఉలకడు పలకడు మాటల సందర్భంలో ముచ్చట రానేవచ్చేది.

"ప్రేములు ప్రియమవుతున్నట్లున్నాయి"

రాజా ఆ ఫ్రేంలో తనదికాక మరెవరిఫోటో పెడ్తుంది.

ఇలాంటివి మాటల సందర్భంలో దొర్లేవి.

ఒకనాడు శాంత రాజాతో కూడా చెప్పేసింది. ఆమె అగ్గి అయింది "వెదవ ఏమనుకుంటాడు? వాడి ఫోటో పెడ్తాననుకుంటాడా ఫ్రేంలో? వాణ్ణి ముక్కలుముక్కలు చేయాలనిపిస్తూంది. అమెరికా వెళ్ళడానికి కూడ బెట్టిన డబ్బంతా కర్చుపెట్టాలనిపిస్తుంది. వాణ్ణి ఏడిపిస్తుంటే నాకు సరదాగా ఉంటుంది' అన్నది.

రాజా సుందరాన్ని గంటలకొద్ది పతాయించేది. ఇద్దరూ ఎంతోసేపు పోట్లాడేవాళ్లు. కాని ఆనాటినుంచి రాజా గంభీరంగా ఉండిపోయింది. నవ్వడం, తుళ్ళడం విలిచిపోయాయి. కొన్నాళ్ళపాటు సుందరానికి విముక్తి లభించినట్లయింది.

ఒకనాడు సుందరం ఇస్త్రీచేసిన తెల్లని చొక్కా తొడిగాడు. సుందరం చూపులు రాజామీద పడ్డాయి. రాజా మాట్లాడలేదు. చొక్కాను గురించి పట్టించుకోలేదు. శాంత దగ్గరికి చేరింది. కూరలు తరగసాగింది.

'మీరు ఈమధ్య బొత్తిగా కనిపించడంలేదు' అన్నాడు సుందరం.

ఆమాటవిని ఇద్దరూ నవ్వారు.

అందమైన రాజా కళ్లు నవ్వాయి. ఆమె చెవికిఉన్న లోలాకులు నవ్వాయి. ఆమె చేతికి ఉన్నగాజులు గలగలమని నవ్వాయి.

'నేను చెప్పనా- ఈమధ్య రాజా ఎక్కడుంటుందో? అని శాంత అంటే రాజా సిగ్గుపడిపోయింది.

'ఏడీనా! ఏమిటది?' అని వారించింది.

"బాబూ! ఈమధ్య రాజా ఒకరి మనసులో కూర్చుంది' శాంత వాక్యం పూర్తికాకుండానే రాజా రెండు చేతుల్తో ముఖం దాచుకుంది. అలక చూపింది. శాంతమీద కోపగించింది. 'అబద్ధాలు చెప్పడం ఎప్పటినుంచి నేర్చావు?"అన్నది.

ఆనాటి రాత్రి ఏదో ఆలికిడికి మెలుకువ వచ్చింది. చూస్తే సుందరం బాల్కనీలో తిరగాడుతున్నాడు. తెల్లవారి సుందరం బీడీసాంతం ఒకేసారి కాల్చేశాడు. బేబీకి లెక్కలు చెప్పలేకపోయాడు. పాలకూర తెమ్మంటే పొట్లకాయలు తెచ్చాడు. రూపాయి ఇచ్చి చిల్లర తీసుకోవడం మరిచిపోయాడు.

గంటలో శాంత తిట్లన్ని మరిచాడు.

"వదినా! ఇవ్వాళ రాజా రాలేదేం?" అని అడిగాడు.

"రాజా ఇక్కడికి రావాలంటే సిగ్గుపడుతూంది. ఇహ నువ్వేకూడా ఆమెతో పరాచికాలు మానెయ్యి - ఎవరన్నా చూస్తే ఏమనుకుంటారు! పెళ్ళి అయింతర్వాత మీ ఇష్టం"

శాంత వంటింట్లో గిన్నెలు సర్దింది. నేను పేపరు చాలాసార్లు చదివేశాను. సుందరం మాత్రం ఖాడిదచేతుల్తో పళ్లెం పట్టుకుని అలాగే కూర్చున్నాడు. అతడు చప్పున లేచాడు. పళ్లెం పడేశాడు. ఖాళీద చేతుల్తో నన్ను పట్టుకొని ఏడ్చేశాడు. నేను చకితుణ్ణయినాను. ఎందుకు ఏడుస్తున్నాడో అర్థంకాలేదు. నేను నా కథల్లో మానవ ప్రకృతిని అనేక కోణాల్నుంచి పరిశీలించాను. హీరో వలపుటగ్గిలో మండుతాడు. అప్పుడు సూర్యచంద్రులు చేష్టలు ఉడుగుతారు. వాతావరణం ఉదాసీనం అవుతుంది. ఆకాశం కన్నీరు కారుస్తానని శపథం చేస్తుంది. కాని సుందరం విషయంలో అలా జరగలేదు. నా సహితంగా ప్రకృతిసాంతం ఊపిరి బిగపట్టి చూడసాగింది. అందువల్ల అతనిని ఓదార్చినవారు లేరు. అతడే తెములుకున్నాడు, అన్నాడు.

'నేను రాజా ప్రాణం తీయలేను. వదిన నాకూ ఆమెకూ పెళ్లెందుకు నిశ్చయించింది? నేను ఇంత సంతోషం భరించలేను. పిచ్చివాన్నయిపోతాను"

మళ్ళీ ఏడ్పు సాగించాడు.

నాకేమీ అర్థంకాలేదు. అతకని ఈ సంబంధాన్ని శాంత ఎలా అతికించింది? ఈ పిసినారి వెధవంటే రాజాకు పడేదెకాదు. ఆమెకు సుందరం విషయంలో ఉన్నది ద్వేషమా? ప్రేమా? నేను కథాకారుణ్ణి, కథలల్లుతాను. కాని ఈ ఇంట్లో ఇన్ని వలపుకోరకాలు వికసించాయని ఎరుగను. ఇక్కడ ప్రేమ పరీమళాలు గుబాళించాయని గమనించలేదు. నేను ద్వేషపు ముళ్లుమాత్రం ఏరుతున్నాను. రాజా సుందరాన్ని ద్వేషిస్తూందనుకున్నాను. సుందరం ఆమెకోసం అంత ఖరీదైన చీరలు ఏడనుంచి తెస్తాడు? ఆమె ఫేషన్లు, వృథాకర్చులు ఎలా భరిస్తాడు? వలచిన ఆడది అంత త్యాగం చేయగలదా? అలాంటి రాజాను తలచుకొని ఆశ్చర్యపోయాను.

సుందరం ఏడుస్తూనే ఉన్నాడు.

శాంతను విషయం అడిగాను ఆమె కిలకిలా నవ్వింది. "మీ దోస్తుకు చెప్పండి- మొదట ముఖం కడుక్కొమని. రాజా పీణ్ణి పెళ్ళాడుతుందని నెనెప్పు డన్నాను? రాజాతండ్రి ఆమెకోసం బంగారంలాంటి వరుణ్ణి చూశాడు. చాల పెద్ద వ్యాపారం ఉందట వాళ్ళకు.

శాంత నవ్వుతూంటే నాకు ఏడుపు వచ్చింది.

సుందరం రాత్రికి ఆలస్యంగా వచ్చాడు. ఇంకా రాత్రిఏమిటి? ఓటమి పులుముకున్న ఆతని ముఖంలో విజయ చిహ్నాలైన వేల దీపాలు వెలుగుతు న్నాయి, ఆతడు కొన్ని ప్యాకెట్లు, బండల్స్ తెచ్చాడు. వాటిలో చీరలున్నాయి. చెప్పులున్నాయి. మేకప్ సామగ్రి ఉంది. ఇంకేమేమి ఉన్నాయోగాని వాటితో టేబుల్ నిండిపోయింది. ఆతడు సంతోషంతో ఊగిపోతున్నాడు.

"వదినా! ఇవన్నీ రాజాకు పసందు ఆవుతాయిగా" ఏదో మామూలు సామాను. ఇకనుండి రాజా తన ఇష్టప్రకారం కొంటుంది. సంతోషంలో మాట తడబడుతూ అన్నాడు.

"కాని నువ్వు ఇంత డబ్బు ఎలా కర్చుచేశావు?" శాంత అడిగింది. ఆమెకు ఆశ్చర్యంగా ఉంది.

"నా రాజాముందు డబ్బొకలెక్కా వదినా! రాజా చిరునవ్వుకోసం నా ప్రాణాలిస్తాను. నేను ఆమెరికా ఎందుకు వెళ్ళాను- రాజాకోసం! నేను ఆమెరికా వెళ్తే రాజా ఇక్కడ మహారాణిలా ఉంటుంది."

శాంతకు ఎందుకో భయం ఆవుతూంది.

సుందరం తెచ్చిన బహుమతులన్నీ చాటుగా శాంత, రాజాకు అందిం చింది.

ఇహ మా ఇద్దరి మనసు మనసులో లేదు, నాబుర్ర బొత్తిగా పనిచేయడం లేదు. తరువాతి అధ్యాయం ఎలా ప్రారంభించాలో అర్థం కావడంలేదు. సుంద రానికి జీవితం ప్రసాదించాలా? హాలాహలం ప్రసాదించాలా?

రాజా మా ఇంటికి రావడం మానేసింది. ఆమెకు విలువైన బట్టలతోనూ. నగలతోనూ సతిపోతూంది. ఆమె తండ్రి రెండువేలు అప్పుతెచ్చాడు. పెళ్ళికి సంబంధించిన ఏర్పాట్లు ప్రారంభం అయినాయి. ఆయింటి రూపమే మారిపో యింది. పెండ్లిఏర్పాట్ల సందడితో వెలిగిపోతూంది. సుందరం ఆనందానికి అంతులేకుండా ఉంది. పెళ్ళికి ఏమేమి చేయాలని శాంతను అడుగుతున్నాడు.

"రాజా తండ్రికి నన్ను గురించిన వివరాలన్నీ తెలుసునా? ఆఫీసువాళ్లు నా పిసినారితనం గురించి చెప్పలేదుకదా!' సుందరం నన్ను అడిగాడు.

"అవును. నిన్ను గురించి అన్నీ తెలుసువారికి" అన్నానేనేను. నేను నాకొత్త కథ ముగింపును గురించి ఆలోచిస్తున్నాను.

"నిజం?" సుందరం లేచి కూర్చున్నాడు 'అయినా....' అని నసిగాడు.

నా కథకు చివరి పేరా రాస్తూ 'అందుకే వాళ్లు మరో వరుణ్ణి ఎన్నుకు న్నారు' అన్నాను.

సుందరం ముఖ కవళికలు వింతగా మారాయి. చావుబతుకులు నా అధీ నంలో ఉంటే నాకు నేనే ఉరిశిక్ష వేసుకునేవాణ్ణి, భగవంతుడు బతికి ఉన్నవాడికి కాలి చచ్చే శిక్ష విధిస్తే నాకు అది తప్పదు. ఆరోజు - ఆక్షణంలో ఎన్నెన్ని చూశాను! పిడుగులు కురిసేది చూశాను. తనువునుండి ప్రాణం ఎగిరిపోవడం చూశాను. మొక్కనుండి పూలు రాలడం చూశాను: ఎన్నెన్ని చూచాను ఆక్షణంలో!

ఆనాడూ సుందరం ఇదే గదిలో కూర్చున్నాడు. పట్టపగలు కటికచీకట్లు పరుచుకున్నాయి. ఏడుపు నాగొంతులో ఉబుకుతూంది, సుందరాన్ని చూచాను.

అతని బాధ భరించరాకుండా ఉంది. అతని గొంతు పిసికి భవబంధాలనుండి విముక్తుణ్ని చేయాలనిపించింది.

మూడోరోజు ఆస్పత్రికి వెళ్ళేప్పుడు నా కాళ్లు వణికాయి. నర్సులను చూస్తుంటే భయం ముంచుకొస్తోంది. ఏనర్సు ఏవార్త చెప్తుందో?

గుమ్మంలో సుందరమే కనిపించాడు. చాల మామూలుగా ఉన్నాడు. ఏమీ జరగనట్లే ఉన్నాడు. నన్నుచూచాడు. పక్కమంచపు రోగిని గురించి ప్రస్తావించాడు. ప్రక్కరోగికి మూత్రపిండాల జబ్బు, పాపం చాల బాధపడుతున్నాడు.

నాకు నిరాశ ఎదురయింది. సుందరాన్ని కథానాయకుణ్ణి చేయరాదని నిశ్చయించుకున్నాను. ఏమిటిది? ప్రేమించేవాళ్లు ఇలాగే ఉంటారా?

సుందరం ఆస్పత్రినుంచి వచ్చిన రాత్రి పడుకున్నాడు. ఉదయం చూస్తే మంచం ఖాళీగా ఉంది. అతడు లేడు. మాయం అయినాడు. నాకు భయం అయింది. వణికిపోయాను. ఎందుకంటే వలపు కథల చివరి అధ్యాయం రాయడానికి బయలుదేరాడా అని. మధ్యాహ్నం వరకూ అంతటా వెదికాం. అతని ఏడు వేల రూపాయలు నాపేరా రాసిన పత్రంకోసం ఇల్లంతా గాలించాం. పత్రం దొరకలేదు. అల్మారీలో పుస్తకాల కింద పడిఉన్న పాస్ బుక్ నన్ను చూచి నవ్వుతూంది.

రాత్రికి శాంత వినిపించిన వార్త ఏమంటే రాజాకూడా ఇంటినుంచి మాయం అయిందని. రాజాను సుందరం లేవదీసుకు పోయాడని రాజా తల్లి అనుమానం. పోలీసుకు రిపోర్టు చేయమంటుంది. రాజా తండ్రికి అది ఇష్టంలేదు. కూతురు ఇష్టంప్రకారమే వాళ్లిద్దరికీ పెళ్లిచేయాలని అతని అభిమతం.

తెల్లవారి లేచి చూస్తే సుందరం కనిపించాడు. పంపు దగ్గర ముఖం కడుగుతున్నాడు నాగుండెకు పోటులాంటిది వచ్చింది- అవును ఏడువేలు రూపాయిలు పోగొట్టుకున్నవ్యథ! తరవాత రాజా శాంతకు చెప్పిందేమంటే తాను స్వయంగా సుందరాన్ని బలవంతం చేసిందని, తనను కాదనలేక సుందరం తన

వెంట వచ్చాడని. జరిగిందేమంటే వాళ్లిద్దరూ వెళ్ళారు. ఒక హోటల్లో గది తీసుకున్నారు. తనను పెళ్ళాడితే రాజా కష్టాలు పడాల్సి వస్తుందని సుందరం చెప్పాడు. రోజా కనీసం ఒక కొత్తచీర తేగల భర్తకావాలె నన్నాడు. ఆమె పెదవుల వెలుగు నిలిపేవాడూ, ముఖకాంతిని రక్షించగలవాడు భర్తగా ఉండాలని బోధించాడు. అతడు తన పేదరికాన్ని గురించి వివరించాడు. అమెరికా వెళ్ళడం తన జీవితలక్ష్యం అన్నాడు. రాజాను పెళ్ళాడితే తానేమీ చేయలే నన్నాడు.

రాజా తిరిగి వచ్చేసింది. సుందరాన్ని మరింత ద్వేషించసాగింది పూర్వం లాగే మా ఇంటికి వస్తూంది. సుందరం జరిగిందంతా మరచాడు, మామూలుగా మాట్లాడుతున్నాడు. రాత్రింబవళ్ళు ఆశిస్తున్నాడు— అమెరికా వెళ్ళాలని; పీనాసి తనం ఎక్కువయింది. బీడీ మానేశాడు.

రాజా అతనికోసం ఏమీ తెచ్చిపెట్టడంలేదు. సుందరం పకోడీలు మానే శాడు. ఉప్పుతినడం మానేశాడు. చప్పని కూరలు తింటున్నాడు.

రాజాపెళ్లి జరిగిపోయింది. కొన్ని నెలల తరువాత పుట్టింటికి వచ్చింది. అప్పుడు సుందరానికి ఊరగాయ గుర్తుకు వచ్చింది.

“వదినా! రాజాను పిలవండి. ఇప్పుడిహ ఆమె ముఖాన తిలకం తీర్చి ఉంటుంది. వందల విలువగల చీరలు కడ్తుంటుంది.” అన్నాడు సుందరం.

రాజా అత్తగారివాళ్లు మోసం చేశారని శాంత చెప్పింది. వాళ్ళపెళ్లి సరకులు అరువుతెచ్చారట, రాజా మొగునికి చిన్న దుకాణం ఉందట. పుట్టింటినుంచి అయిదువేలు తెమ్మని రాజాను పంపించారట. పాపం తండ్రి బాధ చెప్పలేం.

భోజన సమయంలో శాంత ఉప్పువేసిన కూర సుందరానికి వేసింది. ఇద్దరికీ పోరు జరిగింది.

“నా కూరలో ఉప్పెందుకు వేశావ్?”

“నాకేంతెలుసు— ఉప్పునీకు విషమని?”

"అప్పుడు, ఉప్పునాకు అమృతమనా మీరనుకునేది?"

"కాక. అమృతాన్ని మించిందే" శాంత తక్కువ తిన్నదేంకాదు 'రాజా పకోడీలు తెచ్చిపెట్టినప్పుడూ, ఊరగాయలు తినిపించినప్పుడూ ఉప్పు నీకు అమృతాన్ని మించిందే'

ఇప్పటికి రాజా వచ్చేసింది.
'నన్నింకా మీరు మరవనట్లున్నారు' అన్నది.
ఎవరూ మాట్లాడ్లేదు. అంతా మౌనం వహించారు

'నీపేరు—నీపేరెవరు తలచారు? వదిన విషాన్ని గురించి మాట్లాడుతూంది' సుందరం మెల్లగా అన్నాడు.

రాజాను చూచాను. రెండుమూడు నెలల్లోనే మారిపోయింది సాదా నూలు చీర కట్టుకుంది. పెదవుల మీద వెలుగులేదు ముఖాన కాంతిలేదు. ఆమెను చూచి నిండుగా ఉండిన ఇల్లు అమాంతంగా రిక్తం అయినట్లు అనిపించింది. నేను సుందరాన్ని చూచాను. రాజాను చూడకుండడానికి సర్వ ప్రయత్నాలు చేస్తున్నాడు.

'ఏమిటాలోచిస్తున్నావు సుందరం? వదిన నీకు ఊరగాయలు పెట్టడం లేదా?' రాజా అడిగింది.

సుందరం అమెరికా వెళ్ళకముందే ఇంగ్లీషు వాడైపోయాడు. ఊరగాయ ఎక్కడ తింటాడు? ఉప్పుకూడా వదిలేశాడు' శాంత సాగదీసింది.

"ఉప్పు వదిలాడా? అయితే నన్నూ మరుస్తాడు" రాజా నవ్వింది. "అప్పగింతలప్పుడు ఓదార్చడానికి కూడా రాలేదు కృతఘ్నుడు. వదినా, నిజం ఈ మగవాళ్ళవి రాతిగుండెలు; ఇతనితో కాక అమ్మాయితో ఇంతస్నేహం చేసి ఉంటే ఎంత ఏడ్చేదో ఇప్పుడు"

"ఏం చేయమురాజా! స్త్రీ హృదయం నాకేలావస్తుంది? నేను మగాణ్ణి," సుందరం సిగ్గుపడిపోయాడు.

"బొట్టెందుకు పెట్టుకోలేదు?" శాంత అడిగింది.

"పెట్టుకున్నాను. రాలిపోయినట్లుంది." వేలితో నొసలు చూచుకుంటూ అన్నది.

అది విన్నాడు సుందరం. లేచాడు అల్మారీ తెరిచాడు. పుస్తకాలు వెదక సాగాడు.

"సుందర్ం రారాదూ -- ఇలా కూర్చో! నా బొట్టు నీ పుస్తకాల్లో ఉందని వెదకుతున్నావా?" రాజా అన్నది.

"అవును. నీ బొట్టు ఇందులోనే ఉంది. నీ పెండ్లికి బహుమతి ఇవ్వలేక పోయాను" అంటూ తన బ్యాంక్ పాస్ బుక్కు తెచ్చి రాజాకు అందించాడు.

"ఎనమిదివేలు!!!" రాజా కళ్లు తిరిగాయి. శాంత ఉలిక్కి పడ్డది.

"ఇంత కఠినశిక్ష విధించకు సుందరం" రాజా చేతులు వణకుతున్నాయి.

"నీపెదవులకు లిప్‌స్టిక్ లేదు. నొసట బొట్టులేదు" తలిగినట్లు అన్నాడు సుందరం.

సుందరం అమెరికా వెళ్ళలేదు. మద్రాసుకు బదిలీ అయింది. అతడు ఉత్తరాలు రాయలేదు. ఉద్యోగంకూడా ఊడిందని విన్నాను. వాడు నా తమ్ముడు కాదు. భవిష్యత్తుకోసం డబ్బుదాచుకోలేని బుద్ధిహీనుడైన మిత్రుడు. అలాంటి వాడు నాకెందుకు గుర్తుకొస్తాడు!

సుందరం డబ్బుతో రాజాభర్తకు కలిసివచ్చింది. అప్పుడప్పుడూ కారుతో రాజా మాఇంటికి వచ్చేది. అమె లిప్‌స్టిక్ పెదవులు ఎంతో బావుంటాయి ఆమె కూర్చుంటే గదిసాంతం వెలిగేది, ఆమె పట్టుకుంటే గ్లాసు పగిలేది. శాంత బాల్కనీనుంచి ఆమె కారును తాకే కుర్రాళ్ళను కోప్పడాల్సివచ్చేది ఆమె తన ఇరుగు పొరుగుల్తో చెప్పేది. రాజా తన స్నేహితురాలనీ-వాళ్లు చాలా ధనికులనీ.

నేను సుందరం కథరాయలేదు. మంచిదయింది. రాస్తే ఉప్పచప్పగా ఉండేది పదేళ్లు గడిచి పోయాయి. ఇవ్వాళ సుందరం వచ్చాడు. ఏదో గారడీ

జరిగినట్లు సుందరం వెంట్రుకలు తెల్లబడ్డాయి. పళ్ళు ఊడిపోయాయి. అతన్ని చూస్తుంటే కొంటె పిల్లవాడు తెంపి, నలిపి పారవేసిన పూవులా కనిపించాడు. మిగిలిన బీడీముక్క జేబులోవేసుకున్నాడు. గోడకు ఉన్నపటం చూచాడు. అందులో రాజా, ఆమె పిల్లలు ఉన్నారు.

“ఎవరు! మీ పొరుగింటి రాజాయేనా। అవుతే ఇప్పటికీ ఆమె సిపిస్టిక్ వాడుతూంది. ఖరీదైన చీరలు అలంకరించుకుంటూంది. అచ్చా। కారుకూడా! ఉందా! వాపుంది చాల బావుంది!” అన్నాడు సుందరం.

అతని చేతులు వణకుతున్నాయి. జేబులోనుంచి బీడీముక్క తీశాడు. నోట్లోపెట్టుకున్నాడు. భవిష్యత్తును గురించి ఆలోచించినట్లున్నాడు. బీడీముక్క నోట్లోనుంచి తీశాడు. మళ్ళీజేబులో వేసుకున్నాడు. అతడునావైపుచూచాడు. చాలా గర్వంగా చూచాడు. అమెరికావెళ్ళివచ్చినట్లు చూచాడు. అక్కడినుంచి ఏదో డిగ్రీ తెచ్చినట్లు చూచాడు. గొప్ప సూటులో ఉండి మెరిసిపోతున్నట్లు చూచాడు. అన్నాడు.

‘మనిషి తన గతాన్ని ఎన్నడూ మరువలేడనే కథాకారులు ఎంత అబద్ధాలకోరులు.’

# ఎంకెమ్మ

"ఎంకెమ్మా! ఇంతముసలిదానివి ఎలా అయినావ్?"

ఇది ఈనాడు రాజా నన్నడిగిన ప్రశ్న. నా గదిలో పడుకొని ఒంటరిగా ఆలోచిస్తున్నాను- అవును నేను ఇంత ముసలిదాన్ని ఎలా అయ్యాను.?

యవ్వనం చెప్పకుండా ఎలా జారిపోయింది? వార్ధక్యం ఎలా నాదరి చేరింది? ఏమో నాకేమీ జ్ఞాపకం రావడంలేదు.

బయట వాన జోరుగా పడ్తూంది. పక్కింటి అమ్మాయి కిటికీలోంచిచూస్తూ గునుస్తూంది - "కన్నయ్య నీ కోసం ఎన్నిబాధలు సహించాను...."

బయట చాల గొడవగా ఉంది. బాలకృష్ణ పిల్లలూ, కిట్టు పిల్లలూ ఆడు స్తున్నారు-అల్లరిచేస్తున్నారు. కిట్టు పెళ్ళాంవనిత మొగుడితో పోట్లాడుతూంది. అయినా కిట్టుకాస్త నవ్వుతూమాట్లాడాడా వనితఅన్నీ మరుస్తుంది. వాడి ఒక్క చిరునవ్వుచాలు - లోకంలోని సుఖాలన్నింటినీ మరుస్తుంది. మురుస్తుంది. లోకం లోని ఆడవాళ్ళందరూ తనకంటే తక్కువే నన్నట్లు భావిస్తుంది.

మనకు తల్లిదండ్రులంటే గౌరవం. భర్త అంటే గర్వం. పిల్లలంటే వాత్సల్యం. భగవంతుడు ఎక్కణ్ణుంచి తెచ్చిపెట్టాడో ఇవన్నీ? అన్ని శాస్త్రా ల్లోనూ ఈ విషయాలే చెప్పబడినాయి. ఎవరికి గుండెలున్నాయి - వాటిని అతిక్ర మించడానికి? గుండెలున్న ఆడది ముండ అవుతుంది - రాజా అవుతుంది - స్త్రీ జాతికి తలవంపులుతెచ్చే రూపం ధరిస్తుంది. లోకానికి స్త్రీమీద చచ్చేసానుభూతి. సతీ సావిత్రీ అయి నావలె నరకంలో మగ్గి మసికావాలంటుంది. ఏమిటీ పాపిష్టి ఆలోచనలు? ఎందుకిలాంటి ఎంకర టింకర ఊహలొస్తాయినాకు? కాటికి కాళ్లు చాపి కూర్చున్నాను. అరవై ఏళ్ళొచ్చాయి. ఇప్పటికీ ఎందుకీ జీవితాశ? నేనేదో త్యాగాలు చేశాననుకోవడం! ఇదీ ఒక భ్రమ! ఎంతోకాలం గడిచింది, నాకు

చావు దగ్గర పడింది. ఇప్పుడెందుకు కంటపడింది రాజా నాకు? అవును ఆమె నా మనసును మలినంచేసింది. నిజం.

నాకు గడచిన కథలు గుర్తొస్తున్నాయి. గతం నాముందు నిలిచింది. అదిగో కనిపిస్తోంది.

వాన జోరుగా పడుతుంది. పిల్లలు బడి మానేశారు. ఇంట్లో గొడవచేస్తు న్నారు. వర్షం తెగిన ప్రేమబంధాల్ని గుర్తుచేస్తుందంటారు. మానిన గాయాల్ని పచ్చి చేస్తుందంటారు. ఏమో! నాకెన్నడూ తెలియదు – ప్రేమ దేన్నంటారో! ఒకే వ్యక్తిని జీవిత సర్వస్వం అనుకుని జీవితం సాంతం ఎలా లాగుతారో ; అన్ని కథల్లోనూ, సినిమాల్లోనూ ఈ విషయమే చెప్పుతుంటారు. ఏమిటో నాకు ఒక్క ముఖమూ గుర్తులేదు. నన్ను ప్రేమించినవాడు, లోకంలో అన్నింటినీ మించి నన్నుకోరినవాడు ఉంటే, చావు దగ్గరపడిన ఈ వయస్సులో తలచు కునే దాన్ని.

మా తెలుగువాళ్లలో కూతుళ్లు పెద్దవాళ్ళయి ఇంట్లోనే ఉండిపోతారేమోనని తల్లులు భయపడుతుంటారు. పుట్టింటినుంచి మెట్టినింటికి వెళ్ళేప్పుడు కూతురు మనసులో మరోరూపం ఉండరాదని జాగ్రత్తపడ్తారు. మా నాన్న అలాగే తొందరపడ్డాడు. అందుకే వర్షాన్ని చూస్తే ఎవరూ గుర్తుకురారు–పుట్టిల్లు జ్ఞాపకం వస్తుంది. పల్లెవదిలాను. మావారితో పట్నం వచ్చాను. అప్పటినుంచీ వానచూస్తే పుట్టిల్లు గుర్తుకువస్తుంది. పట్నంవాళ్ళకు వానపీడలా కనిపిస్తుంది. వర్షం విలువ పల్లెవారికితెలుసు – పంటలు పండించడం వాళ్ళకు తెలుసు. వాన వారికి ప్రాణం లాంటిది.

ఊళ్ళో మా ఇల్లేపెద్దది. అంతకంటే పెద్దఇల్లు ఆ ఊళ్ళోలేదు. మల్లేశం బాబాయి ఊళ్ళోకి ఒక భోగం రాజాను తెచ్చారు. ఆమెకోసం బాబాయి మా ఇంటిముందే మరో ఇల్లు కట్టాడు. అది మా ఇంటికంటే పెద్దది. మా బాబాయి డబ్బున్నవాడు. వారికి తాటివనాలున్నాయి – పొలాలున్నాయి. పశువులున్నాయి.

అందువల్ల ఎవరూ నోరు మెదపలేదు. పెద్దమనుషులు నీళ్ళు మింగి ఊరుకున్నారు. మాటమాట్లాడలేదు. మా చిన్నమ్మ నలుగురుపిల్లలతల్లి. ఆమెను ఇంట్లో వదిలారు. బోగందాని ఇంట్లో మకాం పెట్టారు.

నాకు అప్పుడు పదకొండేళ్ళ, సిగ్గు మొగ్గలు వేస్తున్న వయసు. పెళ్ళి కొడుకు" అనే మాటవింటె వంట్లో రక్తం సొంతం వదనంలో చేరేది. మా రేడ్ల ఇళ్ళలో ఈ వయసు పిల్లల్ని ఇళ్ళల్లో ఉంచుకోరు. మానాన్న అదివరకే ఇద్దరు కూతుళ్ళకు చెరి ఇరవై వేలు పెట్టి మొగుళ్ళను కొన్నాడు. నాకూ మంచి వరుణ్ణి తేవాలని డబ్బుకూడ పెడ్తున్నాడు. అమ్మా. నాన్నా రోజూ గుడికి వెళ్ళే వారు. పంటలు బాగా పండాలని ప్రార్థించేవారు. తునికి ఆకు వ్యాపారం బాగా జరగాలనీ లాభాలు రావాలనీ మొక్కేవారం. ఇదంతా దేవికోసం ? నా పెళ్ళి కోసం.

నాకివన్నీ ఏమీ తెలియవు. నేను పుస్తకం తెరిచి చూస్తునేదాన్ని. నామన సులో మాత్రం పెళ్ళిని గురించిన ఆలోచనలు పరిభ్రమిస్తుండేవి. పెళ్ళంటే తొందర. ఏదో ఆతురత. త్వరగా జరిగిపోవాలనే రభస. ఇవన్నీ ఎందుకు కలిగాయంటే అమ్మ నన్ను చదువుకోవడానికి పంపేది. అందువలన ఆలోచనలు రాసాగాయి. అమ్మానాన్నా ఉన్నప్పుడు నన్ను గదిలోకి ఎందుకు రానివ్వరు? ఇది అర్థం అయ్యేదికాదు.

నేను వెళ్ళేది చదువుకవి. నేను ఏం చూసేదాన్నో ఎవరికి తెలుసు?

మల్లేశం బాబాయి ఇల్లు నేను చదువుకునే గదిముందు ఉంది. వారిద్దరిగదీ నాకు కనిపిస్తుండేది. బాబాయి, రాజా చిలకాగోరింకల్లా కనిపించేవారు. వారిని చూస్తే నాకు నిప్పులో పెట్టినట్లుండేది. కొలిమలో కాలుతున్న ఇనుప సలాకలా అనిపించేది. కాస్త దెబ్బతగుల్తే విరిగి ముక్కలై పోతాననిపించేది. ఇహ చదువుమీద ధ్యాస ఎక్కడ? పుస్తకం పారేసి పెళ్ళికొడుకును గురించి ఆలో చించేదాన్ని లోకం మరిచేదాన్ని.

రాజా చక్కగా అలంకరించుకునేది. సరిగ్గా ఆమెలా అలంకరించు కోవాలనే ఉబలాటం నాకు. రాజా ఏరంగుల చీరలు కడ్తుందో అలాంటి చీరలే కట్టాలనిపించేది. రాజా ఎంత అందమైంది. ఎప్పుడూ కిలకిలలాడుతుంటుంది. కూనిరాగం తీస్తుంటుంది. మా ఇంట్లో ఎవరూ అంత సంతోషంగా ఉండడం చూళ్లేదు. మాఅక్కలు అత్తగారి ఇంటినించి వచ్చేప్పుడు నిట్టూర్పులు విడుస్తూ వచ్చేవారు-వెళ్లేప్పుడు కళ్లతుడుచుకుంటూ వెళ్లేవారు.

రాజా నవ్వుతుంది. తుళ్లతుంది. పాడుతుంది. ఇంట్లోఉండే సంసారస్త్రీలు ఎందుకలా నవ్వలేరు? ఎందుకంత ఆనందంగా ఉండలేరు? అమ్మను అడుగుదా మనుకున్నాను ఈప్రశ్న. కాని మింగేశాను. నోటమాట రాలేదు. నాకు తెలుసు- అమ్మ ఇలాంటి ప్రశ్నలు సహించదు. అగ్గి బుగ్గిఅవుతుంది. మెడలు వంగేపని చెప్తుంది- ఇహ మళ్లీ అలాంటి ఆలోచన రాకుండా!

బాబాయి రాజాకు తన చేత్తో తినిపించేవాడు. నేను చూస్తూ ఉండిపోయే దాన్ని. ఒకసారి పూలచెండు స్వహస్తాల్తో రాజా తనలో సింగారించడం చూచాను. అప్పుడు నా గుండెలో నల్లనాగులు బుసలు కొట్టాయి. కిందికీ దిగి వస్తే చుక్కమ్మ చిన్నమ్మ మాటలు గుర్తుకు వచ్చాయి- 'ఎయసులో విర్రవీగు తారు ముండలు. ముసలితనం వస్తే ముష్టెత్తుకోవల్సిందే. చచ్చేపుడు కుక్క చావు చావాల్సిందే.'

చుక్కమ్మ చిన్నమ్మ వలుగురు పిల్లల్తో ఇంట్లో పడిఉంది. రాత్రింబవళ్లు విసుర్రాయి ముందో పొయ్యిముందో పడిఉంటుంది. ముఖంనిండా దుమ్ము, బూడిద. చిరిగిన చీర కట్టుకుంటుంది. అయినా వాటిని లెక్కచేయదు. గేదెపాలు పితుకుతుంది. వాకిట్లో ఊడిచి చల్లుతుంది. ముగ్గులు వేస్తుంది. పిల్లల బట్టలు ఉతుకుతుంది.

అమ్మఅంటుంది చుక్కమ్మ చిన్నమ్మ అత్తవారింటికి వచ్చిన కొత్తలో ఆమెను మించిన అందకత్తె ఆ ఊళ్లోనే ఉండేదికాదని- కాని ఇవ్వాళ ఆమెను

చూస్తే ముఖాన ముడతలు పడ్డాయి. మల్లేశం బాబయికి ఏదో మంత్రం వచ్చేలా గుంది అనపించేదినాకు. కాకుంటే అంత అందం అయిన చిన్నమ్మను ఇంతవికారంగా చేసి, బోగంముండ రాజాను అప్సరసను చేస్తాడా? బాబాయి రాజాను వికారిని చేస్తాడేమో, కాని ఇప్పుడైతే అప్సరలాగుంది. అంత అందంగా ఉండీ అంత నవ్వుముఖంతో ఉండే ఆడదాన్ని మళ్ళీనేను చూడలేను. బహుశా ఆడది అంత నవ్వుముఖంతో ఉండదేమో!

రాజా గుడ్డిదై- బిచ్చకత్తెఅయి-చేతులో చిప్పతో బిచ్చానికి రావాలనిపించేది. అది నన్ను బిచ్చం అడుగుతుంది. నేను ఈసుగా చూస్తాను- అప్పుడంటాను- 'మా చిన్నమ్మను ఏడిపించి జీవితాంతం నవ్వాలనుకున్నావు కదూ' అని

'చూడ్డానికి బాగానేఉంది చుప్పనాతి- చేతులతో గోతి తవ్వుకుంటూంది' అన్నది అమ్మ ఒకసారి- రాజానుచూచి. నాకేందుకో అమ్మమాట నయించలేదు. బంగళాలోకి పోయి చూడమందామనుకున్నాను. అనలేకపోయాను. రాజా తన గొయ్యి తవ్వుకుంటున్నది అనుకుంటే- సుఖం దేన్నంటారు? ఆనందం దేన్నంటారు?.... ఇహ ఆలోచించ దలచలేదు. పొగచమ్మిన పిడకలపొయ్యి ఊదుతున్న చుక్కమ్మ చిన్నమ్మ కనిపించింది.

కొన్ని నెలలు గడిచాయి. ఒకనాడు రాజా కనిపించింది. ఆకాశం చీల్చుకొని వచ్చిన తటిత్తులా ఉంది. అలంకరించుకొని నుంచున్న రాజా అంతదూరంగా ఉండే నామీద పిడుగు పడ్డట్టయింది, ఆమె విషయంలో కూడబెట్టుకున్న అసహ్యం అమాంతంగా మాయం అయింది.

రాజా వంటరిగా ఉంటుంది అంత బంగళాలో. ఆమె అంటే ఊరివాళ్ళందరికీ అసహ్యం. పనివాళ్లుకూడా బోగందాని ఇంట్లో పనిచేయమన్నారు. అందుకే ఆమె తన నౌకర్లను వెంటతెచ్చుకుంది. ఆమె ఇంటి గడప ఎవరూ తొక్కేవారు కారు.

ఆరోజు ఆమెను వంటరిగాచూచి నాకు చాల బాధఅయింది. రాజా సైగ చేసింది. నన్ను పిలిచింది. నాకు విధి దొరికినట్లయింది. నిక్షేపం లభించినట్ల

యింది. రాజాను దగ్గరినుంచి చూడాలి. ఆమెను తాకాలి. ఇది కలకాలంగా మన సులో అణగిఉన్న కోరిక. అమాంతంగా మెట్లుదిగాను. కిందకు ఉరికాను. అక్కడ మాఅమ్మ చుక్కమ్మ చిన్నమ్మ కన్నీరు తుడుస్తూంది.

"అమ్మా! .. ఆరాజా.... లేదూ .. "

'నోర్ముయ్' అమ్మలాగి లెంపకాయ వేసింది. కళ్ల చీకట్లు కమ్మాయి. కన్నీరు దుమికింది. నోటమాటరాలేదు.

'కన్నెపిల్లలు బోగంముండపేరు తలుస్తారా? మళ్ళీ అటు చూచావో కళ్ల పెరికేస్తా-ఏమనుకున్నావో. పో పొయ్యి అంటించు' అమ్మ గద్దించింది.

నేను బెదిరాను గోడకరుచుకొని నుంచున్నాను. అమ్మ నన్ను పాపకుం దంలో పడకుండా కాపాడింది. నేను రాజా దగ్గరికి వెళ్లిఉంటే.... ఆది నన్ను అంటుఉంటే.... అమ్మో! ఇంకేమన్నా ఉందా? నేను వికసించని ముకురం లాంటిదాన్ని, పవిత్రను. రాజాఉంటే ఎంతో ఔన్నత్యంలో ఉన్నాను. నామన సులో చెడు ఆలోచనలు ఉన్నాయి- కావచ్చు- ఎవడుచూచాడు వాటిని?

'చుక్కమ్మక్కా. ఓపికపట్టు. ఆ పాపిష్టిది ఈ భూమ్మీదే అనుభవిస్తుంది' అమ్మ చిన్నమ్మను ఓదార్చింది.

'అక్కా! ఆ ముండలు మందుపెట్టారు. ఇహ మనిషికి ధ్యాసేఉండదు. పిచ్చివాడయి పోతాడు' అని గునిసింది చిన్నమ్మ కన్నీరు తుడుచుకుంటూ.

నేను గోంగూర ఏరుతూ చుక్కమ్మ చిన్నమ్మ తన మొగుని తప్పెం దుకు పట్టదు? పిచ్చివాణ్ణి చేసేమందు రాజాదగ్గర ఉంటే చుక్కమ్మ చిన్నమ్మ దగ్గర ఎందుకుండదు? అని ఆలోచించాను. ఈమాట అమ్మను అడుగుదామను కున్నాను. అమ్మో! ఇంకేముంది- అగ్గిమీగ గుగ్గిలం అయిపోదూ?

"అక్కా! దేవుడు కల్పించిన బంధాలు తెగి పోతాయా? ఏదో నాలుగు రోజులు ఎగురుతారు. ముసలితనంలోనన్నా నామొగుడు నావాడు కాకపోతాడా?

అన్నది చుక్కమ్మ చిన్నమ్మ గర్వంగా- కన్నీరు తుడుచుకుంటూనే. ఆ తరువాత కూలబడ్డది.

"ఏం వయసులో ఎందుకు కాగూడదు?" చిన్నమ్మను అడుగుదామని మాట నోటిదాకా వచ్చింది. మింగేశాను.

చిన్నమ్మ ఎంత అమాయకురాలు పాపం! ఎవరో వేదాంతం ఆమె బుర్రకు ఎక్కించారు. ఆ సంతృప్తితో జీవితం వెళ్ళబుచ్చుతూంది. మల్లేశం బాబాయి భోగందాన్ని తెచ్చుకున్నప్పుడూ చిన్నమ్మ పెదవి కదపలేదట. బాబాయినీ పల్లెత్తు మాట అనలేదట. బాబాయి, చిన్నమ్మ పెళ్లిబట్టలూ, నగలూ భోగందానికి అర్పించేశాడు. చిన్నమ్మ అభ్యంతరం చెప్పలేదట. రెడ్లలో వధువు తరఫువారు వరుణ్ణి అన్నీఇచ్చి కొనేస్తారు. అది నిజమే. ఎవరుచెప్పాలి చిన్నాయనకు ఈ విషయాలు?

ఇవ్వాళ్టికి యాభై ఏళ్లు గడిచిపోయాయి- అయినా ఇప్పుడు జరిగినట్లే అనిపిస్తూంది.

చనిపోయేముందు మనోనేత్రం తెరుచుకుంటుందంటారు. అదేగావాలు. నాకు మృత్యువు దగ్గర పడుతున్నట్లుంది. నేను ముసలిదాన్ని అయినాను. అవును రాజా వాస్తవం చెప్పింది. రాజామాత్రం తన యవ్వనాన్ని తాళ్ళతో కట్టిఉంచ గలిగిందా।

ఏమిటీ వెధవ ఆలోచనలు! వీటిని దూరం నెట్టాలి. మరోపక్కకు తిరిగి పండుకుంటాను. భగవంతుని ధ్యానిస్తాను. నాకు ముగ్గురు కొడుకులు. వాళ్లేనాకు తలగొరివి పెట్టేవాళ్లు. వాళ్ల గుర్తుకు వస్తున్నారు. వాళ్ళకు నామీద కోపం. నాచావు కబురుకూడా వాళ్ళకు తెలియకపోవచ్చు. నా అల్లుడు కూతురు ముఖం చూడనివ్వడు. నా డబ్బంతా కొడుకులకే పెట్టానని అతనికి కోపం. అవును కొడుకులకే అంతా దోచిపెట్టాను. ఎందుకలా చేశాను? అల్లునికి ఎందుకివ్వలేదు? వాళ్లేం సుఖపెడ్తున్నారు నన్ను? అందరికీ నేనంటే కోపమే! అలాంటప్పుడు కూతురుకు ఎందుకు ఇవ్వలేదు?

మాఅమ్మ మంకుది. నోటిదురుసు. ఆమె అంటే అంతా వడకేవారు. మా నాన్నే అనేవారు. ఈ గయ్యాళితో ఎలాకాపురం చేశానా! అని. ఇప్పుడు నా భర్త తన పిల్లలతో అదేమాట అంటున్నాడు. పిల్లలకూ ఆశ్చర్యమే ఈ పిచ్చి ముండ కడుపున ఇంత తెలివైనవాళ్లు ఎలాపుట్టారా? అని.

ముసలితనంలో తల్లులంతా పిచ్చిముండలు అయిపోతారేమో!

నేను పెర్రిదానిలా అత్తవారి కడపలో అడుగు పెట్టినరోజులు గుర్తొస్తున్నాయి. మావారు మంచివారు. వారి పాదాలవద్ద పదిజన్మలు ఎత్తడానికైనా సిద్ధమే నేనంటే వారు పడిచస్తారు తన చేతితో నాకు తినిపించగలరు. జీవితాంతం పట్టుపరుపుల్లో పెట్టి పూజించగలరు. కాని మా అత్తవారిల్లు ఒక దొడ్డి. ఉన్నవి మూడు గదుల్లు–ఉండేది. పదిహేను, ఇరవైమంది! రాత్రింబవళ్లు అరుపులు– కేకలు! రాత్రి వంటిగంటకుగాని పడుకునే అవకాశం లభించదు. మా వారికి నాతలలో పూలు అలంకరించాలని ఉన్నా ఎలాసాధ్యం? ఏమూలచూచినా తమ్ముళ్లు, చెల్లెళ్లు– పెళ్లికానివారు అయినా నేను కోరిన చీరలు తెచ్చేవారు పూలదండలు తెచ్చేవారు. వాటివి గదిలో మూలకు దాచిపెట్టేదాన్ని. కుటుంబం పెద్దది. పనినుంచి విరామంలేదు. కనీసం తలదువ్వుకునే సమయం దొరికేది కాదు: బొట్టుపెట్టుకోడానికి అద్దంముందు నుంచుంటే "ఏమిటా అద్దంముందు నుంచోడం–బోగందానిలా. నడుప్ వాకిలి ఊడువు" అని అరిచేది అత్తగారు.

అయినా మనసులోని కోర్కెలు అణగలేదు. అందరూ నిద్రపోయిం తరువాత రాజావలె సింగారించుకునే దాన్ని. అచ్చం అలాంటిచీర కట్టేదాన్ని. ఆరోజులు మరలిరావు. రమ పుట్టింది. ఆకోర్కెలు కూడా తగ్గసాగేయి. రమ మాఅత్తలాంటిది. ఒక్క నిముషం అలా కూర్చోనిచ్చేదికాదు. బోగం ముండలకు పిల్లలుండరు. అందుకే సుకపడ్తారు ముండలనుకునేదాన్ని. కాని వార్ధక్యంలో అడుక్క తినాల్సి వస్తుంది. ఆలోచన మాత్రంతో వళ్లు జల్లుమనేది. వెంటనే రమను, రత్నంను గుండెలకు హత్తుకునేదాన్ని. నేనెంత అదృష్టవంతురాలిని! భగవంతుడు నాకు అన్నీ ప్రసాదించాడు!

ఆయిదేళ్లు గడిచాయి. ముగ్గురు పిల్లలతో పుట్టింటికి వెళ్ళాను. నన్ను ఎవరూ గుర్తించలేదు. నాముగ్గురు పిల్లలు, మా అత్తా కలిసి నా రక్తం సొంతం పీల్చేశారు. నా రూపమే చెడిపోయింది. వికారంగా తయారయ్యాను. మా అమ్మ ఇంటింటికివెళ్ళి మా అత్తింటి కసాయితనం వర్ణించేది. మా అమ్మ మాటలు విన్న చుక్కమ్మ చిన్నమ్మ "గొంతుకోసినా మొగునికి మేలేకలగాలి. మనబిడ్డ విలాసం కోసం పోయిందా అత్తవారింటికి? అత్తవారింట్లో ఉండడానికే, పిల్లలు కనడానికే కష్టాలు పడాలి మరి, పడక తప్పుతుందా" అన్నది. ఆ అనడమూ మహాగర్వంగా అన్నది.

మల్లేశం చిన్నాయన పని తీరిపోయింది. రాజా అతన్ని వదిలేసింది. మరోసేటును పట్టింది. సేటు ఆమెకు కారుకూడా కొనిచ్చాడు. రాజ్యం గెలిచి వచ్చిన మొనగాసిలా ఇంటికి చేరాడు బాబాయి. చిన్నమ్మింటే మండిపడ్డాడు. తిట్లు చీదరింపులు లెక్కలేదు. పళ్ళాలు విసరేస్తాడు. గిన్నెలు తంతాడు చిన్నమ్మ పలకదు ఉలకదు ముసుగు వేసుకొని తప్పుకుంటుంది. మూలమూల లకు నక్కుతుంది. అయినా ఆమెకు మనసులో ఉల్లాసంగానే ఉంది. ఆనందం గానే ఉంది. మొగుడు నావాడు ఎక్కడికి వెళ్తాడు. వచ్చాడు మళ్ళీ తనదగ్గరికే. అదీ ఆమె సంబరం.

మల్లేశం బాబాయిని చూచి నాకు ఆశ్చర్యం అయింది. అతను జన్మలో తిరిగి వస్తాడనుకోలేదు. మళ్ళీ చిన్నమ్మకు ముఖం చూపిస్తాడనుకోలేదు.

మొగుడు వచ్చాడనే సంతోషంలో చిన్నమ్మ గుడికివెళ్ళింది. నేనూ వెంట వెళ్ళాను పూజ చేశాను. తిరిగి చూస్తే ఒకదేవత కనిపించింది. అప్స రసలా ఉంది. అంత అందంగా ఉంది. ఆమె చిరునవ్వు నవ్వింది. నన్ను చూచింది. నేను బెదిరాను. వెనక్కు జరిగాను. అది రాజా !! సతీసావిత్రిలా ఉంది. కొంగు తలమీదవేసుకుంది. చూపు వాల్చుకుంది. గుడికి వచ్చిందా? దానికి ఏంతక్కువని వచ్చింది ఏం కోరడానికి వచ్చింది? వార్ధక్యపు వ్యధపట్టుకుం దేమో! సంతానం లేదనేవెలితి కన్పిస్తుందేమో! చూస్తే అలా అనిపించడంలేదు. ఆమె వయసు పెరిగినట్లులేదు. తగ్గినట్లుంది. వికసించిన పుష్పంలా ఉంది.

వదనంలో యవ్వనపు మిస మిసలున్నాయి. వయ్యారం ఉంది. సోయగం ఉంది. దేవుడు ఆమెను చూసి తననే మరుస్తాడేమో! అడిగిన వరాలు ఇచ్చేస్తాడేమో! అనేట్లుంది ఆమె. అయినా నాగుండెలో అగ్గిరగిలింది. దేవుడు దీన్ని ఎన్నడు శిక్షిస్తాడు. దీని చిపనప్పుకు చివర ఎక్కడ? అను కున్నాను.

రాజా పూజ ముగించింది. నాపక్కనుంచేసాగి పోయింది. అక్కడ పూలు విరుచు కున్నట్లయింది. రాజా ఎలా ఉంది. ఎంత చక్కని జీవితం గడు తుంది అనుకున్నాను. ఇది పాపపు ఆలోచన. నాకు తెలుసు. ఎందుకిలాంటి ఆలోచనలు వస్తాయి అర్థంకాదు. వెంటనే దేవునిముందు మోకరిల్లాను. ఆ ఆలోచనలను అవతలకు నెట్టాను.

ఆతరవాత అత్తవారింటికి వెళ్లినప్పుడు వాస్తవంగా నాఅదృష్టం పండింది. వారికి మద్రాసులో ఫిలిం కంపెనీలో ఉద్యోగం అయింది. అత్త, ఆడబిడ్డల పోరు వదిలింది. నాఇల్లు ఒంటి ఏర్పడింది. దానికి నేను యజమానురాలిని అయినాను. బాల్యంనుంచి అణచి పెట్టుకున్నాను కోర్కెల్ని. ఇహతీర్చుకో వచ్చు. కాని పిల్లలు పెద్దవాళ్ళవుతున్నారు. రమ స్కూలు ఫైనల్‌కు వచ్చేసింది. నేను చక్కని బట్టలు కట్టుకొని, పూలు తురుముకొని వారికోసం ఎదిరిచూసే దాన్ని. రమను చదువుకొమ్మని పైకి పంపేదాన్ని। పాపం ఆమెకేం తెలుసు తండ్రి వచ్చినపుడు ఆమెకు ఏదోఒక పని ఎందుకు అప్పగిస్తామో। అయినా వారికి గడియ విరామం ఉండేది కాదు. హాయిగా కూర్చొని మాట్లాడుకోవడం పడేదేకాదు. వారికి రమపెళ్లిని గురించి ఫికరు పట్టుకుంది. వారు సాయంత్రం వేరే ఆఫీసులో పని చేసేవారు. రత్నం హైస్కూలు ఫాసైనాడు. ఇహ నేను మంచి మంచి చీరలన్నీ రమ పెళ్లికొరకు దాస్తున్నాను. నాకూ వయసు ఉడుగు తూంది. నలుగురు పిల్లల్ని చదివించడం మాటలుకాదు. బాధ్యతలు పెరిగాయి. దాంతో వారికి చిరాకు ఎక్కువైంది. అన్నిటికీ నాదే బాధ్యత అయినట్లు అరు స్తుండేవారు బాధ్యతల భారం నన్నూ కుంగదీసింది. నాగుండె నీరసంగా ఉంద న్నారు డాక్టర్లు. మంచి ఆహారం తీసుకోవాలన్నారు. విశ్రాంతి కావాలన్నారు. నిజమే కాని నలుగురి పిల్లల తల్లికి అవి సాధ్యమా?

రాజా ఆ సేటును వదిలేసిందట. ఎక్కడ్నుంచో ఒక పిల్లను తెచ్చిందట. పెంచిందట. ఊరినుంచి వచ్చిన ఒకతను చెప్పాడు. అప్పుడు విర్రవీగింది. ఇహ అనుభవిస్తుంది అనుకున్నాను. భర్త, సంతానం లేక జీవితం ఎలా గడుస్తుంది. ఇల్లా. సంసారం ప్రాణాలు తోడేస్తాయి. నిజమే కాని. అందులో ఎంత ఆనందం ఉంది, ప్రేమఉంది! మమకారం ఉంది! రత్నం పరీక్షలో మంచి మార్కులు తెచ్చుకుంటే పొంగి పోయేదాన్ని. వారికి కోపంవచ్చి అన్నం వదిలి వెళ్లిపోతే రాత్రంతా కుమిలి కుమిలి ఏడ్చేదాన్ని. వారికాళ్లుపట్టుకునేదాన్ని. క్షమాపణ కోరేదాన్ని అప్పుడు వారు నవ్వేవారు. నామనసులో మల్లెలు కురిసేవి.

భర్తను ఉన్నత స్థానంలో ఉంచడం మా ఆచారం. అది మా సంస్కారం వారి పాదాల వద్దపడి ఉండడంలోనే మా ఆనందం ఉంది. వారు అనేకసార్లు పోట్లాడారు. అయినా ఎన్నడూ వారిని విడిచి పోవాలనిపించలేదు. భర్త, పిల్లలు వారే నాజీవితం - సర్వస్వం. అదేనాకు గర్వం, అందుకే నాగుండెను ముక్కలు చేసి వారికి పంచేశాను.

నడుముల దాకా అప్పుల్లో కూరుకుపోయి రమ పెళ్ళిచేశాం. వారు దిగులుతో కుంగి పోయారు. నేను వారిని ఓదార్చాను. రత్నం పెళ్ళికి కట్నం వస్తుందన్నాను. దాంతో అప్పులు తీర్చేయ వచ్చన్నాను. ఆడ పిల్లలు పరాయి ఇంటివారు - మగపిల్లలు మన ఇంటివారే ననుకున్నాము. నా ఆలోచనలు అబద్ధాలయినాయి. ఇంజనీరింగ్ పూర్తిచేయకుండానే రత్నం తన క్లాసుపిల్లను పెళ్ళాడాడు. పాదాభివందనం చేయడానికి వచ్చారు, కోడలు గడపలో అడుగు పెట్టింది.

అదిజరిగి ఇరవై ఏళ్లు అయిపోయింది. రత్నం ఈఇంటి బిడ్డడేనా అని ఆలోచిస్తాను. వాడి పటం ముందు కూర్చుంటే వాణ్ణి కన్ననాటినుంచి ఇంజనీర్ను చేసేప్పటివరకు జరిగిన కథ కళ్ళముందు గిరగిర తిరుగుతుంది. దుఃఖం వస్తుంది. గుండెనిండి పోతుంది.

రత్నం అలా పెళ్ళిచేసుకొని వెళ్ళిపోయాడు. అదేభయం పట్టుకుంది. బాలకృష్ణ, కిట్టు అట్లాగే చేస్తారని పించింది. వారికి త్వర, తరగా పెళ్ళిళ్లు చేసే

శాను. వారికి వచ్చిన కట్నానికి ఇంట్లో స్థలంలేదు. వారి పిల్లలతో ఇల్లు నిండి పోయింది. ఇప్పుడేం కోరిక కోరాలి? కోడళ్ళకు ఇసుమంత కష్టం కలుగనీయ లేదు. వాళ్ళకోసం వేరువేరు గదులు ఏర్పరచాను. వాళ్ళ సిగల్లో నా కొడుకులు పూలుతురిమే అవకాశం కల్పించాను. అయినా కోడళ్ళకు నేనంటే పడదు. వృద్ధుల బుద్ధులు సంచలిస్తాయిగదా, ముసలితనం వెర్రిలో ఏవో అనిఉంటాను. అందుకేనేమో కొడుకులకూ, కోడళ్ళకూ నేనంటే చిరాకు. నేను పనిచేస్తుంటే కోడళ్లు నవ్వుకుంటారు. ఏమిటి ముండకు ఇంకా పని చేయాలనే ఆసక్తి అను కుంటారేమో!

ఎందుకో తెలియదు ఇల్లంటే నాకు వచ్చే మమకారం. పిల్లవాడు గ్లాసు బద్దలు కొడ్తే నాగుండె బద్దలయ్యేది. కోడలు పడవ కాలుపెడ్తే నాగుండె కాలేది. ఏమిటీ చిన్న చిన్నవాటికి గుండె కాల్చుకుంటావు అంటారు మావారు. వారికేంతెలుసు వాటిని కూర్చడానికి నేనెన్ని తిప్పలు పడ్డానో? ఈ ఇంటిలోని అణువణువులో నా స్వేదబిందువులు ఉన్నాయని వారికి ఎలా చెప్పను? అందుకే ఏమూలన ఏం జరిగినా నాగుండె మూలని గునపం పడుతుంది. అత్తలు కోడళ్ళను ఆరడి పెడ్తారనడం మామూలు. ముసలితనంలో మా ఇల్లు గుల్లచేస్తుంటే మేం ఎంత యాతన పడ్డామో వాళ్ళకేం తెలుసు!

ఇప్పుడు నేను ఒంటరిని. గదిలో పడి ఉంటాను. చావు దరిచేరింది. నా మాట ఎవరికివ్వను? నేను కట్టుకున్న ఇంటిని గుర్రాల కొట్టం చేశారు. పల్లెత్తు మాటంటే కొడుకు చుర్రుమంటాడు, "ఎందుకలా సుద్ధమీద విరుచుకు పడ్తావు. నీ ఇంటిలో ఉండలేం. వెళ్లిపోతాం" అంటాడు. ఏంచెప్పను నాబాధ? ఎవరితో చెప్పుకోను? ఈ మాట మావారిదాకా పోతుందేమోనని భయం. వారు నామీద ఎగరడానికి నెపంకోసం వెదుకుతుంటారు. ముసలిముండకు కోపంవస్తే కొడుకునూ ఏమనలేదు. కోడళ్ళనూ మందలించలేదు, భగవంతుడా! ఇంత ఆయువు ఎందుకిచ్చావు నాయనా!

పని లేనపుడు నా మనసుకు వెధవ ఆలోచనలు వస్తాయి, సుఖపడ్డ ఆడది లోకంలో ఎవతన్నా ఉందా ? అనిపిస్తుంది. నావరకునేను కంటినిండా

నిద్రపోవటం నోచుకోలేదు. నా మనుమలు అడుగుతారు ''నానమ్మా నీ'మూట'
ఎక్కడుంది ? నాకెప్పుడిస్తావు ?'' అని.

నా కన్నీరు దుముకుతుంది. ఎంత పిచ్చిదాన్ని నేను ? ఉన్నదంతా
ఊడ్చిపెట్టాను. ఏమీ మిగిల్చుకోలేక పోయాను.

ఎందుకు! ఏమిటివన్నీ గుర్తుకొస్తున్నాయి నాకు? కోడలుతో షూటింగు
చూడ్డానికి వెళ్ళాను. వెళ్ళకుండా ఉంటే పోవును, కోడలు బిడ్డను పట్టుకోవడానికి
వెళ్లాను. తారల్ని చూడడం అంటే నాకూ సరదా. నా కొడుకు పిక్చర్
తీస్తున్నాడు. ఇహనేను చాలా గర్వంగా వెళ్లానక్కడికి. హుందాగా కూర్చున్నాం.
అందం అయిన అనేకమంది ఆడపిల్లలు కనిపించారు. కాని ఒక అమ్మాయి
సౌందర్యానికి ప్రతిరూపంలా ఉంది!

ఆమె హీరోయిన్ అని నా కోడలు చెప్పింది. పదిపన్నెండు లక్షలు
పుచ్చుకొని యాక్ట్ చేయడానికి బొంబాయినుంచి వచ్చిందట.

"ఏముందా రూపంలో? అంత డబ్బు ఎలా సంపాదిస్తుంది?" అని
అడిగాను.

"దాని కులమే అలాంటిది" కోడలు చెవిలో చెప్పింది.

'వీళ్లకేం తెలుసు సంపాదన, వీళ్లకు నటననేర్పింది సంపాదిస్తుందంతా'

ఇంతలో ఒక అందమయినకారు వచ్చింది. అంతా లేచి నుంచున్నారు.
ప్రొడ్యూసర్ స్వయంగా వెళ్లి తలుపు తెరిచాడు. మహారాణి దిగింది- వందల
వందనాలకు చిరునవ్వుతూ, ఆమె ఖరీదైన చీర సింగారించింది. మందమైన
మేకప్ వేసింది. అందరూ ఆమెను చూచి జరిగారు. దారి ఇచ్చారు. హీరోయిన్
తల్లి వస్తూందన్నారు.

ఆమె నా ముందునుంచి సాగింది.

నేను కేక పెట్టాను....'రాజా! రాజా!' అని.

రాజా నా వైపు తిరిగింది. గాగుల్స్ తీసింది. నన్ను ధ్యాసగా చూచింది, పైట సవరించుకుంది. చిరునవ్వు నవ్వింది.

'నువ్వా ఎంకమ్మా .... ఎంకమ్మ నువ్వా! ఎంత ముసలిదానివి అయినావు?'

* * *

గదిలో చీకటి. కూర్చున్నాను. ఆలోచిస్తున్నాను ఇంత ముసలిదాన్ని ఎలా అయినాను. అని.

ఇక్కడ ఒంటరిగా పడిఉన్నాను.

ఆ....లో....చి . స్తు....న్నాను.

# స్కూటర్ వాలా

ఇంట్లో ఆబిదా ఒంటరిగా ఉంది. మున్నాను భుజానవేసుకుని అటూ, ఇటూ తిరుగుతూంది. ఆలోచనలు వస్తున్నాయి- అర్థంలేనివి. గోడమీద పిచ్చుక కనిపించింది. తాను పిచ్చుక అవుతే ఎంత బావుణ్ణు అనుకుంది. పిచ్చుకగా మారితే పక్క ఇంట్లో దూరవచ్చు-అక్కడ పాట పాడే వారిని చూడవచ్చు. ఇంతలో మరో ఆలోచన-మున్నావలె చిన్నపిల్ల అయిపోతే! మళ్ళీ జీవితం మొదలు. ఆమె మొదటిసారి అత్తవారిల్లు వదిలి వచ్చింది. అక్కడంతా ఆడాపుడి ఉండేది. వేరు ఇంట్లో ఒంటరితనం భరించరాకుండా ఉంది. వేరు కాపురం పెట్టాలనే అనుకుంది. పెట్టింది సంతోషించాలి కదా? ఎందుకో భయం. ఏమిటా భయం.

కొత్తగా ఈ ఇంట్లో చేరారు. ఇంకా పనిమనిషి దొరకలేదు. మున్నా ఇంకా చిన్నవాడు. ఇంటిపని చేసుకోవటం గగనంగా ఉంటూంది.

మున్నా నిద్రపోయాడు. వాణ్ణి పడుకోబెట్టింది బాగా అలసిపోయింది మున్నాకు జ్వరం-దగ్గు. వాడు ఊపిరి సలుపుకోనివ్వలేదు.

మొహసిన్ ఆఫీసుకు వెళ్ళేముందు మున్నాను ఆడిస్తాడు, అప్పుడు ఆబిదా 'నాష్తా' వండుతూంది. మున్నా నిద్రపోయింతరువాత చేయాల్సిన పనులన్నీ జ్ఞాపకం వచ్చాయి. వంటచేయాలి, మున్నా బట్టలు ఉతకాలి' ఇల్లుఊడవాలి. ఇంకా ఎన్నోపనులున్నాయి. ఆబిదా బాత్‌రూంలోకి వెళ్ళింది మున్నా బట్టలు అందుకుంది. కిటికీకిందినుంచి ఒక స్కూటర్‌వాలా సాగిపోయాడు స్కూటర్ రొదకు మున్నా లేచాడు ఏడుపు సాగించాడు.

'ఎవడో వెధవ పడుకున్న పిల్లవాణ్ణి లేపాడు.'

ఆమె మున్నాను భుజం మీద వేసుకుంది. ఇంత చిన్నబాబుతో ఒంటరిగా ఉండడం కష్టం. అవును అత్తగారు అన్నమాట నిజం.

బాబు నిద్రపోయాడు, పడుకోపెట్టింది. వంటింట్లో దూరింది వంటచేయ-
డానికి, ఒంటి గంటవరకు పనులన్నీ అయిపోయాయి. ఆబిదా అన్నం తినాలి-
అంతే మళ్ళీ ఒకస్కూటర్ రొదపెడ్తూ సాగిపోయింది. మున్నా నిద్రలోంచి
లేచాడు. మంకుపట్టి ఏడుపు సాగించాడు. ఆబిదా ఒళ్ళుమండింది. తనకు ఒక
స్కూటరు దొరికితే బావుండుననుకుంది. పోయిన స్కూటరు వెంట పడాలని
పించింది. సినిమాల్లో హీరోల్లా స్కూటర్ వాలాతో యుద్ధం చేయాలనిపించింది.
ఏమిటా వెధవ రోడ్డంతా వదిలి కిటికీ పక్కనుంచి తీసుకెళ్తాడు! పాడువీధి.
అత్తవారి ఇల్లున్న వీధి ప్రశాంతంగా ఉండేది. మున్నీ పుట్టింది అక్కడే.
అందుకే వాడికి రొదపడదు. కాస్త అలికిడి అవుతే లేస్తాడు. ఇక ఈ ఇల్లు
ఎలా ఉందంటే ఏ కిటికీ తెరచినా వీధి కనిపిస్తుంది. రోడ్డు ఇరుకు, అమ్ముకునే
వాళ్ళ అరుపులు.

రెండు రోజుల్లోనే ఆ వీధివిషయం ఆబిదాకు తెలిసిపోయింది. పదిగంటలకు
అమ్ముకునే వాళ్లు వస్తారు పంటిగంటకు కూరగాయలవాడు. తొమ్మిదినుంచి
పదకొండువరకు నలుగురు పకీర్లు వస్తారు. పెద్దకేకలుపెట్టే పకీరు రాత్రికి
సరిగ్గా మున్నాపడుకునే సమయానికి వస్తాడు. ఇదీవరస!

అటు స్కూటర్‌వాలా ప్రాణంతోడేస్తున్నాడు. పదిగంటలకు మున్నా
పడుకుంటాడు. వాడు లేపి వెళ్ళిపోతాడు. ఇక మధ్యాహ్నం-మున్నాకు పాలు
పట్టించి దాను పడుకోవాలనుకుంటుంది- మళ్ళీ స్కూటర్ రొద వినిపిస్తుంది.
స్కూటర్ సాగడం, ఆగటం బట్టి అది రెండుమూడు ఇండ్లఆవల నిలుస్తుందని
గుర్తించింది అంటే ఆస్కూటర్‌వాలా తన పొరుగువాడే. తనను సతాయించ
డానికే పూనుకొన్నట్లున్నాడు. పెద్ద హీరోలాగ రొదపెట్టిస్తూపోతాడు-వెధవ!
సరిగ్గా పంటిగంటకు ఉరికి వస్తాడు ఆఫీసునుంచి- ఏఆఫీసో-ఎలాబయట
పడ్తాడో తెలియదు. మున్నా జబ్బున పడ్డా మొహసిన్ టైం కొందే ఆఫీసునుండి
రాలేదు. వాహ్! నవాబులా ఉన్నాడు స్కూటర్‌వాలా. తిరిగ్గా రెండుగంటలకుగాని
వదలడు ఒకోసారి రెండున్నరదాకా వదలడు. కొత్తపెండ్లికొడుకేమో! పెళ్లాం
కోసం తుఫానులా వేగంగా ఎగిరి వస్తాడు.

పెళ్లైన కొత్తరోజుల్లో మొహసిన్ కూడా అయిదింటిదాకా ఆగేవాడుకాదు. నాలుగింటికే వాలేవాడు. మున్నా పుట్టాడు. వలపు సొంతం ఒలికిపోయింది, ఇహ ఇప్పుడు పొద్దు పొడుస్తే ఇద్దరూ మున్నా ఆటల్లో మునిగిపోతారు. రాత్రి అవుతే మున్నాను నిద్రపుచ్చడంతో సరిపోతుంది. ఉదయం ఆఫీసుకు వెళ్ళే తయారీ. ఆబిదాను పలుకరించే సమయమే దొరకదు మొహసిన్‌కు, మొహసిన్ మున్నాకు "టాటా" చెప్పి వెళ్ళిపోతాడు. కాని స్కూటర్‌వాలా భార్య అతన్ని కదలనివ్వదేమో! ఇంకా రెండే అయింది. అప్పుడే ఆఫీసుకువెళ్ళి ఏంచేస్తావు? అంటుందేమో! కాని శలవునాడు ప్రశాంతంగా ఉంటుంది. స్కూటర్‌వాలా కొత్త పెళ్ళాన్ని వదిలి బయట అడుగు పెట్టడు పెథపకు 'అల్లా' ఆరేడుగురు పిల్లల నిస్తే తెలుస్తుంది స్కూటర్ రొదంటే ఏమిటో!

ఆబిదా ధ్యానలో స్కూటర్‌వాలా నిలిచి పోయాడు. అతని అందమైన భార్య కళ్లల్లో ఆడిపాగింది. మందంగా మేకప్ చేసుకొని. మంచి బట్టలు కట్టి. దోమతెర మంచంలో వయ్యారంగా పళ్లువిరుస్తుందేమో! ఆమె వడ్డించి కూర్చుం టుంది. అతడు సమయానికి వస్తాడు. ఈ ధ్యానల్లో అన్నీ మరస్తుంది ఆబిదా. భర్త సాయంకాలం వస్తాడు-వంట-చేయాలి-గుర్తుండదు. ఎప్పుడూ గడియారం చూస్తుంటుంది. పంటిగంట - స్కూటర్ చప్పుడు. స్కూటర్ వెళ్లిపోవాలి. అప్పుడుగాని ఆమెకు స్థిమితంలేదు. స్కూటర్‌వాలాను చూడాలని చాలాసార్లు అనుకుంది. అసలువాడు ఎలావుంటాడు? అంతమోనగాడా? కాని చూడలేక పోయింది. ఆమె ఇంటికిటికీలు చాలఎత్తు. తెరతొలిగిస్తేగాని వీధికనిపించదు! అన్యపురుషుణ్ణి చూడ్డానికి ఆమె కిటికీలోంచి తొంగిచూస్తుందా?

"ఈవాడలోని స్కూటర్‌వాలా నాతల ప్రాణం తోకకు తెస్తున్నాడు' మున్నా పడుకుంటే చాలు రొదపెట్టి స్కూటర్ తెస్తాడు - మున్నాను లేపుతాడు" భర్తతో మొరపెట్టుకుంది.

"నువ్వు మున్నాను పడుకోపెట్టేది పొంచి చూస్తాడేమో!" మొహసిన్ ఆమెమాటను అంతగా పట్టించుకునే వాడుకాదు.

"హాస్యం అనుకుంటున్నారు - నిజం. రోజూ పదిగంటలకు వెళ్తాడు. పంటిగంటకు వస్తాడు. మళ్ళీ రెండూ, రెండున్నరకు వెళ్తాడు - సరిగ్గా మున్నా నిద్రపోయే సమయాల్లోనే"

"బావుంది. స్కూటర్‌వాలా రాకపోకలు బాగా గుర్తుంచుకొన్నావు-ఇహ వాడి ప్రైవేట్ సెక్రటరీ అయిపోరాదూ"! మొహసిన్ బూట్లు పాలిష్ చేసుకుంటూ నవ్వసాగాడు.

ఒక అపరిచితుని విషయంలో ఇన్నివిషయాలు తానుఎందుకు జ్ఞాపకం పెట్టుకుందో ఆబిదాకు అర్థం కాలేదు.

"మీకలాగే ఉంటుంది. ఆ వెధవ నాప్రాణాలు తోడేస్తున్నాడు. నాబాబు నిద్రకు శత్రువైనాడు".

"అయితే ఏంచేయమంటావు? స్కూటర్‌వాలా చాలా చెడ్డవాడు. మా మున్నా నిద్రచెడగొడ్తున్నాడు. అందువల్ల అతని స్కూటర్ లాక్కోండి, అని పోలీసుకు పిర్యాదు చేయనా" ?

"మీరు అపహాస్యం చేస్తుండండి. నేనే ఏదోఏర్పాటు చూస్తాను" మూతి ముడిచి అన్నది ఆబిదా.

ఈవాడ విచిత్రం అయింది. ఇక్కడి వారంతా గయ్యాళిగంపలే. భర్తలు బయట పడగానే వాకిళ్లలోకి వచ్చేస్తారు. జగడాలు మొదలవుతాయి. ఇహ తిట్లు సాపెన్లు ఎన్నడూ విననివి.

ఆ రోజు ఆబిదా గదిలోఉంది. ఇరుగు పొరుగుల మాటలు విని పిస్తున్నాయి.

పొరుగింటిది ఇరుగింటి దానితో అంటూంది. నా మున్నాకాలిరక్కొట్టావు కదూ! నీ ఇంటిమీదికి ఎక్కినవానికాలు విరుగుతుందని సాపించావు. నా మున్నా కాలు విరిగింది. అయిపోయిందనుకోకు-నిన్ను ఉరి తీయిస్తా"

"పందిముండ"

ఆబిదాకు సాపెనల మీద పొత్తిగా నమ్మకంలేదు. కాని ఇరుగు పొరుగు అమ్మలక్కల మాటలు విని ఆశ్చర్యపడింది. వాస్తవంగా సాపెనల్లో ఇంత బలం ఉందా? అందుకేనేమో జనం సాపెనలంటే భయపడ్తారు! తానూ పరీక్షించాలను కుంది. తన శత్రువును సాపించాలనుకుంది. శత్రువుల పట్టిక చూచుకుంది. అగ్రస్థానంలో ఆడబిడ్డ కనిపించింది – ఎవ్రమిరియం! ఆమె వల్లనే తాను వేరే కాపురం పెట్టింది. సాపింతాననుకుంది. వెనకాడింది ఆడబిడ్డకు చిన్నచిన్న పిల్లలున్నారు. తల్లిలేకుంటే కుమిలి కుమిలి చస్తారు. షమీమ్ గుర్తుకువచ్చింది. కాలేజీలో తన ప్రాణం తినేది. సాపింతాననుకుంది! దయతలచింది. ఆమె భర్త గాలిపటం, ఆమెకు పిల్లలు పుట్టిపోతున్నారు. అసలే సగం చచ్చింది. దాన్ని చంపి ఏ లాభం?

మరుసటిరోజు మొహసిన్ మిత్రులను రాత్రిభోజనానికి పిలిచాడు. వేరే కాపురం పెట్టిన తరువాత తొలిసారి. వంటలోని తన ప్రావీణ్యం చూపించాలని ఆబిదాకూ ఉబలాటంగానే ఉంది. పొద్దున్నే లేచింది. మున్నాకు పాలుపట్టింది. పడుకోబెట్టింది. వంటింట్లోకి ఉరికింది. మధ్యాహ్నానికి సగంపని తెమిలింది. అయినా రాత్రి వంట ఏర్పాట్లు జరగలేదు. ఆబిదాకు స్కూటర్‌వాలా గుర్తుకు వచ్చాడు. ఇహ వస్తాడు వాడు మున్నాను లేపుతాడు. సాయంత్రందాకా ఏపనీ చేయలేదు. అలా అనుకొని ముందు డ్రాయింగ్‌రూం శుభ్రం చేయడానికి బయల్దేరింది పొరకట్ట అందుకుంటుండగానే స్కూటర్ చప్పుడు వినవచ్చింది. ఎందుకో ఆమె సంతోషంతో గంతులు వేసింది. ముందు గదిలోకి పరిగెత్తింది. కాని ఆ స్కూటర్ తాను అనుకున్నదికాదు. మరొకటి ఇటురాలేదు. అటువెళ్లి పోయింది

ఒకటి అవుతూంది, ఇంకా ఏపనీ కాలేదు. తనకేమీ తోచడంలేదు. ఏమిటిది? వెర్రిదానిలా ఇల్లంతా తిరిగింది. మున్నా చెంపలమీద చేతులు వేసుకుని హాయిగా నిద్రపోతున్నాడు. ఆబిదా తిరుగుతూ, తిరుగుతూ వరండాలోకి వచ్చింది – స్కూటర్ రొద వినిపించింది – మున్నా ఎక్కెక్కి ఏడుస్తున్నాడు.

"అల్లా, ఈ స్కూటర్ వాడి ప్రాణాలు తీయాలి. వీడి స్కూటర్ ఇప్పుడే గుద్దుకోవాలి. స్కూటర్ ముక్కలు ముక్కలయి పోవాలి" తనకు తెలియకుండానే సాపెన్లు వచ్చాయి ఆవిడ నోటినుంచి. మున్నాను ఎత్తుకుంది. అటూ ఇటూ తిరుగుతూంది.

సాయంత్రం అయింది. మొహసిన్ మిత్రులు వచ్చారు. కేకలు అరుపులు, నవ్వులు, ఎనిమిదింటిదాకా కబుర్లు సాగాయి. ఇక భోజనాల తగాదా. శ్యాం వంటింట్లోకి మారాడు. వంటలన్నీ రుచిచూసి వచ్చాడు. ఇక తిండిని గురించిన తాపత్రయం. మున్నా నిద్రపోతే వడ్డించవచ్చనుకుంది ఆవిడ.

మున్నా నిద్రపోయాడు. భార్యా భర్తలు టేబుల్ సర్దుతున్నారు. ఆవిడ పనిలో ఉంది. అయినా ఆమె ధ్యాసంతా స్కూటర్ మీదే ఉంది. స్కూటర్ వస్తుంది. దాని రొద వినిపిస్తుంది.

భోజనాలు అవుతున్నాయి. శ్యాం, ఫ్రసర్, సాధిక్ నానాగొడవ చేశారు. ఆవిడ తక్కువదేం కాదు. గడుసే. చురుకైన జవాబులు ఇవ్వగలదు. కాని ఆమె ధ్యాససాంతం స్కూటర్ మీదనే ఉంది. వచ్చేవేళ అయింది. రొదవినిపిస్తుంది.

"మున్నాను చూసొస్తా" అని అక్కణ్నుంచి బయల్దేరింది. గదిలోకి వచ్చింది. అదోలా ఉంది. అటూ ఇటూ తిరిగింది. స్కూటర్ వస్తుంది. రొద వినిపిస్తుంది. మున్నా లేస్తాడు. అనుకుంటూంది.

భోజనం ముగిసింది. చాయ్ కూడా అయిపోయింది. నవ్వులు, కవ్వింపుల్తో అంతా అలసిపోయారు. అయినా - ఎవరికీ లేవబుద్ధికావడంలేదు. కూర్చునే ఉన్నారు.

ఏమిటి ఇవ్వాళ గడియారం ముందుకు ఉరుకుతుంది. పదిచూపిస్తుంది. స్కూటర్‌వాలా ఇంకా రాలేదు? ఆవిడ ఆలోచనల్లో మునిగింది.

"ఇవ్వాళ వదినమూడ్ బావుండలేదు" శ్యాం కదిలించాడు.

"ఏంలేదు" అని నవ్వింది. నవ్వు చప్పగా ఉంది. ఏమిటిది? నేనిలా ఎందుకున్నాను? నాకేమైంది? తనను తానే ప్రశ్నించుకుంది. ఒక్కోసారి ఏహో

అనుమానాలు మనసును కలచివేస్తాయి, మనకే తెలియదు ఎందుకో? ఊరికే ఆలోచించాల్సివస్తుంది ఆలోచనలు ముందుకు సాగలేదు. గడియారం చూచింది ముల్లు ముందుకు సాగిపోతుంది. పదిన్నర అయింది.

"వదిన తేప తేప గడియారం చూస్తూంది వెళ్దాం. ఖుదాహాఫిజ్" అన్నాడు ఖైసర్ శ్యాంతో

"అది నిజమే. కాని కోడి అరగాలి, అది రశీదు పంపాలి. అప్పటి వరకూ లేచేదశలో లేను" అన్నాడు శ్యాం. సోఫామీద వెల్లకిలా పడిపోయాడు.

ఏమిటిది తేప తేప గడియారం చూస్తుంటే వీళ్లు ఏమనుకుంటారు? ఆబిదా సగ్గుపడి పోయింది. రాని నవ్వు తెచ్చుకొని మనసు నిండా నవ్వింది. వాళ్ల పరిహాసాల్లో చేరిపోయింది.

అమాంతంగా ఏడుపు వినిపించింది. అది ఆడదాని ఏడుపు తెలుస్తునేఉంది ఆబిదా భయంతో వడికి పోయింది. ముఖం వివర్ణం అయింది.

"ఏమిటి? ఏమైంది"? అందరూ ఉలికిపడి అడిగారు,

"వాడలో ఎవరో చచ్చారు, వాడిభార్య ఏడుస్తూంది" ఆబిదా గంభీరంగా అన్నది.

మొహసిన్ కిటికీ దగ్గరికి వెళ్ళాడు. విన్నాడు. అన్నాడు. "కాదే"!

"తల్లి కొడుకును కొడుతున్నట్లున్నది. అలాగా జనంలా కనిపిస్తున్నరు వీధివాళ్లు?"

"అలగా జనం అంటే బిడ్డల్ని కొట్టే తల్లులనా మీ ఉద్దేశం"? శ్యాం మొహసిన్ను అడిగాడు. "వదినకూడా మున్నాను కొడుతుందని విన్నాం" కొంటెగా అడిగాడు శ్యాం.

"మున్నానేమిటి–మున్నాతండ్రిని కూడా" అన్నాడు సాదిక్. అంతా నవ్వారు.

ఆబిదా చిరాకుగా లేచింది. కిటికీ దగ్గరికి పోయి నుంచుంది.

"చావలేదా! అబ్బ! నాకు ప్రాణం పోయినంత పనిఅయింది".

"వదినగారూ! శలవియ్యండి. ఈ పీడలోని ఎవరి చావుకై తామూ నిరీక్షించు చున్నారు"? సాదిఖ్ అడిగాడు.

మళ్ళీ నవ్వులు.

ఆబిదా నవ్వలేదు. తలవంచుకుంది. విగతాత్మకు వందనం చేస్తున్నట్లుంది. స్కూటర్‌వాలా చావుకు తనదే బాధ్యత అనుకుంది. ఆస్పత్రివాళ్ళు శవాన్ని గుర్తించి ఉండరు. శవాల గదిలో పారేసి ఉంటారు. స్కూటర్ ముక్కలు రోడ్డుమీద చెల్లాచెదరై ఉంటాయి. అతని భార్య తల దువ్వుకోవి. పూలు తురుముకొని పందిరి మంచంలో కూర్చొని ఉంటుంది. భర్త రాకకు ఎదిరి చూస్తుంటుంది. రాకుంటే పరిపరివిధాల ఆలోచిస్తుంది. ఎవతో రంగేలి ముండ భర్తదారి తప్పిందనుకుంటుంది. కాని ఆమెకు ఆబిదా.... ఆబిదా....

వాతావరణం.... గంభీరంగావుంది. మూగగా ఉంది. అది చూచారు మిత్రులు. లేచారు. వెళ్ళిపోయారు.

పది, పదిహేను నిమిషాలు గడిచాయి. మొహసిన్ గదిలో ప్రవేశించాడు చూస్తే ఆబిదా దిండుమీద తలపెట్టుకొని ఏడుస్తుంది. ఎక్కెక్కి ఎడుస్తూంది.

అబ్బా! ఆబిదాజాన్? ఏమిటి? ఏమైందినీకు''? మొహసిన్ గాభరా పడిపోయాడు.

ఏడుస్తూనేఉంది. ఎక్కిళ్ళు వస్తుండగా "మొహసిన్! నేను తప్పుచేశాను. పెద్దతప్పుచేశాను. ఒకని ప్రాణం తీశాను. అలా అనిపిస్తూందినాకు.'' అన్నది.

''ఏమిటీపిచ్చి! ఎవరిప్రాణం తీశావు? ఎలాతీశావు? ఏమిటీకథ? చెప్పు. త్వరగా చెప్పు. ఎందుకేడుస్తావు"?

ఆ స్టార్టర్‌వాలాలేడూ! రోజూ మన మున్నానులేపడూ! వాడు. వాణ్ణిబాగా తిట్టాను. సాధించాను. ఇవ్వాళ ఇంతవరకూ వాడు ఇంటికి రాలేదు. బస్సువాణ్ణి గుద్దేసి వుంటుంది. వాడు చచ్చిఉంటాడు. అందుకే వాడెళ్ళాం ఏడుస్తోంది".

"ఓస్ ఇంతేనా"? మొహసిన్ ఓదార్పుల చూపులు చూపాడు. ఆబిదాను పడుకోపెట్టి వీపు నిమురసాగాడు.

"పిచ్చిదానా! నీ సాపెన్లు తుపాకి గుండ్లు అయినావనుకున్నావా? వెర్రివేషాలు! పడుకో, ఎప్పుడూ స్టార్టర్‌వాలా కలవరింత!

ఆబిదా ఆరాత్రి నిద్రపోలేదు. ఆమెకు భయంకరం అయిన కలలు వచ్చాయి. హంతకులకు మనశ్శాంతి ఉండదంటారు. ఎవరిగొంతో నొక్కుతున్నట్టు కలగంటుంది. భయంతో కలవరిస్తుంది, అరుస్తుంది.

తెల్లవారింది. లేస్తే జబ్బునపడి లేచినట్లుంది. ఒళ్ళుమండిపోతూంది. జ్వరం మండిపోతూంది. ఈజ్వరం వల్లనే రాత్రి కలవరించింది అనుకున్నాడు మొహసిన్. అతడే ఇంటిపని సొంతం చేశాడు. అంతేకాదు అతడు తన తల్లి దగ్గరకు వెళ్లాడు. పనిమనిషిని ఏర్పాటు చేయవలసిందని చెప్పాడు. ఆఫీసుకు వెళ్ళాడు.

ఆబిదా మున్నాను పెట్టుకొని పడుకుంది. చప్పున ఎక్కడో ఏడుపు వినిపించింది. అప్పుడు ఎవరో ఏడుస్తున్నారు. ఎవరో చనిపోయారు అని గ్రహించింది. లేచి కూర్చుంది, భయంతో వణికిపోసాగింది. నుంచుంది. నడిచింది. ఇంటి కిటికీలన్ని మూసింది. బాత్‌రూంలోకి దూరింది. ఎవరో వెంటాడుతున్నట్లు గట్టిగా తలుపు మూసుకుంది. వణికిపోతూంది. తానే హంతకురాలని దృఢ పర్చుకుంది. పోలీసు వాళ్లు వచ్చేస్తారని నిశ్చయించుకుంది. సినీమాల్లో, నవలల్లో ఉండే హంతకులంతా ఆమె కళ్ళలో కదులాడారు. బాత్‌రూంలోనే ఏడ్పు సాగించింది. అరిచింది. "నేను హత్యచేయలేదు, చేయలేదు" అని బయటికి వచ్చేసింది. మున్నాను గట్టిగా కావలించుకొంది.

జనం ఎంతవిచిత్రంగా పిలుస్తున్నారు! ఆడవాళ్లు ఏడుస్తున్నారు. గుండెలు పగులుతున్నాయి. సొంతం వాడిపెళ్ళాంగా! ఏం కావాలి? తలలో పూలు... గోరింటాకు చేతులు... బొట్టెట్టు మంచం! అయ్యో, ఇక హ్రాటర్ కాదనినాను. అనిపిస్తుంటే ఎలా? ఎలా గడుస్తుంది రోజా!

మళ్లీ ఏడ్చింది.

కాలుకాలిన పిల్లిలా తిరుగుతూంది.

పారిపోవాలనే ఆలోచన వచ్చింది.

పట్టుకుంటారు. పారిపోవాలి. హంతకులు అలాగే చేస్తారు. అయినా నేరం దాగదు. రక్తం వెంబడిస్తుంది. హంతకుని ఆత్మ వెంటాడుతుంది.

హంతకి, తాను హత్యచేసింది.

మొహసిన్ తనను అసహ్యించుకుంటాడు.

అత్తింటి వాళ్లేమంటారు?

మున్నా హంతకి కొడుకు!

తనను జైల్లో పెడ్తారు. కోర్టులకు తిప్పుతారు!

ఉరిపంజరం.... కంబం .. ఉరి!

ఆవిడా గ డ గ డ లాడింది.

అవతల ఏడుపులు. — పెద బొబ్బలు ఎక్కువవుతున్నాయి. చావువార్త చాలమందికి తెలిసినట్టుంది. జనం వస్తున్నారేమో! అడుగుతున్నారేమో ఎలా చచ్చాడని? కాని ఏక్సిడెంటు అసలు కారణం ఎవడికీ తెలియదు. బస్సువాణ్ణి పట్టుకొని ఉంటారు.

అసలుకారణం తాను! తాను హంతకి!! ప్రాణాలు లేచిపోతున్నట్లనిపిస్తూంది.

అమాంతంగా మరో ఆలోచన— తన ఉరిశిక్ష రద్దయింది!

జ్వరం తగ్గినట్లుంది. చమటలు కక్కుతూంది.

ఎవరో బెల్ నొక్కారు. బెల్ మోగింది. ఆమె ఉలికిపడ్డది. లేచింది. ఇల్లంతా తిరగసాగింది.

"తలుపు తెరవండి" ఎవరో అరుస్తున్నారు.

పోలీసు వచ్చేసింది. అవును పోలీసే. ఒప్పుకోవాలి – తాను హంతకినని ఒప్పుకుంటే శిక్ష తగ్గుతుందంటారు. తలుపు తీస్తుంటే కాళ్ళూ, చేతులు వణుకుతున్నాయి. చెంపల మీద కన్నీటి చారలు కనిపిస్తున్నాయి.

బయట ఒక యువకుడు నుంచున్నాడు. అతని చంకన పిల్లవాడున్నాడు.

"క్షమించండి, శ్రమ కలిగిస్తున్నాను. నా మామగారు చనిపోయారు. నా భార్య స్పృహలేక పడిఉంది. రెండు, మూడు గంటలు కాస్త ఈ బాబును పట్టుకుంటారా? కాసిన్ని పాలు తాగించండి – ప్లీజ్ – మ్రక్రియా"!

ఆబిదాకు ఏమీ వినిపించలేదు. అర్థం కాలేదు. అయినా చేయి చాచింది. బాబును అందుకుంది.

చింపిరి తల, ఏడుపుతో ఎర్రవారిన కళ్లు, కన్నీరు నిండిన ముఖం, ఆబిదాను చూచి అతను అడిగాడు. 'ఏమిటి? అలావున్నారు.? మీ వాళ్ళు ఎవరైనా.... ?

ఆబిదా పెదవి కదలలేదు. తలుపు మూసింది.

ఇంతలో స్కూటర్.... దాని రోద వినవచ్చింది.

ఆబిదా ఎగిరి గంతేసింది. పిల్లవాణ్ణి గట్టిగా కౌగిలించుకుంది.

"లేదు, ఎవరూ చావలేదు.

మా వాళ్లెవరూ చావలేదు, చావలేదు" ఆబిదా అరచింది.

# గొడ్రాలు

బేగం కళ్లుమూసుకుని ప్రార్థించింది. కళ్లుతెరచి చూస్తే ప్రొద్దుక్రుంగి పోయింది ముంగిలి శుభ్రంగా ఉంది. నిశ్శబ్దంగా ఉంది. నిరామయంగాఉంది? పూలకుండల్లో వసంతం విరిసింది. ముంగిట్లో నేరేడు చెట్టుంది. నల్లనేరేడు వాన కురిపిస్తోంది.

ఆమెకు చప్పున పాతరోజులు గుర్తుకు వచ్చాయి. అప్పుడు-ఆరోజుల్లో- తనపిల్లలు-కొంటెపిల్లలు-నేరెడుపళ్లు పచ్చి, పండు అనేది లేకుండా నమిలేవారు. పూలకుండ్లు ఇలాఉండేవా? ఉండనిచ్చేవాళ్లా! ముంగిలి ఇంతశుభ్రంగా ఉండేదా కాగితం ముక్కలు, పూలరెమ్మలు, బురద అంటిన బంతులు - చెల్లాచెదురుగా ఉండేవి.

బేగం చాపచుట్టి పక్కనపెట్టింది. పనికత్తె కరీమన్‌ను పిలిచింది. గుమ్మంలో ఎవరున్నారో చూడమంది. ఎప్పుడూ అంతేఆమె. రోజుకు యాభై సార్లు చూసి రమ్మంటుంది. మొదట్లో కరీమన్. కరీమన్ కూతురు షమ్మీ బేగంను పిచ్చిది అనుకున్నారు. క్రమంగా అలవాటయింది.

ముంగిట్లో వడియాలు ఎండపెట్టింది. కాకులు ఎత్తుకు పోతున్నాయి. బేగం చేతులెత్తి వాటిని అదిలించింది అయినా అవి కదలందే! వాటికి తెలిసి వచ్చినట్లుంది ఈ ఇంట్లో ఆశ్రయంలేని ముదుసళ్లు అల్లాడుతున్నారని!

బేగం చాపచుట్టి పక్కనపెట్టింది. పాందాన్ (పక్కాకులపెట్టె) తెరచి కూలబడ్డది. ఏంచేయడానికి తోచలేదు. అనవసరంగా షమ్మీని పిలిచింది. "బిడ్డా! షమ్మీ! చూడమ్మా గుమ్మంలోకి ఎవరొచ్చారో?" అంది.

ఉత్తరాలకోసం నిరీక్షించడం ఆమె జీవిత పరమావధి అయింది. ఏం తెలుసు? ఏ క్షణంలో ఏ కొడుక్కు తాను గుర్తుకువస్తుందో!

షమ్మీ కూర్చున్నచోటు నుంచి కదల్లేదు. 'అమ్మా పోస్టువాడు వెళ్లిపోయడు. వకీలుగారి ఇంట్లో ఉత్తరాలు ఇస్తున్నాడు' అన్నది.

'బిడ్డా! కాస్త ఆడుగు_మనకేమన్నా ఉత్తరాలు వచ్చాయేమో!'

ఉత్తరాలువస్తే పోస్టువాడు ఇచ్చివెళ్తాడు. ఊరికే ఎందుకు వెళ్లిపోతాడు అనుకుంది షమ్మీ. కాని బేగం మాటకని లేచింది గేటుదాకా వెళ్లింది. కాస్తసేపు నుంచుంది, ఆ కాస్తసేపట్లో బేగం నిశ్చయించుకుంది ఉత్తరం వచ్చిందని. పదిహేను, ఇరవై రోజులయింది_తప్పక ఉత్తరం వచ్చి ఉంటుంది అనుకుంది.

బేగం కళ్లద్దాలు తగిలించుకుంది. చేయి చాచింది.

'ఉత్తరం రాలేదు.' షమ్మీ చెప్పింది.

'అచ్ఛా,' నిరాశగా అన్నది బేగం. కళ్లద్దాలు తీసేసింది. మంచంలో వాలిపోతూంది. భర్త కోసం నిరీక్షించ సాగింది, అతను డాక్టర్ దగ్గరికి వెళ్లాడు.

వయసులో పిల్లలతో సతమతం అయింది. భర్తకు గ్లాసుడు నీళ్లు ఇవ్వడానికి తీరికలేకుండా చేశారు పిల్లలు, కాని ఇప్పుడు ముసలితనం వచ్చేసింది. ఇప్పుడు భర్త క్షణం విడిపోయినా చిరాకుగా ఉంటూంది కొత్త పెళ్లికూతుర్లా పరితపించి పోతూంది.

కాని ఇవ్వాళ ఇంకా ఎదిరి చూడకముందే దగ్గువినవచ్చింది. హమీద్ గారు మందులు, ఇంజక్షన్ల డబ్బాలు పట్టుకొని వచ్చేశారు. అతడు చిక్కిపోయి ఉన్నారు. నడుం వంగింది, చేతులు వణుకుతున్నాయి. వారికి రక్తంపోటు, దమ్ము.

వయసులో పురుషులు విర్రవీగుతారు. రంగురంగుల జీవితాన్ని రుచి చూస్తారు. వార్ధక్యం వస్తే జీవిత ఆల్లుడం ఎన్నికల్లో నిలవడం, క్లబ్బులకు

పోషణం లాంటి వ్యాసంగాలు వెతుక్కుంటారు. కాని హమీద్‌గారి వయసు భారంపురమాయింపులతోనూ. పిల్లల తగాదాలతోను గడిచిపోయింది. అప్పుడు వారికి మిత్రులను కూర్చుకునే సమయంగాని. హాబీలకుపోయే తీరికగాని లేక-పోయింది. ఇప్పుడు అరవై ఏళ్ల ముసలితో ప్రయాణం సాగిస్తున్నారు. వాళ్లిద్దరూ. వేరువేరు మంచాలలో పడుకొని రాత్రింబవళ్లు తమ క్షేమసమాచారాన్ని గురించి చర్చించుకుంటారు. ప్రార్థనలు చేస్తారు. తమ పిల్లలను గురించి ముచ్చటించుకుంటారు.

ఇవ్వాళకూడా హమీద్ గారు రాగానే అడిగారు 'ఉత్తరం ఏమన్నా వచ్చిందా?' అని.

బేగంకు రాలేదని చెప్పడానికి మనసొప్పలేదు. అయినా చెప్పాల్సి వచ్చింది. రాలేదనే మాటవినగానే మందులు స్టూలుమీద పెట్టారు. బూట్లు విప్పకుండానే మంచంలో కూలబడ్డారు. నడుం వాల్చారు. అనుకున్నారు-అప్పుచేసి అయినా "వజా"కు డబ్బుపంపాల్సిందే. చాలకోపం వచ్చినట్లుంది. అందుకే ఉత్తరం రాయడంలేదు-అని. వారు పక్కకు మల్లారు. ఉదాసీనంగా అన్నారు:- "అల్లాకే తెలియాలి ఏం అవసరం వచ్చిపడిందో"?

బేగం కన్నీరు మింగి గోడను చూస్తూంది. గోడమీద కూసే పిట్ట కూర్చుని ఉంది. బాల్యంలో వాజిద్ దానివలె కూతవేయడానికి ప్రయత్నించేవాడు.

"ఆవును - పెద్దకోడలుకు మనతోటలోని మామిడిపళ్లు పంపించారా?"

"పంపించాను. పళ్లపార్సిలు చేశాను. కాని సాదిక్‌మియాఁ ట్రాన్సిస్టర్ కావాలంటున్నాడు. అల్లుని కోరిక ఎలా కాదంటాం?"

హమీద్‌గారు లేచికూర్చున్నారు. చాలసేపు ఆలోచించారు. అప్పుడన్నారు 'ఇహనాకు మందులు, మాకులు వద్దు. సాదిక్‌మియాఁ పురమాయింపు పూర్తి చేద్దాం'

"రాజా బాబుకోసం చిన్న చిన్న చొక్కాలు. టోపీలు కుట్టాను. అవికూడా వాంతో పంపిస్తాను" చొక్కాలు, టోపీల మాటతోనే ఆమె ముఖంలో వెలుగులు కనిపించాయి.

పెళ్ళి కాగానే పిల్లలు కొల్లలుగా కావాలనుకునే ఆడవాళ్లుంటారు కొందరు. బేగం ఆ వర్గానికి చెందింది. తొలిసారి ఆమె పెళ్ళికొడుకును చూచింది. పొంగిపోయింది. అబ్బ! పిల్లలు అందంగా ఉంటారు తండ్రిలా-పచ్చగా అనుకుంది. కళ్లుకూడా పెద్దగా ఉంటాయని మురిసిపోయింది. ఆమె అనుకున్నట్లు అవుతే రెండుడజన్ల పిల్లలను కనేది. కాని ఏమైందో తెలీదు-ఏడోబిడ్డ తరువాత కాన్పు ఎట్టిపోయింది.

కోడిపెట్టలా పిల్లలను ఎప్పుడూ తనలో దాచుకునేది. పిల్లలకోసం ఆమె ఎన్ని కష్టాలు పడ్డదో! అన్నింటికంటే ముందు అందమైన, విశాలమైన ఇల్లు కట్టాలనే కోరిక కలిగింది. హామిద్‌గారి తల్లిదండ్రులు అద్దె ఇళ్ళలోనే కాలం గడిపారు. హమీద్‌గారిని పట్టభద్రుని చేసేవరకే వారిపని తీరిపోయింది. కాని ఇవ్వాళ్టి స్థితివేరు. బేగం పిల్లలు పెరుగుతున్నారు - పెద్దవారు అవుతున్నారు. ఇప్పుడు బేగంకు మనుమలను మనమరాళ్లను సాదాలనే మక్కువ పట్టుకుంది. కోడళ్లతో పోట్లాడడానికీ, అల్లుళ్లతో తిట్లుతినడానికి పెద్ద ఇల్లు కావాలనుకుంది. అందుకుగాను మగని చాటుగా కూడబెట్టసాగింది. నలుగురు కొడుకులను విదేశాలకు పంపడం, ముగ్గురు మంచి అల్లుళ్లను కరీదు చేయడం నవ్వులాటకాదు. భర్త సంపాదించే దానితో బేగం సంతృప్తిచెంది ఉంటే హమీద్‌గారు పవిత్వపు పిచ్చిలో నడిపోయేవారు. కాని భార్యతగాదాలతో హమీద్‌గారు ప్రమోషన్ల మెట్టెక్కడం కాదు గంతులేసి డప్యూటీకమీష్నర్ పదవిని అందుకున్నారు. అయినా బేగం పైసపైసకు ప్రాణాలు విడిచేది. అవును ఆమెను పెద్దఇల్లు కట్టాలనే కోరిక వదలడంలేదు. ఎంతపెద్దఇల్లు? నలుగురు కొడుకులకు వేరేవేరే భాగాలు, ముగ్గురు అల్లుళ్ళకు వేరువేరు గదులు- మనవలు ఆడుకోవడానికి పెద్దతోట-పనివాళ్లకు వేరే క్వార్టర్సు!

పెద్దకొడుకు రాషిద్ అందమైనవాడు. చురుకైనవాడు. బేగం మనసులో అనుకునేది-దుర్మార్గుడు విదేశంనించి 'లేడీని' తెస్తాడని. అందుం రాషిద్‌కోసం కట్టిన భాగం పాశ్చాత్య పద్ధతిలో ఏర్పరచింది. తరవాతవాడు సాజద్. వాడు ఎప్పుడూ తల్లిని అంటిపెట్టుకుని ఉంటాడు. కాస్సేపు తల్లి లేకుంటే ఏడ్చి, ఏడ్చి ప్రాణం మీదికి తెచ్చుకుంటాడు. అందువల్ల సాజిద్ పెళ్లాం పిల్లల్ని తన దగ్గర్నే ఉంచుకోవడానికి నిశ్చయించుకుంది. సాజద్‌కు చదువంటేప్రాణం. వాడు ప్రొఫెసర్ అవుతాడనుకునేవారు. హమీద్‌గారు. అందుకే బేగం వాడి గదిలో ఆనేక అల్మారీయి, షెల్ఫులు ఏర్పాటు చేసింది. ఇహ వాజద్ రోగిష్టి. వాడికి చదువుమీద లేదు. ఆటమీదలేదు. ఏదాది పొడుగూ ఏదో భయంకరం అయిన జబ్బుతో బాధపడుతుంటాడు. ఎప్పుడూ మంచంలోనే బేగంకు దిగులు-వాడెన్నడైనా చదువుతాడా అని తనపిల్లలు "దొరలు" కావాలనే అభిలాష బేగంకు.

ఆడపిల్లలను గురించి బేగం బాధపడేది. షాఫా, రాజా అందంఅయిన వాళ్లు. తండ్రి డిప్యూటీ కమీషనర్ కాకున్నా. ఎవరో మహారాజులు వాళ్ళను చేసుకుంటారు. కాని హదియా అంత అందమైందీకాదు-స్వభావమూ మంచిదికాదు రాత్రింబవళ్లు అన్నల్తో పోట్లాడుతుంది. వాళ్ళ ఆటలు చెడగొడ్తుంది. ఇదే ఆమె పని. ఇది పరాయఇంట్లో ఎలా నెగ్గుతుందని దిగులుపడేది బేగం. తనకొడుకులు పరాయిదేశాల్లో ఉద్యోగాలు చేయరాదనీ, తన కూతుళ్ళను దూరప్రదేశాలకు ఇవ్వరాదని నిశ్చయించుకుంది.

పిల్లల పల్టన్ తెలివి మీరుతుంది. తల బిరుసుతనం చూపుతూంది. షాఫా తండ్రిని వప్పించి మ్యూజిక్ స్కూల్లో చేరింది. హాదియాకు బొమ్మలు వేయడం సరదా. పిచ్చిదానిలా కాగితాలమీదికి పిట్టలనూ, చెట్లమాడించుతుంది సాజిద్, వాజద్ కలిసి తండ్రి పెంచిన మామిడిచెట్లు, జామచెట్లు కొట్టించేశారు. తోటలో టెన్నిస్ కోర్టు తయారు చేశారు.

హామిద్‌గారు మండిపోయారు. కాని బేగంకు మనసులో సంతోషంగా ఉంది తన బిడ్డల పెంకితనంమీద. "కానివ్వండి వెధవలు - ఇల్లంతా వాళ్ళదేగా"

అన్నది ముసిముసిగా. హమీద్‌గారు మాట్లాడ్లేదు. వినదక్కర అందుకున్నారు విసురుకోవడానికి. వార్ధక్యంలో భార్యల వశం అయ్యే భర్తల వర్గానికి చెందిన వారు హామీద్‌గారు..... ముఖ్యంగా పిల్లల తగాదాల విషయంలో వారి అసమర్థత వారికి తెలుసు. భార్యకున్న చాతుర్యమూ వారు గ్రహించారు.

సదారోగి వాహిద్‌కు ఏదో మందు పడివచ్చింది టానిక్ సీసామీది బొమ్మలా బలం పెంచుకున్నాడు. స్కూలు క్రికెట్ టీమ్‌తో ఢిల్లీపెళ్తానని మొండికెత్తాడు. ఆమాట వింటూనే బేగం ప్రాణాలు లేచిపోయాయి. హామీద్ గారూ కాస్తబెదిరారు. అయినా అనుకున్నారు - భయం వదలడమే మంచిదని- "ఇంత భయపడేదానివి యూరోపుకు ఎలా పంపుతావు?" అడిగారు భార్యను. హమీద్ ఢిల్లీ వెళ్లగానే అందరికీ అలుసు అయింది. ఒకడు కష్మీర్ వెళ్ళాడు. ఒకడు మద్రాసు వెళ్లాడు. షాహా కేరళ వెళ్ళింది.

తొలిసారి హామీద్ ఇంటి బయటకు అడుగుపెట్టినపుడు బేగంకు అన్నం సయించలేదు. రాత్రింబవళ్లు ఏడుస్తూ ఉండిపోయింది. వాహీద్ పద్మవ్యూహం లోకి దూరినట్లు నెత్తిన చేతులు పెట్టుకొని కూర్చుండి పోయింది. వారం తరవాత తిరిగి వచ్చి తల్లి పరిస్థితి చూచి అదిరిపోయాడు హామీద్. ఇహ తాను ఇల్లువదిలి పెళ్ళనని పట్టుపెట్టుకున్నాడు. కాని రాషిద్ డాక్టర్ అయినాడు. యూరోపు వెళ్ళాల్సి వచ్చింది - మూడేళ్ళ వరకు. బేగం ఎన్నాళ్ళని ఉపాసా ఉంటుంది? ఎంతకని ఏడుస్తుంది? ఇంకా ఆరుగురు మంకువాళ్లున్నారు. పని దొంగలున్నారు! వాళ్ళతో క్షణం విశ్రాంతి దొరికేది కాదు. ఆపిల్లల తల్లికి ఎంత ఓర్పుకావాలి? ఎంతసహనంకావాలి? పిల్లలు పెద్దవాళ్లు అవుతుంటే తల్లిచేసే ప్రతీ పనిలోనూ ఏదో వంక కనిపిస్తూండేది. ఆడపిల్లలు మరీను. వారికి తల్లిచేసే ప్రతి పనీ అపహాస్యంగా ఉండేది. బేగం కూతుళ్ల నచ్చిన బట్టలు కట్టాల్సి వచ్చేది, వాళ్ళకు ఇష్టం అయిన వంటలు వండాల్సి వచ్చేది. ఒకనాడు మాజిద్ తండ్రిని గద్దించాడు-అహారం సరిగా తీసుకోవట్లేదని. బేగం గుండెలో వెన్నెల విరిసింది. పిల్లలు ఎంతపెద్ద వాళ్లైయారు-తల్లి తండ్రులకే బుద్ధి చెప్పుతున్నారు అనుకుంది!

బేగంకు ఇక్లేలోకం. మరోలోకం ఉందనే ఆలోచనలేదు. షాఫా మామ గారు వచ్చి ఆమెను పాకిస్తాన్ తీసికెళ్లినప్పుడుగాని ఇల్లుకాక మరోలోకం ఉందని బేగంకు తెలిసి రాలేదు. బేగం తనకూతురును అంత దూరం ఇచ్చేది కాదు. కాని రాసి ఉన్నాక ఏంచేయగలరు? షాఫా వెళ్లిపోతే ఏడ్చి, ఏడ్చి కళ్ళద్దాలు తెచ్చుకుంది. వెంట్రుకలు అమాంతంగా వెండి తీగలయి పోయాయి. మిగతా పిల్లలను వీధిదాటి ఇవ్వవద్దని నిశ్చయించుకుంది. షాషాకూడా పాపం చాలా ఏడ్చింది. రోజూ తల్లికో ఉత్తరం రాసింది. ఆమె బిడ్డను కన్నది. తల్లికి తెలియ పరచడం మరిచి పోయింది. రాషిద్‌కు రేండేళ్లు తల్లి వంటలు గుర్తుకు వచ్చాయి. తండ్రికి పఠనమూ గుర్తుకు వచ్చింది. ఇహ విసిగిపోయి పెళ్లిచేసు కున్నాడు. ఇల్లు కూర్చు కున్నాడు.

బేగం అవార్త వింటే గుండెమీద రాయి విసిరి నట్లయింది. హమీద్‌గారి బ్లడ్‌ప్రెషర్ పెరిగింది. రాషిద్ బాల్యంలో ముద్దుగా ఉండేవాడు. బేగంకు వాడంటే ముద్దు. వాడి అందం చూసి మురిసి పోయేది. నా కొడుకు విదేశాల నుంచి కోడలును తెస్తాడని మురిసి పోయేది. కాని ఇవ్వాళ వాస్తవంగా అది జరిగేప్పటికి బేగం గుండెదడ పెరిగింది. తన చేతుల్తో కొడుకును పెండ్లి కొడుకును చేయాలని ముచ్చట పడింది. కట్నాన్ని గురించి తగాదా పడాలని తహతహ లాడింది.

అన్నను చూచారు తమ్ముళ్లు. వారూ పరాయి దేశాలకు జారుకున్నారు. బేగం చాల బాధపడింది. హాదియా పెండ్లి అవీధివారితోనే కుదిరించింది. అయినా అప్పగింతలప్పుడు గుండెలు అవిసేట్లు ఏడ్చింది. ఏదో తథాస్తు దేవతలంటారే అలాగే జరిగింది. హాదియా భర్త ఉండీ ఉండీ అమెరికా వెళ్తానని ఎగిరాడు. అంతా హాస్యం అనుకున్నారు. చూస్తూ చూస్తూనే అల్లుడు అమెరికా వెళ్లిపో యాడు. హాదియా సప్తసముద్రాలు దాటిపోయినట్లు బేగం తల బాదుకొని ఏడ్చింది.

ఆడపిల్లలు అత్తవారి ఇళ్ళల్లోనే బావుంటారు. మగపిల్లలు ఎంతకాలం తల్లి దండ్రుల సొమ్ము తింటుంటారు? సంపాదించు కోవడానికి వెళ్లిపోతారు.

ఈ విషయాలు అనేక మంది చెప్పారు బేగంకు. అలా వినడంలోనే పదేళ్ల గడిచి పోయాయి.

బేగం పిట్టపిల్లల్ని సాకింది, రెక్కలొచ్చాయి, అవి ఎగిరి పోయాయి. ఎప్పుడో తీరిక ఉన్నప్పుడు వచ్చేవారు. మూడు, నాలుగు రోజులు అలా తొంగి చూచి వెళ్లిపోయేవారు. జీవితం అతి వేగవంతం అయింది. వాళ్ళకూ తీరిక లేదు– ముసలి వాళ్ళతో సరదాగా ఉండడానికి! వాళ్ళకు అనేక సమస్యలు, సంపాదనలు, పెద్ద పెద్ద ఉద్యోగాల్లో ఉన్నారు. బాధ్యతలు బరువులు. అంతులేని పనులు. కోడళ్లు చదువుకున్నవాళ్లు, జగడాలమారి అత్తతో ఉండడం నచ్చదు. ఒక సుపుత్రునికి ఆ పాతబడిన ఇల్లు నచ్చేది కాదు. తండ్రి హుక్కా పీలుస్తాడు. ఆపొడువాసన, ఖంగు ఖంగుమని దగ్గడం, కఫం ఊయడం, తీవ్ర స్వభావంగల తల్లి, ఇవన్నీ వారికి నచ్చేవి కావు. అందుకే దూరంగా ఉండాలనుకునేవాళ్లు.

అవురు మంటున్న అంత పెద్ద ఇంట్లో ఒక్కతే బేగం బిక్కు, బిక్కు మంటూ గడుపుతూంది. భర్త వంటరి తనం ఆమె గుండెలో ముల్లులా కెలుకుతూంది. పాపం హామిద్‌గారు రోగిష్టి. తల వత్తేవారులేరు. టెంపరేచర్ చూచే వాళ్ళూలేరు. ఎందరినో బ్రతిమాలాల్సి వచ్చేది.

ఎప్పుడో ఒకసారి ఒక కోడలు తన కొడుకు జన్మదినం గురించి తెలియ పరచేది. అత్తా, మామలనుంచే బహుమతులు ఆశించేది. ఇహ ముసలి వాళ్ళకు వారాల కొద్దిపని, బహుమతులు సిద్ధం చేయడం, వాటిని సేక్ చేయడం.

"రాహిద్ చాలా మంకువాడు. ఒక్కోసారి ఎత్తుకొని నుంచునే ఉండాలని పట్టు పట్టేవాడు. కూర్చుంటే ఏడ్చేవాడు. రోజంతా నుంచునే ఉండాల్సి వచ్చేది". అంటూ బేగం పాందాన్ తెరచి కూర్చున్నది – గతమంతా ఆమె ముందు ప్రత్యక్షంగా కనిపిస్తూంది. "మాజిద్ ఎంత తుంటరి! గోడలెక్కి ముంగిట్లో దూకేవాడు" అన్నది. హామిద్‌గారి కండ్లు చెమ్మగిల్లాయి. మాజిద్

బాల్యం వారిముందు పరుచుకుంది. "మాజిద్ మూడో పిల్లవాడు అచ్చం మాజిద్ లాగే ఉంటాడని మాజిద్ అత్తగారు అంటూంది". బేగం వక్కలు కత్తిరిస్తూ గర్వంగా "బొమ్మలో వాడిముక్కు అచ్చం మాజిద్ ముక్కులాగే ఉంది" అని మురిసి పోయింది. హామిద్‌గారికి ఒకపని దొరికింది. పాత ఫోటోలు వెదుక సాగారు.

'రాషిద్ కొడుకు రాజకుమారుడిలా ఉన్నాడు. ఎంత ముద్దొస్తున్నాడో!' బేగంముఖం చేటంత అయింది.

'తల్లి రంగురాదుగదా!' హామిద్ అనుమానం వ్యక్తపరచాడు.

'బావుంది వాడు నలుపెందుకు అవుతాడు? నాబిడ్డలు నలుపుకావడానికి వీల్లేదు' గర్వంగా అన్నది బేగం.

'నాబిడ్డలు'హమిద్ గారి ధ్వనిలో అపహాస్యంఉంది' మనబిడ్డలే మనకు కానప్పుడు వారి బిడ్డల్తో ఏమిసంబంధం?' అన్నాడు.

ఇంత కటువైన వాస్తవం అర్థం అయినా పిల్లల జ్ఞాపకాలు, వారి ముచ్చట్లుకాక జీవితంలో మిగిలిందేమి? కోడళ్ళవద్దింపుల గాయాలు మానిపోతే చాలు కాళ్ళకు రెక్కలు వస్తాయి. మళ్ళి కొడుకుల దగ్గరికి ప్రయాణం. మనుషులతో ఆడుకోవాలనుకునే లాలస! అప్పుచేసి రైలెక్కడం, అక్కడ వీరి పథ్యపు వంటలు, దగ్గు, కఫం వీటితో కోడలుకు విసుగు రెండోనాడో, మూడోనాడో మళ్ళీ రైలెక్కించడం. ఇదీవరస!

ఇద్దరు ముదుసళ్ళు తమతమ మంచాల్లో పడిఉన్నారు. చీకట్లు పరచు కుంటున్నాయి. ఎవరు లేవాలి? దీపం వెలిగించాలి. బయట వీధిలో సాయం కాలపు సంచలనం వినిపిస్తూంది. వంటల వాసన వస్తూంది.

ఇంతలో 'అజాం' ధ్వని వినవచ్చింది. ఇద్దరు నమాజు చేయడానికి లేచారు. బేగం అరుగు అంచున కూర్చొని కాళ్లుముఖం కడుక్కుంటూంది.

రజియా వచ్చింది. బేగం అన్నకూతురు రజియా. ఇప్పుడు బేగం అన్న కుటుంబపు తగాదాలు పరిష్కారం చేయడం ఎలాగా పట్టుకుంది. రజియా ఎప్పుడూ నవ్వుతూ, తుళ్లుతూ. వచ్చేది. ఇవ్వాళ కన్నీటికుండ నెత్తిని పెట్టుకునిదిగింది. కనిపించగానే బేగంను చుట్టేసుకుంది. ఎక్కెక్కి ఏడ్చింది. తెలిసిందేమంటే రజియా భర్త మళ్లి పెళ్లిచేసుకున్నాడు. ఎంచాతంటే రజియాకు పిల్లలు కలుగ లేదు.

వార్త విన్నది బేగం. ఒక్కసారి గట్టిగా ఊపిరి పీల్చుకుంది - దాంతో ఆమె ఏడుగురు పిల్లలూ మళ్లీఆమె పొట్టలోచేరి కిచకిచ మంటున్నట్లు అని పించింది, బేగం కన్నీరు తుడుచుకుంది రజియాను ఓదార్చసాగింది,

'ఏం పుట్టింది ముండాకొడుక్కు! నీకంటె అందమైంది దొరుకుతుందా వెధవకు! ఆ గాడిదకు నిన్ను మించి ప్రేమించేది ఏడనే దొరికేది?' చేతులు ఆర్చుకుంటూ సాపించింది.

కాని ఆయనదిమాత్రం ఏం తప్పు "రజియా వెక్కిళ్లతో 'నేను గొడ్రాలిని. అల్లా నానొసట ఇలా రాశాడు. వారినని ఏంలాభం? వారికీ పిల్లలు కావాలని ఉంటుంది. ముసలి తనానికి బిడ్డలేగదా ఆశ్రయం" అన్నది.

"గొడ్రాలు" ఈ పదం బేగం గుండెమీద గునపంలా గుచ్చుకుని నర నరాల్లోకి చొచ్చుకుని ఉరికింది.

ఆమె ఆవురుమంటున్న ఇంటిని చూచింది.

దగ్గుతో ఊపిరి సలపక లేచి నీళ్లుతాగుతున్న హమీద్ గారిని చూచింది.

తాను- గొడ్రాలే అనిపించింది బేగంకు అమాంతంగా! తన కడుపున ఒక్కడూ పుట్టలేదనుకుంది. ఇంటికి వెలుగునిచ్చే ఒక్కబిడ్డను కనలేదనుకుంది. తన దురదృష్టాన్ని తలచుకుంది. కన్నీరు రాలుస్తూ రజియాను కావలించుకొని బోరుమంది.

'రజియా బిడ్డా బంగారుబొమ్మా.... ఓపికపట్టు' అన్నది కాని మనసులో అనుకుంది

"నన్నుచూడు నేను గొడ్రాలికంటె కడహీనం"

# బంగారు లేడి

మార్గాలన్నీ అంతమైనాయి – ఇవ్వాళ. ఏవీధిలోకీ దారిలేదు ఏద్వారమూ తెరిచిలేదు. ఇదేమిటీ – నేను తోవతప్పానా? ఏబాట? పదేళ్లు వరసగా నడిచిన బాట. ఏమైందినాకు? దారితప్పానా? బాటమరిచానా?

పెళ్లి. పెళ్ళంటే సీతారాముల వనవాసమా? జీవితాంతం కష్టాలుపడ్డమా? చెరల్లోఉండడమా? ఏం లేదు నాలుగు మంత్రాలు చదివిం తరవాత విని ఇచ్చిన మాట. ఒక సమూహంముందు చేసిన వాగ్దానం. అందుకేనా సీత అన్ని ఇడుమల పాలైంది? మరి రాముడు? అతడు పురుషుడు. అతడూ మాటఇచ్చాడు. ప్రమాణం చేశాడు. కాని సీతను తనదారికి అడ్డమయిన రాయిగా భావించాడు! సీత చుట్టూ మూడుగీతలు గీశాడు. అవి అతని నమ్మకం, ప్రేమ విశ్వాసానికి చిహ్నాలు. ఆ గీతలుగీశాడు. తన ఉద్యమపు బాటన సాగిపోయాడు। ఆమూడు గీతలమధ్య గృహిణి ఆనందానికి పట్టపగ్గాలుండవు. లోకంలోఉన్న సర్వ శక్తులూ ఆమె రక్షణకే అవతరించాయి. అనుకుంటుంది. పెళ్ళంటే ఆడదానికి పింఛం తగిలించిట్లు అవుతుంది; ఆమెకుండిన అన్ని కళంకాలూ పవిత్రం అయి నట్లుగా భావిస్తుంది.

మూడుగీతలు కట్టేస్తాయ్యంటే నాకు నవ్వొవస్తుంది. సీత బంగారులేడి వెంట పరుగెత్తలేదు. సరే మరెవడైనా గీతలుదూసి ఎచ్చేస్తాడు. దానికో అవవసరపు క్లైమాక్సు! సీతపునీత, పతివ్రత. పవిత్రస్త్రీ, బాగానేఉంది. బంగారులేడి వెంట ఆమె మనసు ఉరకలు వేయడం ఏమిటి? అయితే కథచెప్పేవాళ్లు ఇలాంటి అతుకులు వేయాలి. అలాకాకుంటే సీత రాజప్రాసాదాలను వదిలి అడవులెందుకు పడుతుంది. ఇదొక మిష, ఒక ఆకర్షణ, వినేవాళ్లకు బావుంటుంది. మార్గాయాసం తెలియదు.

నిజమే నాప్రయాణానికి అంతం ఎప్పుడు?

ఇవ్వాళ – రాత్రి నావెంట పడ్డది. వెన్నాడుతున్నది ఎప్పుడు నన్ను విడుస్తుందిది? వదులుతుందిది? ఇది భయంకరం అయిన చీకటి గుహ. ఎక్కడ దీని అంతం. ఇది భయంకర గృహ, దీన్లోంచి బయటపడ్డం కష్టం. పగటి వెలుగు వస్తుందా? నేను–నా ఇంటిని–చూడగలనా?

నాఇంటికి వెళ్లేవాట తప్పిపోయింది, రోజూ ఉదయం ఎనిమిందింటికి నాకాళ్లు స్వతసిద్ధంగా స్కూలువైపు నడిచేవి. అక్కడ చిన్నచిన్న పిల్లలకు నీతిపాఠాలు చెప్పేదాన్ని. నావెంట నడిచేవాళ్లు రోజూ ఒకేరకం వాళ్లు–పాల పథకం వారి లారీ– పళ్లు, కూరగాయలు తీసికెళ్ళేట్రక్కు – స్కూలుకువెళ్ళే పసిపాపల గుంపులు–ఆఫీసుకు వెళ్లేవారు–కాలేజీకి వెళ్లే అందమైన మహారాష్ట్ర పడుచు–ఆమె వెంటపడే ఎర్రనికుర్రాడు ఆ అమ్మాయి అడుగుల్లో అడుగుపెట్టి నడుస్తున్నాడు ఆరునెల్లుగా. వీరంతా నాతోటిబాటసారులు, ఈరోడ్డు నాజీవితంలో ఒకభాగం అయిపోయింది.

కాని ఏరీ వారంత ఇవ్వాళ? ఎవరూ నాకుఅండగా నిలువరేం? ఎవరూ నాకు బాటచూపరేం? నాచుట్టూ నల్లని మేఘాలు కమ్ముకుంటున్నాయి. దుమారం లేస్తున్నిది. ఎటుచేయి చాచిన మూసిన కవాటాలు తగులుతున్నాయి. దేన్ని పట్టు కోవాలన్నా ఎవరో దాన్ని లాగేస్తున్నారు. నాబాటకున్న గుర్తులన్నీ చెరిగి పోయాయి–మలిగిపోయాయి. నావెంట రోజూవచ్చిన సహయాత్రికులేరి? ఏటు పోయినారు? విచిత్రంగా మాయం అయినారు.

ఇల్లుచేరుకుని మహారాష్ట్రఅమ్మాయిఅబ్బాయిల కథచెప్పాను. మాఇద్దరు పిల్లలకు అదిబోరు కొట్టేది. ఇవ్వాళ నాబిడ్డలు నాకోసం ఎంత నిరీక్షిస్తుంటారో! ఇవ్వాల్టివరకు ఎన్నడూ పిల్లలను వదిలి రాత్రిళ్లు వేరేచోట పడుకోలేదు. మున్నానేను తినిపిస్తేగాని తినదు. ఎన్నిపనులు నాకోసం ఎదిరిచూస్తున్నాయో. నేను ఇంటికి చేరుకోనందుకు ఖ్యాలిద్‌కు కలుగుతుంది. అయినా పడు కునేప్పుడు అతనికి నేనులేని కొరతఃనిపిస్తుంది. నేను కాళ్లపత్తకుంటే వారికి నిదరాదు. ఇవ్వాళ ఇల్లునాకుదూరం అయింది–వాటికి నిద్రదూరం అవుతుంది! నాఇల్లు నారాజ్యం. అందులో సీతలా రాజ్యం చేశాను. వంటింట్లో నేను వండిన

కూరఉంది. దండెంమీద మురికి బట్టలున్నాయి, టేబుల్‌మీద మా పెళ్లిఫోటో ఉంది. నేను సాధారణ క్లర్కుభార్యను. అయినా పటంలో ఎంత ఆనందంగా ఉన్నాను. నాకలలు నిజమైనట్టుంది. నేను ఒకరికోసం పుట్టాను. అతడు రెక్కల గుర్రం ఎక్కిన రాజకుమారునిలా వచ్చాను. అతనికోసం నా హృదయం. శరీరం, అందం, ఆనందం, పవిత్రత. ప్రేమ అన్నింటినీ అతనికోసం భద్ర పరచి ఉంచాను. కాని అతడు నాలోని మంచిని మాత్రమే ప్రేమిస్తాడని నాకేం తెలుసు! నన్నుసచ్ఛీలప్రతిమలా భావిస్తాడు. నేనెన్నడూ తప్పుచేయనని అతని నమ్మకం! ఎన్నడూ నేరం చేయనని అతని విశ్వాసం!!

"నీకు ప్రేమతప్ప ఏమీ ఇవ్వలేను" అన్నారు. నేను పూవులా విక సించాను. ఎదలు జలదరించింది. ప్రేమను మించి నాకేమీ అక్కర లేదని అని పించింది. అది నిజం అయింది, వాస్తవం అయింది, అతడు నాపడి తనవిశ్వా సంతో నింపేశాడు. ఇహ నానుండి అన్నీ లాక్కుంటాడు. ఎప్పుడన్నా మాట వస్తే "పెళ్లి తరవాత ఆడది చలించదు. ఎంచేతాంటె పెళ్లితరవాత ఆడదానికి కోరికలేమీ మిగలవు" అంటాడు.

"మంచి థియరీ కనిపెట్టారు" అన్నాన్నేను. నాగుండె మండేది. "పెద్ద కోరిక భర్తను తనవైపు తిప్పుకోవడం ఎందుకు? మన సంగతే ఆలో........"

"కావచ్చు, కానీ ఆడది పెళ్లి ఒప్పందాన్ని నీతిగా భావిస్తుంది. దాన్ని నిలపడం తన కర్తవ్యంగా భావిస్తుంది. సరే మన సంగతే.........."

అది వారు హాస్యానికి అన్నమాటే. కాని నాకు గుండెలో బాకులా గుచ్చుకునేది. అయితే మా ఇద్దరి చుట్టరికం విధినిర్వహణ. అంతే నన్నమాట. అంతకుమించి ఏమీ లేదన్నమాట.

"ఈ విధినిర్వహణ భారంకూడా ఆడదాని మీదే మోపుతారు. మగవాళ్లు వాటిని గురించి పట్టించుకోరు. అన్య స్త్రీల వెంట ఉరుకులు పెడ్తారు. వాళ్ళ వెనుక మైళ్ళకొలది వెళ్లిపోతారు".

"అది వేరేవిషయం" వారు చాల మెల్లగా అన్నారు. పెళ్ళికి ముందు అమ్మాయిల్లో అపూర్వమైన ఆకర్షణ ఉంటుంది. అది అబ్బాయిలను అటు లాగేస్తుంది. మగవాళ్ళ విధులను మరిపిస్తుంది.

"ఏమండీ, అలా అనకండి. అందరి ఆడవాళ్ళ దగ్గర ఒకశక్తి ఉంటుంది. అది మగాళ్ళను పిచ్చివాళ్ళను చేసేది" నేను గట్టిగానే అన్నాను.

"మంచిదండీ. ఒప్పుకుంటాం. మీలో కూడా ఆ మహత్తరం అయినశక్తి ఉండింది. ఇద్దరు పిల్లలు కలిగారు. ఆ శక్తి చచ్చి ఊరుకుంది" హాస్యధోరణి లోనే అన్నారు.

ఇహ అనవసర ప్రసంగానికి జవాబులేమి ఇవ్వను? వారికి నన్ను వెక్కిరించే నెపం దొరికింది.

"నిన్ను చూచి ఎన్ని బాటలు మరచాను" అంటారు నన్ను వెక్కిరించ డానికి.

"ఈ గొప్ప బట్టలు బ్రహ్మాండం అయిన సింగారం చూచి పిచ్చివాడు కానిదెవరు?" అంటాన్నేను అతుకుల చీర పొగచూరిన ముఖం చూపి.

ఖాలిద్ నన్ను మెచ్చుగొట్టకుంటే, అంత నమ్మకం అతనిలో నింపుకో కుంటే నేను ఇవ్వాళ్ళ నా ఇల్లు మరిచే దాన్నికాదు. బాట తప్పేదాన్నికాదు. అది నా ఇల్లు, అక్కడ అన్నీ మరచేదాన్ని. పిల్లల అల్లరి, వారి కోప తాపాలు. అన్నింటిలో మునిగి మాసిన చీరకట్టి స్కూలుకు వెళ్ళాలనే విషయం మరిచే దాన్ని. తెగిన చెప్పు కుట్టించుకోవలసి వచ్చేది

పార్సీ గల్లీ మలుపులో మహారాష్ట్ర అమ్మాయి కోసం ఎర్రని కుర్రాడు పెద్ద పాకెట్టు పట్టుకొని కనిపించి నప్పుడు మాసిన చీర, తెగిన చెప్పు గుర్తుకు వచ్చేవి. ఆ అమ్మాయి వయ్యారం వలికిస్తూ, వెలుగులు చిమ్మిస్తూ! చిరునవ్వుతూ వచ్చేది. అబ్బాయి స్కూటర్ వెనుక కూర్చునేది. వెళ్ళిపోయేది- ఎక్కడికో!

ఈ పిల్లలు నగ్రజానాలు అందుకోవడానికి ఎంత చీకటి గుహల్లోకి వెళ్లిపో తారో?

కాని పెళ్లి చేసుకొని ఆడది ఎంత వెర్రిది అయిపోతుంది! ఖాలిద్ వలె భర్తలందరికీ పెద్ద నమ్మకం—తమ భార్యను ఎవరూ కన్నెత్తి చూడరని. ఇహ ఆమెకు దారి ఏది? పెళ్ళిలోని మంచిదనము కన్నా జీవితాంతం నగ్రజానాలు అందుకుంటుంటే! ఆ మహారాష్ట్రి అమ్మాయి ఎంత ఖరీదైన బట్టలు కడ్తుంది! ఎలాంటి మేకప్ చేస్తుంది!

ఒక్కోసారి నాకూ ఇంటికి వెళ్ళకూడదనిపిస్తుంది. సాయంత్రం స్కూల్లోనే ఉండి పోతాను. పిల్లలతో హోంవర్క్ చేయిస్తాను. స్నేహితురాలి ఇంటికి వెళ్తాను. కాసేపు కాలక్షేపం చేస్తాను. వెళ్ళేప్పుడు పూలు కొంటాను. కొప్పులో పెట్టుకుంటాను. ఆ రోజు బాగా షాపింగ్ చేస్తాను. చాల రాత్రికి ఇంటికి బయలు దేర్తాను. నామనసులో గుబులు చేర్తుంది. వారు నన్ను అడుగుతారు—ఇంతసేపు ఎక్కడికి వెళ్ళావు, అని. పూలు ఎవరు కొనిపెట్టారు? కొత్తచెప్పులు ఎలా వచ్చాయి, ఇలాంటి ప్రశ్నలడుగుతారని గుబులు. గుబులు గుబులుగానే ఇంట్లో అడుగు పెడ్తాను. వారు మాట్లాడరు. పేపరుమీంచీ చూపు తిప్పరు. పిల్లలు అల్లరి వింటారు. చూపు మళ్లించ కుండానే అంటారు. "మున్నా అమ్మతో చెప్పు ముందు మాకు చాయ్ చేసి పంపుమని"

"ఇవ్వాళ చాల ఆలస్యం అయింది" అనేదాన్ని. అప్పుడన్నా నా తలలో పూలు చూస్తారని—వికసించిన ముఖం పరికిస్తారని—ఆతరువాత మండి పడతారని, కాని అదిఏదీ జరగదు. ఎంత నమ్మకం ఇతనికి నామీద! ఈ నమ్మకాన్ని నిలిపి ఉంచడానికి ఎన్ని తంటాలు పడ్డాను! ఎన్ని యత్నాలు చేశాను! ప్రతి నిముషం నావిశ్వాసంవ్యక్త పరచాను. సర్వదా త్యాగాలకు సిద్ధపడ్డాను!

"ఇవ్వాళ టిఫిన్‌లో పచ్చి రొట్టెలు పెట్టేశావు. ఇహ నేనంటే నీకేం లక్ష్యం" అంటారొకనాడు.

తెల్లవారి జాగ్రత్తగా టిఫిన్ తయారు చేసేదాన్ని.

ఒకో్కనాడు నా మీద వారికి జాలి కలుగుతుంది.

"ఇవ్వాళ ఇంత పాడుచీర ఎందుకు కట్టుకున్నావు?" అంటారు.

ఇవ్వాళ నేను పాడుచీర కట్టుకున్నానా! ఏదోనిన్న మంచి చీర కట్టుకున్నట్లు! ఏమిటీ వింత-ఇవ్వాళ వీరి చూపు నామీద పారింది. అలా అనుకునే దాన్ని. అంతే. చిరునవ్వి "ఏమిటి లేడా? నన్ను చూచేవారెవరున్నారు మంచి బట్టలు కట్టుకోవడానికి" అన్నాను. "నేను మీ పెళ్ళాన్ని. మీరు నన్ను కట్టుకున్నారు. ఒక విధి నిర్వహిస్తున్నారు. మీ ముందు మాసిన చీర కట్టుకోక ఎర్రకుర్రావి బహుమతులు తెద్దునా?" అనాలనిపించేది.

మగాళ్ళందరికీ మంచి మంచి బహుమతులు కొనడం తెలుసు. కాని పెళ్ళి అయిందంటే చాలు-వీళ్ళ తెలివి మీద బండ పడుతుంది. ఇహ వారికి రంగులు గుర్తుండవు. మంచి బట్టలు తెలియవు. జార్జెట్ ఎలా ఉంటుందో తెలియదు. భార్య ఏదైనా అడుగుతే ప్రాణం మీదికి వస్తుంది. ఆమె భద్రంగా ఉంది అని ఆవిడ ముఖం చూడ్డం మానేస్తాడు.

ఆ ఎర్రకుర్రాడు - అబ్బ ఎంత చిలిపి, రోడ్డున నడిచే ఆడవాళ్ళందరినీ పరీక్షగా చూస్తాడు. ఎవరికి ఎలాంటి చీర సరిపోతుందా అన్నట్లుంటాయి అతని చూపులు. అహ ఆ మహారాష్ట్రి అమ్మాయి కోసం ఎన్ని దుకాణాలు గాలిస్తాడో! అందుకే ఆ అమ్మాయి అలా మెరిసిపోతుంటుంది. ఆమె వచ్చిందంటే పరిసరాలు వెలుగులు చిమ్ముతాయి.

ఒకనాడు ఖాలిద్‌కు ఆ అమ్మాయి అబ్బాయి కథ వినిపించాను. వారు పార్సీ గల్లి దగ్గర ఎలా కలిసేది, అబ్బాయి ఎంత తపనతో నిరీక్షించేదీ అన్నీ వివరించాను.

అందమైన కన్యలంటే అలాగే పడిచస్తారు. బజారున నడిచే ప్రతి ఆడదాన్ని ఎవడు చూస్తాడు" నిర్లక్ష్యంగా అన్నాడు. నా మనసు మండింది.

"మీరెప్పుడూ ఇంతే. ఆ అమ్మాయి అందంగా ఉందా? దానిదొంద నా కంటే ఛాయ తక్కువ. ఇప్పటికి ఎన్ని పెళ్ళిళ్ళు చేసుకుందో? ఎందరు పిల్లలున్నారో? ఎవరికెరుక? ఇంత వృష్టి అన్నమాటలివి.

"ఊరుకో, ఏమిటిమాటలు, ఆ కుర్రాడు వెధవ అనుకున్నావా పెళ్ళయి, పిల్లలున్న ఆడ వాళ్ళకు డబ్బుదోచి పెట్టడానికి" అంటూ గడ్డం చేసుకో సాగాడు.

ఆ రోజు అతడు అలా అనకుంటే ఈ రోజు నేను ఇల్లు ఎందుకు మరిచే దాన్ని? నాపిల్లలు నాకోసం ఎదిరి చూడరా?

మగాళ్ల మాటలన్నీ ఇలాగే ఉంటాయి, ఈ విషయమే ఆలోచించండి. నలుపు మనసుగల ఎర్ర కుర్రాడు పెద్ద పాకెట్ పట్టుకొని నుంచున్నాడు. పాపం చిరాకు పడుతున్నాడు. ఆ అమ్మాయి రాలేదు.

నాచూపులు ఆ పాకెట్‌ను వెదుకు తున్నాయి-ఎలాంటి చీర ఉండవచ్చు అందులో? ఆ దుర్మార్గుడు ఏమనుకున్నాడో నాచేయి పట్టుకున్నాడు - స్కూటర్ మీద కూర్చోపెట్టుకున్నాడు. నాభర్త ఖాలిద్ అనీ, నాకు ఇద్దరు బిడ్డలున్నారనీ లక్షబెదిరించాను. అతడు విననేలేదు. చెవులు లేనట్లు ఊరుకున్నాడు.

సాయంత్రం బస్టాండు దగ్గర నుంచున్నాను. చేతిలో పాకెట్ ఉంది. అది మణుగుల బరువు ఉన్నట్టనిపిస్తూంది. ఆ బరువుకు నడుం వంగిపోతూంది. వెంటనే ఈ పాకెట్ ఖాలిద్ ముఖాన కొట్టాలనుకున్నాను. "నువ్వు నన్ను ఇద్దరు బిడ్డల తల్లిని చేసి నా చుట్టూ బక కట్టావుగా ...." అందామను కున్నాను.

వచ్చే బస్సుల నంబర్లన్నీ చూచాను. నన్ను ఇంటికి చేర్చే బస్సు నంబరు కనిపించలేదు. ఏమిటి-ఈ బస్సులన్నీ కొత్త కొత్తగా కనిపిస్తాయి. నాతో ఏమీ సంబంధం లేనట్లే అందరినీ ఎక్కించుకొని వెళ్ళిపోతాయి?

ఏది ఆ గొంది? ఏది ఆ వీధి? నేనూ, నాపిల్లలు ఉండిన ఇల్లేది? నా వాళ్లు అనుకున్న వాళ్ళంతా ఏరి? ఎక్కడ దాగారు? ఎటు మాయం అయినారు? ఏడి నాఖాలిద్? ఎక్కడికి వెళ్లాడు? ఎంతదూరం వెళ్ళాడు. నాగెలుపు గుర్తు అతని ముఖాన కొట్టాలను కున్నాను. ఇవ్వాళ ఇహ పేపర్ చదువుతూ కూర్చోలేడు. అతన్ని హెచ్చరిస్తారు. నన్ను కాపాడు కొమ్మంటాను. అతని చూపుల కాపలా తొలగించ వద్దంటాను. నా కాళ్ళకు సంకెళ్లు వేయమంటాను. అలా అయితే పడుతూ, లేస్తూ, బస్సుల్లో ఎక్కుతూ, కార్లు స్కూటర్లనుండి తప్పుకుంటూ, వేలపురుషుని విరుపు చూపులను తిప్పి కొడుతూ, సాయంత్రం ఇల్లుచేరు కుంటాను.

ఇంటికి రాగానే నాకు పెద్దతృప్తి – ఎందుకు? నా ఖాలిద్ నామీద ఎగురుతాడు. తిడ్తాడు. గద్దిస్తాడు, ఆ గద్దింపులు, తిట్లూ, కటువైన మాటలు నాజీవితంలో కలిసి పోతాయి. విషానికి సహితం మనిషి అలవడ్తాడు. అలా ఖాలిద్‌తో చీవాట్లు తినాలని నా తహ తహ.

ఎంతో ప్రయత్నించాను – నా అడుగులు మరో ఇంటికి దారి తీస్తాయి. తలుపు తట్టాలను కుంటాను. లోన అంతా నిద్రించారేమో – ఎవరూ ఎదిరి చూడ్డం లేదేమో!

నా అడుగుల సవ్వడి విన్నాడు. ఒక పిల్లవాడు లేచి కూర్చున్నాడు. క్షణంలో ఒక పురుషకంఠం వినిపించింది – "మున్నా! తలుపు తీయవద్దు. ఆమె మీ అమ్మ కాదు. మీ అమ్మ వంటరిగా–ఇంతరాత్రిదాకా–వీధుల్లో తిరగదు. ఆది విసురు కావచ్చు. వెళ్ళిపోతుంది"

నేను వాయు తరంగంలా వెనక్కు తిరుగుతాను. నా ఇంటికోసం వెదుకుతాను. నా చుట్టూ మూడుగీతలు గీసిన రాముసికి నా చుట్టూ బంగారు లేళ్లు ఉన్నాయని తెలుసు. ఇహ నేను ఒకానొక రావణుడు పన్నిన వలను చూచి ఉబలాట పడ్డాను.

# కిషన్! ఓ కిషన్!

కిషన్! ఓకిషన్!! వింటున్నావా?

నెత్తిన తట్టఉంది, నిచ్చెనమీద నుంచున్నాను. బరువు ఆవుతూంది. మెడ వంగిపోతూంది. రా త్వరగా-అందుకో తట్ట. ఎంతసేపైంది నేను నుంచొని? చూడనైనా చూడవుందా! అబ్బో నువ్వెందుకు అందుకుంటావు? మొనగానివి! మేస్త్రీవి!! మేస్త్రీననేగా-ఆడ కూలిలతో ఆ నవ్వులు-ఆ సరసాలు!!

నిజం ఈ మగాళ్ళది వింతజాతి. నా విషయంకాదు వదిలేయి నేనెంత. ముండను, వేశ్యను. వారంనుంచి ఏతొత్తుకొడుకూ రాలేదు. నా దగ్గరికి. అందుకే కూలికి వచ్చాను. ఏమన్నావు నేను కూలిచేయడానికి రాలేదా, నీవెంట పడడానికి వచ్చానా? సరే అంతే అనుకో. ఏం? నేను నిన్ను దూరంనుంచి కూడా చూడగూడదా? నీదగ్గిర నుంచుంటే బాగనిపించడం లేదా?

కిషన్! ఓకిషన్! నువ్వెందుకు వింటావులె. నువ్వు ఎదుటవుంటె ఎన్ని సార్లు నీ నామం జపిస్తాను! ఏమంటావు నువ్వులేనప్పుడా? అవును. అప్పుడు నిన్నెందుకు గుర్తు చేసుకోవాలి! నువ్వేమన్నా గుర్తుచేసుకుంటావా నన్ను? నీవు పట్టి అబద్ధాలకోరువు పిరికి పందవు. నిన్ను ఎందుకు జ్ఞాపకం చేసుకోవాలినేను? అవును, నీది పిరికిగుండె. ఆ విషయం నాకు నీ చిన్నతనం నుంచీ తెలుసు. నిన్ను వీపుమీద కూర్చోపెట్టుకోవాలనుకునేదాన్ని. నీకుగుర్రాన్ని కావాలనుకునే దాన్ని. అప్పుడూ భయపడేవాడివి. నిన్నుపట్టుకుని ఈదటంనేర్చాను. అప్పుడూ నన్ను వదిలించుకుని పారిపోయేవాడివి. ఎప్పుడూ నీవు నాచేతికిచిక్కలేదు. నాపాడు చేతులనుంచి తప్పుకోవాలనుకునేవాడివేమో!

అవును. నీకులం గొప్పది. మేం హరిజనులం. భగవంతుడే నిన్ను ఉన్నతుడ్ని చేశాడు. నన్ను అడుక్కునెట్టాడు పాతాళంలోకి తోసేశాడు అందుకే నా చేతులు నిన్ను ఎన్నడూ అంటుకోవు.

ఇహ ఇప్పుడంటావా? నీకో పెళ్లాం ఉంది. ఆమెకు జడుస్తావు. భయపడాల్సిందే-ఎందుకు పడవు-ఎంతైనా పెళ్లాంకదా! నువ్వు గౌరవం కలవాడివి. మర్యాదస్తుడవు. నీకు హోదాఉంది. భార్యఉంది. బిడ్డలున్నారు. ఇల్లుంది సంసారం ఉంది. నువ్వుజంకాల్సిందే. వెరవవలసిందే నువ్వేంనాలాంటివాడివా? నాదగ్గరేముంది డబ్బుందా? గౌరవం ఉందా? మర్యాదఉందా? మొగుడున్నాడా? పిల్లలున్నారా?

కిషన్!ఓకిషన్!! కాస్తపైనున్న కూలీతో చెప్పు-నాతట్టఅందుకొమ్మని. ఇంజనీరు చూస్తున్నాడు-నువ్వూనేను మాట్లాడుకోవడం. చూడు ఎలా గుడ్లప్పగించి చూస్తున్నాడో! మనం వలపుమాటలు మాట్లాడుకుంటున్నాం అనుకుంటున్నట్లున్నాడు. ఇవి వలపు పలుకులా? వలపుమాటలు ఇలాగే ఉంటాయా? అయినా నేను ముండను వేశ్యను. నన్నెందుకు ప్రేమిస్తావు-కిషన్ నువ్వు!

అబద్ధం-అంతఅబద్ధం-నన్నెవ్వరూ ప్రేమించరు. అమ్మప్రేమించదు నాన్న ప్రేమించడు అన్నదమ్ములు ప్రేమించరు. అక్కచెల్లెళ్లు ప్రేమించరు. ప్రేమించరు ఎందుకు ప్రేమిస్తారు? ద్వేషిస్తారు. అంతాద్వేషిస్తారు నన్ను. ఎందుకు ద్వేషించరు? బంగారంలాంటి బతుకు పాడుచేసుకున్నాను. గుంతలో పడిపోయాను. నరకానికి వెళ్ళిపోయాను. కిషన్! ఇప్పుడు ఆలోచిస్తాను-నాకూ ఒక ఇల్లుంటే .... చిన్నచిన్న పాపలుంటే ....కోపిష్టి భర్తఉంటే ....? నాభర్తనన్ను రాత్రింబగళ్ళు తలబద్దలు కొట్టేవాడు. అప్పుడు.... నేను.... నడివీధిలో తలెత్తుకుని తిరగగలిగేదాన్ని. ఎలా? నీభార్యవలె. అప్పుడు నాభర్తను మరోఆడది-కన్నెత్తిచూస్తే ....ఓదార్చేదాన్నా. దాని కళ్ళుపీకేసేదాన్ని. నాభర్త అణువుఅణువునా అధికారం స్థిరపరచుకునేదాన్ని. అతనిఆత్మలో,హృదయంలో, మనసులో నిండిపోయేదాన్ని, అక్కడే కూర్చునేదాన్ని. కదిలేదాన్ని కాదు. నేను అలా చేయలేదు. కాదు నోచుకోలేదు. ఒకపూవు. తనవారితో బంధం తెంచుకుంది. గాలికి కొట్టుకుపోయే ఒక తిరుగుబోతుతో బంధం కల్పించుకుంది. ఆ గాలిగాని వెంటపరిగెత్తి, పరిగెత్తి అలసిపోయాను-వగరుస్తున్నాను.

కిషన్! నీవే నామనసు గుర్తించేవాడివి అనిపిస్తుంది. ఒకసారి నాకోసం మిఠాయి తెచ్చావు. ఒకసారి సారాయిసీస తెచ్చావు. ఇంకా ఏం తెచ్చావో గుర్తుందా. మరిచి పోయావా? నిజంగా మరిచిపోయావా? మరిచే ఉంటావ్ు. కాని కిషన్ నేనెలా మరుస్తాను? మరువను మరువలేను. ఏం? జ్ఞాపకం పెట్టుకుంటే నీమెళ్ళు పోయింది! ఏమిటి ఏడుస్తున్నావా? ఇహ పనిచేస్తాను. చకచకా పని చేస్తాను. నన్నేం చేయమంటావు చెప్పు. కిందఉన్న కూలీలు ఆట్లాఉన్నారు. మెల్లగా అందిస్తున్నారు తట్టలు. నేను నిచ్చెనమీద ఉన్నాను మధ్యన ఉన్నాను. కిందాలేను. పైనాలేను. నాకెప్పుడూ ఇలాంటి చోటే దొరుకుతుంది. ఎక్కడికి పోయినా అంతే! ఈ అడకూలీలు నంగనాచులు. ఇంటికిపోయి మొగునితో కాళ్లు పత్తించుకోవాలి. అప్పుడు గాని వీళ్ళ అలసట దూరం కాదు. నాకు ఎన్నడూ అలసటలేదు–అలిపిరిలేదు. రాత్రింబవళ్లు వీళ్ళకంటే నాలుగింతలు కష్టంచేస్తాను ఇలాంటి పిడుగులు వానలా కురుస్తాయి నామీద!!!

కిషన్! ఓకిషన్! నిజంగా చెప్పు–గుర్తులేదనీకు – నాకోసం ఏం తెచ్చావో? ఒక్కసారి చెప్పు. నీనోటితోచెప్పు. మళ్ళీ అడుగను. గుర్తులేదంటావు. సరే. ఆఎండిన పూలదండ నీకు తిరిగి ఇచ్చేస్తాను. నీభార్యకు ఇచ్చేయి. ఒకనాడు నీవు దండతెచ్చావు. నామెళ్ళోవేశావు. 'నిన్నే పెళ్ళిచేసుకుంటా. నన్నావు. ఆదండ మెళ్ళోవేసుకుంటే నా గుండెలోని మొగ్గలన్నీ విచ్చుకుంటాయి. నిజంగా పెళ్ళికూతురును ఆయినాననుకుంటాను. సందడి–సంబరం–వాద్యగాళ్ళు వస్తారు. నన్ను తీసుకుపోతారు అనుకుంటాను కాని ఆ రాత్రి నా కొసం మరో గ్రాహకుడు వస్తాడు. పూలదండ మెళ్ళోంచి తీస్తాను. దాచి పెడతాను. ఎన్నడూ నా గ్రాహకుల ముందు ఆ తండ వేసుకోలేదు. ఏమంటావు? నీవు నా గ్రాహకునివా? మత్తులో వచ్చావా మైకంలో ఏమేమో అన్నావా? కాదు–కిషన్–కాదు. నేనెన్నడూ నిన్ను గ్రాహకుడు అనుకోలేదు.

కిషన్! ఓ కిషన్!! జ్ఞాపకం వచ్చిందా? మనం ఇరుగు పొరుగు వాళ్ళం. చిన్నతనం నుంచీ ఎరిగిన వాళ్ళం. మన ఇళ్ళమధ్య గోడలు ఉండేవి. ఒకటి

ఇటుకది రాతిది. రెండవది మన కులాలది, ఇంకొకటి అంతస్తుల అంతరాలది. మరొకటి నా దురదృష్టపుది. అందుకే నా కేకలు నీకు వినరాలేదు.

కిషన్! ఓ కిషన్! అవును నేను ఏక్కువే మాట్లాడుతున్నాను. అయినా నీవు వినవు కదా? ఏమంటావు- ఈ అడకూలీలకు నేనంటేమంటా? నా రూపం అంటేమంటా? నా దర్పం అంటేమంటా? మండుకోనీ! ఉడుక్కోనీ! నేనంటే ఉడుక్కునేవాళ్ళూ ఉండాలిగా! వాళ్లు పాపం పిచ్చివాళ్ళు. వాళ్ళ మొగుళ్లను మురిపిస్తా ననుకుంటారు. వాళ్ళ ఆనందాన్ని దోచుకుంటాననుకుంటారు. అయినా వాళ్ళకు గర్వమే. ఏం చేస్తుందీ ముండ అనుకుంటారు. నవ్వుకుంటారు- సరిగ్గా నీ భార్యలా.

నీ భార్య ఒకసారి నాతో అన్నది. నాతో అన్నదా? కాదు. నేనొకసారి వీధిలో నుంచున్నాను. నీభార్య వెళ్తుంది-చెల్లెలుతో నన్ను చూచింది. బిగుసుకుపోయింది. అక్కడే నిలిచింది. "నాభర్త సందుగొందులు తిరుగుతాడు' డబ్బుంటే అన్నీ కొనుక్కుంటాడు. అన్నికోర్కెలూ తీర్చుకుంటాడు. అయినా దస్సి పోయినపుడు ఇంటికే వస్తాడు- ఏ మంటావు-ఎంతయినా భర్తకదా!" అన్నది చెల్లెలితో. ఆమె అలా అన్నదీ అంటే నీకు నేనుకాక ఇంకా భోగం ముండలు ఉన్నట్లేగా! వాళ్ళ దగ్గరికి నీవు పోతున్నట్లేగా!

కిషన్! ఓ కిషన్! ఏందుకలా అదురుకుంటావు-'పెళ్లాం, అనగానే. మొనగానివలె-పెళ్ళాన్ని కొడ్తావా! అవును ఆమె నీ వస్తువు. ఆమెమీద నీకు అన్ని అధికారాలూ ఉన్నాయి. అవును. పాపం, ఆమె నీ భార్య! ముండను కొట్టు నీతో ఉంటుందేమోచూడు!

అవును నేను అడ్డదిడ్డంగా మాట్లాడుతున్నాను. నా బుర్ర అలాంటిది. అదే అడ్డదిడ్డం అయింది. కాకుంటే ఇక్కడనుంచొని ఎందుకు మొత్తుకుంటాను?

కిషన్! ఓకిషన్! ఓఓ కిషన్! నీకు చెప్పడుకాదు. నేనిలాగే మొత్తుకుంటుంటాను. నిన్ను పిలుస్తుంటే నాకేదో ఆనందగ కలుగుతుంది .... ఆనందం

.... ఆనందం ఆరే! ఎందుకా ఇంజనీరు అలా నవ్వుతున్నాడు- నా మాటలు వినేనా? బావుంది మాట్లాడుకోకుండా పని ఎలా సాగుతుంది? ఇంత బరువు ఎలా మోయగలం? నువ్వేం భయపడకు ఆఇంజనీరునుకూడా తృప్తిపరచగలను విన్నావా? నాకు అందరినీ సంతృప్తులను చేయడం చాతనవును. ఈ మగాళ్లు న్నారు చూడావా కుక్కలు. ఎంగిలి ఎముకకోసం ఉవ్విళ్ళూర్తారు! అవును నేనూ కుక్క-నే-ఆడకుక్కను. కాకుంటే ప్రతి మగాడి కాళ్ళమీదపడి చోటు అడుగుదునా?

కిషన్! నువ్వన్నది నిజం-నాకు ప్రేమించడం రాదు. ప్రేమ పచ్చి దారం లాంటిది, దాంతో మనసును ఎవడు కట్టిపెట్టగలడు? కాస్త దెబ్బతగుల్తే దారం తెగుతుంది. మనసు చెల్లాచెదరు అవుతుంది. దానికంటే దుఃఖపు దారం గట్టిది. ఎంత లెంచినా తెగదు.

అలాగా! నిజంగా నేను చెప్పేది వినాలనిఉందా? వినగలవా!

నేనూ ప్రేమించాను! నేను ఒక మగాణ్ణి వలచాను. ఆతను నవ్వితే నవ్వాను ఏడుస్తే ఏడ్చాను. వాడు చిన్నప్పట్నుంచీ నా కనుపాపల్లో కాపురం పెట్టాడు. ఇంకా చిన్నదాన్నే. ఆటలాడే వయసు. అప్పుడే ఆపద నెత్తిన వేసుకున్నాను. కన్నయ్యలా అతడు నన్ను వదల్లేదు. కలలోనూ, ఇలలోనూ నావెంట ఉండేవాడు. వెంటాడేవాడు. విడిచేవాడుకాదు. ఏమన్నావు? నువ్వెప్పుడు చూల్లేదా అతణ్ణి? కిషన్! నువ్వేం చూశావు? ఏమీ చూల్లే. నా దగ్గరికి వస్తేనా వాడు- నువ్వు చూడ్డానికి! నేను దూరంగా చూచేదాన్ని. అలా చూచి జీవించాను మౌనంగా చూసేదాన్ని.

కిషన్! ఓకిషన్! ఇప్పుడైనా వింటున్నావా? లేక ఈ కూలిదాన్ని కళ్ళప్పగించి చూస్తున్నావా?

అప్పుడు నా పెళ్ళిని గురించిన ప్రస్తావన వచ్చింది. ఒక్కతండ్రి సంపాదన- నలుగురం తినేవాళ్లం. ఈ దరిద్రం నా తండ్రిని ఆకలమారిని

చేసింది. నన్ను పెళ్లాడేవాని నుంచి పాతికరూ పాయాలకు ఆశపడ్డాడు మానాన్న ఆ ఆశతో నన్ను పదారేండ్లు ఉంచేశాడు. ఏమంటావు? నా విషయంలో నీకు అన్నీ తెలుసునసా? ఏంతెలుసునీకు నువ్వనేదేమంటే నేను తిరుగుబోతును అయినానని-అందుకే నన్నెవడూ పెళ్లాడలేదని. అంతేగా నీకు తెలిసింది. కిషన్ నేను తిరుగుబోతును ఎందుకు అయినాను?

ఒక్క పురుషునికోసం లోకంలోని మగాళ్లందరినీ పరులనుకున్నాను, తరవాత అందరినీ నా మొగుళ్లుగా గుర్తించాను. ఎందుకలా చేశాను. నేను ఒకని భార్యను కావాలనుకున్నాను. అతడు నాకు అతిదూరంలో ఉన్నాడు. అందడు. అతనితో తిరగాల్సినదాన్ని. అతని కొంగుకు నాకొంగు ముడిపడాల్సింది.

కిషన్! ఓకిషన్! నీకీమాటలు నచ్చవు. ఎందుకు? నా కథలన్నీ తెలుసునుకుంటావు!

అందుకే ఇదంతా నీకు వినిపిస్తున్నాను. ఇంత దురాన ఉండి అతని కోసం నేను ఎంత తపిస్తున్నానో నీకేంతెలుసు? మరి ఆతడెలాంటివాడు, లక్ష పాట్లు బడ్డాను. కనీసం నావైపు కన్నెత్తి చూడడు. నా కేకలు చెవిని పెట్టడు. అతని పెళ్లయింది. నేను వేశ్యను అయినాను. ఎందుకలా అయినావు? అంటావు నువ్వు. ఏంచేయను? నా అగ్గిలో నేను ఎంతకాలం కాలను? అతని విరహబాధ ఎంతకాలం సహించను? వేశ్యనై అతని ముందుకు వెళ్ళాను! ఏంచేయను? వేశ్యగానే అతనిముందుకు పోగలను అతడు నావెల చేతితో పెట్టాడు. అది అమూల్య సమయం. అది నీకు తెలియదు. ఆతడు నావెంట ఉన్నాడు ఆరాత్రిని లోకంలోని ధనరాసులన్నీ వెలకట్టలేదు. కిషన్! నీకు ఎన్నటికీ అర్ధంకాదు. అతడు నాగ్రాహకుడు. అయినాడు. జన్మజన్మలకు అతని పత్నినైనాను నేను. అతని కోసంపుట్టాను, అతనికోసం చస్తాను. అలాంటి ఆడదాన్ని నేను. అతడు నాపూరి గుడిసెలో అడుగుపెట్టాడు. ఆతని అడుగులకాంతి సర్వదా విరజిమ్ముతుంటుంది. అతదేమనుకొని ఉంటాడు? ఇది కొత్తగా వృత్తి సాగించింది. అందుకే

ఇన్ని మర్యాదలు చేస్తున్నదని. కాని అతనికేం తెలుసు- ఆ రాత్రంతా భగవంతుణ్ణి నేను ఎన్ని వరాలుకోరానో- ఉదయం కావద్దని. అతడు నాకు కొత్తవాడై అతని భార్యవద్దకు వెళ్ళేరోజు రారాదు- ఇకనేను అతనికోసం నిరీక్షిస్తూ అందరు పురుషులకోసం కవాటాలు తెరుస్తాను.

కిషన్! ఇవ్వాళమాత్రం నామాట విన్నావా?

వెళ్లిపోయావు.

# అపరిచితులు

మతిమరుపు ఎక్కువ. ఇలా చూసిన మనుషుల్ని అలా మరిచి పోతుంది.

ఏమిటీ మతిమరుపు? అన్నలు అక్కల ముఖాలు కూడా మరిచిపోయింది తాను. నమ్మోకు ఇదోవిచారం. ఒకబాధ. వాళ్ళే ఎక్కడయినా కలిశారను-తాను గుర్తుపట్టగలదా? మీ పెద్దన్న చాయ నలుపా? ఎరుపా? అంటే ఏమిటి చెప్పడం. అందుకే ఆమె పుట్టింటికి వెళ్ళడం మానేసింది. అది రజాకు చాల సంతోషం? తన విరహం భరించలేదని తన భార్య, పుట్టింటి వారు ముక్కుమీద వేలువేసుకుంటారు - ఏమిటమ్మా ఇంత ప్రేమలు - విచిత్రం - నమ్మో పుట్టింటినే మరిచి పోయింది అనుకుంటారు. తనతల్లిని కూడా గుర్తించని దశ వస్తుందని నమ్మోకు భయం.

అందును గురించి ఆలోచిస్తూ, ఆలోచిస్తూ ఆమె పాలిపోయింది. జబ్బున పడిన దానిలా కనిపిస్తూంది.

ఎంత వింతగా ఉంటుందో ఆలోచించండి-ఎప్పుడూ మీ వెంట ఉండే వాళ్ళనే మీరు గుర్తించలేరు!

మనిషిని ముఖాన్ని బట్టేగా గుర్తించడం. గుండె సంగతి గుర్తించిన వాడులేడు. ఆ విషయం ఎక్స్‌రేకూ తెలియదు. కార్డియోగ్రాఫి వింత యంత్రం అది గుండెలు కొలుస్తుందట. నమ్మోచాల సార్లు అనుకుంది-తన గుండెను కొలిపించాలని. తనకు ఏదో పెద్దజబ్బు రావాలి. భర్తతో చెప్పికార్డియోగ్రాఫి తీయించుకోవాలి. ఎందుకింతా అమ్మా అంటే కంటికి ఎవరూ గుర్తుండడం లేదు. గుండె కూడా కన్నులా అయిందేమోనని ఆమె భయం! ఆమె కార్డిమోగ్రాఫిను గురించి విన్నది. అది సినిమా తెరలా ఉంటుందని, దానిమీద గుండెలో దాగిన గీతలుగా వస్తాయని! ఎవరికి తెలుసు తన గుండెలో ఎంత రహస్యం ఉందో? అది కాస్తా భర్తకు కనిపిస్తే! ! !

అల్లాకే తెలియాలి ఈ జబ్బు ఎప్పుడు? ఎలా మొదలయిందో?

పెళ్ళికి ముందు ఆమె అందరినీ చప్పున గుర్తించ గలిగేది. స్కూల్లో చదివేప్పుడు తనతోటివాళ్ళు కనిపిస్తే చప్పున అటు పరుగెత్తేది. వాళ్ళను కలుసుకునేది. ముచ్చట్లు పెట్టేది పొరుగింటి పిన్ని ఇంటికి వస్తే ఆమె పేరుచెప్పి సలాం చేసేది. ఆమెకు అయిదుగురు అన్నలు. అందరూ ఒకలాగే ఉంటారు. వాళ్ళ భార్యలు కూడా అప్పుడప్పుడు పొరపడేవారు. నిమ్మో ఎప్పుడూ పొరపడలేదు. అందరూ ఆమెకు బాగాగుర్తు. పెద్దక్క సంతానం అంతా ఒక్కలాగే ఉంటారు. అక్కకే కష్టం వాళ్ళను గుర్తించడం. నిమ్మో పేరుపేరు వరసన గుర్తుంచుకునేది.

ఏమైందో తెలీదు. అమాంతంగా జరిగి పోయింది. మెదడులో మనుషలను గుర్తుపట్టే భాగం చెడిపోయింది. రోగం పేరవది. విచిత్రం అయింది. ఎవరితో చెప్పుకున్నా అపహాస్యం చేస్తారు. హేళన చేస్తారు.

ఒక్కోసారి రాజా డ్రాయింగ్ రూంలోంచి కేక పెడ్తాడు "నమ్మో! ఇలారా! చూడు. ఎవరు వచ్చారో"? అని.

నమ్మో మీద పిడుగులు కురిసినట్లవుతుంది.

"అతడు" మళ్లీ రాలేదు కదా! నేడు అతనినోట మళ్ళీ ఏమాట వచ్చునో? పెళ్లికిముందు రజాను వదల్లేదు కట్నీ. పెండ్లయింది. ఇప్పుడూ వదలదా? కట్నీవచ్చిందేమో!

నడిచేప్పుడు కాళ్లు బరువవుతాయి, నెమ్మదిగా. జాగ్రత్తగా గదిలో అడుగు పెడుతుంది. ఆమెముందు ఒక కొత్తఆడది కనిపిస్తుంది. ఆమె వడకిపోతుంది. ఎవరామె? ఎలా గుర్తు తెచ్చుకోవడం? భయంతో గడగడలాడుతుంది. చమటలు పడ్తాయి. ముఖంలో రక్తం చిప్పిలు తున్నట్లు కనిపిస్తుంది.

"హాయ్! గుండె అంత బలహీనం అవుతే ఎలా? సంతోషం కూడా భరించ లేకుంటే కష్టమే, వచ్చిన ఆమె నవుతూ అంటుంది. నమ్మో భయంతో

వణికి పోతుంది. ఎవరీమే? తాహర్ చెల్లెలా? ముమాని బేగం కాదుకదా! కాదు తన చిన్న ఆడ పడుచు. ఈమెను ఏమనాలి? సల్మా అనాలా? ఏమో ఏదీ తెలిసేది కాదు. విలవిలలాడుతుంది. వచ్చినామెను కౌగలించు కొంటుంది. బోరున ఏడ్చేస్తుంది.

"ఏడవకమ్మా ఏడవకు. మూడునెలల పిల్లవాడికే ఇంత ఏడుస్తే ఎట్లా? జబ్బున పడ్డావు. చూస్తుండు అల్లా నీకు ఎందరు పిల్లల నిస్తాడో-లెక్క పెట్టలేవు" వచ్చినామె ఓదార్పు.

అందరూ నవ్వుతారు. నమ్మో భయపడుతుంది. తనపిల్లలను కూడా మరచిపోతానేమోనని భయం. వారి ముఖాలుకూడా మరచిపోతానా? యాఅల్లా! ఇన్నిరూపాలు ఇలా ఒకేరకంగా ఎందుకుచేశావు? ఒక్కొక్కరిని వేరువేరుగా గుర్తుంచుకోవాలంటే అంతా కలగాపులగం అవుతూంది.

పెద్దక్క చిన్నక్క ఒకలాగేఉంటారు. పెద్దతేడా కవిపించదు. పెద్దక్క ఛాయ కొంత మెరుగు. అయితే చిన్నక్క-కంటె లావు. పెద్దక్క బరువు మణుగులుంటుంది. అయినా నమ్మో ఇద్దరిని వేరువేరుగా గుర్తుంచుకోలేక పోతున్నది. ఆమెకు గుర్తున్నదల్లా పెద్దక్క గుండెగాయాలు మాన్పగలదు. చిన్నక్క ఎన్నటికి మానవి గాయాలు చేయగలదు. అక్కలను వారి మాటలను బట్టి గుర్తించగలదు. చేతలనుబట్టి గుర్తించగలదు. రూపాన్నిబట్టికాదు. ఒక్కొసారి చిన్నక్క ముక్కు పెద్దక్క ముఖానికి వచ్చేస్తుంది. పెద్దక్క కళ్లు చిన్నక్కకు వచ్చేస్తాయి. అప్పుడు భయపడిపోతుంది కళ్లు పెద్దక్కలా ఉన్నాయి. ఈమెను చిన్నక్క అనాలా? పెద్దక్క అనాలా?

అందరూ ఇన్నిరూపాలను వేరువేరుగా ఎలా గుర్తుంచుకుంటారో ఆ అల్లాకే తెలియాలి. ఇంతచిన్న మెదడులో అంతస్థలం ఎక్కడుంది? లైబ్రరీలో వలె ముఖాలన్నింటినీ భద్రపరచే ఏర్పాటు ఎలా సాధ్యమబ్బా!

తన మెదడు ఇంత చిన్నదని - ఇంత బలహీనం అయిందని రజాకు తెలిస్తే? అత్తవారి ఇల్లుసాంతం అంటుకుంటుంది. ఆడపడచులు మొదలే

తానంటే బొమలు ముడిపెడ్తారు. ఇహ అప్పుడు ఆటలాడిస్తారు. అసలు తన భర్త రజా! అతడెంత బాధపడ్డాడు. ఎంత విచారిస్తాడు? అందరూ ఏమంటారు. దేశంలో ఆడవాళ్లు కరువుపోయారా? టీవిగా కట్టుకున్నాడు. రజా! రజా అణువు అణువునా తాను నిండి పోయింది. రజాకు తానంటే ప్రాణం. భార్యను చూచి నవుతల్లా చిరునవ్వే మగవాళ్ళెంతమంది?

మగవాళ్లందరికీ అలవాటేనేమో! వాళ్ళ అలవాట్ల సామ్యమే వాళ్లను ఒకజాతిగా చేశాయేమో!

ఇదో ఇంక్కడే గడబిడంతా మొదలయ్యేది.

నమ్మో పెళ్లి నిశ్చయం అయింది. పెళ్లిసందడి విన్పించడంలేదు నమ్మోకు. ఆమెకు "అతడు" కనిపిస్తున్నాడు. మగవాడు అంటే "అతడు" కాక వేరే ఉంటాడని ఊహించలేక పోయింది. ఆలోచనలతో అలసిపోయింది ఓడిపోయింది. చుక్కాని వదిలేసింది. నావను నదీవాగులో వదిలేసింది. మునిగినా దరిచేరినా లక్ష్యపెట్టలేదు.

అతడు కాడు ఇహ ఎవరైతేనేమి?

నిమ్మోవరుడు "అతడు" కాడు. అయినా అలాగే నవ్వుతాడు. అట్లాగే మాట్లాడ్తాడు. అదే విధంగా పొగుడుతాడు, నమ్మోను చూస్తాడు చిరునవ్వు నవ్వుతాడు.

మగవాళ్ల అలవాట్లలో, ప్రేమలో తేడా లేదని నిమ్మో తేల్చుకుంది. అలాంటప్పుడు 'అతని' కోసం ఎందుకు ఏడ్చింది?

ఈ మాట తన స్నేహితురాలు అఫ్తాబ్‌తో అన్నది. అఫ్తాబ్ గంభీరంగా అన్నది. అన్నీ మరచిపోయానని చెప్పరాదు. మంచిదే అయింది, కాకుంటే ఆడదాని బతుకు దుర్భరం. జీవితాంతం అవే ఆలోచనలు. జ్ఞాపకాలు బిగపట్టుకొని బతకాల్సి వస్తుంది.

అబద్ధం అలా జరగడానికి వీల్లేదు. నేను అతణ్ణి ఎలా మరువను? మరువగలను?

ఆప్తాబ్‌కు తానంటె మంట అనుకుంది నమ్మో. అవును అదికూడా ఆతడు అంటేనే పడిచచ్చేది.

'అతడు' ఇప్పటికీ తనకు రోజూ గుర్తుకు వస్తాడు, అయినా అతణ్ణి గురించిన ఊహ రాగానే రజా రూపం ఆ ఊహల్లో నిండిపోతుంది.

ఒకనాడు ఇంట్లో ఒక్కతేఉంది. రాబోయే పాపకు బట్టలు కుడ్తూంది. తలుపుతట్టిన చప్పుడు అయింది. ఈ వేళప్పుడు ఎవరబ్బా వచ్చారు అనుకుంది. భారమైన కడుపుతో లేచింది. వెళ్ళింది తలుపు తీసింది.

"మీరు.... మీరు.... ఎవరుమీరు?"

"అతడు మాట్లాడలేదు. చూచాడు తలవంచుకున్నాడు. వెళ్ళిపోయాడు.

అప్పుడు నిమ్మో అనుకుంది. ఇతడు అతడే. అచ్చం ఆతడిలాగే ఉన్నాడు. ఏమో! అతడు కాకనూపోవచ్చు. కాకుంటే తిరిగిపోయాడెందుకు నేనిలా తయారైనాను. అతడు తిరిగిపోక ఏంచేస్తాడు? అవును నేనతణ్ణి గుర్తించలేకపోయాను ఎందుకు? హయ్యో! నా కళ్ళకు ఏమైంది. ఏమిటది నేను అన్ని రూపాలూ మరిచిచిపోతానా?

అదిగో ఆరోజునుంచి నిమ్మో మనోఫలకం నుంచి రూపాలు – ముఖాలు మాయం కాసాగేయి. మాటలు గుర్తుంటున్నాయి, గుండెకు తగిలిన గాయాలు మాత్రం మానడంలేదు. తరవాత అన్నిముఖాలూ ఒకేతీరుగా కనిపిస్తున్నాయి.

ముఖాలు చూచి మిత్రులను శత్రువులను ఎలా గుర్తిస్తారు? తన చుట్టు పట్లవాళ్లపేర్లు బట్టీ పెడ్తుంది. జ్ఞాపకం ఉంచుకోటానికి ప్రయత్నిస్తుంది. అయినా అనుమానమే ఆ పేరు అవ్యక్తిదేనా? కాదా?

నిమ్మోకు ఇతరుల జ్ఞాపకంమీద ఈర్ష్య కలుగుతుంది. చూడగానే మనిషిని ఎలాగ్రహిస్తారు? తాను వెర్రిదానిలా అటూఇటూ చూస్తూఉండిపోతుంది ఒకసారి ఆడపడమనే గుర్తించలేదు. ఆమెకు కోపం వచ్చింది. 'వదిన మనసులో ఒకే రూపం వెలిసింది. వేరేవాళ్ల ఎందుకు కనిపిస్తారు?' అన్నది.

ఆడపడుచుకు తన అన్న తననుంచి దూరం అవుతున్నాడని మంట. ఆవిడకేంతెలుసు ప్రతి ఆడదాని గుండెనిండ భర్త మాత్రమే నిండి ఉంటాడని మనసులో ఉన్న మనిషికోసం వెదికేవారుంటారా? అయినా ఈ మాట ఆడ పడచుకు ఎలాచెప్పడం? ఆవిడకు కావలసింది వర్ధించడం 'అబ్బో। మహారాణి అయింది నమ్మోవేగం. మేమెందుకు గుర్తుంటాం ఇంత వెలగల బట్టలు నగల్లోమునిగి మా పేదవాళ్లను గుర్తుంచుకుంటుందా?

'నిర్దయగాని అలా అనకమ్మా' కన్నీరు తుడచుకుంటూ అంటుంది.

నేను ఎవరినీ మరవడంలేదు. నా బుర్ర పనిచేయడంలేదు. నాకు ఏదో గాలిసోకింది. ఎవరో మంత్రించినట్లున్నారు. ఏదోగారడి జరిగింది. "ఆతడు" చేయించిఉండవచ్చు. అసలు అతడే తరచుగా కలల్లో కనిపిస్తున్నాడు. నలు మూలలా అతడే కనిపిస్తున్నాడు. సముద్ర తరంగాల్లా ఒకసారి పొంగుతాడు లొంగుతాడు. ఇహ ఇప్పుడు రజా ఫోటోలోకూడ దాగి చిరునవ్వుతున్నాడు. అలాగే ఉండిపోతే మెల్లమెల్లగా పిలుస్తున్నట్లుకూడా వినిపిస్తుంది.

'నమ్మో....నమ్మో....' ఉలికిపడి చూస్తుంది. ఎదురుగా రాజాచిరునవ్వు తుంటాడు.

బెదిరిపోయి కేకవెడ్తు ఇతడు "అతడా?" రజాయా?"

"అతడు రజా అవతారం ఎత్తాడేమో!

ఒకనాడు వదినను వెంటతీసుకుని షాజీ దగ్గరికి వెళ్ళింది. అయిదు రూపాయల ఫీసువోయినా చిత్తశాంతి లభిస్తుంది అనుకుంది.

షాజీ అగ్గిలో ఆజ్యం పోశాడు.

ఆయిదు గురువారాలు దక్షిణలాగాడు.

ఎప్పుడో పెద్దలకు అపచారం చేశావు. శిక్ష అనుభవిస్తున్నావు. మన-శ్శాంతి మాయం అయింది. నీవాళ్ల అనుకున్నవాళ్లకూడా నీవాళ్లకారు. నీకర్మకు ఏడుపు రాసిపెట్టి ఉంది' అన్నాడు.

కావచ్చు తాను పెద్దలకు అపచారం చేసి ఉండవచ్చు. దేవప్రభువు రెక్కల గుర్రం ఎక్కి భయంకర రూపంతో. రాజలాంఛనాలతో తనఇంటికి వచ్చిఉంటాడు. తాను అతణ్ణి దొంగపకీరు అనుకొని ఉంటుంది. కసిరి కొట్టి ఉంటుంది.

'మీరు....మిరు....మీరెవరు' అని ఉంటుంది.

దేవతలను రిక్తహస్తాలతో పంపరాదంటారు. అలా పంపినవారికి శిక్ష అవుతుందట. రిక్తహస్తాలతోనే ఉండిపోవాల్సి వస్తుందట. అందుకే నేను "నావాడు" అనుకునేవాడు కాకుండా పోయాడు!

షాజీ నాలుగు తాయెత్తులు ఇచ్చాడు. రజా పడుకునే మంచం కోళ్ళకింద పెట్టెయ్యమన్నాడు. ఉదయమే మంత్రం రజా ముఖంమీద ఊదమన్నాడు. ఆమెభర్తముఖం ముందు ముఖం పెట్టుంది. భర్త మైమరుస్తాడు. నవ్వేస్తాడు. ఆమె నవ్వేస్తుంది. ఇంకేముంది_మంత్రంపోయింది_తంత్రంపోయింది. అంతే కాదు మంచం నాలుగుకోళ్ళ కింది తాయెత్తులు కాపాడ్డమూ కష్టంగానేఉంది. ఎందాతంటే నిమ్మో అత్తగారు పవిమనిషితో ఇల్లు ఊడ్పించేప్పుడు మంచాలు జరపకుండా ఊడవనివ్వదు. ఏమూల కాస్తకపవుఉన్నా కొంప మునిగినట్లు చేస్తుంది. బయటి పారిశుద్ధ్యాన్ని గురించి ఇంతశ్రద్ధ చూపేవారు తమలోపల చూచుకుంటే ఎంత మురికి ఉందో అర్థం అయ్యేది.

నిమ్మోను మరోభయం ఆవహించింది_తాను రజాను గుర్తించలేదేమో నని! అదే జరుగుతే తనగతేంకాను? రజా తనకోసం సర్వం అర్పించడానికి సిద్ధంగా ఉన్నాడు. తానుసంతోషిస్తే అతడు మురిసిపోతాడు. తాను చిన్నబుచ్చు

కొంచెం విలవిలలాడ్తాడు. ఇహ తాను అమాంతంగా రజాను గుర్తించలేక పోతేనో!!

రజారూపాన్ని గుండెల్లో భద్రపరచు కోవటానికి అనేక ప్రయత్నాలు సాగించింది. రజా ఆఫీసుకు బయల్దేరతాడు. స్కూటరు బయటికి తీస్తాడు. నిమ్మో అక్కడికి వెళ్తుంది. రజాను చూస్తూ ఉండిపోతుంది. రజాకు అర్థంకాదు. అడుగుతాడు. ఏం చెపుతుంది. రజా చిరునవ్వుతాడు. అయిదురూపాయల కాగితం అందిస్తాడు."సల్మాతో సినిమాకు ప్రోగ్రాం అన్నమాట.వెళ్లు, అల్లా నీ నొసట ఆనందం రాసిపెట్టాడు" అంటాడు.

నిమ్మో నిరామయంగా నోటును అందుకుంటుంది. గుండెదడదడలాడు తుంది, రజా అయిదు రూపాయలిచ్చాడు. కనీసం చిరునవ్వు లేకపోయానే అను కుంటుంది. ఏం నవ్వుతుంది- గుండెలో దొంగ దోబోచులాడుతున్నాడు. రజా వెళ్లి పోతుంటాడు, అతని కళ్ళనిండా చూస్తూ ఉండిపోతుంది -మరచిపోకుండా.

కుడిచెంపకు గాయపుమచ్చ. మెడమీద పుట్టుమచ్చ.

సాయంకాలం పనులన్నీ పెడుతుంది, వస్తుంది. కిటికిలోనుంచుంటుంది- రజారాకను ఎదిరిచూస్తూ. రజా వేసుకున్న బట్టలేమి' గుర్తుతెచ్చుకోవడానికి ప్రయత్నిస్తుంది. రజావేసుకుపోయింది నల్లప్యాంటా? తెల్లప్యాంటా? బట్టలే మనిషికి గుర్తులు. బట్టలనుబట్టి మనిషిని చప్పున గుర్తించవచ్చు।

రజా నల్లప్యాంటుతో ఆఫీసుకు వెళ్లాడనుకో. నల్లప్యాంటుతోనే తిరిగి వస్తాడుగా! అబ్బ। ఎంత సులభమార్గం దొరికింది - రజాను గుర్తించడానికి।

నిమ్మో గబగబా గదిలోకి వెళ్తుంది. రజా అల్మారి తెరుస్తుంది. హేంగర్లు చూస్తుంది, నల్లప్యాంటు ఎక్కడా కనిపించదు. మళ్ళీవచ్చేస్తుంది. కిటికీలో నుంచుంటూంది. ఆమెకు చాలాసంతోషంగా ఉంది-ఇవ్వాళ రజాను వాకి ట్లోనే గుర్తిస్తుంది. నల్లప్యాంటు....తెల్లషర్టు ..కుడిచెంపన గాయపుమచ్చ.... మెడమీద ... అల్లా! అసలు ఇవన్నీ మరిచిపోనుకదా! మరోపదినిముషాలు -

నిమ్మోలో ఆరాటం పెరుగుతున్నది. గాబరగా ఇల్లంతా తిరుగుతూంది–దుర్వార్త వినడానికి సిద్దపడ్డట్లుంది ఆమెస్థితి.

వాకిట్లో స్కూటరు హారన్ వినిపిస్తుంది. ఉరుకుతుంది. వాకిట్లోనే రజాను కలుసుకుంటుంది. ఇద్దరూ కలిసి లోనికి వస్తారు. అప్పుడు రాజాకు ఎంత సంతోషమో! ఎన్నడో ఒకనాడు అత్త చెప్పిన పనిలో ఉండిపోతుంది, రాలేదు. ఆరోజు రజా "మూడ్" చెడిపోతుంది.

ఇవ్వాళా అలాగే పరిగెత్తింది దర్వాజాలోకి. తెరకిందినుంచి తెల్లపేంటు పరిచయంలేని కాళ్ళు కనిపించాయి. నెమ్మదిగా వెనక్కు వచ్చేసింది.

"ఏమిటది? నన్నుచూచి ముఖం మాడ్చుకున్నావు"

రజా ధ్వని విన్నది. తిరిగి చూచింది. అవును ...కుడిచెంపన....

'ఓహ్! మీరా! ఎవరో అనుకున్నా' అలా అనుకుంటూనే ఉంది.

'అయితే తమతో కొత్తగా పరిచయం చేసుకోవలసి వచ్చేట్లుంది' రజా కొంటెగా నవ్వాడు. ఆమె ముడుచుకుపోయింది.

'యాఅల్లా ఇప్పుడేమిటి చెయ్యటం? నేను రజాను గుర్తించలేదని అతనకి తెలిసిపోతే, ఏమో బాబూ' అనుకుంది.

రాజా బట్టలు మార్చుకున్నాడు, బయటికి వచ్చాడు. నిమ్మోను అదో రకంగా చూచాడు.

'ఏమిటి ఇవ్వాళ ఇలా ఉన్నావు? ముఖం జిడ్డుకారుతూంది. తలదువ్వుకోడానికికూడా సమయం దొరకలేదా? బట్టలుమార్చలేదు. ఇవ్వాళరేపు చుడీదార్ పైజామా. షర్టు ఫేషను అయిందని వేయిసార్లు చెప్పాను. ఎప్పుడు చూచినా అదే వెధవచీర నువ్వు' గునుస్తూ బాత్‌రూంకు వెళ్ళిపోయాడు.

మర్నాడు నిమ్మో చాలాజాగ్రత్తగా బట్టలువేసుకుంది. సింగారించుకుంది. చుడీదార్ పైజామా బిగుతు షర్ట్ నాకేం బావుంటాయి? నవయువతులకు బాగుంటాయి, రజాకు నన్ను ఎన్నెన్ని వేషాల్లో చూడాలని ఉందో?

ఇంకా నిమ్మో అద్దం దగ్గరేఉంది. రజా మాట వినిపించింది. ఉలిక్కి-పడ్డది.

'అరె రఫ్వీ వచ్చేసిందా-మా అదృష్టం పండించ....'

రజా మాటయి పూర్తికాలేదు.

నిమ్మో తిరిగి చూచింది.

రజా బెదిరి పోయాడు-ఎవరోలాగి లెంపకాయ కొట్టినట్టయింది.

'అరె. తోబ! నేను ఇవ్వాళనిన్ను మరచాను....నీవు....రఫ్వీలా కనిపించావు'

రజా నవ్వాడు.

నిమ్మో ఏడ్చేసింది.

అవును రజా నన్ను గుర్తించడు. అతడూ బలవంతపు బ్రహ్మచార్యం చేస్తున్నాడు. అంతాదగా....మోసం... షాజీ చెప్పింది కరెక్ట్. నీవు ఎవరిని నీ వాడనుకుంటావో వాడు నీవాడు కాడు. ఇహ జీవితాంతం రజా అంటూనే ఉంటాడు.

'అరె రఫ్వీ వచ్చిందా-మా అదృష్టం పండించ....

'ఇవ్వాళ నిన్ను మరచాను-నిమ్మో!

# వినోదం

"అమ్మా! రొట్టెముక్కెయ్యమ్మా! తల్లీ రొట్టెముక్కెయ్యమ్మా!"

మండే ఎండలో ముంగిలిలో నుంచొని ఉంది. శరీరం మీద ఎక్కడా తులమంత మాంసం లేదు. కంకాళానికి చర్మం తొడిగినట్లుంది.

అమ్మా, పాపం ఈ పిల్లకు ఓ రొట్టెముక్క పడెయ్యి. నిన్నసాయంత్రం నుంచి చూస్తున్నాను. వీధంతా అడుక్కుంటూ తిరుగుతూంది. ఎవరూ పెట్టినట్లు లేదు. ఆకలితో అలమటిస్తూంది." ఆదిల్ తల్లితో అన్నాడు.

'కదులు ఇక్కణ్ణుంచి ఇంకానుంచున్నావేం. అబ్బ ఎంత ధైర్యం ముండకు-అడుక్కోడానికి వాకిట్లోకే వచ్చేసింది-దీని అబ్బసొమ్ము దాచిపెట్టినట్లు' అమ్మ కసిరికొట్టింది.

'కిలో రెండున్నర గోధుమలు తెచ్చి, పిండి విసిరించి, రొట్టెలుచేసి పక్కీర్లకు పంచిపెడ్దాం' అమ్మమ్మ పడిపోయిన జపమాల వెదుకుతూ వ్యాఖ్యానించింది.

'అమ్మా! రొట్టెముక్కెయ్యమ్మా! తల్లీ రొట్టెముక్కెయ్యమ్మా!'

'పెళ్తావా పక్కీరుముండా! చెప్పు అందుకొమ్మంటావా?' అమ్మమ్మ జపం మానేసి భగ్గుమంది.

ఆదిల్ అమ్మాయి డొక్కను చూచాడు వెన్నుకు అంటుకుని ఉంది. అతనికి జాలి కలిగిందీ. 'అమ్మా! దాన్ని పనికి పెట్టుకో. ఒక రొట్టెముక్క వెయ్యి పాపం ఆకలికి అలమటిస్తూంది' అన్నాడు.

"ఆ, అలా అన్నావు బావుంది. విను ఓ పిల్లా! పనిచేస్తావా!" అమ్మ అడిగింది.

"పనిచెయ్యాలా? అంటే?" ఆ అమ్మాయికి ఏమీ అర్థం కాలేదు. కాసేపు ఊరుకుంది, మళ్ళీ గునిసింది 'రొట్టెముక్కెయ్యమ్మా!' అని.

"అవునే! రొట్టె పడేస్తాం-పనిచెయ్యాలి" అమ్మకు చెడిపోయినబియ్యం గుర్తుకు వచ్చాయి. నిన్న వాటీని పారపోద్దాం అనుకుంది. మళ్ళీ అనుకుంది. ఎవరైనా పక్కీరువస్తే వాడికిఇవ్వడం మంచింది-ఇంత పుణ్యమైనా సంపాదించు కోవచ్చు అనుకుంది.

'అబ్బ ప్రాణం లేచివచ్చింది - పనిపిల్ల దొరికింది. పరీక్షలు దగ్గరికి వచ్చాయి అయినా రొట్టెలు చేయడం, ఇల్లు ఊడవడం తోనే సరిపోతూంది. పాపం 'పప్పా' మైలుదూరం బసికి వెళ్ళాలి. బట్టలు ఉతికీ, ఉతికినా సడుం విరిగి పోతున్నది.' ఉజ్జాకు విశ్రాంతి లభించినట్లనిపించింది.

'ఓ పిల్లా! నీకు రొట్టెలు చేయడం వచ్చా? పనిపిల్లఉంటే పనిపొంతం చెయ్యాలి. పుక్కెవికి జీతం ఎవడిస్తాడు?'

అమ్మాయి మాట్లాడలేదు. అమ్మను ఒకసారి చూచింది. ఆ చూపులోనే ఉంది నీ ప్రశ్నలకు జవాబు చెప్పడం వృథా అనే అర్థం. అయినా రొట్టె చేయ డం ఎమిటి? అనుకుంది అమ్మాయి. రొట్టెచేయడానికి పొయ్యికావాలి. ఎక్కడో గాని ఒక పొయ్యిమండదు-అన్ని ఇండ్లల్లో పొయ్యిలు ఉంటాయా? అనుకుంటె మనసులోనే.

"అచ్చా! నీకు మాంసం వేపటం వచ్చా!" ఇది అమ్మమ్మ ప్రశ్న. ఈ ఇంటర్వ్యూ బోర్డుకు తననే చైర్మన్‌గా భావించు కుంటూంది అమ్మమ్మ.

'అరె అమ్మమ్మా! దానిముందు మాంసం మాట అనకు. అది హిందువు అయిఉండవచ్చు"

"ఏమిః హిందువా?" అమ్మ ఉలికి పడింది ముందు ఒక గుడ్డ చుట్టుకొని వచ్చింది. బట్టలంటే గుర్తించవచ్చు హిందువో. ముస్లిమో! మంచిదైంది

అదిల్ చెప్పాడు - కాకుంటే అంతా అపవిత్రం చేసేది ముండ. ఏమే నువ్వు హిందువా?"

"హిందూ అంటే?" అమ్మాయి గొంతులోంచి బలహీనంగా వచ్చింది ప్రశ్న.

'పీడుంపతెగ' అమ్మ పెద్దగా నవ్వేసింది ఇంకా ఎలా చెప్పాలి దీనికి? నామెదడు తినేసేట్లుంది' అన్నది?

అమ్మాయి వచ్చిందనే మాట విన్నాడు అన్న, చదువుతున్న డిటెక్టివ్ నవల దిండుకు కొట్టి బయటికి వచ్చాడు. 'ఇదా ఎముకలు తప్ప ఏమీలేవు. పైగా చిన్నపిల్ల ఎందుకు పనికొస్తుంది' అని "నీ అక్క ఉంటే పిల్చుకురా పనికివస్తుంది' అన్నాడు. అమ్మనుచూచి అమ్మా! ఇది చాలా చిన్నది. పనికిరాదు' అన్నాడు.

'అక్క ఏమిటి? అమ్మాయికి ఏమీఅర్థంకాలేదు. ఎండ మండిపోతూంది. వళ్లు తూలుతుంది. వాకిట్లో కూలబడ్డది.

'శ్రీమతిగారు ఇక్కడే మకాం పెట్టడానికి వచ్చినట్లున్నారు' ఉజ్రా నవ్వింది.

'రొట్టెముక్కియ్యండి' తన విషయంలో జరుగుతున్న వ్యాఖ్యానా లన్నింటికి ఆమె జవాబు అది.

"చూడండి నంగనాచి పనిమాటఅంటే పలకదు-ఉలకదు. రొట్టెముక్క పడేస్తే పారిపోవాలనుకుంటూంది ముండ"

"ఏయ్‌పిల్లా! ఇదివరకు ఎక్కడైనా పనిచేశావా?" అమ్మమ్మ పోలీసు వాళ్ళ ప్రశ్నింపు ప్రారంభించింది. అమ్మ చెవిలో "అమ్మాయీ దొంగముండ కాదుకదా! రాత్రిళ్లు తలుపు తెరిచి దొంగల్ని జొరపెట్టదుగదా!" అనుమానం వెలిబుచ్చింది.

అమ్మాయి దొంగలా ఇంట్లోకి తొంగిచూస్తునేఉంది. ఇంట్లో పొయ్యిలు మండుతున్నాయి. వంటల వాసన వాకిటిదాకా వస్తూంది'

'నువ్వేమన్నాఅను నాకైతే అచ్చందొంగలాగే కనిపిస్తూంది. చూడుదాని దొంగచూపులు – ఇంటినంతా దొంగిలించేట్టున్నాయి' ఉగ్రా ఎం. ఏ సైకాలజీ చదువుతూంది. ఆమెకు మనిషిచూపుల భాష అర్థం అవుతుంది.

'నీ పేరేమి?

"రో....రో... రో....ట్టి... ట్టి....ట్టి..."

"చెవిటిదానిలా ఉందిముండ– నసుగుతుందేమి

మంచిదే, ఆ ముండ నసీబన్ నా కథలు ఊరంతా చాటేసింది వెధవ ముండ' అనుకున్నాడు అన్న.

"ఇదిగో! నీకు ఏడురూపాయలు జీతంఇస్తా. రాత్రింబగళ్లు పనిచేయాలి– విన్నావా?" అమ్మ అన్నది.

'అమ్మాయి! నీకేమన్నా పిచ్చిపట్టిందా! వేలెడులేదు–ముండ–ఏడురూపాయాలిస్తానంటావు! అయిదు రూపాయాలిస్తాం. నీఇష్టంవస్తేఉండు. కాకుంటే దారి పట్టు'

అమ్మాయి తలఊపింది.

అది తెలియగానే వదినగారు గదివదిలి బయటికి వచ్చేశారు. 'అయితేలే. పనిమొదలుపెట్టు ముందు పళ్లాలుకడుగు. శుభ్రంగా తుడిచిలోనపెట్టు. పాల సిసాలు వేడినీళ్ళతో కడగాలి. "ముందు తనపని చెప్పడం మంచిది. రోజా అలాగే చేస్తుంది. తనపని తప్పుతుంది.అనుకుంది.

'అమ్మా వాకిట్లో మొక్కలకు నీళ్లు పోయమనండి. నాకు పరీక్ష లదగ్గర పడుతున్నాయి–నేను పోయలేనమ్మా;' ఉగ్రా పుస్తకం చదువుతూనే అన్నది.

్మీ పనులన్నీ అయింతర్వాత ఇటుపంపండి కాస్త కాళ్ల వత్తుతుంది. కలకలతో కాళ్లు కదలరాకుండా ఉన్నాయి. కాస్తనిద్రన్నా వస్తుంది' అమ్మమ్మ అన్నది,

'ఇది వండుతే నేనైతే తినను. గలీజుగా ఉంది' అన్నగారు మరొకసారి ఆ ఎముకలపోగును కళ్ళతో వెతికాడు ఎక్కడన్నా మాంసం ఉందా అని. 'దాని అక్కను తెమ్మనండి. ఇదేం పనికొస్తుంది' అన్నాడు.

'నీ ఇల్లెక్కడ? నివాసం ఎక్కడ.'

'చల్, లే, లేచి వాకిలి ఊడ్వు'

'పొగరుబోతున్నట్లుంది ముండ' ఉజ్రా సైకాలజీ పుస్తకం చూస్తూనే అంది.

అమ్మా; దానికో రొట్టెముక్క వెయ్యి' ఆదిల్ బజారుకువెళ్తు చెప్పి పోయాడు.

అమ్మమ్మ జపం పూర్తిచేసింది, జపమాల అక్కడ పెట్టింది. పాందాన్ అందుకొని 'ఈవీధిలో నీకు తెలిసినవారు ఉంటే తీసుకురా. మాఇంట్లో ఏదన్నా పోతే ఏవరివి అనాలి అన్నది. అమ్మమ్మ జామీను అడిగింది.

'ఇదిగో చూడు గాజుగ్లాసులేమన్నా పగలగొట్టావా నీ జీతంనుంచికోస్తా అమ్మ ఒకవార్నింగ్ ఇచ్చింది.

'చూశారా! అమ్మమాటవిన్నా విననట్లే కూలబడ్డది' ఉజ్రా చదువుతూ, చదువుతూనే అటు చూచింది.

'దీనికి పనిచేయాలని ఎక్కడుంది? ఏదో ఇంత కడుపునిండితే పారిపోవాలని-లుచ్ఛాముండ'

'లే, ఊడ్చు'

'ముందు కప్పులు కడుగు'

'అడక్కుండా ఏదైనా నోట్లో వేసుకునేవు ఖబర్దార్!'

'చూడు, పనిఅంటే ప్రాణం లేచిపోతూంది. తెలిసిందా? ఇహ మీరంతా వినోదం చూస్తుండండి.' ఉగ్రా సైకాలజీ పుస్తకం నేలకొట్టి లోపలికి వెళ్లింది. ఒకరొట్టె తెచ్చింది. అమ్మాయి తలమీద ఆడించసాగింది.

"ఇదిగో రొట్టె . లే . తిను"

అమ్మాయి కదల్లేదు.

ఉగ్రా వాలినతల పైకెత్తాలని పట్టుకుంది. చకితురాలయింది. ఆమె సిగ్గుతో కుంగిపోయింది – వినోదం చూపించలేనందుకు.

రొట్టెకోసం పడిగాపులుకాసిన అమ్మాయి ఆకలినుంచి, అవసరాలనుంచి విముక్తురాలయిపోయింది.

# మనస్సాక్షారం

చిన్న తాళంచెవి! టేబుల్ సొరుగులో చిన్న డబ్బాలోవేసి దాచాను. అది ఏతాళావిదో తెలియదు. చాలసార్లు ప్రయత్నించాను. గుర్తుకు రాలేదు. ఎక్కడ్ణించి వచ్చింది అది నా మందుల డబ్బాలోకి ఏమో! తెలియదు. ఆయినా అనుకున్నాను తాళంచెవి భద్రపరచడం మంచిది. ఎవరికితెలుసు ఏదోఒకతాళం దాంతో రావచ్చు. అందుకే ఉండనిచ్చాను డబ్బాలో.

నా హృదయపేటికలో ఎన్నో రహస్యాలు, ఆశలు, ఆశయాలు కోరికలు ఉన్నాయి. ఆవన్నీ ఏదో తాళంచెవికోసం నిరీక్షిస్తున్నాయి. నాలో ఏముంది? ఈ విషయం చాల కాలంగా ఆలోచిస్తున్నాను.

నేను చూస్తున్నాను చాలమందిని వారు నవ్వుతున్నారు, ఏడుస్తున్నారు. వాస్తవంగా ఆ నవ్వు, ఆ ఏడుపు వారిహృదయ కుహరాల్లోంచి ఉబికివస్తూందా? అంతకన్నీరు వారిగుండెల్లో నిలచిఉందా?

నేను వారిగుండెల్లోకి ఏల తొంగిచూడలేను? వారి శరీరాలు చీల్చివారి ఆత్మను ఎందుకు పరికించలేను? అది నాఅశక్తత. దానిమీద నాకు కోపం వస్తుంది. చిరాకు కలుగుతుంది. ఒక్కొక్కసారి అన్ని త్యజించాలనిపిస్తుంది. వైద్యవిద్య, అద్వేషుప్రేమ మాతృవాత్సల్యం అన్నింటిని వదిలేయాలనిపిస్తుంది అసలు జీవితరహస్యం ఏమిటి? జీవితానికి అర్థం ఏమిటి? కొన్నివిషయాలు నమ్మశక్యంకావు. వాస్తవానికి అతిదూరంగా ఉంటాయి. అసలు వాస్తవంఏమిటి సత్యంఏమిటి? ఇది నా అన్వేషణ.

అద్వేష్ప్రేమలో అన్నీ మరుస్తాను అతని వాగ్దానాలు అతని కోరికలు అతని వలపులు అన్నీ మరిపిస్తాయి. ఒక్కొక్కసారి ఆశ్చర్యం అనిపిస్తుంది. సర్వదా అద్వేషు ఆలోచనల్లో మునిగి ఉంటాను. జీవితపు ప్రత్యంగంలోప్రత్యణు

వులో అతణ్ణి చూస్తాము. ఇది వాస్తవంగా సులభసాధ్యంకాదు. కాని చాల సులభంగా నాకు సంబంధించిన తాళాలన్నింటినీ అతనికి అప్పగించాను. అద్వేష అమాయకుడంటుంది అమ్మ. జీవితం ఎల్లప్పుడూ ఇంత అందంగానూ, ఇంత రమ్యంగానూ ఉండదు అనే విషయంకూడ ఎరుగదు కాని నేను ఈ విషయాలు ఎన్నడూ ఆలోచించలేదు. నాకూ, అద్వేషకూ ఉన్న వలపును తూకం చేయడానికి ప్రయత్నించలేదు. అయినా అతని విషయంలో అనేక అనుమానాలు! ఇదంతా దగా- మోసం. లోకంనిండా కుట్ర, కపటం నిండిఉన్నాయి. దీనిలో నాకు ఎలాంటి సంబంధంలేదు. మానవ హృదయంలోకి తొంగిచూడడం చాతకానంతవరకు అద్వేషతో సహితం నాకు ఎలాంటి సంబంధంలేదు. అతను తనప్రేమ విషయంలో వేలకు వేలు చెపుతాడు. నాకు నమ్మకం కలిగించాలని యత్నిస్తాడు. నాకు వేల అనుమానాలు కలుగుతాయి. నేను అనుమానాలల్లో మునిగిపోతాను- ఉక్కిరి బిక్కిరి అవుతాను. అద్వేష హృదయ పేటికలో నేను ఒక్కర్తెనే ఉన్నానని ఏమిటి నమ్మకం? అతని హృదయ కవాటాలు మూసి ఉన్నాయి. అవి ఏదోఒక తాళంచెవికొరకు నిరీక్షిస్తూ ఉండవచ్చు. ఆ తాళంచెవి ఏటేబిల్ సొరగులోనో నిద్రిస్తూఉండవచ్చు, కావచ్చు.

మెడికల్ కాలేజీ డాక్టర్ సూరి ఒకసారి డిసెక్షన్ హాలులో అన్నారు "స్త్రీలు, పురుషులు ఉభయులు మానవులే. అయినా వారి రక్తంలోనూ ప్రకృతిలోనూ వ్యత్యాసాలు ఉన్నాయి. ఇక్కణ్ణించే మానవశరీరాన్ని గురించి రీసెర్చ్ విడిపోతుంది."

మేమంతా హాల్లో కూర్చున్నాం. మాలో అబ్బాయిలూ ఉన్నారు. అమ్మాయిలూ ఉన్నాం. అందరమూ డాక్టర్ సూరిచెప్పే నోట్సురాసుకొంటున్నాం

'పురుషుని శరీరం కోసి చూస్తే.......'

నేను వణకిపోయాను.

నేను అద్వేషను డిసెక్షనుకు గురిచేయనా? అతని గుండె చీల్చిచూడనా! ఆరాత్రి అనేకసార్లు అద్వేష శరీరాన్ని శస్త్రించేశాను. డాక్టర్ సూరి అనేక

గుర్తులు చూపాడు. వాటిన్నింటినీ పొడవైన గోళ్లగల నావేళ్లతో వెదికి చూశాను అయినా నాకేమీ దొరకలేదు!

'మనసు కనులు తెరుస్తే చిత్తశాంతి లభిస్తుంది.'

మా అమ్మమ్మ అంటుండగా విన్నాను.

మనసు కనులు!

నేనూ నా మనసుకనులు తెరుస్తాను. అలా చేస్తే అందరి మనసులూ చూడవచ్చేమొ ఏమొ! ఆ ద్వేషహృదయం చూడగలనేమొ! చూస్తాను అందులో నేనున్నానో లేనో తవును. మగవాని వలపును నమ్మిందెవరు. వట్టిమాటల బూటకం కావచ్చు. అతని గుండెలో మరో గులాబిలాంటి కన్నెపిల్లఉండవచ్చు

మానవ హృదయ రహస్యాలు తెలుసుకోందె నేను డాక్టర్ను ఎలా అవుతాను? ఇతరుల బాధలు ఎలా తొలగించగలను? మానవుని దుఃఖం మందులతో దూరమయ్యేదా?

హృదయపేటికను తెరిచే తాళంచెవి ఎక్కడా దొరకలేదు. వెదక లేదని కాదు. అన్ని కోణాలను గాలించాను. సాలీని గూళ్లు నిండిన చీకటి గదులను వెదికాను. ఒకరాత్రి నిద్రలో ఉన్నాను. ఉలికి పడ్డాను వెలుగు వాగులు కనిపించాయి. అవినన్ను ముంచెత్తాయి. రాత్రి బంగారు కిరణాలతో వెలిగిపోతూంది. ప్రతి వస్తువూనాముందు బృహత్తరంగా నిలిచింది. ప్రతీదీ శుభ్రంగాఉంది. శుచిగాఉంది. దిగంబరంగా, అందంగా కనిపించింది. తేను పడక మీంచి లేచాను. నలువైపులచూచాను. ప్రతి వస్తువులోని లోతులు కనిపిస్తున్నాయి, వాటిసత్యం గోచరిస్తూంది. దేనికీ బట్టల కప్పులు లేవు. అన్ని బహిరంగంగా కనిపిస్తున్నాయి, నా కమల జ్యోతులు వేలరెట్లు వెలిగాయి. నాకు మహత్తరం అయిన శక్తి వచ్చింది. ఇప్పుడు ప్రతీదాన్ని పరీక్షించ గలుగుతున్నాను. రహస్యాలు తెలుసుకో గలుగుతున్నాను. ఈ గడియారపు రహస్యమేమి? దీని నిరంతరపు కదలికకు కారణంఏమి?

నాపక్క పడకమీద అమ్మ పడుకుంది. మా అమ్మ పద్దెనిమిదేళ్లకే విధవ అయింది. ఆ తరువాత ఆమె పురుషుని ముఖం చూడలేదు. నన్ను పెంచి పెద్దదాన్ని చేయటంతోనే సరిపోయింది. రోజూ తెల్లవారుజామున లేస్తుంది అమ్మ పూజ చేస్తుంది. తరవాత ఒక ఎర్ర గులాబి అందుకుంటుంది. నాన్న పటంముందు ఉంచుతుంది. ఆలోచిస్తే ఒక్కోసారి అనిపిస్తుంది అమ్మకు ఇది ఆచారం అయిపోలేదుకదా అని. వాస్తవంగా అమ్మ నాన్న ప్రతిమను గుండెకు హత్తుకొని పడుకుంటుందా? పద్దెనిమిది సంవత్సరాల ప్రాయంలో అమ్మను వదిలి వెళ్ళిపోయాడు నాన్న. అమ్మ దుప్పటి కప్పుకొని పడుకుంది. దుప్పటితీసి ఆమే నిజ స్వరూపం చూతామనుకున్నాను. గుడ్డి వానికి కళ్లు వచ్చినట్లుంది నాస్థితి. లోకంలోని కటువైన సత్యాలను చూడ్డానికి నా కళ్లలో జ్యోతులు వెలుగుతున్నాయి. నా చేతిలో గుండెలను విప్పగల తాళంచెవి ఉంది!

ఉహుం. అమ్మ కప్పుకున్న దుప్పటి పట్టుకొని వదిలేశాను.

ప్రపథమంగా నేను చూడాల్సింది అద్వేష్ను. అతణ్ణి నా గుండెలో బంధించాను. తాళం వేశాను. తాళంచెవి ఒక పెట్టెలో ఉంచాను. ఆవును ఎందుకింకా। నా జీవితం అతనికి అర్పిస్తానని మాటఇచ్చాను.

సిద్ధుకు అలాంటిమాట ఇవ్వలేదు. సిద్ధు భయంకరంగా ఉంటాడు. అవకాశం వస్తే నమిలి మింగడానికి సిద్ధంగా ఉండే అడవి జంతువులా ఉంటాడు. అర్థంకాదు-కొందరిని చూడగానే భయపడిపోతాం. ఈభయం ఎందుకువస్తుంది? ఎక్కడనుంచి వస్తుందీ ఏమీ తెలియదు. అయోమయం. ఒకసారి క్లాసులో సిద్ధు పెన్ను తీసుకోవాల్సివచ్చింది. మర్నాడు పెన్ను అడగడానికి వచ్చాడు. బ్లవుజ్‌లో వెదికాను. కనిపించలేదు, "ఇంట్లో మరిచి వచ్చినట్లున్నాను. నిన్న నేను ఏ బ్లవుజ్ వేసుకున్నానో గుర్తుందా? అని అడిగాను.

సిద్ధు నన్ను మింగేసేటట్లు చూశాడు. "లేదు. జ్ఞాపకం పెట్టుకుంటే జ్ఞాపకం కూడా కోల్పోతాను" అన్నాడు.

అప్పుడు ఒక ఆలోచన వచ్చింది-డబ్బాలో నేను దాచిన తాళంచెవి సిద్ధుది కాదుకదా అని. పాపం సిద్ధుకు మరిచే అలవాటు ఉన్నట్లుంది! అందుకే రోజూ ఒక కొత్త అమ్మాయితో తిరుగుతాడు. పాతవాళ్ళను గుర్తించడమే గగనం. ఒకసారి 'ఖైసర్' తో తిరుగుతాడు - మరోసారి రూపతో. 'సిద్ధు గడ్డంచూస్తే అమ్మో నాకు భయం' అంటుంది. అంజుమ్.

ఒకనాడు కాలేజీలో అడుగుపెట్టగానే ఆద్వేష్‌ను చుట్టేశాను ఆదిగో సిద్ధు వస్తున్నాడు, అమ్మో! అతడంటే నాకుభయం' అన్నాను.

"నేను నీవెంట ఉన్నాను, నా చేయి పట్టుకొని ఆద్వేష్ న్నాడు' ఎవరిఅ దారి వారిది, అతనితో మనకేం పని' అని.

అన్నాడు అద్వేష్, అదినిజమే కాని నేను వాస్తవాన్ని చూడాలి. ఇవ్వాళ ఆద్వేష్‌ను చూస్తాను-నా మనోనేత్రంతో. అప్పుడు తెలుస్తుంది-అసలు నేనున్నానా అతని గుండెలో? ఇహ కళ్లుమూసుకుంటాను. ఉదయం మొదలు ఆద్వేనుష్ చూస్తాను అనుకున్నాను.

అయితే అంతా గమ్మత్తు అయింది. వెలుగు వ్యాపిస్తే అంతా మాయం అయింది. నామనోనేత్రవు అసామాన్యమైన వెలుగులేదు. వెలుగు వల్లువ అంత రించింది. మళ్ళీనేను చిన్నచిన్న కళ్లపిల్లనే. గాగుల్సు పెట్టుకొని కాలేజీకి వెళ్లాను. వెళ్తుంటే నా వెనుక జనంగుంపులు-సైకిళ్ల మీద-కార్లలో-కాలినడకన-అందరూ గుండెలో వేనవేల రహస్యాలు బంధించి, ముఖాలమీద రంగురు పులుముకొని సాగుతున్నారు.

ఆస్పత్రి ఆవరణలో అడుగుపెట్టాను. గుమ్మానికి అడ్డంగా నుంచు న్నాడు సిద్ధు ఏదో మేగజైన్ చూస్తున్నాడు. ముఖంమీద ఊయాలనిపించింది. చప్పున లైబ్రరీవైపు తిరిగాను - మరో గుమ్మంలోంచి లోన ప్రవేశించడానికి.

ఒక్కోసారి మనకు అనుమానం కలుగుతుంది - ఎవరో వెంటాడు తున్నట్లు - ఎవరో మననే గుచ్చిగుచ్చి చూస్తున్నట్లు, వెనక్కు తిరిగిచూస్తే

ఎవరో ఒకరు ఎదురు పడ్తారు. ఇప్పుడూ అలాగే జరిగింది. నేను వెనక్కి తిరిగి చూస్తాను. ఆద్వేష్ వస్తున్నట్లు కనిపిస్తాడు ఎప్పుడు చూచినా ఆద్వేష్ కనిపిస్తాడు, ఎక్కడ చూచినా ఆద్వేష్ కనిపిస్తాడు. ఆద్వేష్, ఆద్వేష్ నా నాళాల్లో రక్తంగా ప్రవహిస్తున్నట్లని పిస్తుంది. అవును చూడాలి. నా మనోనేత్రం తెరిచి ఆద్వేష్‌ను పరిశీలించాలి. ఏంలేదు- నా మనశ్శాంతికి. నా మనోనేత్రం వికసించిననాడు ఆద్వేష్ దగ్గరికి ఉరుకుతాను, ఒక మగవాని గుండెను చీల్చిచూస్తాను. అప్పుడు నేను లోకాన్ని చూడగలను. ప్రపంచ రహస్యాలను గుర్తించగలను. ప్రతి వస్తువులోని సత్యాన్ని గమనించగలను.

ఆస్పత్రిలో డాక్టర్‌గారి ప్రాక్టికల్స్ క్లాసు తీసుకుంటున్నారు.

"ఇహ చెప్పండి ఈ రోగానికి మూలకారణం ఏమి?" అని అడిగారు డాక్టర్‌గారి.

మాముందు బల్లమీద పద్నాలుగు, పదిహేనేళ్ళ పిల్లవాడు పడుకొని ఉన్నాడు. అమాయకంగా చూస్తున్నాడు. నేను స్టెతస్కోపు అతని రొమ్మున ఉంచాను. నాకు ఒక్క కుదుపు కుదిపినట్లయింది. నలుదిశలా వెలుగువాగులు వ్యాపిస్తున్నాయి. బంగారు కిరణాలు తళుకుతళుకు మంటున్నాయి: సర్వత్ర పరచుకున్న భరించరాని డెట్టాల్‌వాసన ఘుమఘుమలాడే పరిమళంగా మారి పోయింది అన్ని బృహత్ద్రూపంతో నా కనులముందు నిలిచి ఉన్నాయి.

నా మనోనేత్రం వికసించింది. ఆ కుర్రాణ్ణి చూస్తున్నాను. అతని గుండెలో జీవించాలనే కోరిక దివ్వెలా కదలాడుతున్నది. చావు అతని దరిచేరి నిలిచిఉన్నది.

"డాక్టర్! ఈ వ్యాధిపేరు బతకాలనే ఆశ-బతుకుమీద నమ్మకం. ఇతనికి నమ్మకం కలిగించండి వ్యాధి నయం అవుతుంది" అన్నాను. అక్కడ్నుంచి పరిగెత్తాను- అద్వేష్‌ను వెదకడానికి. పిచ్చిదానివలె పరిగెత్తుతున్నాను. ఒక్క అంగలో అనేకమెట్లు ఎక్కుతున్నాను-కాదు-ఎగురుతున్నాను. హాల్లో సిద్ధు నుంచొని ఉన్నాడు. ఒక ఆంగ్లో ఇండియన్ అమ్మాయి నడుంమీద చేయి

వేశాడు— జన్మజన్మాలకు ఆమెను వదలనని విశ్వాసం కలిస్తున్నాడా— అన్నంత గట్టిగా పట్టుకున్నాడు. సిద్ధు గడ్డానికి నల్లని వల తగిలించాడు. మెడపట్టీ ఉన్న ఎర్రని సూటర్ వేసుకున్నాడు. నిముషంలో వెయ్యోవంతులో ఆతని మనసు చూచాను— ఆతని హృదయం సూర్యునివలె ప్రకాశిస్తూంది. దాన్లో అంజుమ్ నిలిచిఉంది. ఏ అంజుమ్? సిద్ధువైపు చూచి ఊయడానికిసైతం సిద్ధిపడని అంజుమ్ నిలిచిఉంది.

ఓహో! ఎంతటి రహస్యాలు నాముందు బద్దలవుతున్నాయి! ఎంతటి వాస్తవాలు నాకు గోచరిస్తునాయి!! ఏది అద్వేష్? ఎక్కడున్నాడు? అక్కడ ఉన్నాడా? అలా ఆస్పత్రి పొంతం తిరిగాను—కాదు—ఉరికాను.

'ఏమైంది?....ఏమైంది?'

నావెనుక అమ్మాయిలు, అబ్బాయిలు గుంపులు గుంపులుగా వస్తున్నారు. గుంపు పెరుగుతూంది. గుంపులు పెరుగుతున్నాయి. నేను వెర్రెత్తిన దానిలా అద్వేష్‌ను వెదుకుతూ తిరుగుతున్నాను. మా ప్రణయం చాటుమాటుది కాదు. మెడికల్ కాలేజి సాంతం మారుమోగింది, అయినా మేముమిత్రుల్లా కలుసుకున్నాం. కాని ఇవ్వాళ? ఎందుకీ వెర్రి? అద్వేష్ హృదయంలో దాగిన గుట్టును గుర్తించాలి.

'ఇవ్వాళ అద్వేష్ అస్పత్రికి రాలేదు'

హేభగవాన్! ఇహ ఏంచేయను? ఇందరు వెంటాడుతున్నారు. ఎలావదిలించుకోను? భయంతో టాయ్‌లెట్ రూములో దూరాను.

నాముందు పెద్ద అద్దంఉంది. అద్దంలో నేనున్నాను—ఎలా? సూర్యునివలె వెలుగుతున్నాను— భూమినుంచి ఆకాశంవరకూ ఎదిగాను. నాహృదయం ఎర్ర గులాబివలె వికసించింది—అదిగో దాని మధ్యలో ఉన్నాడు. "సిద్ధు"—నిర్లక్షంగా నిరామయంగా—భయంకరంగా"

ఆరాత్రి ఆతురతగా టేబుల్ సొరుగు తెరిచాను, మందులడబ్బా బయటికి తీశాను—చూచాను. తాళంచెవి అందులో లేదు ఎక్కడో పోయింది.

# సూనా

పాసింజర్ బండి. ప్రయాణీకులు నిండిఉన్నారు. బరువు ఎక్కువ అయినట్లుంది. మెల్లగా నడుస్తోంది.

"అమ్మా బండి ఇంత మెల్లగా ఎందుకు నడుస్తోంది?"

ఒక పసిపిల్లవాడు తల్లిని అడిగాడు. ఆ తల్లి దుంగలా లావుగా ఉంది. బుగ్గలు బూరెల్లా ఉన్నాయి. పిల్లవాడు పలకరిస్తే బాదుతూంది, తిడుతూంది అయినా పసిబిడ్డను రెండు చేతులతో గట్టిగా కరిచి పట్టుకొని కూర్చుంది.

"వెధవ నోర్ముయ్. కనిపించటంలేదూ బండిలో ఎంతమంది ఉన్నారో" అని గద్దించింది.

తల్లి సమాధానం పిల్లవాణ్ణి ఓదార్చింది. వాడు గుమ్మంలో ఇరికిన ప్రయాణికులను చూస్తున్నాడు.

అది నెలలో మొదటి వారం. పైగా ఆదివారం. అందువల్ల పట్నానికి పోయేకూలీలు, క్లార్కులు చిన్న చిన్న వ్యాపారస్తులతో పెట్టె నిండి పోయింది.

అప్పటికి రాత్రి పదకొండున్నర అయింది. బండి ఉదయం ఐదున్నరకు గాని హైదరాబాదు చేరదు. పాపం ఒంటికాలుమీద కోడిలా నిల్చున్నజనం విసిగి వేసారుతున్నారు. ఇంకా ఐదున్నరగంటలు అలా నిల్చోవాలి. వారి చేతులు నొప్పులు పెడుతున్నాయి. మరికొందరు, చేతుల్లో సూటుకేసులు, హోల్డాళ్ల మూటా, ముళ్ళే పట్టుకొని నిల్చున్నారు. బండి ఒక్కసారి కుదిపిందంటే ఈ చివరినించి పోయి ఆ చివరికి పడుతున్నారు. ఒకడు ఒక అమ్మాయిమీద పడుతున్నాడు. మరొకని కర్ర ఇంకొకని కండ్లలో గుచ్చుకుంటూంది. కాని,

కొందరున్నారు. వారు పక్క స్టేషనులోనో, ఆ పైస్టేషనులోనో దిగాలి. వారు మహదానందంగా ఉన్నారు.

ఇద్దరు కొంటె కురాళ్ళు మహా ప్రమాదంగా నిల్చున్నారు. వారిలో ఒకడు బయటి హాండిల్ పట్టుకొని స్టాండు మీద వేలాడుతున్నాడు వాడితల కిటికీలో దొచ్చుకొని ఉంది, రెండోవాడు కిటికీ నానుకొని లోన నిల్చున్నాడు. వాడితల కిటికీ బయట ఉంది. తలఏమిటి నడుముదాకా బయటికి వెళ్ళబెట్టాడు ఈ లోపలివాడు ఆ బయటి వాడితో పరసాలు! తిట్లు చీదరింపులు మహా సరదాగా ఉన్నారు ఇద్దరూ. చప్పున బయటివాడి చేయి హేండిల్ మీంచి జారి పోతుంది. మళ్ళీ పట్టేస్తాడు హేండిల్. ఇద్దరూ కలిసి ఘాటయిన ఫీలింగీతాలు పాడుతున్నారు. ఇంతలో పెట్టెలో కూర్చున్న ఆడది కన్పిస్తుంది. ఇహ వారు నవ్వు ఆపుకోలేరు. ఒకటే నవ్వడు వక్కడ! వక్కడ!

ఐదుగురు లంబాడీ స్త్రీలు లాంటిన్ పక్కన కూర్చొని ఒక మగాడితో పోట్లాడుతున్నారు. ఆ మగాడున్నాడే వాడు మొండి. మామగారి ఇంటినుంచి పెళ్ళాన్ని తెచ్చుకుంటున్నాడు. ఐదుగురు ఆడవాళ్ళ పోరుకు దిగిన మొగాణ్ణి చూస్తేరాళ్ళుకూడా కన్నీరు కారుస్తాయి. అతడేదో. చెప్పాలనుకుంటాడు. వారు చెప్పనిస్తారా? అతని పెదవుల కదలిక మాత్రం కన్పిస్తూంది. పోరు పడలేక కిటికీలో తలపెట్టి నీలి నీలి ఆకాశాన్ని చూస్తున్నాడు. అతణ్ణి చూస్తుంటే అలా ఆకాశంలోకి ఎగిరిపోతే బాగుండును అన్నట్లు ఉంది.

నాకు దగ్గరలో ఒక ముసలవ్వ నిల్చుంది. ఆవిడ బక్కపల్చగా ఉంది. కళ్ళద్దాలున్నాయి. వాటిలోంచి కన్పించే కళ్ళల్లో అశాంతి కనిపిస్తూంది. ఆవిడ చూపులు నుంచున్నవారి బట్టల్ని రూపురేఖల్నేకాదు, డొక్కలోని తిండినికూడా వెతుకుతున్నట్టున్నాయి. ఆమె చేతిలో మూట ఉంది. మూటలో తన కొడుకు కోసం తీసికెళ్ళే బట్టలున్నాయి. ఆ మూటలో ఊళ్ళో కొడుకు మర్చిపోయిన పుస్తకాలు ఉన్నాయి. కోడలుకోసం తీసికెళ్ళే రెండు సేర్లు నువ్వులున్నాయి. ఆవిరెండుసేర్లమీద ఒక ఛటాకు ఎక్కువే ఉంటాయి. ఏది ఏమైనా ఎంత

భ్రష్టకారి కోడలు తగ్గించాలని తూచినా రెండు సేర్లకు తగ్గవు. ఆమె తెల్లని చేనేతచీర కట్టింది. అది ఒకేసారి ఉతికిన చీర. దాన్ని ఆమెకొడుకు హైదరాబాదునుంచి, పోయిన దీపావళికి పంపించాడు. ఒక్కనెలమాత్రం హైదరాబాదులో ఉండాలని బయలు దేరింది. ఎందుకంటె ఊళ్లోఉన్న బర్రె మరొకరికి పాలివ్వదు ఆమె దగ్గర పాడి ఎంత గొప్పగా ఉందంటే— అనగా, అనగా ఒకనాడు పావు సేరు పెరుగు— ఇవన్నీ ఆమె చెప్తోంది అందరికీ. పెట్టెలోని వారందరూ వినేట్టు అరుస్తోంది

ఆమె తనను గురించి ఎంత వ్యాఖ్యానం చేసినా ఎవరూ పట్టించుకోలేదు మనస్సు చివుక్కుమన్న ముసలవ్వతన భూత భవిష్యద్వర్తమానాల్ని గురించి ప్రక్కన కూర్చున్నవారికి వివరించడం మొదలెట్టింది. పక్క నున్నవాళ్ళు మాట్లాడకపోయేసరికి నా వైపుతిరిగి "బిడ్డా! ఎక్కడికి వెళుతున్నావు? అని అడిగింది. మిల మిల మెరిసే ఆమె చూపులు నా రూపురేఖల్ని నా చేతుల్లో ఉన్న పుస్తకాలను అతి అనుమాన దృష్టితో చూశాయి.

"ఎవరి దగ్గరికి? ఒంటరిగా వస్తున్నావా? ఒక్క దానివే? నీవెంట ఉన్న మొగాడు? నాకు తగిన మగాడికోసం పెట్టె అంతా కలయ చూసింది.

'ఎప్పుడూ ఒంటరిగానే ప్రయాణం చేస్తావా?' ఆవిడ ధ్వనిలో పోలీసు ఇన్‌స్పెక్టరు ప్రశ్నలు కన్పించాయి.

నాకెందుకో భయమయింది. మపాసా కథల పుస్తకం అందుకున్నాను. ఆమె ప్రశ్నల పట్టిక తయారయ్యేవరకు ఒకటీ అరా కథన్నా చదువుకోవచ్చని

ఆ పరిసరాల్లో స్వచ్ఛమైన నేతి పరిమళం వ్యాపించింది. ఒక బక్క పల్చని మనిషి పన్నెండు నేతి డబ్బాల్ని కరచిపెట్టి కూర్చున్నాడు. అతని పట్టు వదిలితే ఒకటి అరా ఆకాశంలోకి ఎగిరిపోతాయేమో అన్నట్టు పట్టుకున్నాడు. అంతకుముందే అతడు కళ్ళద్దాల ముసలమ్మతో తాను నెయ్యి అమ్మటానికి పోతున్నట్టు చెప్పాడు. ఆతర్వాత మంచి నేతి తయారింపుగురించి సవివరంగా

వ్యాఖ్యానించాడు. ఎంత ఏసెస్సుకావలసింది, ఎంతకొవ్వు కావలసింది, ఎంత వనస్పతి కావాల్సిందీ వివరించాడు అతడు. మాట్లాడుతుంటె నోట్లోంచి తుంపర్ల వర్షం కురుస్తూంది. అతని చర్మం ఎండిన పొలంలా ఉంది.

నేతిమనిషి దగ్గరే కవి కూర్చున్నాడు అతని ముఖంలో అవలక్షణాల అంగరాగం కన్పిస్తోంది. కునికిపాట్లు సదా అతన్ని వీడవు. అతని ముఖం చూస్తే అవహేళనచేసిన సభనుంచి ఇప్పుడే దిగివచ్చినట్టు కనిపిస్తూంది. పాపం కవి కళ్ళద్దాల ముసలవ్వకు తననుగూర్చిన పరిచయం చేసికుంటున్నప్పుడు పెట్టెలోని జనం ఎవ్వరు కవిని గుర్తించకుంటే, అతని ముఖం కందగడ్డ అయింది. నిరాశ చెందినకవి ఆకాశాన్ని చూశాడు. అతని చూడ్డం ఎలా ఉందంటే. అల్లా! ఇలాంటి అరసికులను నిలుపావు, ఇహ ఈ బండి గతేం! కవి, కావ్యరీతిలో నిరామయంగా ఉన్నాడు. అతని చేతిలో రంగులు వేసినఒక కట్టెపిట్ట ఉంది. దాని ముక్కు ప్రయాణీకుల తోపిడికి విరిగిపోయింది. అది గాక అతని దగ్గర పాలరాతి బుద్ధవిగ్రహంకూడాఉంది. ఆ రెండు అతడు తన చెల్లెలి కొడుక్కు తీసుక వెళుతున్నాడు ఆ పిల్లవాడు ఇంకారెండునెల్లవాడే అయినా అతని చెల్లెలు ప్రతిఉత్తరంలో రాస్తుంటుంది. తన కొడుకు మామ కోసం పలవరిస్తున్నాడని!

కళ్ళద్దాల ముసలవ్వ ప్రశ్నల వర్షానికి విరామమిచ్చినప్పుడు ఈ కవి పుంగవుడు, ముక్కు విరిగిన పిట్టకు ఊహాలోకంలో ముక్కు అమరుస్తుంటాడు. ఆ తరువాత బుద్ధ విగ్రహం మీద పడిన దుమ్మును దులుపుతుంటాడు.

ఈలోగా నేను "నైట్ అవుట్" అనే కథలోంచి బయట పడితే, ముసలవ్వ లవుడ్ స్పీకర్ లాంటి ధ్వనితో ప్రకటన చేస్తోంది.

ఇది భోగంముండ.

ఆ మాటవిని నా చేతిలోంచి పుస్తకం జారి పడింది. నేను నివ్వెర పోయాను. కాని ఆమె చూస్తున్నది నల్లగా ఉన్న ఒక యువతివైపు, ఆమె లాట్రిన్ దగ్గర కూర్చున్న ఐదుగురు ఆడవాళ్ళప్రక్కన కూలబడ్డది. ఆమె

మోకాలిమీద తలపెట్టి ఒక నడివయసు కుర్రాడు జోగుతున్నాడు. అతని తల మీద ఆవిడ చేయి నిమురుతోంది. మగాడి మెళ్ళో ఒక తాడు ఉంది. వాడి చెవులో సగంకాల్చిన చుట్టఉంది.

'దీనిపేరు సూనా. ఇది మాఊరిదగ్గరే ఉంటుంది ఇది అంటే మగాళ్ళంతా పడి చస్తారు. అందుకే నా కొడుకును ఊరినుంచి పంపించేశాను. ముసలవ్వ సూనాకు తన కొడుక్కి జరిగిన ప్రణయాన్ని గురించి నేతివాడికి వినిపించసాగింది. ఆ నేతివాడు కళ్ళుమూసుకొని కొడుకునుగురించి, సూనెను గురించి కలలు కంటున్నట్టున్నాడు.

నేను సూనాను చూశాను. ఆవిడ అందాన్ని చూస్తే అనేకమంది మగాళ్ళను పిడికిళ్ళలో పట్టగలదనిపిస్తోంది. తెలంగాణంలో అందంఉందని అంగీకరిస్తే, సూనా కంటె అందమైన అమ్మాయి గురించి ఆలోచించటం సాధ్యపడదు. ఒక శిల్పి నల్లరాతితో మలచిన విగ్రహంలా ఉంది ఆవిడ. ఆమె చూపుల్లో భయం ఆ పెట్టెలోఉన్న ప్రతివాడు తనను తన్నటానికి వస్తాడా అన్నట్టున్నాయి ఆమె చూపులు.

'నీ మొగుడికి జబ్బా?' బిడ్డతల్లి, బిడ్డను తనఒళ్ళో కూర్చోపెట్టుకుంటూ అడిగింది.

'అవును' కాదన్నట్టుగానే అంగీకారం తెలిపింది సూనా.

సరిగ్గా అదే సమయంలో మగాడు తలపైకెత్తాడు. ఉబ్బి ఎర్రగా ఉన్న అతని కళ్ళల్లో పశుత్వం పరవళ్ళు తొక్కుతున్నది. జీవితాంతం గొడ్డలిపట్టి చెట్లను పడగొట్టిన వాడిలాగున్నాడు, మెలివేశిన అతని మీసాల్లో ఏదోఅధికారం తొంగిచూస్తున్నది. అతను కనుబొమ్మ ముడివేసి చూడడంతో ఆమె ఆకాశం నుంచి అమాంతంగా ఊడిపడ్డట్లయింది.

'పిల్లి ఎక్కడ?' కల్లు వాసన కంధ్వనితో సూనాను అడిగాడు ఆవిడ బెదిరి అటూ, ఇటూ చూసింది, తర్వాత అతని గడ్డం పట్టుకొని గారాబంగా 'చూడు; నువ్వు కల్లంతా స్టేషనులోనే తాగవుగా'.

'ఏ – ? అవును తాగుతే ఏం' అతను సూనా చేతిని పట్టుకొని గట్టిగా విదిలించాడు. తరువాత జుట్టుపట్టుకొని గోడకేసి కొట్టాడు. ఐనా సూనాకు కోపం రాలేదు. అతని చేయిపట్టుకొని నమ్రంగా 'సరేతెస్తా, ఇప్పుడే తెస్తాగా'.

అందరూ అటే చూశారు. 'ఈ పెధవను ఎత్తి అవతల పారేయాలని పిస్తుంది', ఒక క్లార్కు అతని తోటివాడితో అన్నాడు.వాళ్ళిద్దరికీ పెళ్ళికాలేదు. అక్కచెళ్ళెల్ల పట్టన్నుం వొదిలించుకొనె దాక వాళ్ళ పెళ్ళి కాదని వాళ్ళు ముసలవ్వ తోటి చెప్పారు.

రెండోవాడు కాండ్రించి ఊశాడు. గాలి వడికి అది వచ్చి వాడిమొఖానే పడింది.

'కాస్త ఊరుకో అందరు మననే చూస్తున్నారు'. సూనా మెల్లిగా అంది. మొగాడి పిడికిలి అలాగే నిల్చిపోయింది. ఆమెమీద దెబ్బ పడలేదు. వాడు నిప్పు అంటుకున్నట్టు. బెదిరి పోయాడు' బెదిరి జనాన్ని చూశాడు. 'అచ్చా. అబద్ధం చెపుతవులే. చూడు ఇవ్వాళ్ళ నీ తోళ్ళు వలుస్తా' అన్నాడు. తర్వాత సూనా మోకాలు మీదికి వంగిపోయాడు.

'ఇది భోగం ముండ' ముసల్ది క్లార్కునుచూసి మళ్ళీ ప్రకటించింది. ఆ వార్త పెట్టెలో అందరికీ అందింది.

సూనా భోగందే. ఆ విషయం నేను గ్రహించాను. కాని ఈమగాడెవడు? ఎందుకు వాడిమీద అలా పడి చస్తుంది.? ఈ నడివయసు వాడు కూలీగా కని పిస్తున్నాడు. భోగందాన్ని ఉంచుకోదగ్గ ధనికుడైతేకాదు. వాడు రాత్ను పగల కొట్టే వాడిలా కనిపిస్తున్నాడు వాడి సంపాదన కల్లుముంతకు కూడా సరిపోదు.

చిన్న, చిన్న స్టేషనుల్లో జనం దిగిపోయారు. ఈ కాళరాత్రిని గడ పాల్సిన ప్రయాణీకులు మాత్రం మిగిలిపోయారు ప్రయాణీకులందరి జీవితాల ప్రధాన వృత్తాంతాలను తెల్సుకున్న ముసలవ్వమూట తలక్రింద పెట్టుకుని

నిద్రపోయింది. లావుపాటి ఆడమనిషి బెంచిక్రింద పక్కపరిచి, పిల్లవాణ్ణి పడుకోబెట్టింది. తానేమో కిటికీలో తలపెట్టి ఊగుతుంది.

నేతిమనిషి, నేతిగిన్నెల పరిరక్షణ వదిలేసి ఒక బెంచిమీద తలా, మరో బెంచిమీద కాళ్ళుపెట్టి, రైల్వేక్రాసింగ్ బ్రిడ్జిలా నిద్రపోతున్నాడు. నిద్రలో అతని పెదాలపై చిరునవ్వు కనిపిస్తుంది. బహుశా పెరుగుతున్న నేతిధరను కలలు కంటుండవచ్చును.

ఇద్దరు క్లార్కులు ఒక బేంచి నాక్రమించారు. వాళ్ళు పడుకున్నతీరు ఎలాగుందంటె ఒకడికాళ్ళె మరొకడి నెత్తికి తగులుతున్నాయి. కవి పుంగవుడు కళ్ళు తెరచి కప్పును చూస్తునాడు, ఒక పద్యభాగంకోసం వెతుకుతున్నట్టు ఉన్నాడు. అతని ఒళ్ళోఉన్న బుద్ధుడు, కవి, కవితారసాన్ని గ్రోలుతూ ఊగుతున్నాడు.

సూనా మేలుకతోనే ఉంది. రైలు, స్టేషనులో ఆగినప్పుడు బెదిరి చూస్తూంది. ఆ చూపులు, వాళ్ల టిక్కెట్టులేని ప్రయాణీకులని తెల్పుతున్నాయి. కాచిగూడ స్టేషనులో టికెట్టు ఇన్స్పెక్టర్ పోలీసును పిలుస్తాడు. వాళ్లిద్దరిని చావబాది స్టేషను బయటికి నెట్టేస్తారను కున్నారు. కాని, ఇంకా కాచిగూడా స్టేషను రాకుండానే ఆ పని జరిగిపోయింది. కేకలు, అరుపులు వినపడి మేల్కొన్నాను. నేతివాడు సూనాను చావబాదు తున్నాడు. సూనా ఏడుస్తూ తన్నులు తప్పుకోవటానికి ప్రయత్నిస్తున్నది.

నేతిగిన్నెలు ఉన్నస్థలం ఖాళీగా ఉంది. సూనా మోకాలుమీద నెత్తిపెట్టి పడుకున్న మొగాడు మాయమైనాడు.

అందరు, కళ్లుతుడుచుకొని చూసి, విషయం అర్థం చేసుకున్నారు. విచిత్రం ఏమంటే నేతివాడి దెబ్బలకు సూనా అరవడంలేదు. కన్నీరులేదు. ఆమె ఒళ్ళు వణుకుతోంది. పన్నెండు నేతిగిన్నెలు తనలో దాచుకున్నట్టు. పెదవి కదల్చటంలేదు. రేయిసాంతం సూనానుచూసి గుటకలు మింగిన ఇద్దరు క్లార్కులు నేతివాణ్ణి ఆపలేదు.

"స్టేషను రానీయి నీపని పడ్తా." అని నేతివాడు, దెబ్బలుకొట్టి, కొట్టి, అలిసి బేంచిమీద వచ్చి కూర్చున్నాడు. ఎండిపోయిన అతని శరీరం చమటతో, నెయ్యి పూనుకున్నట్టు మెరుస్తోంది.

ఒకటికాదు. రెండుకాదు. పన్నెండు దబ్బాలు నీ మిండడికి పట్టిచ్చావు!

దీన్ని పోలీసులకు పట్టించండి. ముసలవ్వ బుగ్గలు నొక్కుకొని సూనాను చూసింది. తన కొడుకును సూనా యెలా వల్లో వేసింది వినిపించ సాగింది.

ఇవ్వాళ పోలీసువాళ్ళ అదృష్టం పండింది. ఒకక్లార్కు చిరునవ్వి తన తోటివాడితో అన్నాడు. ఇద్దరూ కాళ్ళు ఊపసాగారు.

సూనా తలవంచుకొని కూర్చుంది. చేతుల్నుంచి కారే రక్తాన్ని గోడకు రాస్తుంది, ఒంటినుంచి కారే రక్తాన్ని చేతివించి తీసి కిటికి అవతల పారేస్తోంది, ఆమె ముఖంలో బాధకాని వేదనకాని వ్యక్తం కావటంలేదు. ముసలవ్వ తిట్లుగాని సాపెనలుగాని ఆమెదాక చేరుతున్నట్టులేదు. ఆ మెమాకు చాలా దూరంగా వేల మైళ్ళ అవల పాతాళంలో పడిఉన్నట్టు, మనుషులు రాళ్ళు కొడుతున్నట్టు – అని పిస్తోంది,

తరువాతి స్టేషనులో రైలు అగకముందే నేతిమనిషి మాకు సూనాను అప్పగించి దిగిపోయాడు. ఇద్దరు క్లార్కులు, ముసలవ్వ, కవి, లావుమనిషీ, కోటకట్టి సూనాచుట్టూ నుంచున్నారు. కాని, సూనా, నేతిమనిషి దిగడంగాని, జనం తనను చుట్టివేయడం గాని గమనించినట్టులేదు. ఆమె తల వంచుకొని కాళ్ళకు తగిలిన గాయాలను చూస్తూకూర్చుంది.

'నువ్వో పిచ్చిదానివి వాడితోబాటు నువ్వెందుకు దిగిపోలేదు?, కవిగారు ప్రశ్నించాడు.

ఆమె తలెత్తి కవిని చూసింది—. అంతకంటె తెలివైనవాణ్ణి తన జీవితంలో చూడలేదన్నట్టు.

"అలాచేస్తే, జనం నన్నువదిలి వాణ్ణి పట్టుకోవటానికి పరుగెత్తుతారు.

'ఇప్పుడు నీ ఎముకలు విరుగుతాయి.'

'హుం' ఆమె నిర్లక్ష్యంగా తలాడించింది సర్దుకొని కూర్చుంది.

'మీకు తిండి లేకుంటే బిచ్చమెందుకెత్తుకోరు.' కవిగారి ఆలోచన, మార్క్సిజం, ధనస్వామ్యం, జాగీర్దారీ విధానంగురించి ఆలోచిస్తున్నట్టున్నారు.

'వాడు నెయ్యిఅమ్మి, మొత్తం తాగేస్తాడు. తన కూతురుకు కూడ ఒక పైస ఇవ్వడు. దానికికూడా నేనే డబ్బు పంపుతాను.'

'వాడికి కూడా కూతురు?ఉందా?' నేను ఆశ్చర్యంగా అడిగాను.

ఉంది. ముసలవ్వ చప్పునలేచి కిటికీలోంచి చూసింది, పోలీసులు వస్తున్నారేమోనని.

అయితే, దీన్ని ఉంచుకున్నవాడూ ఒకడున్నాడన్నమాట. లావాటి స్త్రీ అసహ్యంగా అటుచూచి గర్వంగా తన బిడ్డను గుండెలకు హత్తుకుంది.

'ఒసేయ్, ఎందుకే వాడంటే అలా చస్తావ్. నీకు బంగారులో ఇల్లూ వాకిలీ ఉంది. వాడేమో వెధవ, ఫకీర్లకంటె దండగ. రాత్రింబవళ్ళు ఎముకలు ఇరగ తంతుంటాడు భోగమూండలకు మగాళ్ళు కరువనా, వాడితోటి తన్నులు తింటావు.' ముసలవ్వ ఉపన్యాసం రైలుకంటె వేగంగా పరుగెత్తుతూంది.

సూనా కళ్ళలో తొలిసారి కన్నీటి జాలు వారింది. బాగా దట్టమైన ఆమె వల్లని పెదవులు, ముసల్దాని దెబ్బ సరిగ్గా గుండెల్లో తాకినట్టు వణికాయి. ఆమె అందర్నీ ధ్యానంగా చూసింది. అక్కడ ఎవర్లోనూ ఆమెకు మానవత్వం కనిపించినట్టులేదు. 'అతడు నేవంటేపడిచస్తాడు. మగలు మాత్రం ఇలాచేయరా? అతడేం విటుడా, నా వయ్యారాలు సహించడానికి? అతడు ఎన్నడూ నన్ను. భోగం-దానిలాగా చూడలేదు. నువ్వు చూస్తుండగానే ఎన్నడో ఒకనాడు పెళ్ళి చేసుకుంటాడు.

బాగుంది పిచ్చిముండ ఇదేం కాలమమ్మా వీసమంత ప్రేమకు వేయి తెన్నులు తింటుంది. వాడంటె పడిచస్తుంది. అని తలాడించింది ముసలవ్వ.

ఇహ ఈ కథలో రుచిలేదని నేతివాడి పెళ్ళాంమీద సానుభూతి కురిపించింది. నేతివాడి పెళ్ళానికి పక్షవాతం' నేతివాణ్ణి గురించి ముసలవ్వ ప్రార్థించడం మొదలు పెట్టింది.

నేతివాడు ఇద్దరు పోలీసుల్ని తెసుకొచ్చాడు. వాళ్ళ తంతూ, గుద్దుతూ సూనాను తీసుకవెళ్ళారు. నేతివాడుగూడ వాళ్ళవెంట పోయాడు.

రైలు కదిలింది. రైలుకేదో ప్రమాదం జరిగినట్టు, చక్రాల్నెవరో పట్టుకున్నట్టు, ముందుకు కదిలే శక్తికోల్పోయినట్టు మెల్లగా కదిలింది.

అందరూ ఒక నిట్టూర్పు విడిచారు. ఇంక ఈ వృత్తాంతాన్ని గురించి ఆలోచించడంకంటే నిద్రపోవడం మంచిదనీ, ఆ ప్రయత్నంలో పడిపోయారు. కవిమాత్రం నిద్రపోలేదు. సూనా కూర్చుంది వెళ్ళిపోయిన స్థలాన్ని చూస్తున్నాడు. అక్కడ రక్తపు మరకలున్నాయి. ఇప్పుడిప్పుడే అవి ఎండిపోతున్నాయి. ఉలిక్కిపడి అతడు తన పరిస్థితి చూసుకున్నాడు గ్రహించాడు. బుద్ధ విగ్రహం మీద పడిన దుమ్మును దులప సాగాడు.

ఏదో ఒగ భయంకర సంఘటన బుద్ధ విగ్రహాన్ని ఇప్పుడిప్పుడే రాతి విగ్రహంగా మార్చినట్టని పిస్తుంది. నేను కపిలవస్తు రాజకుమారుణ్ణి, అడిగాను.

'ప్రేమకోసం. సత్యంకోసం అన్వేషిస్తూ తిరిగిన సిద్ధార్థ రాకుమారా! మీరు ఇక్కడిదాకా వచ్చి రాతి విగ్రహంగా ఎందుకు మారిపోయారు? ఇక ముందున్న మార్గం భయానకమైందా? సూనావలె ఆమార్గంలో పయనించి శిలువ కేక్కలేరా!'

# కేదారం

చంద్రు డెలాంటివాడు? భయపడే గుండెలాంటివాడు. ఆ విషయం తొలిసారి గ్రహించింది లాలా. వెన్నెల విదురపోదు. సదామేల్కొనే ఉంటుంది అదీ అనాడే తెలిసిందామెకు. ఆమె గుండెలమీద వడగళ్లవాన దాడిచేసింది. ఆమె చూస్తుండగానే నీలందుప్పటిలాంటి పాత ఆకాశం రూపంమార్చుకుంది. కొత్త ఆకాశానికి రెండే రెండు రంగులున్నాయి. ఒకటి దుఃఖిత హృదయంలాంటి మసిపులుముకున్న నీలంరంగు. మరొకటి పెళ్ళికూతురు కళ్ళలోలాంటి అరుణిమ. కేదార రాగం ఈ రెండు రంగుల్తోనే ఏర్పడింది. ఈ రెండు రంగులే హృదయాకాశంలో వెలుగుచీకట్ల దోబూచులాటలు. ఈ రెండురంగులే ఆశకు విరాశకూ సంకేతాలు.

కళ పాటపాడుతూంది. లాలా వింటున్నది. అప్పుడు అమెకు స్ఫురించింది. కళ వెన్నెలరాత్రివి చిత్రిస్తూందని వెన్నెలరాత్రివి చిత్రించడానికి ఆ రెండురంగులేకావాలి.

లాలా తరవాత ఆలోచించలేకపోయింది.

కళ కొలను ఒడ్డున కూర్చుంటుంది. ఆమె బుజాన తంబురా ఉంటుంది. పాట పాడుతుంటుంది. కాళ్లు నీళ్ళలో ఆడిస్తుంటుంది. కళపాట శ్రావ్యంగా ఉంటుంది. అందులో ఆకర్షణఉంది. అది జనాన్ని లాక్కొనిపోతుంది. వారు మెల్లమెల్లగా అడుగులువేస్తూ సాగిపోతుంటారు. వారి అడుగుల క్రిందినుంచి, వెన్నెల వెలుగులు పరచుకున్న నీరు మెల్లమెల్లగా కదలిపోతుంటుంది, ఇంతలో వారి బుజాలకు మెత్తమెత్తవి రెక్కలు మొలుస్తాయి. వారు రెక్కలు రెపరెవలాడిస్తారు, ఎగురుతారు, ఆకాశంలో విహరిస్తారు మబ్బులతో దోబూచులాడ్తారు

నేటి వెన్నెల్లో మధురవేదనఉంది. ఉదాసీనం అయిన నవ్వుంది. ఈ ఉద్యానం పెరుగుతూంది – వామనునిలా అది ఆకాశాన్ని అంటుతూంది. పూలు

వికసించాయి. వాటి కళ్ళలో ఏదో నిరీక్షణఉంది లాలాకు నిరీక్షణ కనిపించింది అనంతమైన నిరీక్షణ!

ఆమె ఒక్క నీటిచుక్కకోసం లోకంసాంతం గాలిస్తూంది. కేకలుపెడ్తూ తిరుగుతూంది ఆమె పెదవులు అక్తర్‌మామ పెదవుల్లా ఆరిపోయాయి. ఎండి పోయాయి. ఆమెకళలా వచ్చబడిపోయింది. కలలుసైతం ఎట్టిపోయిన కనులు కలవర పడుతున్నాయి, తంబురాకు తలానించి పాడుతూంది - సాగిపోతూంది

"కైసే కహూఁమై సాజన్ బినా నీంద్‌నఆయే"

"ఏలా చెప్పుదునే ప్రియుడులేక నిదురరాదని ఏల?"

కేదార రాగపు స్వరాలు నలువైపులా వ్యాపించాయి. తెల్లని వెలుగులు పరచాయి. అవి దుఃఖపు చీకట్లు పారదోలే వెలుగులు, ఆశల వెన్నెల వెలుగులు వెలుగుల నిరీక్షణల నీడలు.

లాలా జీవితంలో తొలిసారి వెన్నెల వెలుగులు చవిచూసింది. వారు వెన్నెల్లో విహారానికి వెళ్లారు - అక్తర్‌మామవెంట. అక్తర్‌మామ కవిగానే తెలుసు లాలాకు. ఆనాడే ఆమెకు తెలిసింది అతడు విఫలప్రేమికుడని. కవి అన్వేషణకు బయలుదేరితే చంద్రుడు ముందుబయలుదేర్తాడట. కాగడా పట్టుకొని దారిచూపుతాడట. అక్తర్‌మామ వెన్నెల్లో బయలుదేర్తాడు. గ్రామంగ్రామం వాడవాడలా తిరుగుతాడు. ఏదో వెదుకుతూ తిరుగుతాడు. అది సూర్యుని వెలుగుకు కనిపించదట. వెన్నెల్లోనే కనిపిస్తుందట. అక్తర్‌మామకూడా దేనికోసమో వెదుకుతాడని తెలిసి లాలా ఆశ్చర్యపడింది.

ఇవ్వాళ అక్తర్‌మామ దేనికోసమూ వెదుకుతున్నట్లులేదు. విరిసిన వెన్నెలను ఆనందిస్తూన్నట్లూలేదు. వెళ్లిపోతున్నాడు. కొండమీదినుంచి దొర్లే రాయిలా కాలిబాట వదిలాడు. అడవులవైపు సాగిపోతున్నాడు. కొద్దిసేపటిలో అంతా తోటలోకూడారు. లాలా కేదారం పాడుతూంది. వింటున్నారు.

స్వరం సుందరంగా ఉంది. రాగం రమ్యంగా ఉంది. సంగీతంవినే ఓపిక ప్రసాదించమని భగవంతుని ప్రార్థించింది.

అ క్టర్ మామ రాతి బెంచీమీద కూర్చున్నారు. శిలా ప్రతిమలా మారి పోయారు. తల్లి తన ముద్దులకొడుకు శవానికి అగ్గిపెట్టినట్లు సిగరెట్టుమీద సిగరెట్టు అంటిస్తున్నాడు

'కళ'ను చూస్తే లోకంలోని కళలన్నీ కాలికి బుద్ధిచెపుతాయి. కొత్త కార్టూనిస్టు ఉబుసుపోకకు గీసిన స్కెచ్‌లా ఉంటుందామె. ఆమె ఎవరినో ప్రేమించిందట పెర్రిగా. ప్రేమ ఫలించలేదట. దేవదాసిగా మారిపోయిందట. గుళ్ళోని రాతిదేవుణ్ణి పలికించలేకపోయిందట. బయట వడిందట. విప్లవ కారుల్లో కలిసిందట. ఆలంకారిక ప్రేమనుంచి వాస్తవ ప్రేమవైపు ప్రయాణం సాగించిందట అన్వేషణలో అరిగిన బాటలు, మాసిన మార్గాలుబట్టి పయనించింది ఊళ్లు గాలించింది. దేవాలయాలు వెదికింది. కమ్యూనిస్టు పార్టీ కార్యాలయానికి కూడా చేరింది. సంగీతజ్ఞానం ఆర్జించింది. కాని ఆమె వెదుకుతున్నవాడెక్క డున్నాడు? ఆమె మనోమందిరంలో ఉన్నాడు. ఆమె తంబురా తీవల్లో ఉన్నాడు

కళ వదనంలో విరాళ నిట్టూరుస్తూంది. అయినా లాలా గెలిచింది. కళ వదనం వికసించింది. ఆమె కేదారం అందుకుంది. పాట మధురంగా సాగింది.

"కైసే కహూం మై సాజన్ బినా నీంద్ నఆయే"

గానంలో కరిగిపోయింది లాలా. కళను అప్పుడు అర్థంచేసుకుందామె. కళకు పుట్టిన్నాటినుంచీ కంటికికునుకు లేదు. బుజంమీద విచిత్రవీణ దాల్చితుంది పాట పాడుతుంది. మనసులో వెలసినవాడికోసం వెదకుతుంది. ఊరూరూ, వాడవాడా తిరుగుతుంది. ఇది లాలా గ్రహించిన సత్యం.

ఆమె మనో మందిరంలో వెలసినవాడెవ్వరు? ఆమె మనసుకు ఒక రాయిలాంటిది తగిలింది. తరంగాలు వర్తులంగా దూరదూరం వ్యాపిస్తూపోయాయి చూపందినంత దూరం ఎవరికోసమో వెదికింది.

ఓహ్! నేడు దశదిశలు రంగులతో మెరిసి పోతున్నాయి. ఈ దృశ్యం ఇలాంటి దృశ్యంకోసమే ఆమె తన భావ ప్రపంచంలో అనేక రంగులను రంగరించింది. వేల రేఖాచిత్రాలు గీసింది. అంతలోనే కలపిన రంగులను కాలతన్నింది. నలువైపులా రంగులధారలు కురిశాయి కురిసిన చిక్కని చక్కని రంగులు ఎటుసాగాలని తల్లడిల్లాయి. తల్లడిల్లి వెన్నెలవెలుగుల్లో కలిసిపోయాయి కరిగిపోయాయి. ఆకాశంనుంచి లేతనీలిమ మబ్బులా రాలుతూంది.

"ప్రియుడులేక నిదురరాదు"

తారలు కళ కన్నీటిచుక్కల్లా ఉన్నాయి. నిటారుగా ఎదిగినచెట్లు తల లెత్తి దేనికోసమో నిరీక్షిస్తున్నాయి. చెట్లమీది పిట్టలు ఊపిరి బిగపట్టిచూస్తున్నాయి

చంద్రుడు వేగంగా సాగుతున్నాడు. ఆకర్ మామలా కొండమీంచి దొర్లిపోతున్నాడు. హమీదా అక్క నీళ్ళల్లో కాళ్లు కదిలిస్తూంది. నీటిలోని చందమామను దూరందూరం నెడ్తూంది. నీటిలోని చంద్రబింబం కళ కాళ్లు ముద్దుపెట్టుకోవడానికి వస్తున్నాడు. ఇంతలో ఒకపక్షి రయ్యిమని వచ్చింది. చంద్రుని కాంతి పడుతున్న కళ పాదాలవైపు సాగింది. హమీదాఅక్క భయంతో గడగడలాడింది. అప్పుడే - అదిగో అప్పుడే కళ కన్నీటిచుక్క నీటిమీద రాలింది.

చంద్రుడు బెదిరిపోయాడు. చెదిరిపోయాడు. అమాంతంగా మంట లంటుకున్నట్లయింది. కొలను మీద బంగారు మలామ పరచుకుంది. ఆ పిట్ట కెవ్వున కేక పెట్టింది. ఎక్కడో దూరాన రైలు పెద్దగా అరచింది. ....ధక్ ధక్ మని సాగింది. అది గుండెల చప్పుడులా ఉంది.

పక్షి వేగంగా ఆకాశంలోకి దూసుకు పోయింది. లాలా తన చూపాని నంత దూరంచూచింది. పక్షి దూసుకుపోతూనే ఉంది. ఎందుకో ఆమెకు కొండ మీంచి దొర్లేరాయి గుర్తుకు వచ్చింది. చాలసేపటి వరకు లేచిపడుతున్న తరంగాల నీడలు కళముఖంమీద కదలాడుతూ కనిపించాయి. ఆమె వేళ్లలో కంపనం కనిపించింది. తీవల్లో ప్రకంపనం వినిపించింది. తన స్వరం తనకే ఆశ్చర్యం

కలిగించేటట్లుంది. తనప్రశ్నలు తనకే తెలియని బికారిలా, పిలవాలనుకున్న వాడిపేరు తెలియక పరితపించే ప్రయాణీకునిలా, కళస్వరాలు కేకలయి నలు వైపులా ప్రతిధ్వనిస్తున్నాయి. కళ కన్నీరు చెప్పిన కథ, కొలనువద్ద చూచిన చోద్యం లోకానికి చాటాలని కేకపెడ్తూ విసురుగా ఎగురుతూంది చిన్నపక్షి. కళగానం ఆకేకల్లో కరిగిపోతూంది. నడిరేయిలాంటి ప్రశాంతత ఆవరించింది.

లాలాకు జాగారం చేసి అలసినట్లనిపించింది. కళలా తానూఎంతో దూరం నుంచి కాలినడకన వచ్చినట్లుంది. కాళ్ళు కొలని నీటిలో ఆడిస్తూ, తంబురాతలకు ఆనించుకుని సేదతీరు తున్నట్లనిపించింది.

చంద్రుని చుట్టుపట్టు నడయాడే నీడ కనిపించింది. ఎందుకో ఏడవాలను కుంది. కళ్ళకు ఏమయిందో తెలియదు-ఏడుపు వచ్చిందికాదు.

ఆరాత్రి ఆమె చాలా అలసిపోయింది, కాళ్ళు చెప్పినమాట వినలేదు. ఇంటిదాకా తీసికెళ్ళమని బ్రతిమాలాల్సి వచ్చింది.

## స్థాయి

పొగమంచును కళ్ళలో దాచుకొని అతిప్రశాంతంగా పాకుతూంది-రాత్రి.

వెన్నెల విరిసింది; అది లాలా కన్నుల్లో దాక్కుంటూంది. ఆమె కళ్ళలో మబ్బులున్నాయి. వాటిని కురిపించాలని చూస్తోంది. తన ఉదాసీనతను కడిగి వేయాలను కుంటూంది.

గ్రీష్మ, శిశిరాలు ఆలింగనం చేసుకుంటున్నాయి. కాలం కడు సుంద రంగా ఉంది. అమ్మాయిలు కూనిరాగాలు తీస్తున్నారు. అబ్బాయిలు కవితలు అల్లుతున్నారు.

ఒక్క చలివిసరుకు లాలా వడికిపోతూంది. దుప్పటి ముసుగుతన్ని ముడుచు కుంటూంది. అంతలో ఉక్కపోత, ముసుగు విసిరేస్తూంది. ఇవి ఆమె మనసులో ఉవ్వెత్తునలేచి పడుతున్న భావతరంగాలు కావు, వాస్తవంగానే వాతా వరణం అస్తవ్యస్తంగా ఉంది.

ఆమె వంటరిగా వసారాలో పడుకుంది. నిద్రలో ఉన్నాననే అనుకుంది. మేలికవచ్చి చూస్తే చంద్రుడు కనిపించాడు. అతడూ కలలు ఎరగనట్లున్నాడు. పాపం జాగారం చేస్తున్నాడు - తనలాగే. ఇవ్వాళ పౌర్ణమి. అయినా చంద్రుని ముఖంలో కాంతిలేదు. అక్తర్‌మామ ముఖంలోలా ఏదో అన్వేషణ కని పిస్తూంది. అక్తర్ మామను శానిటోరియంలో చేర్పించారు. అతని గదిలోకి చంద్రుడు తొంగి పైతం చూడడు. చీకట్లో ఊపిరి సలపడం లేదని మొత్తు కుంటూ ఉత్తరాలు రాశాడు తల్లికి.

అది విని లాలా ఏడ్చింది. ఇంటివాళ్ళంతా నవ్వారు. వెర్రిది అన్నారు. మామకు తగిన కోడలే అన్నారు.

అక్తర్ మామను గురించి కుటుంబంలో ఎవరికీ సానుభూతిలేదు. అతడు వెర్రివాడికింద జమ.

వల్చని మబ్బులు చంద్రుపికళ్ళకు మసకలు కప్పాయి. చంద్రునిముఖం వెలవెలపోతూంది. అయినా అందంగానే ఉన్నాడు;

లాలా నిద్రపోవాల్సిందే, కాని హమీదా అక్క నవ్వుల జలపాతాలు వినిపిస్తున్నాయి. చంద్రుని నిట్టూర్పుల్లా కవోష్ణవాయు తరంగాలు తాకు తున్నాయి. వరండాలో జనం ముచ్చట్లలో మురిసి పోతున్నారు. వారంతా కలిసి తన భవిష్యత్తుకు ప్రణాళిక సిద్ధం చేస్తున్నారు. అది ఇటుకా. మట్టితో కట్టిన అనాకార భవిష్యత్తు. తాను అర్టిస్టు. అది తనకు తగిన భవిష్యత్తు మాత్రంకాదు. వాళ్ళ పాట్లేవో వాళ్లు పడరాదూ; ఇతరులను గురించి వీళ్ళకు ఎందుకింత చింత?

వరండాలోని వాగుడులో తనకు ఆసక్తిలేదు భయమూలేదు. తన మన సుకు తాను రాణి. తనమనసు గడుసుది. అది తాను చెప్పినట్లూ వినేట్లులేదు. ఆమె ఆలోచించసాగింది. అందులో దుఃఖమూ, ఆనందమూ కలగలిశాయి.

ఆమె రంగురంగుల కలలు కంటూంది. కలలతో బెదిరిపోతూంది. భయం

అలలు అలలుగా ఆమెను అల్లకల్లోలం చేస్తోంది. ఏదే తన మనసులోని చంద్రుడు? ఎక్కడికి పోయి క్రుంగాడు?

ఆమె కళ్లనుమూసుకుంది. ఎక్కడో దూరంగా కళ పాడుతూంది. తంబురా తలకానించిన కళ కనిపించింది. పాట వినిపించింది :-

'ప్రియుడులేడు. నిదురరాదు'

ఆమె స్వరాల సరాగాలను ప్రతిధ్వనిస్తోంది. కేకలుపెట్టిన పక్షిని చీకటి గదిలో కట్టివేసినట్లున్నారు. చంద్రుడు పాపం ఆ పక్షి దుఃఖం భరించలేక వెల వెల పోయాడు. వెన్నెల తనకాళ్ల అందియలు విప్పి పారేసి మౌనంగా, విరాగినిలా నుంచుంది - ఏదో అన్వేషిస్తున్నట్లు.

కన్నీరు ముఖాన్ని ఎడిగేసిం తరువాత, పరిస్థితులు ఎదుట నిలిచి వాటి ప్రాముఖ్యతను నచ్చచెప్పసాగేయి. మనసు వినడంలేదు. ఆమె మనసు ముకుదాడులేని ఆబోతులా తయారయింది. ఏ కారణం చెప్పినా, ఏ తత్త్వం చెప్పినా వినడంలేదు. దానికి గర్వం. తలబిరుసుదనం వచ్చేసింది. దానికి ముకుదాడు వేయడాన్ని గురించే వాళ్లు ఆలోచిస్తున్నది.

ఆ వరండా ఎంతదూరం. తనకు అక్కడ కూర్చున్నజనం తన ఉనికినే గమనించడంలేదు. వాళ్ళకూ తనకూ మధ్య శతాబ్దాలదూరం. వాళ్లంతా మహెంజొదారో శిథిలాల్లోంచి లేచివచ్చి వరండాలో కూర్చున్నట్లున్నారు. మల్లెపందిరి సందుల్లోంచి వాళ్ళ ముఖాలు కనిపిస్తున్నాయి. వాళ్ల చిలుంపట్టిన మెదళ్ళూ, లుకలుకలాడే ఎముకలూ, నరంలేనినాలుక గలవాళ్లు. వాళ్లసమాధుల్లోంచి బయటపడి సజీవమైన ఒకఅమ్మాయి భవిష్యత్తును నిర్ణయించడానికి వచ్చారు. వీళ్లే ఆ శ్రీ మామ అదృష్టమూ నిర్ణయించారు. అతడు మౌనంగా వీళ్ళతీర్పువిన్నాడు. పలుకలేదు- ఉలకలేదు, లేచినుంచున్నాడు. ఆనాటినుంచీ క్షణం విరామంలేకుండా తిరుగుతున్నాడు - ఏదో పోగొట్టుకున్నట్లు - ఎన్నడో దొరక్క పోదన్నట్లు.

అన్వేషణ అతని పని. ఎప్పుడూ పరధ్యానంగా ఉంటాడు. గజాలా అక్క మొగుడూ పిల్లలతో యాభైసార్లు అతని ముందునుంచి తిరిగినా గుర్తించడు. ఆమెను మందిరంలోని దేవతను చూచినట్లూ, నీళ్ళలోని చంద్రబింబాన్ని చూచినట్లూ చూస్తాడు.

లాలాకు వరండాలో వింతవింత ముఖాలు కనిపిస్తున్నాయి. వారిలో ఇమ్తియాజ్ సోదరుడు, హమీదా అక్క. తల్లితండ్రి ఉన్నారు. వారిమధ్య లక్కడి తాత ఉన్నాడు. రెండు భాగాలుగా విడివడ్డ అతని గడ్డమూ కనిపిస్తుంది. బంగారు ఫ్రేమ్ ఉన్నవారి పటం పెద్ద గదిలో గోడకు ఉంది. తాత సంపాదించిందంతా కొడుకులు కర్పూరంలా కరిగించారు. వారుఆర్జించిన కీర్తి ప్రతిష్ఠల్ని లాలా అన్న దేశదేశాలు తిరిగి ఉద్యోగాలకోసం దేబిరించడంలో పోగొట్టాడు. ఇంకా ఆ కీర్తిప్రతిష్ఠలు, తాతగారి పటంలా, ఫ్రేములో బిగింపబడి ఉన్నాయనే అపోహలో ఉన్నారంతా. వారు మణుగు బరువున్న కరవాలాన్ని పూవును అందుకున్నట్లు లాఘవంగా అందుకునేవారు. ఆ కరవాలంతోనే చివరి మొగల్ పాదుషాను వారు రక్షించారు. ఆ కరవాలంతోనే శత్రుమధ్యంలో దూకి, శత్రుసంహారంచేసి, తన శిరస్సును ఖండించుకున్నారు.

ఆకరవాలం ఇప్పటికీ అటుకుమీద ఉంది. ఒకసారి లాలా తనశక్తినంతా ఉపయోగించిదాన్ని ఎత్తడానికి ప్రయత్నించి, చమట కక్కింది. అక్కడే షరో ఫ్రేమ్‌లో వరసకు బామ్మ కూర్చుంది. పెళ్లిళ్లు కుదర్చడమే ఆమె జీవిత సర్వస్వం. కళ్లు మూసుకొని కూరలో ఉప్పువేసినట్లే ఆమె సంబంధాలు కుదిర్చేది. ఆమె చుట్టుపట్ల ఉన్న అబ్బాయిలకు అమ్మాయిలకు అంటకట్టింది. అంతే కాదు వాళ్ల పిల్లలకూ, పిల్లలపిల్లలకూ కూర్చింది. అందువల్ల లాలా అత్తలకూ, పిన్నమ్మలకూ తేలిగ్గా జరిగిపోయింది.

లాలా ఈసారివి గూటిని తొలగించింది. అలా అనుకునేవరకు చంద్రుడు చిరునవ్వాడు, వెన్నెల వెలుగులు విరబోసి ప్రతివస్తువునూ చెమ్మగిల చేస్తున్నాయి — ఆమె మనసుముక్తంగా.

చాలా మనోహరంమైన పాత స్మృతులు చెదరాయి. తాను కాదన్నది, అతను పుస్తకాల పురుగుగ ఎండలో మరిగినట్లు బాధపడ్డాడు. బొంగురుగొంతుతో ఏమేమో అన్నాడు. ఈ మధ్య అతడు ఇంగ్లండు వెళ్లాడు పైచదువులకు. అదివిని తాను అదో రకంగా తిరిగింది. తానేం మామూలు స్త్రీయా? హుఁ.

మంచిదయింది. ఒకబరువు దిగినట్టయింది. ఆమెకు స్త్రీ విషయంలో ఎక్కడలేని గర్వం. తాను ఎవరిముందూ తలవంచదు. అదే ఆమె నమ్మకం.

బతకడమూ,చావడమూ,తెలియని అమ్మాయిలంటే ఆమెకు జాలి.పుట్టగానే పెళ్లిచింతలో పడిపోతారు. వయ్యారంగా స్కూలుకు, కాలేజీకి ఉరుకుతారు. ఒకరినిచూచి ఒకరు మండిపడ్తారు. ఎవరైనా కొత్తచీర కట్టుకున్నా ఏడుపే. ఒక అబ్బాయిని మెచ్చుకున్నా మంటే, ఇహ అందరి గుండెలమీద పాములు పాకుతాయి. ఇహ పెళ్లి, అబ్బో ఏం సిగ్గో! సిగ్గులు వలకబోస్తూ పత్రిక తెచ్చిస్తారు, అబ్బ! ఎంత గర్వమయాఅంటే వాళ్ల తండ్రి శివధనస్సును విరిచేషరతు పెట్టి ఒక రాముని తెచ్చి కట్టినంత! అయిపోయింది, అక్కడితో జీవితంలో ఫుల్‌స్టాప్. తరవాత ఏముంది ? మామూలే. తగాదాలు. సంసారం చాలని అవాయం - ఛీ ఏమిటబ్బా - బతుకులు !!

'సరే మేమింతే బ్రష్‌పట్టుకొని రంగులు కలపడమే జీవితమా?' హమిదా అక్క వెటకరిస్తుంది. అవునండీ. వీళ్ళు మహిళా సమాజాలు ఏర్పరుస్తున్నారు. అక్కడేమిటమ్మా నేర్పేది అంటే తిరగబడ్డానికి చిట్కాలు. సంగీతం నేర్చుకుంటారు. మగాళ్ళమధ్య కూర్చుని చర్చలు సాగిస్తారు. తోట్లో ఒకటిరెండు మొక్కలు నాటేస్తారు. ఇహ ఇదేనమ్మా జీవితం' ఇదీ వరస.

'జీవితం అంటే బిందువులో దూకడం'

'బావుంది - అది జీవితం ఎలా అవుతుంది చావుబావిలోకి ఉరికే మోటర్ సైకిల్ అవుతుంది.' హమిదా అక్క అరుస్తుంది".

'నాకేదో భయంగా ఉంది.' హమిదా అక్క అలోచనలో పడిపోతుంది' నవ్వూ కళవలె లక్ష్యంలేని మార్గాన పడవుకదా అని'

ఆమె ఆ మాట విన్నది. మంచులా చల్లబడి పోయింది. ఊపిరిసైతం అడకుండా అలా చాలసేపు నుంచుంది. ఆమె చేతిలోని గులాబి చిరునవ్వు,నవ్వి, తలవంచుకొని నిద్రపోయింది.

ఆమె బెదురుతూ, బెదురుతూ కళ్లు తెరిచింది. చుక్కల దివ్వెలవెలుగు తగ్గింది. చంద్రునిముఖంలో అలసట కనిపిస్తూంది. తాను కళవలె నవ్వీ, నవ్వీ నవ్వీ నవ్వీ చల్లబడి పోతుంది. మెడవాలి పోతుంది. జనం తనను ఈడ్చి పారేస్తారు.

ఆమె విసికింది. వేసారింది. ఏదో మార్గం వెదుక్కుందాం అనుకుంది. కాని ఏదీ మార్గం? దోవ ఎక్కడో మళ్లిపోయింది. చక్కని నీలపు ఆకాశం నిరాశోపహతుని హృదయంలా వ్యాపించింది, భయంతో ఆమె కళ్లుమూసుకుంది. పక్కకు తిరిగింది.

హమిదా అక్క ఆమెమాటలకు భయపడుతూంది. ఒక్క హమిదా ఏమి? కుటుంబం సాంతం ఆమెను కొరకరానికొయ్య అనుకుంటున్నారు. వచ్చిపోయే వాళ్లు వింతగా చూస్తున్నారు.

అలాంటివారిలో అతనూ ఒకడు –.

లాలా తన ఆలోచనల మందను ఒకవైపు తోలాలనుకుంది. ఆమె స్మృతులు దేన్నో వెదుకుదామనుకున్నాయి కాని సోమరితనం వాటిని లేవనీయ లేదు, ఎదుగుతున్న చంద్రుణ్ణి చూస్తూ ఉండిపోయింది. ఏదోఒకనీడ మెరుపులా వచ్చి మాయం అయింది. ఆదేనీడ ఆమె గుండెలో వెన్నెల ఆరబోస్తూంది – ఇప్పుడు. అదే ఛాయ ఎదుగుతూ పోతుంది.

'తన గొప్పతనం చూపడానికే మగాళ్లను అసహ్యించుకుంటుంది. తనను గురించి ఎక్కళ్ళేని టెక్కు ఎవడికేం' అతడు చాలా ముందు కూర్చొన్నిమూడు నాలుగు గంటలు ఆమె తప్పులు ఎన్నందే అతనికి అన్నం అరగదు.

అతనికి లోకంలో ప్రతిదాన్ని పరిహసించడం అలవాటయిపోయింది– ముఖ్యంగా ఆడవాళ్ళ రచనలన్నా వారి పెయింటింగ్స్ అన్నా బొత్తిగా గిట్టదు.

"కవిత్వమా! అది మీకెలా తెలుస్తుంది? అర్థంకావట్లా అది- అదేం వంటావార్పా?" అని వెక్కిరింపుగా నవ్వుతే లాలాకు మంటల్లో దూకినట్లుంటుంది.

ఎవరూ దొరకలేదనుకోండి లాలా తల్లిదగ్గర ప్రారంభిస్తాడు "ఆర్ట్ గిఫ్ట్ అంటారు చూశారా అవి ఆడపిల్లల్ని నాశనంచేసి వదుల్తాయి. ప్రపంచంలో ఎంతమంది గొప్ప ఆర్టిస్టులున్నారో వాళ్ళంతా తమ ఆర్ట్‌ను పిచ్చాసుపత్రిలోనే పూర్తిచేశారు" అని విమర్శిస్తాడు.

"అల్లా! లాలాను కాపాడు" తల్లి వాస్తవంగానే వణికిపోతుంది" ఏమోనమ్మా లోకంలోని ఆడపిల్లలంతా ఇంటిపనులు చేసుకుంటారు. దీని వ్యవహారం అంతా తలకిందులు" అని వాపోతుంది.

"విన్నారా! ఇహ ఇప్పుడు వాళదగ్గర సంగీతం నేరుస్తోంది" చిన్నపిల్లవాడిలా చాడీలు చెపుతాడు.

లాలాకు అక్తర్ మామంటే అభిమానం అని తెలిసింతరవాత మరీ పరాచికాలు పట్టించేవాడు, అక్తర్‌మామ తిరిగి తిరిగి ఎప్పుడోగాని ఇల్లు చేరుకునేవాడు కాదు. అతడు వచ్చాడంటే లాలాకు చేతివిందాపని. మాటమాటకీ గజాలా, అక్కను పిలుస్తుంది. రోజంతా వాచ్ చేస్తుంటుంది. వెయిటర్లా అవుతుంది. అక్తర్‌మామ సిగరెట్లు అయిపోతే, పేకాటలో సర్వస్వం పోయినవాడిలా తలపట్టుకొని కూర్చుంటుంది. అప్పుడు ఆమె ఆరాటం చెప్పలేం. ఎక్కడ్నుంచో సిగరెట్లస్టాకు తెప్పించిపెట్టాలి. అక్తర్‌మామ విషయంలో లాలాకున్న సానుభూతి చూచి ఉడుక్కునేవాడు.

"అమ్మాయ్! నీ పరిచర్యలు నన్ను అవిటివాణ్ణి చేసేట్టున్నాయి. దారి నడిచే బాటసారిని కూర్చోమనడం శిక్షమ్మా" అనేవాడు.

ఆమాటలువిని లాలా గుండె పగిలేది. అక్తర్‌మామను ఓదార్చే జవాబు ఇవ్వాలనుకుంటుంది, కాని నాలుక ఆడకుపోతుంది. ఇక్కడ ఆమె తన జాతినే

అసహ్యించుకునేది. ప్రపంచంలోని ప్రతి ఆడదీ గజాలా అక్కలా కఠినురాలుగా కనిపించేది. గజాలా అక్క వికారమైన తన పిల్లలను అక్తర్ మామ వడిలోవేసి బేబీ ఇదిగో మీ అంకుల్" అంటుంది.

"ఈ అక్తర్ చావాదంతా నాటకం. ఒక ఆడది జీవిత సర్వస్వాన్ని లాక్కోగలదంటే నేను నమ్మను."

'మీకెలా తెలుస్తుంది' లాలా వ్యంగ్యంగా 'అది మానవులకు తెలుస్తుంది' అన్నది.

"అంటే వెన్నెల రాత్రిళ్లలో గాలి తిరుగుడు తిరిగేవాడు, అన్నల సంపాదన తింటూ సోమరి అయ్యేవాడు లోకంలోని దౌర్భాగ్యాలన్ని ఏంత్రితం అయినవాడూ మానవుడని మీ అర్థం.' అతను వెకిలిగా నవ్వుతుంటే ఇమ్తియాజ్ అన్నకూడా నవ్వుతాడు. ఇద్దరూ కలిసి లాలాను ఉడికించే నెపంతో బాగా ఉడికేవారు.

ఇమ్తియాజ్ అన్న అయిదేళ్లనుంచి బి.ఏ. చేస్తున్నాడు. అందుకే చెల్లెళ్ల తెలివితేటలంటే అతనికి మంట.

'చూడుబాబూ! ఇవన్నీ నవలల పాత పాట్లు సినిమా కథలు. నాకు తెలియక అడుగుతాను. మజ్నూ దారిలో నడిచేవాళ్లు వాయిదాల్లో చస్తే ఏంలాభం. ఆత్మహత్య చేసుకుంటే ఎవడుఆపాడు? ఏమంటావ్?' అతడు ఇమ్తియాజ్‌ను అడిగేవాడు.

లాలా అసహ్యించు కునేది. కాని ఆ అసహ్యాన్ని ఎలా వ్యక్తపరచాలో అర్థంఅయ్యేదికాదు. 'మాకు మామ అవుతే మీకు బాబాయి అవుతాడు' ఎటూ పాలుపోకఏదో అనేది.

"అంటే వారితెలివితక్కువను గుర్తించిమాట్లాడొద్దనా?"

'అది మీకేం తెలుస్తుందిలే ఆర్టిస్టులే దాన్ని గ్రహించగలరు.' ఇమ్తియాజ్ అందుకుంటాడు.

‘అవును ఎలాంటి అదృష్టంయా అంటే మాలితో గోతికప్పించి తాము ఒక మొక్క నాటేవారు, కేదారరాగం అభ్యసించేవారు.

‘ఇంకా ఎలాంటి వారయా అంటే ప్రేమోపహతులకు దొంగిలించిన డబ్బుతో కేప్‌స్టన్ సిగరెట్లు అందించేవారు’ అని ఇమ్తియాజ్ అంటే చిన్న పిల్లలా నాలుకతో పెదవితడిపి అతడు యాక్ కేప్‌స్టన్ సిగరెట్టు కాల్చాలని పిస్తుంది.’ అంటాడు.

‘అయితే లే’ ఇమ్తియాజ్ లేచినుంచొని ‘నడుప్ రోడ్ ఇన్‌స్పెక్షన్ చేతాం’ అంటాడు.

ఒకనాడు అక్తర్‌మామ ఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది. వారిని చూడ్డానికి వచ్చినవాళ్ళలో అతనూ ఉన్నాడు.

‘అక్తర్‌చాచా ఫలక్‌నమా నుంచి స్టేషను రోడ్డు ఎంతదూరం ఉండొచ్చు’ అడిగాడు.

‘ఎలాతెలుస్తుంది?’ మామ నిర్లక్ష్యంగా అన్నాడు.

‘ఓహో! అయితే మీరింకా ఆరోడ్డు కొలవలేదన్నమాట!’ అని లాలాను చూచి చిరునవ్వాడు. ఇమ్తియాజ్! నాకూ ఆడదాన్నికావాలని ఉంది. గజాలా అక్కను అవుతే ఎంతబాఉండేది! మొగునిచేతిలో చేయి వేసుకొని తిరిగేవాణ్ణి అప్పుడు మొగుడు మొనగాడికి పుట్టిన ముద్దుబిడ్డల్ని మరొకరి వళ్ళోపారేసి తిరిగేవాణ్ణి” అంటాడు.

“పాపం ఆడవాళ్లు ఎంతఅమాయకులు!” ఇమ్తియాజ్ బుర్రఊసి అదో రకంగాఅనేవాడు.

“అవును పాపం మరోఆడదాని గాయంమాన్పడానికి డబ్బు దొంగిలించాల్సివస్తుంది.

“ప్రేమాభిమానాల ప్రతిమలు” ఇమ్తియాజ్ నిట్టూర్చేవాడు.

'నిజమేగాని కట్టెబొమ్మలు....' వెక్కిరించేవాడు.

అతనికి కళలంటే అసహ్యం. మహామహా చిత్రకారులనుకూడా రంగు ముద్దలకింద జమకడ్తాడు. కవులంటే అతనికి లెక్కేలేదు. రచయితలు అబద్ధాల కోరులు - ప్రేమికులు పిచ్చివాళ్లు - ఇవీ అతని అభిప్రాయాలు.

లాలా తన అదృష్టం ఆ అబ్బాయితో ముడిపెట్టుకుంది.

ఒకనాడు అతనిమీద ఒక ఆపద విరుచుకు పడింది. అతనికి ఒక పెన్సిల్‌స్కెచ్ కావలసివచ్చింది. అతడు ఇమ్తియాజ్‌పేర ఒకచిట్టీరాసి లాలా బల్లమీద ఉంచిపోయాడు. ఉత్తరం ఎంత రొమాంటిక్‌గా రాశాడంటె అది ఇమ్తియాజ్‌ను ఉద్దేశించింది కానేకాదు. అతనికి కావలసిన స్కెచ్ ఏమంటే ఒక వంటరిగాడు సముద్రపు ఒడ్డున ఉదాసీనంగా నుంచొని ఉండాలి. ఆబొమ్మ అతనికి సాయంకాలంవరకు కావాలి. అతనికి ఆ బొమ్మ ఎందుకు అవసరం పడిందో తెలియదు. కాని ఊళ్ళో ఎవరూ అంత తొందరగా వేసిఇవ్వడానికి ఒప్పుకున్నట్లు కనిపించదు. ఇమ్తియాజు ఊర్లోలేదు. పిక్నిక్‌కు వెళ్లాడు. రెండుమూడు రోజులదాకా రాడు. అది అతనికి తెలిసిందే. కాగా ఇమ్తియాజుకు బొమ్మదించడం అలాఉంచి గీతసైతం చక్కగా గీయరాదు.

మరి ఉత్తరం ఎవరికి రాసినట్లు?

లాలాకు పెద్దగా నవ్వొచ్చింది. తనను అర్టిస్టుగానే వప్పుకోడే అలాంటివాడికి అడక్కుండా బొమ్మగీసి పెట్టడం ఎందుకు? అనుకుంది. తనకు నెలలకొద్దీ ఏపనీ చేయడానికి 'మూడ్' రాదు. ఇప్పుడేమోతాను సంగీతం నేర్చుకోవడానికి కళ దగ్గరికి వెళ్లాలి.

నాలుగయింది. అయిదుకావాలని నిరీక్షించ సాగింది. అయిదింటికి అతడు ఎలా వస్తాడో చూడాలనుకుంది. ఎంత గింజుకుంటాడో ననుకుంది. కాని అయిదు కాకముందే బొమ్మగీసి హమీదా అక్కకు అప్పగించింది.

'ఇది ఎప్పుడో వేసినబొమ్మ. బొమ్మలు వెదుకుతుంటే దొరికింది. కాకుంటే ఇప్పుడు పైపైమేదీ వేయడానికి?' అనిచెప్పి బొమ్మ అందించమని చెప్పింది. గబగబా తయారయి కళదగ్గరికి పరిగెత్తింది. ఇహ అతనికి బుద్ధి వస్తుందనుకుంది. చేసిన తప్పులన్నీ ఒప్పుకుంటాడనుకుంది. అతి వినయంగా కృతజ్ఞతలు తెలియపరుస్తాడనుకుంది.

కాని ఆమె అంచనాలు తలక్రిందులైనాయి. తెల్లవారి అతను వచ్చాడు. సిగ్గులేనివాడిలా కుర్చీలో కూలబడ్డాడు. ఆమె వేసిచ్చిన బొమ్మకు ఎగ్గులు పెడుతున్నాడు.

"చూశారా ఈ చిత్రం బొమ్మట! బొమ్మ! అబ్బ ఆ వంటరితనం చూస్తే భయంవేస్తూంది. సముద్రానికి ఒడ్డు ఎక్కడా కనిపించదే! 'ఆర్టిస్టు' అనిపించుకోవాలనే ఆదుర్దాలో మనుషులకు మతిపోతుందనుకుంటా. హమీదాఅక్కా! మీరే న్యాయం చెప్పండి– వంటరిమనిషి తరంగాలు లెక్కిస్తూ సముద్రపువడ్డున ఎంతకాలం కూర్చోగలడు?"

లాలా కే కలుపెడ్తూ అతనిముందునుంచే అనేకసార్లు వెళ్ళింది. గదిలో కూర్చొని పెద్దగా కేదారరాగం ఆలపించింది. అయినా అతను పట్టించుకోందే! చెవుల్లో సీసం పోసుకుంటున్నట్లు కూర్చున్నాడు. ఆమెకు విసుగు పుట్టింది. ఎదురుగావెళ్ళి చీవాట్లు పెడ్దామనుకుంది. చేతిలోని బొమ్మను లాక్కొని ముక్కలు ముక్కలుగా చించి పారేద్దామనుకుంది. అయినా మాట్లాడలేదు.

అనాడు లాలా అతన్ని గురించిన భోగట్టా సొంతం సేకరించింది. అతని అలవాట్లను గురించి అంచనా వేసింది. అతన్ని హేళన చేయడానికి సకల సామగ్రి సిద్ధంచేసిఉంచింది.

సాయంకాలం అయింది. అతడు రాలేదు. రోజూ వచ్చేవాడే. హమీదా పిల్లల్తో బంతికోసం పోట్లాడేవాడు. లాలాను గురించి తల్లికి లేనిపోనివి కల్పించి చెప్పేవాడు. నాన్నతో పితులు చెప్పించుకునేవాడు ఆరోజు రాలేదు.

'కై సేకహుం సాజన్ బినా నీంద్ నఆయే

బిరహా సతాయే"

పాటపాడుతూ ఊగుతూంది. ఇమ్తియాజ్ వచ్చాడు. హమీదా అక్కతో గుసగుస సాగించాడు. తన చాకచక్యాన్ని డబ్బుగా మార్చుకోవడానికి ఇమ్తియాజ్ ఎక్కడికో వెళ్లిపోతానంటున్నాడు. ఇదీ లాలా విన్నది - ఆమె అర్థంచేసుకున్నదీ.

'ఎక్కడికి?' ఆమె సుదూరప్రాంతాలకు తన చూపును ఉరికించింది. ఎదురుగా ఎత్తైన కొండలు కనిపించాయి. కొండల మీదినుంచి దొర్లిపడుతున్న రాళ్లు కనిపించాయి. ఒకరాయి విసురుగా వచ్చింది. ఆమె గుండెకు తాకింది. దాహం గొంతు ఆరిపోతూంది.

ఆదివింటే నవ్వొచ్చింది. నవ్వుకాకుంటే ఏమిటి? ఏముందక్కడ? నెత్తిగోక్కొనే ఇమ్తియాజ్ కూడా విరగబడి నవ్వాడు.

"ఎందుకా వెకిలినవ్వు?........" తీక్షణంగా అడిగింది లాలా.

'ఏంలేదు పిచ్చాసుపత్రి మనింటికి ఎంతదూరమా అని'

ఆమె మాట్లాడలేదు. మూతి ముడుచుకుంది. తంబూరా తీవలు సవరిస్తూంది.

ఇద్దరూ ఏదో కుట్ర పన్నినట్లున్నారు. అతను ఇమ్తియాజ్ గంభీర వదనాన్ని చూచాడు. 'విన్నావాభాయి! పెద్దమామ అక్తర్‌మామను శానిటోరియంలో చెర్పించాట్ట' అన్నాడు ఇమ్తియాజ్‌తో.

ఆ మాటమీద ఇద్దరూ బయటపడతారనుకుంది. ఇమ్తియాజ్ ఉన్నదంతా వెళ్లకక్కుతాడనుకుంది. కాని ఇమ్తియాజు కిక్కురుమనలేదు. తెల్లముఖం వేసుకుని కూర్చున్నాడు.

'ఒక్క అక్తర్‌మామే కాదు-ఇంకెంతమంది పెళ్ళాలో శావిటోరియంకు ఈ ఆడవాళ్ల క్షయక్రిములు. నవ్వుతూ తుళ్లుతూ ఉండేజనాన్ని గోరీలోకి దింపేస్తారు" అని గది తలుపులు మూసుకున్నారు.

ఏమిటీ కథలు వ్యథలు!

ఆమె తంబూర నేలకు కొట్టింది.

ఆకాశంలో చిక్కని చీకట్లు కమ్ముకున్నాయి. చంద్రుడు గోరీల గోతుల్లోకి వెళ్లిపోయాడు. ఎవరినో వెదకడానికి, వెన్నెల విరాగినిఅయి భుజంమీద విచిత్రవీణధరించి, ఎక్కడో మందిరపు చీకట్లో కూర్చొని రాగంఆలపిస్తోంది సాజన్‌బినా నీంద్‌న ఆయే - ప్రియుడులేక నిదురరాదు.

ఆకాశంలో చుక్కలు కన్నీటి చుక్కల్లా మిలమిల లాడాయి! కదిలాయి వణికాయి, ఒక బాష్పబిందువు రాలింది. ఆకసంలో ఒక బంగరురేఖ మెరిసింది లిప్తపాటు నక్షత్ర మాలిక వెలిగింది ఆరిపోయింది.

రేయి సాంతం లాలా కలలుగన్నది, కలల్లో ఆ త్తర్‌మామను చూచింది అతడు చీకటి కొట్లోపడి కొట్టుకుంటున్నాడు, వెలుగుచుక్కకోసం వేచిఉన్నాడు చంద్రునికోసం వేయికనులతో నిరీక్షిస్తున్నాడు. చంద్రుడు రాడు. అతను ఏడ్చి ఏడ్చి సగం అయినాడూ.

హమీదా, గజాల ఆక్కను చూడ్డానికి రోజూ ఆస్పత్రికి వెళ్ళేది. ఆమెకు భరించరాని కడుపునొప్పి. నొప్పిభరించలేక ఆమె పాషాణం తినడానికి ప్రయత్నించిందట.

చాలకాలం తరవాత - అరాత్రి-లాలాకు - ఆకాశంలో ఎవరికోసరమో కేకలువేస్తూ తిరిగేపక్షి కేక వినిపించింది. చెట్లమీది పక్షులు భయంతోకేకలు వేస్తున్నాయి. "ఉష్! నిశ్శబ్దం అరవకండి" అని దూరంనుంచి వినిపించే కేక కోసం చెవులను అర్పించి లాలా కనురెప్పలు వాల్చింది.

# అంతరం

వేడి తగ్గింది. సాయంసంధ్య చీకటి ముసుగు వేసుకుంటున్నది. విసురు గాలి వీస్తూంది. వేగంగా వీస్తూంది. గాలి విడికి చెట్లు ఊగుతున్నాయి. కిటికీల తెరలు రెపరెప లాడుతున్నాయి. లాలా కురులు గాలికి ఎగురుతున్నాయి. ఆమె గుండె వేగం హెచ్చింది. అంతా కల్లోలంగాఉంది.

ఇంకా రేయి ఎదగలేదు. ఇప్పుడిప్పుడే పున్నమి వెన్నెల వీణారాగం ఆలపిస్తూ అడవులవైపు పయనిస్తూంది. వాతావరణం గజిబిజిగాఉంది. కల్లోలంగా ఉంది. ఈరాత్రి ఏదోజరుగుతుంది అన్నట్లుంది.

ఇప్పటికి లాలా నిద్రపోవాల్సింది. కాని ఇవ్వాళదుప్పటి పక్కకునెట్టి పరుపుమీద పడిఉంది. నిద్ర జోకొడుతూంది, కనురెప్పలు వాలుతున్నాయి. నరనరంలో నిద్రాతరంగాలు వ్యాపిస్తున్నాయి. కోపం ప్రతీకారాన్నికి సంబంధించిన ఆలోచనలు మేనువాల్చాయి, ఒక్కకునుకు ఒకేకునుకు అంతే ఆమె నిద్రలో మునిగిపోతుంది.

చప్పున ఆమె హృదయకవాటాలను ఎవరో చప్పుడు చేశారు!

ఆమె ఉలిక్కిపడి లేచింది.

చూచింది.

ఎవరూలేరు

విరిసిన వెన్నెట్లో అంతా నిద్రిస్తున్నారు. అమ్మా - నాన్న, బల్లమీద ఉన్న కూజాలు కూజాల మూతలకు కప్పిన అల్లకపు స్ఫచులు!

అంతటా ఆమెగుండె చప్పుళ్లు వినిపిస్తున్నాయి. లోకంసాంతం ఆమె ఎదద దడదడలతో నిండిపోయింది. ఏమీ వినిపించడంలేదు. ఏ ఆలోచనా వెలుగు చూడడంలేదు. అ స్తర్ మామ కొండమీదినుంచి దొర్లిపడుతున్నట్లుంది.

కళ మందిరంలోంచీ బయటపడి మనుషుల గుంపులో దూరినట్లుంది. మబ్బు ముక్కలు దూదిపింజాల్లా ఎక్కడికో హడావుడిగా ఉరుకుతున్నాయి.

ఏదో జరిగింది. జరిగిపోయింది.

ప్రకృతిసాంతం అల్లకల్లోలంగా ఉంది. వరండాలో వెలిగేదీపం భగ్గు, భగ్గుమని కొట్టుకుంటూంది. చప్పున ఆరిపోయినట్లనిపిస్తుంది. ఇంతలో కళ్లు మిరిమిట్లు కొలిపేట్లు వెలుగుతుంది. ఆమె ముఖంలోని అంధకారాన్ని మాయం చేస్తుంది.

లాలా కళ్లు చీల్చుకొని నలువైపులా చూచింది. ఏమీలేదు. ఏదోవాగ్దానం తానిచ్చినమాట-తనను ప్రశ్నించడానికి వచ్చినట్లుంది. అడగడానికి వచ్చినట్లుంది

హుం ఆ ఆలోచనను దులిపేసింది. పిచ్చికాకుంటే నేనెవరికి మాట ఇచ్చాను? నేను వాగ్దానం చేస్తానా? రక్తంతాగే తోడేళ్లెక్కడ? అమాయకం అయిన మేకలెక్కడ? ఈ రెండూ వాగ్దానాలు చేసుకుంటాయా? అసంభవం. అసాధ్యం.

అంతలోనే ఏదో భావన వచ్చింది. వెన్నల హద్దులకు అవలినుంచి ఎవరో పిలుస్తున్నారు. పిలుపు గాలిలా ఉంది. గాలి సవ్వడిలాఉంది. ఆమె లేచింది. వళ్లు విరుచుకుంది. అమ్మాయిలు కాళ్ళకు అందియలు వేసుకోవడం మానేశారు - మంచిదైంది. కాకుంటే గత వర్షకాలపు గీతాలకు ఇవే అద్దంకులు అయినాయి. మనసునిండా మువ్వల చప్పుడే అయినాయి.

ఘల్లు!

ప్రకృతిసాంతం ఝల్లుమంది.

ఆమె ఉలిక్కిపడింది.

ఆమె చేతిగాజులు రెండు కలుసుకున్నాయి ఆమెను చూచాయి. కిలకిల నవ్వాయి.

ఆమె లేచింది. తోటవైపు ఉరికింది నాలుగు అడుగుల్లో చంద్రుడు అంద సున్నాడన్నంత వేగంగా పరిగెత్తింది.

ఉరికింది ఆగిపోయింది. తోటలోని చల్లని మెట్లమీద కూర్చుంది. ప్రశాం తంగా కూర్చుంది.

చంద్రునివైపు పరుగులు తీసే మేఘశకలం వేగంగా సాగిపోయింది- వెళ్ళిపోయింది- దొర్లిపోయేరాయిలా.

ఏమిటిది? ఎవరైనా అలకబూనారా?

ఆమె బెదిరి ఆలోచించింది. అది బెదురు ఆలోచన, భయభ్రాంతమయిన ఊహ!

లోకంసాంతం అదిరిపడింది. దూరాన రైలు కూసింది. గుండెలు అవి సేట్లు కూసింది. భూదేవి గుండె కుదిపింది- కదిలింది- ధక్....ధక్....ధక్. పిట్టలు బెదిరి గూళ్ళకు తిరిగిరాని పిట్టపిల్లలకోసం అరిచాయి. మల్లెపందిరి కొన కొమ్మల్లో పూసిన పూలు గడగడలాడేయి.

ఆమె నేరెడు చెట్టుకు తల ఆనించింది. మెదడులో మసిలే జ్ఞాపకాలను పట్టుకోవాలనుకుంది.

ఇంతకుముందే-ఈసాయంకాలమే హమీదా అక్క చెప్పింది-జనం తనను హంతకురాలిగా చూస్తారని-రోమును సాంతం తగలపెట్టిన నీరో చక్రవర్తిని చూసినట్లు చూస్తారని-రాముని వనవాసానికి పంపిన కైకను చూసినట్లు చూస్తా రని.

హమీదాచాల బాధగా చెప్పింది-అతడు సన్యాసం స్వీకరించడానికి వెళ్లి పోయాడని. హమీదాకు అతనిమీద అనంతమైన సానుభూతి. పూలు తనకోసమే పూయించుకోవడం స్వార్థంకాదా! ఆమెకు అమాంతంగా కోపం వచ్చింది.

"లోకంలో ఉన్న దీపాలన్నింటినీ ఆర్పేయడం వశ అనిపించుకోదు" అన్నది.

లాలా ఆదివిన్నది. నిశ్శబ్దంగా కూర్చుంది. ఇంతలో కోపం పొంగింది. తనను గురించి ఈ జంతువుకు ఇలాంటి ఆలోచన ఎందుకు వచ్చింది? అను కుంది. వెంటనే కలం కాగితం అందుకుంది. చేతులు నొప్పులు పెట్టేదాకా రాసింది. అప్పుడు లోకాన్ని చూచింది.

పడమట సంధ్యారాగం పరచుకుంది. కోపించిన కాంత చెక్కిలిలా ఆంగ ణంలో అరుణిమ నిండింది. మసీదునుంచి ప్రార్థనాస్వరం వినిపించింది. చప్పున తలమీద ముసుగు కప్పుకుంది. సంధ్యాసమయంలో ఎవరినిగురించి చెడుపలక రాదంటుంది అమ్మ. ఆమాట జరుగుతుందట. అందుకే రాయడం ఆపేసింది. అదిలింపులు, బెదిరింపులూ అన్నింటినీ పెదవిదాటి రానివ్వలేదు.

వేరేడుచెట్టుకు తల ఆనించి ఇవన్ని ఆలోచించింది. అప్పుడుఆమె చుట్టూ వంటరితనపు కటికపొగ కమ్ముకున్నట్లనిపించింది. తాను వంటరిని అనే భావ తొలిసారి కలిగింది. ఎన్నోశతాబ్దాలుగా వంటరిగా అలాకూర్చున్నట్లనిపించింది. కాలానికీ, లోకానికీ దూరంగా ఎవరోతనను పిలుస్తారు. పిలిచీపిలిచీ అలసిపో తారు. తిరిగి వెళ్లిపోతారు. కాని తాను పలకదు.

భయం, భీతి ఆమెమీద దాడిచేశాయి. ఆమె బెదిరిపోయింది. జరగనున్న పరిణామాలు అల్లాకే తెలియాలి. ప్రకృతి అల్లకల్లోలం అవుతూంది. అందులో ఆమె వేడి నిట్టూర్పులు కలిసిపోతున్నాయి. ముత్యాల్లా మెరిసే కన్నీటిచుక్కలు ఆమె చెక్కిళ్ళమీద రాలుతున్నాయి.

ఈమధ్య సాయంకాలం కాగానే ఆమె గుండెల్లో వల్లని చీకట్లు పరచుకుం టున్నాయి. కాని రాత్రులలో-అందాలు విరజిమ్మే రాత్రులలో ఆమె ఎన్నడూ కన్నీటిచుక్క రాల్చలేదు.

"ప్రియుడు లేక నిదురరాదు...."

విచిత్రవీణ బుజంమీదగల విరాగిణి వేళ్లు అతివేగంగా చలిస్తున్నాయి. తీగలమీద ఆమెవేళ్లు చిత్రవిచిత్రంగా కదలుతున్నాయి. ఆమె గానం అందరినీ ముగ్ధుల్ని చేస్తుంది. ఆమె రాగంలో మైమరచింది. స్వరం తప్పింది. మైకం కమ్ముతూంది. వినేవాళ్ళను మైకంలో ముంచుతూంది. రాళ్ళనుగా మారుస్తుంది. ఆమె రాగం ముగుస్తుంది. ఆమె స్వయంగా గీతం అవుతూంది.

లాలాకళ్లు చెమ్మగిల్లాయి. ఆమె చంద్రుణ్ణి చూచింది. చంద్రుడు ఊగుతున్నాడు. జాగ్రత్తగా కన్నీరు తుడుచుకుంది.

ఆమె నేరేడు చెట్టుకింద కూర్చుంది. కాళ్లు చాచింది. కొమ్మల్లోంచి చొచ్చుకొని వచ్చిన వెన్నెలను చూచింది. వాటికి స్థిరత్వంలేదు. కదలాడుతున్నాయి. కప్పలు ఎగిరివచ్చాయి. మెట్లమీద కప్పగంతులు వేస్తున్నాయి.

రాత్రిరాణిమీద ఏదోపక్షిరెక్కలు రెపరెపలాడేయి. చెట్టుసాంతం గడగడలాడింది. చెరనుండి విడివడ్డట్టు గాలి ఉరికివచ్చింది. గాలులు ఎందుకోవచ్చాయి. ఎవరినో వెదకుతున్నాయి. హాయిగా నిద్రిస్తున్న చెట్లు ఉలిక్కిపడ్డాయి. చిన్నచిన్న కొమ్మలు నిరాశ్రయాలయి చేతులుచాచుతున్నాయి. ఎవరినో పిలుస్తున్నాయి. పండుటాకులు కేకలు పెడ్తూ నేలరాలుతున్నాయి. గాలివేగం హెచ్చింది. ఎండుటాకుల్ని దూరంగా తీసుకుపోయింది. తోటలోని పరిమళాలన్నీ ఒకేసారి వ్యాపించాయి. చంద్రుని కాంతి వెలిగింది.

ఈ దారిన ఎవరువస్తారు? వెలుగుతున్న చంద్రుని చూచి ఆమెకు ఏదో నీడజాడ గుర్తుకువచ్చింది. అదే - అనీదే - అమె మనసులో వెన్నెల విరియజేస్తున్నది. విరిసిపోతున్నది.

ఈ చీకటిలో కూడా ఏదోమంత్రం ఉంది - రాత్రి చీకటిలో. ప్రకృతిని సాంతం నిద్రపుచ్చి, దుప్పటి కప్పి విహారానికి వెళ్ళవచ్చు. అంతుతెలియని సముద్రపు వడ్డున నుంచోవచ్చు. తరంగాలు లెక్కిస్తూ జీవితం గడిపేయవచ్చు ఈ చీకటికి భేదాలు లేవు. అది అన్నింటినీ చెరిపేస్తుంది - ఈ వెన్నెల ఎక్కడెక్కడ వ్యాపిస్తూందో ఎవడికి తెలుసు?

కొందరు తమ నిద్రలో స్వప్నజగత్తును నిర్మించుకుంటారు. కాని ఏకదలికయో వారికి వాస్తవ జగత్తును చూపుతుంది.



ఎంతో దూరంగా వచ్చిన వాయుతరంగం ఆమె వెంట్రుకలను చెవుల మీదికి కదిలించింది. గాలి చెవిలో గుసగుసలాడింది- నీజ్ఞాపకాల రూపాలు గుర్తించగలవా? ఆత్మీయత, ప్రేమ, అనురాగం వీటిని నీమనసులో జోకొట్టి నిద్రపుచ్చావు- నీ పిరికిదనంవల్ల. కాని కొంటె పిల్లల్లా అవి లేచి కూర్చుంటున్నాయి.



లాలా భయంతో వణికిపోయింది! తనదగ్గరున్న తాళంచెవులు చూసుకుంది- ఇవ్వాళటిదాకా వాటిని వాడదలచలేదు- తన అదృష్టపు పేటిక తెరవదలచలేదు. అందులో ఎన్ని గెలుపులూ, ఎన్ని ఓటములు దాగిఉన్నాయో!

ఇవ్వాళ తీర్పు జరిగిపోతుంది. ఈరోజే రాముడు శివధనస్సును విరిచాడు. అది తనకు బహుమానంగా అందుతుంది. కాని వద్దు తానొక పూలమాల కాదలచలేదు, కొన్నవాడు దాన్ని జేబులో వేసుకుని వెళ్లిపోతాడు. అతడు ఇంగ్లండు వెళ్లి ఉండడు. జీవితాంతం సముద్రపు వడ్డునే గడిపేస్తాడు. చీకటి కొట్లోపడి వెలుగురేకకోసం ఏడుస్తాడు. ఒకరోజు వస్తుంది. అతనికోసంకూడా ఆకాశంలో దీపావళి వెలుగుతుంది.

ఇవ్వాళ అంతా ప్రశాంతంగా నిద్రిస్తున్నారు. అక్తర్ మామ చీకటి కొట్లోంచి పారిపోయాడని శానిటోరియం డాక్టరు తెలియపరచాడు. అతడు ఆకాశం వైపు వెళ్లిపోయాట్ట! ఏదో వెదుకుతూ వెళ్లిపోయాట్ట. అది విని ఇంట్లో వాళ్ళంతా ఏడ్చారు. లాలామాత్రం పెద్దగా నవ్వింది. కిలకిలా నవ్వింది. ఇవ్వాళ చంద్రుని విరాగిని అడుగడుగునా దీపాలు వెలిగించి ఉంటుంది.

ఆమె మనసుమీద వడగళ్ళదాడి జరిగింది. అక్తర్ మామకోసం ఏడ్చే హమీదాకు 'అతడు' గుర్తుకు వచ్చాడు. అతణ్ణి కొండలమించి దొర్లకుండా కాపాడాలనుకుంది. పాపం! వంటరితనం ఎంతచెడ్డది! ఎవరో ఒకరు తనకోసం

నిరీక్షించడం ఎంత బాగుంటుంది! అతడు ఇంకా సముద్రపు వద్దనే ఉంది- తరంగాలు లెక్కిస్తుంటాడు. చంద్రోదయాన్ని ఎదిరిచూస్తుంటాడు. స్త్రీలు క్షయ క్రిములు. ఆమెకు అమాంతంగా గుర్తువచ్చింది.

అనుమానాల చీకట్లు దాడిచేశాయి-ఆమెమీద. ఏమిటిది ఇంత వెన్నెల! ఇహ చంద్రుడు అస్తమించడులా ఉంది. ఇంతవెన్నెల, ఇంతవెలుగు, ఇంత పరిమళమైన రేయి ఉంటుందా?

ఒకచోట జీవితం పట్టపగటి ఎండలా మాడిపోతుంటుంది. ఓకటచో అంధకార బధురం అవుతుంది. అక్కడ వెన్నెల కిరణం కూడా చొరరాదు. తన మనసులో అనుమానాల అంధకారాలను కూర్చుకున్నప్పుడు చంద్ర కిరణం గురించి ఆలోచించనైనా లేదు.

లాలా ఆలోచనల భారంతో అలసిపోయింది. ఇహ వెన్నెల కొన్ని క్షణాలే ఉంటుంది. క్షణాల్లో వెన్నెలతోడుకూడా విడిపోతుంది. ఆమె తన ఆలోచనలను దూరతీరాలకు ఉరికించింది-తాను బయటపడే మార్గాలను వెదికితెమ్మని.

ఆకాశంలో చుక్కలు మసకలవుతున్నాయి. అయినా చంద్రుడు వెలుగుతున్నాడు. ఇహ తెల్లవారుతుంది. తన ఉత్తరం అనేక టపాలద్వారా పయనిస్తుంది. తన నిరాకరణమీద లెక్కలేనన్ని చేతులు ముద్రలువేస్తాయి. వాయు తరంగాల్లో తన వార్త వ్యాపిస్తుంది. వినిపిస్తుంది. ఆమెకు వెన్నెల రాత్రులలో కేకలువేసే పక్షి గుర్తుకువచ్చింది.

ఆమె పిల్లతెమ్మరలా లేచింది. శతాబ్దాలుగా వెలుగుకోసం పరితపించే వారికోసం దీపాలు వెలిగించడానికి కదిలింది. పిల్లిలా కాళ్ళబలంతో కదిలింది. ఉత్తరం తెచ్చింది. మల్లెమొక్క నాటడానికా అన్నట్లు గునపంతో గోయితీసింది. ఎవరిగుండెలోనో రహస్యం దాచివచ్చినట్లు - ప్రకృతిసాంతం వెలిగించడానికి మీటనొక్కినట్లు - ఉత్తరాన్ని గోతిలో పూడ్చింది.

చివరిసారి రాగం ఆలపించి, మకుటం అందుకొని వదిలేసినట్టు, ఆమె రాగంలా కదిలి మంచం వైపు సాగింది.